# పదకవితా వైజయంతి

* వ్యాస సంపుటి *

# PADAKAVITHA WAIJAYANTHI



డా॥ పొన్నా లీలావతమ్మ,

ఎం.ఎ., పిహెచ్.డి.

పొన్నా పబ్లికేషన్స్

పొనకం–517 503

1993

పదకవితా వైజయంతి

పొన్నా పబ్లికేషన్స్-2

ప్రథమ ముద్రణ-1993

ప్రతులు : 1000

వెల రూ. 80/-



ప్రతులకు :
పి. పార్వతి
పానకం గ్రామం-517 503
తిరుచానూరు (వయా)
తిరుపతి (మండలం)
చిత్తూరు జిల్లా

డా॥ పొన్నా లీలావతమ్మ
లెక్చరర్
భక్తి-పదకవితా శాఖ
తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం
బొమ్మూరు-533 124

ముద్రణ :
త్రివేణి ప్రింటర్స్
దాడితోట
రాజమండ్రి-533 103

కవర్ పేజీ చిత్రణ : రవి

కవర్ పేజీ ముద్రణ :
ప్రకాశ్ ప్రింటర్స్
రాజమండ్రి.




ఈ గ్రంథం

తెలుగు విశ్వ విద్యాలయం

ఆర్థిక సహాయంతో ప్రచురితం

# అంకితం



వంశానుగతంగా
తాత తండ్రులనుంచి సిద్ధించిన
అనంతం—అచ్యుతం—అతులితం
ఆనంద ప్రదం—ఆమోదకరం అయిన
నా ఆస్తి 'రామభక్తి'
అదే శోక భయ విముక్తి
జీవశక్తి—జీవితానురక్తి
మానసిక ప్రశాంతి—మహోజ్వలదీప్తి
అందుకే 'శరణాగతి'తో
'సత్యం శివం సుందరం' అయిన
శ్రీరామచంద్రమూర్తికే
ఈ పదకవితా వైజయంతి....

# వ్యాస పరామర్శ - కృతజ్ఞతాకుసుమాంజలి

ఈ 'పదకవితా వైజయంతి' వ్యాస సంపుటి కాబట్టి మొదటగా వ్యాసం ఆవిర్భావం, తెలుగులో వ్యాసవికాసం గావించిన వ్యాస కర్తలు, తెలుగులో వచ్చిన వ్యాస సంపుటాలు వీటిని గూర్చి మనం సంక్షిప్తంగా తెలుసుకోవలసిన అవసరం ఉంది.

ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్ల ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో ఆవిర్భవించిన అనేక నూతన ప్రక్రియల్లో వ్యాసరచన ఒకటి. ఆంగ్లంలో "ఎస్సె" అనే పదానికి సమానార్థకంగా వ్యాసం అనేపదం ప్రయోగించబడుతోంది. ఈ వ్యాసానికే ప్రమేయం, ప్రకరణం, సంగ్రహం, ఉపన్యాసం అనే పేర్లు కూడా ఉన్నాయి.

వ్యాసమంటే విభాగం అని అర్థం. ఏ విషయాన్నైనా గ్రహించి అందులోని వివిధాంశాలను విభజించి, వివరించి తెలియజెప్పడం వ్యాసలక్షణం. తెలుగులో మొట్టమొదటిగా వ్యాసరచన చేసినవారు స్వామినేని ముద్దు నరసింహానాయుడు, ఆ పైన పరవస్తు రంగాచార్యులు, జియ్యరు సూరి అనేవారు. వీరిని వ్యాస ప్రారంభకర్త్రయం అని కూడా అంటారు.

వ్యాసాన్ని ఉపన్యాసంగా, సారస్వత ప్రక్రియగా సృజనగా రూపొందించి తీర్చిదిద్దినవారు కందుకూరి వీరేశలింగంగారు. వీరేశలింగంపంతులు తన సంఘసంస్కరణ వాదానికి ప్రచార సాధనంగా ఉపన్యాసాన్ని ఉపయోగించుకున్నారు. తెలుగు వ్యాసకర్తలలో ప్రఖ్యాతి గావించినవారు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. వీరు సాంఘిక దురాచారాలను పోగొట్టడానికి సాక్షి వ్యాసాలను హాస్యరసాత్మకంగా రచించారు. సాక్షి వ్యాసాల ప్రభావంతో వదరుపోతు, బారిష్టరు బాతఖానీ వంటి అధిక్షేప వ్యాస సంపుటాలు వచ్చాయి.

కృష్ణా పత్రికలోని ముట్నూరి కృష్ణారావుగారి వ్యాసాలు "అక్షరాస్యుడు సమీక్ష" అనే పేరుతో గ్రంథంగా ముద్రించబడింది. కొమర్రాజు లక్ష్మణరావు పంతులు చరిత్ర, కళలు, సాహిత్యం, ప్రకృతి శాస్త్రం, శాసనాలు మొదలైన వాటిపై వ్యాసాలను "లక్ష్మణరాయ వ్యాసావళి" అనే గ్రంథంగా రూపొందించారు, అలాగే మల్లంపల్లి సోమేశ్వర శర్మగారి చారిత్రక వ్యాసాలు, సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర, హిందువుల పండుగలు అనే వ్యాస గ్రంథాలు, వావిలాల సోమయాజులుగారి మణి ప్రవాళము, కోరాడ రామకృష్ణయ్యగారి సారస్వత వ్యాసాలు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మీగడతరకలు, తెలుగు మెరుగులు, సింహావలోకనం, బండారు తమ్మయ్యగారి వ్యాసావళి, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శాకుంతల వ్యాసాలు మొదలైనవి వ్యాస సంపుటాలుగా వెలువడ్డాయి.

తెలుగు వ్యాసానికి రూపురేఖలు దిద్ది సర్వాంగ సుందరంగా మలచినవారు కట్టమంచి రామలింగారెడ్డిగారు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, పింగళి లక్ష్మీకాంతంగారు, ఖండవల్లి లక్ష్మీరంజనంగార్లు. పీఠికలను వ్యాసాలుగా గ్రహించే పద్ధతి కట్టమంచి రామలింగారెడ్డిగారి వల్లే ఏర్పడింది. వీరి పంచమి వ్యాసమంజరిలోని కొన్ని పీఠికలు 'లఘు పీఠికా సముచ్చయము' అనే పేరుతో ముద్రితమయింది. వీరి వ్యాసాలు చక్కని వింగడింపుతో, తార్కిక దృక్పథంతో, కొత్త దృక్కోణాల నుంచి వినూత్న సొగసుల్ని అందించాయి. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి వ్యాసాలు "సారస్వతాలోకము" నాటకోప న్యాసాలుగా ముద్రితమయ్యాయి. సంగీత సాహిత్య సాగరాలను మథించిన రాళ్ళపల్లివారి వ్యాసాలు తేట తెనుగు నుడికారాలతో, విషయ వివరణతో సుకుమార భావాలతో, మంచి శైలీ రమ్యతతో, విమర్శనా దృష్టితో, నిశిత పరిశీలనతో వెలుగొందాయి.

ఇంకా పింగళి లక్ష్మీకాంతంగారి గౌతమ వ్యాసాలు, నా రేడియో ప్రసంగాలు, ఖండవల్లి లక్ష్మీరంజనంగారి లక్ష్మీరంజన వ్యాసావళి, దివాకర్ల వెంకటావధానిగారి కావ్యలహరి, కాటూరి వెంకటేశ్వరరావుగారి సాహిత్య దర్శనం, దేవులపల్లి రామానుజరావు గారి సారస్వత నవనీతము, ఆచార్య బిరుదురాజు రామరాజుగారి మరుగుపడిన మాణిక్యాలు, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారి సారస్వత సౌరభం, ఆర్. ఎస్. సుదర్శనంగారి సాహిత్యంలో దృక్పథాలు ఆచార్య యస్వీ. జోగారావుగారి సప్తతంతువు, సారస్వత నీరాజనం, కేశవపంతుల నరసింహశాస్త్రిగారి ప్రబంధ పాత్రలు, పుట్టపర్తి నారాయణాచార్యులవారి తెలుగు తీరులు, ఆచార్య సి. నారాయణ రెడ్డిగారి వ్యాసవాహిని, కరుణశ్రీ సంపాదకత్వంలో భాగవతవైజయంతిక మొదలైన ఎన్నో వ్యాససంపుటాలు వెలశాయి.

ఈ విధంగా ఆలోచనా తరంగాలను రేకెత్తించి, భాషాసాహిత్యాల పరిజ్ఞానాన్ని పెంపొందించి, బుద్ధి వికాసాన్ని, హృదయానందాన్ని పరిపోషించిన వ్యాసం తెలుగులో ఒక సాహిత్య ప్రక్రియగా నేడు సముచిత స్థానాన్ని సంపాదించుకున్నది.

'పదకవితా వైజయంతి' లోని ఈ వ్యాసాలు పదకవులకు, పదకవితలకు సంబంధించినవి కాబట్టి పదకవితా వికాసం, పద లక్షణాలు, వాటి లక్ష్యాలు, పదకవితలపై నా అభిరుచి పదకవితలపై వ్యాస రచనా ప్రోత్సాహం వీటినిగూర్చి తెలియ జేయవలసిన అవసరంవుంది.

తెలుగు సాహిత్యంలో పదకవితలనే పేరుతో అన్నమయ్య కాలానికి ముందు ప్రత్యేకమైన రచనలంటూ లిఖిత పూర్వకంగా లభించలేదు. కాని తెలుగుభాష ఎప్పుడు పుట్టిందో అప్పుడే సంగీతాత్మకమైన పదం పుట్టింది. పదాన్నే గేయం, పాట అని కూడా అంటారు. ఈ పదమే సంస్కరించబడి సంకీర్తన, కీర్తన, కృతి అని పిలువబడుతోంది. ఈ పదాలకు రాజాస్థానాలలో, పండితులలో గౌర

వాదరణలు వుండేవి కావు. పదాలు కేవలం పామరులకు, పల్లీయులకు సంబంధించినవని పద్యకవులు వాటిని నిరసించారు. అయినా పద ప్రవంతిని ఎవరూ ఆపలేరు. అందువల్ల పూర్వసంప్రదాయకవుల గ్రంథాలలో కూడా అక్కడక్కడ పదప్రసక్తులు చోటు చేసుకున్నాయి.

నన్నయ ఆంధ్ర మహా భారతం, ఆదిపర్వం, అష్టమాశ్వాసంలో నాగీగీతాలు, నన్నెచోడుని కుమార సంభవంలో శబర కాముల రోకట గొని దంచు పాటలు, కల్లు దించువారి గౌడు గీతాలు. పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో తుమ్మెద, ప్రభాత, శంకర, ఆనంద, వెన్నెల, నివాళి మొదలైన పదాలు, నాచన సోముని జాజర పాట, శ్రీనాథుని భీమఖండంలో యక్షగాన సరణి, పోతన భాగవతంలో బాలునంకించు పాటలు, గోవిందుమీది పాటలు మొదలైన వాటిని పేర్కొనవచ్చు.

పదమూడవ శతాబ్దంలో కృష్ణమాచార్యులు సింహాచల నారసింహస్వామిపై సంహాగిరి నరహరి వచనాలు, రామనామ నృసింహ నామాలు రచించి వచన కవితా పితామహుడయ్యాడు. ఇతని రచనను లక్షణ విరహితమైన అనిబద్ధ పద రచనలే అయినా పల్లవి చరణాలను పోలిన పద నిర్మాణం, పాడుకోవడానికి అనుకూలతమైన రాగ ప్రస్తారం అందులో కనిపిస్తుంది. అందువల్ల ఇతనిని పదకవితా ప్రపితామహుడని కూడా అంటారు.

ఇలా పదకవితా పూర్వకవుల గ్రంథాలలో ప్రసక్తిమాత్రంగా కనిపించి కృష్ణమాచార్యుని కాలంలో అనిబద్ధ రచనలుగా వెలువడి అన్నమయ్యకాలంలో లక్ష్యలక్షణ సమన్వితంగా పరిమళించింది. పద్య కవితాపరిధులను దాటి ప్రజావాహినిలో కలసిపోయింది. అన్నమాచార్యులు సంస్కృతంలో సంకీర్తన లక్షణ గ్రంథాన్ని రచించాడు.

ఆయన మనుమడు చిన తిరుమలాచార్యులు దానిని ఆంధ్రీకరించాడు. అందులో పదానికి పల్లవి, చరణాలు, యతులు, ప్రాసలు, మార్గ దేశి తాళాలు, మాత్రాబద్ధ ఛందస్సు, ముద్ర అనే ప్రధాన లక్షణాలు చెప్పబడ్డాయి. ఈ లక్షణాలతో అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వర ముద్రాంకితంగా ముప్పై రెండువేల శృంగార ఆధ్యాత్మ సంకీర్తనలు రచించారు. సంస్కృతభాషా సాహిత్య వైదుష్యంతో సంస్కృతాభిమానులను మెప్పించడానికి సంస్కృతంలోను, జానపదుల హృదయాలను రంజింపజేయడానికి జానపద గేయరీతులను, గిరిజనులైన చెంచులను, బోయీలను ఉల్లాసపరచడానికి గిరిజన గేయాలను, వైరాగ్య సంపన్నులను తృప్తి పరచడానికి తాత్త్విక గేయాలను, శృంగార ప్రియులకు రసానందం కలిగించడానికి శృంగార సంకీర్తనలను రచించాడు. అన్నింటిలోను విష్ణుతత్త్వం, విష్ణుభక్తి అంతర్లీనమైవుంటుంది. అన్నమయ్య తరువాత క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, త్యాగరాజు మొదలైన వారు పదకవితా రచనను కొనసాగించారు. వీరి కాలాల్లో పల్లవితో పాటు అనుపల్లవి కూడా చేరింది. అన్నమయ్య సంకీర్తనల్లో కనిపించని తాళ నిర్దేశం కనిపించింది. అన్నమయ్య కాలంలో పర్యాయపదాలుగావున్న పదం, సంకీర్తన అనేవి వీరి కాలాలో ప్రత్యేక అర్థంలో ప్రయోగించబడ్డాయి. శృంగారత్మకంగా అభినయాత్మకంగా వున్న క్షేత్రయ్య రచనలు పదాలుగా, ఆధ్యాత్మికంగా వున్న రామదాసు రచనలు కీర్తనలుగా, సంగీత ప్రధానమైన త్యాగరాజు రచనలు కృతులుగా ప్రసిద్ధిగాంచాయి. పదకవులకు కావలసింది పండితారాధన కాదు, రాజస్థానపీఠం, రాజభోగాలు కాదు. వారికి కావలసింది ప్రజాచైతన్యం, ప్రజల ఆనందం. దానికి సంగీతాత్మకమైన పదరచనలే తోడ్పడతాయని భావించి భాషను, భావాన్ని, రచనను ప్రజల అవగాహనకు దగ్గరగా చేశారు. అనేక రకాలుగా భక్తి, మానవత, నీతిబోధలు చేశారు. మూఢాచారాలను, మూఢ

భక్తిని ఖండిస్తూ ప్రజలలో సహేతుక భక్తిని, శక్తిని పెంపొందించారు. తిరుమల తిరుపతి దేవస్థానంవారి అవిరళకృషివల్ల అన్నమయ్య వ్రాసిన సంకీర్తనలలో నేడు పదిహేనువేల సంకీర్తనలు మనకు లభించాయి.

నేను బాల్యంనుంచీ ఇంట్లో పెద్దలు పాడుతుండే అదివో అల్లదివో హరివాసము, జోవచ్యుతానంద, బ్రహ్మకడిగిన పాదము మొదలైన అన్నమయ్య పాటలు, త్యాగయ్య, రామదాసు వ్రాసిన కీర్తనలు వినడంవల్ల భక్తి, సంగీత ప్రీతి కలిగివుండటంవల్ల సంకీర్తనా సాహిత్యంపై అభిరుచి కలిగింది. ఎం. ఏ. లో ఐచ్ఛిక పాఠ్యాంశంగా అన్నమాచార్య శృంగార సంకీర్తనలు చదవడం జరిగింది. అందువల్ల ఆ సంకీర్తనల్లోని వివిధాంశాలు తెలిశాయి. మొట్టమొదటగా పిహెచ్. డి. పరిశోధనారంగంలో ప్రవేశించేముందు అన్నమయ్యపై ఏదైనా ఒక వ్యాసం వ్రాసి తెమ్మని మా గురుదేవులు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తెలుగు అధ్యయనశాఖ మాజీ అధ్యక్షులు, మాజీ ప్రిన్సిపాల్, మాజీ వైస్‌చాన్సలర్ అయిన స్వర్గీయ ఆచార్య జి. యన్. రెడ్డిగారు ఆదేశించారు. అప్పటికి వ్యాసాన్ని ఎలా వ్రాయాలో ఎలా ముగించాలో భాషలో ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో తెలియని నేను వ్యాసం వ్రాయకూడదని సంకోచించాను. కానీ గురువు ఆజ్ఞ, భయంవల్ల ఎలాగో వ్రాయాలని సంకల్పించుకొని ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు రచించిన తాళ్ళపాక కవుల-కృతులు వివిధ సాహితి ప్రక్రియలు, తాళ్ళపాక కవుల భాషా ప్రయోగ విశేషాలు అనే పరిశోధనా గ్రంథాలను, ఎం.ఎ లో అన్నమాచార్య శృంగార సంకీర్తనలపై మా గురువర్యులు చెప్పిన నోట్సులు వీటన్నింటిని పరిశీలనగా చదివాను. అప్పుడు అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయరీతులు అనేశీర్షికపై వ్యాసం వ్రాయవచ్చని నాకు తోచింది. దానిపై నాలుగైదు చిత్తుప్రతులు

వ్రాసి తర్వాత శుద్ధప్రతిని తయారుచేసి మా గురువుగారి దగ్గరకు తీసుకెళ్ళి చూపించాను. వ్యాసరచనా విధానమే తెలియకుండా ఎన్ని చిత్తుప్రతులు వ్రాసి శుద్ధప్రతిని తయారుచేసినా అది చిత్తుప్రతే అవుతుందికానీ శుద్ధప్రతి కాదుగదా. మా గురువుగారు ఈ మాత్రం నేను పట్టుదలగా వ్రాసి తెచ్చినందుకు ఎంతో సంతోషించారు. కొంత వ్యావహారికం, కొంత గ్రాంధికం కలగా పులగంగా ఉన్న భాషను, ముందు వెనుకలుగా, అస్తవ్యస్తగా వున్న విషయాన్ని ఎంతో ఓర్పుతో, వాత్సల్యంతో సరిదిద్ది నా వ్యాసాన్ని క్రమబద్ధంగా రూపొందించారు. దీనిని సప్తగిరి పత్రికలో ముద్రించడానికి వారే స్వయంగా పంపించారు. దీనిని సప్తగిరి సంపాదకులు అన్నమయ్య వాణి-జానపదులబాణి అని శీర్షికను మార్చి ముద్రించారు. ఇలా నా వ్యాసరచనకు నా చేత ఓంకారం దిద్దించినవారు మహనీయులైన ఆచార్య జి. యన్. రెడ్డిగారు.

ఆ తర్వాత ఇదే అంశంపై పిహెచ్.డి. చేయవచ్చని సలహా ఇచ్చి ప్రోత్సహించిన వారు మా గురువర్యులు, పర్యవేక్షకులు ఆచార్య కె. సర్వోత్తమరావుగారు. వీరు నా పరిశోధనా కాలంలో అప్పుడప్పుడు వ్యాసరచన చేయమని ప్రోత్సహిస్తూ వారే కొన్ని వ్యాస శీర్షికలను సూచిస్తూ, వాటిని విషయాన్ని ఎలా విభజించుకోవాలో, ఎలా విశ్లేషించి వివరించాలో చెప్పేవారు. వ్రాసిన వ్యాసాలను ఎంతో శ్రద్ధతో సరిదిద్ది వాటికి నిర్మాణాత్మకమైన ఆకృతి కల్పించేవారు. వీరి సహకార ప్రోత్సాహాలవల్ల అన్నమయ్య సంకీర్తనల్లో ఆవృత్తిపదాల వరుసలు, అన్నమయ్య లోకజ్ఞత అనే వ్యాసాలను వ్రాయగలిగాను. ఇలా నాలో వ్యాసరచనా శక్తిని, వ్యాస రచనాదీప్తిని పెంపొందించినవారు ఆచార్య కె. సర్వోత్తమరావుగారు. పత్రికలలో ముద్రితమైన నా వ్యాసాల్ని చూచి ప్రశంసించి ప్రోత్సహించిన గురువులు ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారు, ఆచార్య

మద్దూరు సుబ్బారెడ్డిగారు. నా పిహెచ్.డి. పరిశోధన పూర్తి అయిన తర్వాత నేనే స్వయంగా వ్యాసరచనకు ఉద్యమించాను. పదకవులందరిలో కనిపించని విషయ వైవిధ్యం అన్నమయ్య సంకీర్తనల్లో కనిపిస్తుంది. కాబట్టి ఎక్కువగా అన్నమయ్య శృంగార ఆధ్యాత్మ సంకీర్తనల్లోని వివిధ అంశాలపై వ్యాసాలు వ్రాయడం జరిగింది. అన్నమయ్య సంకీర్తనలపైనే కాకుండా అప్పుడప్పుడూ క్షేత్రయ్య, సారంగపాణి, రామదాసు, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామాశాస్త్రి మొదలైన వారి కీర్తనలపై కూడా వ్యాసాలు వ్రాయడం జరిగింది. సప్తగిరి, స్రవంతి, యువభారతి, పండిత భారతి, సూర్యోదయం, సమాలోచన, ముముక్షువు, సాహితీమిత్ర మొదలైన సాహిత్యమాస పత్రికాసంపాదకులు, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, కోస్తావాణి ఈరోజు మొదలైన దినపత్రికా సంపాదకులు నా వ్యాసాలను స్వీకరించి, ముద్రించి నాకు సహకార ప్రోత్సాహాలను అందించారు. కడప, హైదరాబాదు, విశాఖపట్టణం, విజయవాడ, తిరుపతి ఆకాశవాణి కేంద్రాలవారు పదకవిత్వంపై రేడియో ఉపన్యాసాలకు అవకాశం కల్పించి నన్ను ప్రోత్సహించారు.

1981 నుండి ఇప్పటి వరకు పదకవితలపై వ్రాసిన వ్యాసాలన్నింటిని కలిపి గ్రంథరూపంలో ముద్రిస్తే పదకవితాభిమానులకు, పరిశోధకులకు పాఠకులకు అందరికి ఉపయోగంగా ఉంటుందని భావించాను. 1984లో కరుణశ్రీ సంపాదకత్వంలో "భాగవత వైజయంతిక" అనే పేరుతో భాగవత పై పరిశోధకులు వ్రాసిన వివిధ వ్యాసాలు ముద్రించబడ్డాయి. అలాగే నా వ్యాస సంపుటికి పదకవితా వైజయంతి అని నామకరణం చేస్తే బాగుంటుందనిపించింది. పదకర్తలలో ఏ ఒకరిద్దరో తప్ప తక్కినవారందరూ విష్ణుదేవుని భక్తులే. వారు ఆ స్వామిని ఎన్నో విధాలుగా మనసారా స్తుతిస్తూ సంకీర్తనాసుమాలతో అర్చించారు. విష్ణుమూర్తి కంఠంలోని కుసుమహారం పేరు వైజయంతి. ఈ

పదకవితలపై నేను వ్రాసిన ఈ వ్యాసమాల శ్రీనివాసుని మెడలోని పూలమాలగా భాసించాలని కాంక్షించి ఈ నామకరణం చేయడం జరిగింది. ఈ "పదకవితా వైజయంతి" పదుగురికీ ఉపకరిస్తే నా కృషి ఫలించినట్లే. సహృదయ పాఠకులు ఈ వ్యాస సంపుటిలోని దోషాలను తెలియజేస్తే ముందుముందు వ్యాస రచనలో సరిదిద్దుకోగలను.

పరిశోధనా వ్యాస రచనలో అవిరళకృషి చేసి విద్యారంగంలో మంచి అభివృద్ధి సాధించాలని ఆశీస్సులందిస్తూ నన్ను ప్రోత్సహించిన వారు తెలుగు విశ్వ విద్యాలయం మాజీ ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దోణప్పగారు, రాజమండ్రి ప్రాంగణంలోని సాహిత్య పీఠాన్ని సందర్శించడానికి, కార్యక్రమాలు నిర్వహించడానికి వచ్చి నప్పుడు అన్నమయ్య సంకీర్తనలపై ప్రత్యేక శ్రద్ధవహించి అందు లోని వివిధాంశాలను ప్రస్తావించి సంకీర్తనా నిర్మాణానికి సంబంధించిన కొన్ని సూచనలు చేసి నాలో ఉత్తేజాన్ని కలిగించినవారు సార్వ త్రిక విశ్వ విద్యాలయం మాజీ ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వ విద్యా లయం మాజీ ఉపాధ్యక్షులు, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత ఆచార్య సి. నారాయణ రెడ్డిగారు, నా పరిశోధనాభివృద్ధి అభిలాషిస్తూ, వాత్స ల్యం చూపుతూ నన్ను ప్రోత్సాహపరచిన మాజీ రిజిస్ట్రార్ ఆచార్య బి. రామకృష్ణా రెడ్డిగారు, నా పరిశోధనాభివృద్ధిని ఆత్మీయంగా ప్రోత్సహించే ప్రఖ్యాత కవి పండిత పరిశోధకులు, తెలుగు విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారు, సహకార ప్రోత్సాహాలందించే తెలుగు విశ్వ విద్యాలయం రిజిస్ట్రార్ ఆచార్య టి. వెంకట రెడ్డిగారు, అన్నమయ్య సంకీర్తనలపై నేను చూపిస్తున్న శ్రద్ధను ప్రత్యేకంగా కొనియాడుతూ ప్రోత్సహించిన తొలి సాహిత్య పీఠాధిపతి ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు, నిరంతరం వ్యాసరచన, పరిశోధన సాగించి సమున్నత స్థాయికి చేరు కోవాలని ఆశీర్వచనం పలుకుతూ నాకు తెలియని కొన్ని పత్రికల

పేర్లు చెబుతూ నన్ను ప్రోత్సహించిన మాజీ సాహిత్య పీఠాధిపతి, భక్తి పద కవితా శాఖాధిపతి ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారు, నా పిహెచ్.డి. పరిశోధనా కాలం నుంచీ పరిశోధనాంశంలో నాకు కలిగిన సందేహాల్ని తీరుస్తూ, తమ అమూల్యమైన అభిప్రాయాలను అందిస్తూ నా వ్యాస రచనా పద్ధతిని గమనిస్తూ నన్ను ప్రోత్సహించిన మాజీ సాహిత్య పీఠాధిపతి ఆచార్య ఆర్.వి.ఎస్. సుందరం గారు, పత్రికలలో ముద్రితమైన నా వ్యాసాలను చదివి సహృదయంతో ప్రస్తావించి ప్రోత్సహించిన పూర్వ సహాధ్యాపకులు తెలుగు విశ్వ విద్యాలయ పుస్తక ప్రచురణ డైరెక్టరు ఆచార్య తిరుమల రావుగారు, అలాగే తులనాత్మక అధ్యయన శాఖ డైరెక్టరు ఆచార్య జి. లక్ష్మీనారాయణ రావుగారు, నా ఉన్నతిని కాంక్షించే సహాధ్యాపకులు శ్రీ ఎండ్లూరి సుధాకర రావుగారు,

విద్యార్థి దశనుండి నాపై సోదరీ వాత్సల్యామృతాన్ని కురిపిస్తూ, నా విద్యాభ్యుదయాన్ని, ఉద్యోగ ప్రగతిని, నా సుఖశాంతులను సదా కాంక్షించే నా ఆత్మీయ సోదరి విదుషి డా॥ ఎం. కె. దేవకి గారు, నా సాహితీ పరిశ్రమను నిరంతరం ప్రోత్సహించే సాహితీ సౌమ్యహృదయులు డా॥ పి. శ్రీనివాస రెడ్డిగారు, వ్యాస రచనకు అవసరమైన విషయాల్ని, పుస్తకాలను గ్రంథాలయాలనుంచి సేకరించి ఇస్తూ, వ్రాసిన చిత్తుప్రతుల్ని సకాలంలో శుద్ధప్రతులుగా తయారుచేసిస్తు నా శ్రమలో పాలుపంచుకున్న పరిశోధక విద్యార్థులు ఆర్. శివప్రసాద్, బాణాల రమేశ్, పూర్ణచంద్రరావు, రామలింగేశ్వరరావు, వేంకటేశ్వరరావు సాయుప్రసాద్, సుబ్రహ్మణ్యశాస్త్రి, సోమేశ్వరరావు, ఇంకా నా వ్యాసాలను చదువుతూ విరివిగా వ్యాస రచన చేయమని ప్రోత్సహించే విద్యార్థులు, నాకు అవసరమైనవన్నీ సకాలానికి అమర్చిపెడుతూ, నా విద్యా వ్యాపకాలకు ఏమాత్రం అంతరాయం కలగనివ్వకుండా జాగ్రత్త వహిస్తు నాకు చేదోడుగా

ఉంటున్న పార్వతి, భారతి సోదరీలు, నా ప్రగతికి, నా పనులకు అన్ని విధాలా సహకరించే సోదరుడు కృష్ణమూర్తి (రవి), తమ స్వార్థ సుఖ శాంతులను పరిత్యజించి నా విద్యాభ్యుదయమే జీవిత లక్ష్యంగా పెట్టుకొని పరిశ్రమించిన అమ్మానాన్నలు,

వివిధాంశాలలో వ్యాస రచన చేయడానికి అవసరమైన పుస్తకాలందిస్తు, తమ అమూల్యమైన ఎంతో కాలాన్ని వెచ్చించి విలువైన అభిప్రాయాలను ఓర్పుతో, శ్రద్ధతో తెలియజేస్తు సహకార ప్రోత్సాహాలందించిన సహృదయులు, సాహితీవేత్తలు, గౌతమీ గ్రంథాలయ ఉద్యోగులు శ్రీ సన్నిధానం నరసింహశర్మగారు, రాజమహేంద్రవరానికి ఉద్యోగ నిమిత్తం కొత్తగా వచ్చినప్పటి నుంచి వ్యాసాలు వ్రాయమని చెబుతూ, వ్రాసిన వ్యాసాలను వెంట వెంటనే ప్రచురిస్తు, ప్రత్యక్షంగా వాటినిగూర్చి ప్రశంసిస్తు పత్రిక ద్వారా పురప్రజలకు నన్ను పరోక్షంగా పరిచయం చేసి ప్రోత్సహించిన కోస్తావాణి సంపాదకులు, సహృదయులు శ్రీ చింతల గోపాలరావుగారు, పత్రికల్లో నా వ్యాసాలు చదివి బాగున్నాయంటూ నన్ను ప్రోత్సహించే రిటైర్డు కమర్షియల్ టాక్స్ ఆఫీసర్, హితకారిణీ సమాజ అధ్యక్షులు సాహితీప్రియులు శ్రీ పతివాడ సూర్యనారాయణగారు, వ్యాసాలు వ్రాసి పంపమని ఉత్తరాలు వ్రాసిన సాహితీమిత్ర, పండిత భారతి, సమాలోచన మొదలైన పత్రికా సంపాదకులు,

పదకవితలపై అమోఘమైన కృషిచేసి పదకవితా మాధుర్యాన్ని పాఠకులకు, పరిశోధకులకు అందించిన ఆచార్య ఎస్. గంగప్ప గారు, ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు, ఆచార్య కె. సర్వోత్తమరావుగారు, ఇంకా పదకవితా వ్యాస రచనకు ఉపకరించిన గ్రంథాల గ్రంథకర్తలు, ఇంకా ప్రత్యక్షంగా పరోక్షంగా నా వ్యాస రచనను ప్రోత్సహించినవారు, సహృదయ పాఠకులు,

మనవి చేసిన వెంటనే నిర్విరామ కార్యక్రమాల్లో నిమగ్నమై వుండి కూడా నాపై దయతో, వాత్సల్యంతో పదకవితా వైజయంతిని శ్రద్ధాసక్తులతో పరామర్శించి సాహితి బాంధవులకు పదకవిత్వంపై సద్భావం, భక్తివిశ్వాసాలు కలిగేలా, నా శ్రేయస్సుకోరి 'ఆశీస్సులు' అందించిన ప్రఖ్యాత కవిపండిత విమర్శకులు, మానవతామూర్తులు తెలుగు విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సిలర్ ఆచార్య పేర్వారం జగన్నాథంగారు, 'స్పందన' తెలియజేసిన నా గురువర్యులు, పర్యవేక్షకోత్తములు, సాహితీ దురంధరులు, అష్టభాషాప్రవీణులు, మృదుస్వభావులు అయిన ఆచార్య కె. సర్వోత్తమరావుగారు, 'ఆమోదం' అందించిన గురుతుల్యులు, నిత్యసాహితి పారిశ్రామికులు, శ్రేయోభిలాషులు అయిన ఆచార్య ఎస్. గంగప్పగారు, 'అభినందన'ను అనుగ్రహించిన అష్టావధాని, సంస్కృతాంధ్ర కవిపండిత శేఖరులు, నిరంతర సాహితీ ప్రోత్సాహకులు, సౌజన్యమూర్తులు, ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు, 'ఆకాంక్ష'ను వ్యక్తం చేసిన అవిరళ సాహితీ పరిశోధకులు, నిత్యోత్సాహకులు అన్నమాచార్య అధ్యయనసంస్థ డైరెక్టర్, ప్రస్తుత సాహిత్యపీఠాధిపతి ఆచార్య సి. రమణయ్యగారు, 'పదలీలాభినందనం' ప్రసాదించిన సౌమ్యమూర్తులు, సాహితీప్రవీణులు డా॥ గుజ్జర్లమూడి కృపాచారిగారు, 'సౌదర్యసంభావన' సొగసుగా సమకూర్చిన సాహితీ విదుషి, విమలమనస్వి, ఆత్మీయసోదరి డా॥ ఎం. కె. దేవకిగారు,

పదకవితా వైజయంతి ప్రచురణకు ఆర్థికసహాయం అందించి సహకరించిన తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులు, తెలుగు విశ్వవిద్యాలయం అధికారులు,

సకాలానికి గ్రంథాన్ని ముద్రించి ఇచ్చిన రాజమండ్రి త్రివేణి ప్రింటర్స్ ప్రొప్రైటర్ శ్రీ ప్రసాద్‌గారు, ముఖచిత్ర

చిత్రాన్ని అత్యంత శ్రద్ధాసక్తులతో తీర్చిదిద్దిన సహజ చిత్ర కళా కారుడు పి. కృష్ణమూర్తి (రవి), ముఖపత్ర చిత్రాన్ని సకాలంలో ముద్రించి ఇచ్చిన ప్రకాష్ ప్రింటర్స్, రాజమండ్రి వారికి—

ఇంకా ఈ 'పదకవితా వైజయంతి' దీప్తిగాంచడానికి సహాక రించిన ఎందరో ప్రత్యక్ష పరోక్ష సాహితీ శ్రేయోభిలాషులు అందరికీ కృతజ్ఞతా కుసుమాంజలి.

పొన్నా లీలావతమ్మ

ఆచార్య పేర్వారం జగన్నాథం
వైస్-చాన్సెలర్
తెలుగు విశ్వ విద్యాలయం
లలిత కళాక్షేత్రం
పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు-4

తేదీ 8-4-93

# ఆశీస్సులు

పేలాది కీర్తనలతో తెలుగునేలను సాహిత్య, సంగీతమయం చేసిన పదకవితా పితామహుడు అన్నమయ్య పదకవితా వైజయంతిని గురించి పొన్నా లీలావతమ్మ పలు సందర్భాల్లో రాసిన వ్యాసాలను కూర్చి ఈ గ్రంథంగా ప్రచురిస్తున్నందుకు చాలా సంతోషం. అన్నమయ్యతో పాటు త్యాగయ్య, దీక్షితర్, శ్యామశాస్త్రి, రామదాసు, క్షేత్రయ్య వరకూ తెలుగు సాహిత్యంలో, భారతీయ సంగీతంలో మకుటాయమానులైన వాగ్గేయకారులను అనేక విధాలుగా పరామర్శిస్తూ ఇందులోని వ్యాసాలు సాగిపోతాయి. ముఖ్యంగా ఇంత విస్తృతంగా రచయిత్రి అన్నమయ్యను దర్శించడంలోని ఆత్మసంవేదనం, అభినివేశం పాఠకుల దృష్టిని కూడ ఆకర్షిస్తుంది. తిరుమల శ్రీ వేంకటేశ్వరుని పట్ల అన్నమయ్య పదాల్లో పొంగులువారి అపార భక్తితత్త్వం ఒకటయితే ఆయన కీర్తనల్లో చోటుచేసుకున్న సమస్త మానవ జీవనావస్థల స్పర్శ మరో గని వంటిది. ఎన్నివిధాల శ్రీహరిని కీర్తించాడో అన్ని కీర్తనల్లో అన్నివిధాలైన ఆదర్శాలను, విలువలను అన్నమయ్య ప్రబోధించాడు. 'నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటె, అండనే బంటు నిద్రనదియు నొకటే' అనేది అన్నమయ్య

వేనవేల కీర్తనల్లో ఒకటి. మానవజాతికి సమానత్వాన్ని గురించి ఆధునిక సిద్ధాంతాల ద్వారా కన్నా సున్నితంగా సరళ రమణీయంగా అందులో చెప్పినాడు. అన్నమయ్య సంకీర్తనల్లో ప్రతిబింబించిన జానపద కవితారీతులు, సంస్కరణ దృక్పథం, సామాజిక చైతన్యం, నీతి, శ్రీహరిపట్ల అనంతమైన భక్తి ఇలా ఎన్నో అంశాలను వేరుచేసి అనాయాసంగా అర్థం చేసుకొనేందుకు వీలయిన పద్ధతిలో రచయిత్రి ఈ వ్యాసావళిని అందిస్తున్నారు.

అన్నమయ్య శ్రీహరిని, త్యాగయ్య, రామదాసు శ్రీరాముని, క్షేత్రయ్య మువ్వగోపాలుని, శ్యామశాస్త్రులవారు దేవిని ఈ విధంగా వాగ్గేయకారులంతా తమ ఇష్టదైవాలను ఆశ్రయించి సంకీర్తనం చేసి తరించారు. వారి సంకీర్తనల్లోని భక్తి ప్రపత్తులు, ప్రవర్తన, పరివర్తన విలువలు ఈనాడు మానవజాతికి ఉపకరిస్తున్నాయి. వీరి 'పదకవితా వైజయంతి' దాక్షిణాత్యులు పొందిన ధన్యతకు చిరసాక్షిగా నిలుస్తుంది. వ్యాసరూపంగా ఒక ఉపయుక్త గ్రంథాన్ని పాఠకుల ముందుకు తీసుకువెళ్ళడానికి లీలావతమ్మ చేస్తున్న ప్రయత్నాన్ని మనసారా అభినందిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం

ఆచార్య కె. సర్వోత్తమరావు
ఎం ఎ. (తెలుగు) ఎం.ఎ. (సంస్కృతం) పిహెచ్ డి.
విద్వాన్, రాష్ట్రభాషా ప్రవీణ
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం
తిరుపతి-517 502

తేది 6-3-93

# స్పందన

తాళ్లపాక అన్నమయ్య సాహిత్యాన్ని మా విశ్వవిద్యాలయంలో 1974 లో ఎం. ఏ. పాఠ్యాంశంగా పెట్టినపుడు ముూతి ముడుచుకున్న వారు కొందరు. పెదవి విరిచినవారు కొందరు. కళ్ళను నెత్తికెక్కించుకొని కస్సుమన్న వారు కొందరు, నీళ్లు నమిలినవారు కొందరు. ఇన్నాళ్ళకు విశ్వవిద్యాలయం గుర్తించిందని పరవశించిన వారు కొందరు. ఇదంతా గత చరిత్ర. తాళ్ళపాక సాహిత్యాన్ని అన్నమయ్య వాఙ్మయాన్ని పీఠికలతో, పరిచయ వాక్యాలతో, ఉపోద్ఘాతాలతో ఊదరగొట్టవలసిన కాలం కాదిది. అన్నమయ్య సాహిత్య పరిచయం లేనివాడు అజ్ఞాని. తాళ్ళపాక సాహిత్యాన్ని తలవనివాడు అపరిశోధకుడు. పదకవితా సౌందర్యానికి ముగ్ధుడు కానివాడు పరమ మూర్ఖుడు, అరసికుడు. ఇది ఈనాటి స్థితి.

తాళ్లపాక సాహిత్యాన్ని పాడటం వరకు పరిమితం చేసుకున్న వారు కొందరయితే పరిశోధనకు తీసుకున్న వారు మరికొందరు. భుక్తి కోసం అన్నమయ్య పేరును వాడుకొనేవారు కొందరయితే భక్తితో 'నిర్మాల్యంగా' కళ్ళకు అద్దుకొనేవారు మరికొందరు. తాళ్ళపాక సాహిత్య పరిశోధక కుటుంబం నానాటికి విస్తరించడం ఆనందించతగ్గ

అంశం. ఈ విషయంలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ముందడుగు వేసింది. ఇతర విశ్వవిద్యాలయాలకు 'మార్గదర్శకత్వం' వహించింది.

డా॥ పొన్నా లీలావతి నా 'అంతేవాసిని' నా పర్యవేక్షణలో పి.హెచ్.డి. సాధించిన పరిశోధకురాలు. కొందరి ఉద్యోగ జీవితాలలో 'పరిశోధనకు' 'పనికి' బాదరాయణ సంబంధం. మరి కొందరి పరిశోధన 'పేటికాంతర్గత రత్నం' కొందరిలో పరిశీలన 'కొడిగట్టినదీపం' అయితే అదృష్టవశాత్తు డా॥ లీలావతమ్మకు ఈ గతి పట్టలేదు. డిగ్రీతో బాటు ఉద్యోగమూ వచ్చింది. తెలుగు విశ్వవిద్యాలయం గుర్తించింది. పదకవితా శాఖలో 'పదవిని' ప్రసాదించింది. డా॥ లీలావతమ్మ పరిశోధన ఆనాడు 'నర్సరీ'లోంచి బయటి ప్రపంచానికి వెళ్ళిన మొక్క. ఈనాడు ఆ మొక్కకు 'నిలుకడ' ఉంది. తనంత తానుగా నిలబలగలశక్తి ఉంది. నింగికెగసే 'ధీమా' ఉంది. పందిరిలా పదిమందికి నిలవనీడనిచ్చే సౌమనస్యం ఉంది. మనసా మెచ్చుకుంటున్నాను.

'పదకవితా వైజయంతి'లో 50 వ్యాసాలున్నాయి. ఎక్కువ భాగం అన్నమయ్య సాహిత్యానికి సంబంధించినవి. మరి కొన్ని రుచి మార్పుకోసం వడ్డించిన పచ్చళ్ళలాగా ఇతర వాగ్గేయకారులవి. ఈ వ్యాసాలను సప్తగిరి, స్రవంతి, కోస్తావాణి మొదలైన పత్రికలు ఆదరించాయి. సహృదయులు స్వీకరించారు. పుస్తకరూపంలో వస్తే బాగుంటుందని భావించారు. చివరకు ఫలించింది. వ్యాసపుష్పాలు 'వైజయంతిక'గా రూపు దిద్దుకొంది.

డా॥ లీలావతమ్మ కృషి 'గోదావరి గలగల'గా రాణి చాలని ఆకాంక్ష.

కె. సర్వోత్తమరావు

ఆచార్య ఎస్. గంగప్ప
ఎం.ఎ., పిహెచ్.డి.
తెలుగు, ప్రాచ్యభాషా విభాగం
నాగార్జున విశ్వ విద్యాలయం
నాగార్జున నగర్
గుంటూరు జిల్లా

తేది 13-3-93

# ఆమోదం



పదపద్యకవితల్లో పదమే ముందు పుట్టిందన్న అంశం సర్వ పండితామోదాన్ని పొందింది. పదం 'అనిబద్ధం' కావడంవల్ల పండితామోదాన్ని పొందలేక 'ముదితవిటులు, విధవలంజలు' పదకవితలుగా యీసడింపబడ్డాయి. కృష్ణమాచార్యులు తాళగంధులుగా వచనంలో రచించుకొన్నారు. ఆ వెనుకపదాన్ని నిబద్ధంచేసి పదకవితా వైభవాన్ని పరిమళభరితం చేసిన ఘనత తాళ్ళపాక అన్నమాచార్యులదే ఆ వెనుక పెదతిరుమలాచార్యులు ముఖ్యంగా క్షేత్రయ్య, సారంగపాణి, రామదాసు, త్యాగరాజు మొదలైన పదకవుల చేతిలో పలు రీతుల మార్పుచెంది సాహిత్యం సంగీత సామ్రాజ్యంలో, అభినయంలో పరవశించింది పదకవిత.

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అయినవాడు, పదకవితలో అనవద్యుడైన అన్నమాచార్యుడు శృంగార, అధ్యాత్మ సంకీర్తలు పాడి, ఆడి తరించాడు. శృంగార మధుర భక్తిపూరిత వైభవాన్ని తెలుగుల కందించిన మహనీయుడు, మహాభక్తాగ్రేసరుడు.

అలాంటి అన్నమయ్య సంకీర్తనలపై పరిశోధనచేసి డాక్టరేట్ పుచ్చుకొన్న పొన్నా లీలావతమ్మ 'పదకవితా వైజయంతి' వ్యాస

సంపుటిని వెలయించారు. తాను చేసిన పదకవితా సాహిత్యకృషిలో భాగంగా యీ వ్యాసాల సంపుటిని మనం గ్రహించవలసి వుంది. సిద్ధాంతవ్యాసంతో పని పూర్తి అయినట్టు భావించక పలువ్యాసాలు ముఖ్యంగా అన్నమాచార్యుని పదాలపై పలు పత్రికల్లో ప్రకటించి నిరంతరం తాను కొనసాగించిన విద్యాపరిశోధనలను జంటగా నడపిన తీరు మెచ్చదగింది; శ్లాఘించదగిన అంశం. కారణం యీనాడు డాక్టరేట్ సంపాదిస్తే అదే పరమలక్ష్యంగా భావించి ఊరుకుంటారు పరిశోధకులు. డా॥ లీలావతమ్మ అందరిలాకాక అధ్యాపకురాలుగా విధి నిర్వహిస్తూ, పరిశోధన పర్యవేక్షకురాలుగా ఉంటూనే అన్నమాచార్యుల పదకవితలపై అనేక వ్యాసాలు, అనేక దృక్కోణాలనుంచి అన్నమయ్యను పరిశీలించి, సంశీలించి; సమాలోచించి, సముచితరీతిని అత్యంత అభినివేశంతో రచించి అన్నమాచార్యులతో తనకుగల అనుబంధాన్ని విస్పష్టరీతిని విశదీకరించి ధన్యురాలయిందని చెప్పడంలో సందేహం లేదు. అనుబాధమన్న మాట డా॥ లీలావతమ్మ వాడిందొక వ్యాసంలో. ఇతర వాగ్గేయకారులను గూర్చిన కొన్ని వ్యాసాలు లేకపోలేదు యీ సంపుటలో. అయినా అన్నమయ్యదే ఆధిక్యత.

డా॥ లీలావతమ్మ భావించినదాన్ని సూటిగా చెప్పడంలోను, చెప్పిన అంశాలను చదివించేట్టుగా భాషా రచనను కొనసాగించడంలోను కృతకృత్యురాలయింది. చెప్పినతీరు, చెప్పిన అంశాలు ఆమోదయోగ్యాలు. డా॥ లీలావతమ్మ కలంనుంచి మరిన్ని రచనలు రావాలని ఆకాంక్షిస్తున్నాను. ఆశీఃపురస్సరంగా అభినందిస్తున్నాను. అస్తు!

ఎస్. గంగప్ప

ఆచార్య బేతవోలు రామబ్రహ్మం
మాజీ పీఠాధిపతి
భక్తి పద కవితా శాఖాధిపతి
తెలుగు విశ్వ విద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం
బొమ్మూరు-533 124

శ్రీముఖ-ఉగాది 24-3-93

# అభినందన

దాదాపు ఒక దశాబ్దం కాలంలో అప్పుడప్పుడూ రచించిన వ్యాసాలను సంపుటీకరించి డా॥ పొన్నా లీలావతమ్మగారు ఈ వైజయంతిని ఆంధ్ర పాఠకలోకానికి "శ్రీముఖ" ఉగాది కానుకగా అందిస్తున్నారు. ఇందులో మొత్తం యాభై వ్యాసాలు ఉన్నాయి. ముప్పయి నాలుగు వ్యాసాలేమో అన్నమయ్యమీద, మిగతా పద హారునేమో తక్కిన పదకవులమీదా. ఇదీ స్థూలంగావీటి విభజన.

డా॥ పి. లీలావతమ్మగారి పిహెచ్.డి. పరిశోధనాంశం కూడా అన్నమాచార్యుడే. అన్నమాచార్యుడంటే వీరికి వల్లమాలిన భక్తి. అతడి కీర్తనలు తప్ప మరొక సాహిత్యం వినను కనను మాట్లాడను అన్నంతటి పట్టుదల వీరికేదో ఉన్నట్టు నాకు అనిపిస్తుంది. ఖద్దరు తప్ప కట్టను-పెట్టను అని వెనకటికి వేంకటేశ్వరరావుగారికి ఒక నియమం ఉండేదిట. నిజమే అన్నింటిలోనూ తలొక అడుగూ వేసేకన్నా ఏదో ఒక ప్రక్రియనో ఒక మహాకవినో నమ్ముకోవడం మంచిది. తల స్పర్శిగా అవలోకనం చేసి, ఇదిగో ఈ ప్రక్రియకు వీరు" అని గుర్తింపు పొందడం ఆశించదగినదే. ఆ దిశలో ప్రయాణం చేస్తున్నారు డా॥ పి. లీలావతమ్మగారు. అన్నమాచార్యుతో ప్రారంభమైన వీరి పరి

శోధనరంగం పద కవితా శాఖకు అంతటికీ విస్తరించింది. ఇది అభినందించదగిన ఆహ్వానించదగిన పరిణామమని సంబరపడుతున్న సహృదయులలో నేనూ ఒకణ్ణి.

మొత్తం ఈ వ్యాసాలన్నింటిలోకీ "ఫెమినిస్టుగా అన్నమయ్య" అనే శీర్షిక చటుక్కున నా దృష్టిని ఆకర్షించింది. గమ్మత్తుగా ఉందే అని చదివాను. అన్నమయ్యగారు అలమేల్మంగమ్మగారి పక్షాన చేరి అయ్యగారి ఘనతకు అమ్మగారే కారణమని చెప్పడం, "పీటపైనున్న దాపె-ప్రియుడవు నిలుచుండి మాటలాడే వాపెతోను మంచిదే కాదా" అనడం-ఇవన్నీ ఫెమినిస్టు భావాలని డా॥ లీలావతమ్మగారు సమన్వయించారు. అన్నమాచార్యుణ్ణి తొట్టతొలి ఫెమినిస్టుగా చూపించారు. పాఠకులు దీన్ని ఒప్పుకుంటారా ఒప్పుకోరా అన్నది అలా ఉంచుదాం. ప్రతి వ్యాసంలోనూ ఏదో ఒక కొత్తదనం ఉండాలి అనే పట్టుదలకు దీన్ని ఒక మచ్చుతునకగా భావించవచ్చు. అయితే అన్ని వ్యాసాలలోనూ ఈ కొత్తదనం ఉన్నదా అంటే చెప్పలేను. అలాంటి ప్రయత్నం ఒకటి ఉంది అన్నంతవరకూ నిజం. భావిలో ఇంకా మంచి వ్యాసాలు వీరినుండి అందుతాయని ఆశించడానికి పూర్తిగా అవకాశం కల్పిస్తోంది ఈ వైజయంతి. ఇంకా వివిధ కోణాలనుంచి పదకవితా సౌందర్యాన్ని పరామర్శించి వినూతన కాంతులను వెదజల్లే వ్యాసాలు డా॥ లీలావతమ్మగారి లేఖినినుంచి ఆకాంక్షిస్తున్నాను. శక్తిమేరకు చదవడం రాయడం అనే రెండు పనులూ వీరింకా విడిచిపెట్టలేదు కనుక ఈ ఆకాంక్ష ఇప్పటికే సంతృప్తద్రావణం అయిపోయిందనుకుంటే మనం చెయ్యగలిగింది ఏమీ లేదు. వీరింకా ఆ దశకు చేరుకోలేదని నా నమ్మిక.

ఈ పుస్తకం విషయంలో భాషాపరంగా ముద్రణ పరంగా మరి కొంత జాగ్రత్త తీసుకొని ఉండవలసింది. ఇటుపైని అవి ఆశిద్దాం. ఏమయినా "నడుచుచున్న వారి చరణంబులే కద ఆల తాకుడుల్" నడవడమే మానేస్తే ఎలా! వీరు ఇంకా ఇంకా ముందుకి - ముసు ముందుకి నడవాలి. జయో஽స్తు.

చేతవోలు రామబ్రహ్మం

**ఆచార్య సి. రమణయ్య**
పీఠాధిపతి, సాహిత్యపీఠం
తెలుగు విశ్వ విద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం
బొమ్మూరు-533 124

27-?-93

# ఆకాంక్ష

ద్రావిడాగమ సార్వభౌముడైన అన్నమాచార్యుల సంకీర్తనలను సమీక్షించిన "పదకవితా వైజయంతి" డా॥ పొన్నా లీలావతమ్మ రచన.

కలియుగ వైకుంఠేశ్వరుడైన శ్రీ వేంకటేశ్వరస్వామిని సంకీర్తన పూజతో సేవించి తరించిన మాననీయుడు అన్నమయ్య.

పదాల పోహళింపులో దివ్యశృంగారాన్ని, పరమార్థాన్ని ప్రదర్శించిన అన్నమయ్యను ఎందరు ఎన్నిరకాలుగా విశ్లేషించినా తనివి తీరదు.

'పదకవితా వైజయంతి'లో డా॥ పొన్నా లీలావతి అన్నమయ్య సంకీర్తనల్లోని అనేకాంశాలను సమీక్షించింది. అన్నమయ్యనే కాకుండా, రామదాసును, జయదేవ్, క్షేత్రయ్యను, వరదయ్యను కూడా రచయిత్రి స్మరించింది.

అన్నమయ్య సంకీర్తనల్లోని జానపదగేయ రీతులమీద ఈమె పిహెచ్.డి. చేశారు. అనుభవాల దొంతరల నుండి వెల్లుబికిన యీ వ్యాస సంపుటి అందరిని ఆకట్టుకోగలదనిపిస్తుంది.

ఈ వ్యాసాలు భావితరానికి ప్రేరకాలు కాగలవని నా విశ్వాసం. ముమ్ముందు డా॥ పి. లీలావతి మరిన్ని మంచి వ్యాసాలు, మంచి పుస్తకాలు రాయాలని కోరుతున్నాను.

**సి. రమణయ్య**

డా॥ గుజ్జర్లమూడి కృపాచారి
రీడర్
తెలుగు శాఖ
నాగార్జునగర్
గుంటూరు జిల్లా.

తేది : 10-3-93

# పదలీలాభినందనం

సత్ప్రవర్తనానికి, సర్వజన శ్రేయోదాయానికి, ఋజువర్తనకూ ఆధ్యాత్మిక బోధనలే అన్నివేళలా ఆదర్శమని ఆచార్యులు భాషిస్తారు. విజ్ఞుల విశ్లేషణ వివరంగా వివరణచేస్తే తాళ్ళపాక అన్నమాచార్యుల విషయంలో అది నిజమని నిర్ధారించవచ్చు. ప్రపంచ చరిత్రలోనే ఒక వ్యక్తి చేతిమీదుగా ఇన్ని వేల సంకీర్తనలు వెలువరించడం చాలా అరుదైన విషయం. అన్నమాచార్యులు ఆంధ్రులు కావడం తెలుగుజాతి అదృష్టమేమరి. ఎందుకంటే ఆయన స్పృశించని విషయంలేదు. వివరించని వ్యావహారంలేదు. తవ్వుతున్నకొద్దీ తరగని గని ఆయన. ఆయనపై పరిశోధనా వ్యాసాలు వేలకొద్దీ వెలువరించినా ఇంకా మిగిలే ఉంటాయన్నది జగమెరిగిన సత్యం.

ఈ పదకవితా వైజయంతి డాక్టర్ పొన్నా లీలావతి పరిష్కరించిన పరిశోధన వ్యాస కవితా వైజయంతి. వైజయంతి అనేది శ్రీ వేంకటేశ్వరస్వామి మెడలోని పూలహారం. అది ఊర్ధ్వంనుండి భూదేవిని చూస్తున్న పూఃమాలాకదంబం. నాగలోకంనుంచి సకల సంపదలు, సర్వశుభాలు భూమికి దిగివస్తాయని యీ వైజయంతి ఉద్దేశ్యమని విజ్ఞులు విశ్లేషిస్తారు. సరిగ్గా అటువంటి విశ్లేషణలే డాక్టర్ లీలావతి రచించిన వ్యాసాల వివరణ సారాంశం. అన్నమాచార్య పేప

వినగానే డా॥ లీలావతి తలపుకు వచ్చే విధంగా ఆమె యీ వ్యాసా లన్నింటినీ మలిచి గుదికూర్చి పేర్చిన వైజయంతి యిది.

డా॥ లీలావతి చేస్తున్న యీ సాహితీక్షేత్ర పరిశ్రమలో ముమ్ముందు మరింత ఫలప్రదం కావాలని, ఆశిస్తూ శుభాకాంక్షలు తెలియ జేస్తున్నాను.

తృషాచారి

డా॥ ఎం. కె. దేవకి
రీడర్, ఆంధ్రభారతి
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం.

తేది : 18-3-93

# సౌదర్య సంభావన

పదకవిత అనే సముద్రంలో దిగి లోతుపాతుల్నంతా గాలించి పుష్కలంగా దొరికిన రత్నాలన్నిటిని అందమైన మాలగా కూర్చి శ్రీనివాసుని కంఠంలో అలంకరించిన వైజయంతి యీ 'పదకవితా వైజయంతి'.

జానపదగేయాలు మానవుని ఉద్విగ్నహృదయంనుంచి మధురంగా జాలువారే రసగుళికలు. యీ గేయరీతుల్లోనే పదకవిత్వమంతా సాగింది. అలాంటి కవిత్వానికి నాందిపలికిన మహనీయుడు అన్నమయ్య. పదకవితా పితామహుడైన అన్నమయ్య సంకీర్తనలన్నీ సామాన్యులు హాయిగా ఆనందంగా పాడుకోవడానికి వీలుగావున్నవే. వేల కొద్దీ వున్న అన్నమయ్య కీర్తనలు అలవోకగా ఆశువుగానే పుట్టాయనడంలో సందేహం లేదు. అందుకే అవి అంత సహజ సుందరంగా భాసిస్తున్నాయి. శ్రీనివాసుడు అలమేలు మంగమ్మలను ఆధారంగా చేసుకొని అల్లబడ్డ ఈ పాటలలో జానపదుల బాణి మాత్రమేగాక వాళ్ళనాడి కూడా నిండుగా గోచరిస్తుంది. భాషాపరంగా ఉన్న జాతీయాలు, సామెతలు, పొడుపుకథలు మొదలైన వాటిని పరిశీలిస్తే యీ విషయం స్పష్టమవుతుంది.

సంకీర్తనల్ని వినడం, కొందరు కొన్నింటిని అడపా దడపా పాడుకోవడం ఆనందించడం అంతమాత్రమే తెలుసు. సంకీర్తనలలో

ఉన్న సౌందర్యాన్నే గాక సమాజపరంగా ఉన్న ఎన్నో అంశాలను వెలికితీసి వాటి ఔన్నత్యాన్ని ఎలుగెత్తి చాటిన ఘనత పొన్నా లీలావతమ్మకు దక్కుతుంది. అన్నమయ్యలో ఉన్న భక్తితత్వాన్నే గాక లోకజ్ఞతను, సామాజిక చైతన్యాన్ని, ప్రణయ సౌందర్యాన్ని, హితోక్తులను, ప్రజాబోధనను, తల్లిలాలనను, సామరస్య గుణాన్ని, స్త్రీవాద తత్వాన్ని, మూఢాచారాల్ని ఖండించిన విధానాన్ని ఈ వ్యాసాలలో సవివరంగా పొందుపరచి మహోన్నతమైన అన్నమయ్య వ్యక్తిత్వాన్ని, రామదాసు, త్యాగరాజు, సారంగపాణి, శ్యామా శాస్త్రి, ముత్తుస్వామిదిక్షితులు, జయదేవుడు, క్షేత్రయ్య, వరదయ్య మొదలైన పదకవుల రచనా వైశిష్ట్యాన్ని అందరికి చాటి చెప్పారు.

కవిత్వం పుట్టింది మానవులలోని జాంతవ ప్రకృతిని అంతం చేయడానికే. కవిత్వం శాఖోపశాఖలయిందికూడా యీ ప్రయోజనం కోసమే.

పదకవితల్ని చులకన భావంలో చదవని వాళ్ళున్నారు. చదివినా శ్రమించలేక విశ్లేషించుకోలేని వాళ్ళున్నారు. విశ్లేషించుకొన్నా సహృదయతతో ఆనందించలేని వాళ్ళున్నారు. ఇలాంటి వాళ్ళందరికీ యీ వ్యాస సంపుటి ద్వారా పదకవితా సంపదను పంచడానికి ప్రయత్నించిన పొన్నా లీలావతమ్మ ప్రశంసనీయురాలు.

తాను మధురంగా పాడుతూ, పాడిస్తూ, పరిశోధిస్తూ, పరిశోధింపజేస్తూ పదకవితా శిఖామణుల హృదయాలను ఆవిష్కరించిన లీలావతమ్మను హార్దికంగా అభినందిస్తున్నాను.

ఎం.కె. దేవకి

# విషయసూచిక

# అన్నమయ్య వాణి - జానపదుల బాణి

పల్లెప్రజలు పాడుకోవడానికి ముగ్ధ మనోహరమై అకృత్రిమంగా ఉండే పాటలు జానపదగేయాలు. పల్లీయులచే సృష్టింపబడి మౌఖిక ప్రచారంతో ప్రవర్తిస్తూ సంగీత సాహిత్యాలతో రసికుల హృదయాలను రంజింపజేస్తుంటాయి. అజ్ఞాతకర్తృత్వం, సామూహిక ప్రచారం, మౌఖిక సంప్రదాయం, ప్రాచుర్యం, సారళ్యం, జాతీయత మొదలగునవి జానపద గేయాలకు ప్రధాన లక్షణాలు.

అన్నమయ్య వివిధ జానపదగేయ లక్షణాలను క్షుణ్ణంగా వశం చేసుకొని తన మధుర భక్తిభావాలతో, ఆధ్యాత్మిక తత్త్వాలతో మాత్రాబద్ధ ఛందస్సులో సంకీర్తనలను రచించాడు. పల్లెపట్టులలో పామరజన ప్రచారంలో ఉన్న అనేక జానపదగేయ కవితారీతులు అన్నమయ్య సంకీర్తనల్లో కన్పిస్తాయి.

జానపదగేయాల్లో లయబద్ధమైన మాటల కూర్పుతో ప్రతి చరణం చివరగాని, కొన్ని చరణాల తర్వాతగాని ఒక పదమో లేక, చరణమో పునరావృత్తమవడం ఒక నిర్మాణ లక్షణం. అన్నమయ్య సంకీర్తనల్లో కొన్నింటిలో ఇట్టి లక్షణం గమనించవచ్చు.

"దొరకెేగా పూజ కందువ పూజ నీ
విరహపు తనుతావి విరవాది పూజ
కలికి నీ కనుచూపు కలువ రేకుల పూజ
లలన నీ నగవు మొల్లల పూజ" - 12 వ సంపుటము.

ఈ సంకీర్తనంలో 'పూజ' అనే పదం ప్రతి పాదంలోను పునరావృత్తమయింది.

పల్లెప్రజల నడుమ సెలయేరువలె పరుగులిడే జానపదగేయ ప్రవంతి వేంకటేశ్వరుని సన్నిధిలో సంగీతం, భక్తి నింపుకొని పరిపూర్ణ

మయింది. ఆనాడు భాగవతుల వాడుకలో ఉన్న పాటలన్నీ అన్న మయ్య చేతిలో నిబద్ధపదాలుగా మారాయి.

అన్నమయ్య సంకీర్తనల్లో పెండ్లిపాటలు, ధవళపు పాటలు, నివాళి పాటలు, సువ్వి పాటలు, గొబ్బి పాటలు, అల్లోనేరేళ్ళ పదాలు సోబె పాటలు, చల్ల అమ్మకపు పాటలు, భజనకీర్తనలు, చిందులు, లాలిపాటలు మొదలగునవే గాక సంవాద పదాలు, సంబుద్ధి పదాలు, ఏలపాటలు, శోభనపుపాటలు మొదలగు జానపదగేయ రీతులున్నాయి. వీటిలో కొన్నింటిని ఉదాహరణ సహితంగా చూడవచ్చు.

## పెండ్లి పాటలు :

అన్నమయ్య సంకీర్తనల్లో పెండ్లిపాటలు చాల ఉన్నాయి. అవి గంధం పాటలు, బంతులాటపాటలు, వధూవరులపాటలు, నలుగు పాటలు మొదలైనవి.

"పిడికిటి తలఁబాల పెండ్లికూఁతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లి కూఁతురు
పేరుకల జవరాలె పెండ్లికూఁతురు పెద్ద
పేరుల ముత్యాలమేడ పెండ్లి కూతురు"
- 12 వ సంపుటము

ఈ పాటలో పెండ్లికూతురైన అలమేల్మంగ యొక్క అలంకారాలను, హావభావ విలాసాలదులను అన్నమయ్య వర్ణించాడు.

## ధవళపు పాటలు :

ఇవి శుభకార్యాలలో ఆశీర్వదిస్తూ అక్షతలు చల్లేటప్పుడు పాడే పాటలు.

"జయ జయ రామా సమర విజయ రామా
భయహర నిజభక్త పారీణ రామా" - 9వ సంపుటము.

**నివాళి పాటలు :**

దృష్టి దోషాన్ని నివారించడానికై పారాణి పళ్ళెం తిప్పుతూ పాడేపాట లివి.

"వలపులు వలపులు వయ్యాళి
చలమరి మరుడును సమేళి" - 13 వ సంపుటము

**సువ్విపాటలు :**

ఇవి దంపుడు పాటలు. ధాన్యం దంచేటప్పుడు కాయక్లేశాన్ని పోగొట్టడానికి 'ఇస్' అనే ధ్వన్యనుకరణ శబ్దమే వేగంగా దంచేటప్పుడు ఆ ఊపులో సువ్వి సువ్వి అన్నట్టు విన్పిస్తుంది. ఈ శబ్దం ఊతగా కలవి సువ్వి పాటలు.

"సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁ గనియె
కావిరి విరిసె కంసుఁడు గినిసె
వావిరిఁ బువ్వుల వానలు గురిసె" - 12వ సంపుటము.

**గొబ్బి పాటలు :**

మార్గశిర మాసంలో యువతులు, బాలికలు, గుమ్మాల ముందు గుంపులు చుట్టి వలయాకారంతో తిరుగుతూ చప్పట్లు కొడుతూ పాడే పాటలివి.

"కొలనిదోఁ పరికి గొబ్బిళ్ళో యదు
కుల స్వామికిని గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా గోవులఁ గాచిన
కొండొక శిశువుకు గొబ్బిళ్ళో"
- 12వ సంపుటము.

**అల్లొనేరెళ్ళో పదాలు :**

ఇవి రాత్రిపూట వెన్నెలలో స్త్రీలు పాడే పాటలు. అల్లో నేరెళ్ళో అంటే అల్ల నేరేడుపండ్లని అర్థం కాదు. ఇది కేవలం ఊత పదమే.

"నెయ్యములల్లో నేరెళ్ళో
ఒయ్యన వూరెడి వువిళ్ళో
తొంటతొంటఁ గన్నులఁ గొరిగేటి నీళ్ళ
చిటిపొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీ వన్నెల మోవికి
గుటుకలలోన గుక్కిళ్ళో" - 12 వ సంపుటము.

భజన కీర్తనలు :

భక్తి జ్ఞాన కర్మమార్గాలను ప్రబోధిస్తూ పామర ప్రజలకు అర్థమయ్యే రీతిలో వ్రాయబడిన పారమార్థిక గేయాలను వైరాగ్యతత్త్వాలని, భజన కీర్తనలని, చెప్పడం పరిపాటి. ఏకనాదం మీటుతూ ఒంటరిగా పాడుకోదగినవి తాత్త్విక కీర్తనలు. అన్నమయ్య కీర్తనలలో ఇలాంటి భజనకీర్తనలకు, తాత్త్విక కీర్తనలకు ఉదాహరణలను ఎన్నైనా చూడవచ్చు.

ఏలపాటలు :

ఆంధ్రుల దేశిగానం ఏలపాటల రూపంలో కూడా సాగింది. ఏలలందు ఔదార్యం, ధార్మికత ప్రదర్శితం కావాలని లక్షణమున్నా కూడా అన్నమయ్య పాటలలో శృంగార ఏలలే వేంకటేశ సంబోధనలతో కూడియున్నాయి.

"మేడలెక్కి నిన్ను చూచి
కూడెననే యాసతోడ
వాడు దేరి ఉస్సురందుర - వేంకటేశ
యాడనుంటి విందాకనుర" - 13 వ సంపుటము.

లాలిపాటలు :

అన్నమయ్య సంకీర్తనలలో శ్రీకృష్ణుని బాల్యలీలా విలాసాలు ఎక్కువగా లాలిపాటల ద్వారానే వర్ణింపబడ్డాయి.

"ఉయ్యాలా బాలునూఁ చెదరు కడు
నొయ్యనొయ్య నొయ్యనుచు
బాలయవ్వనలు పసిడివుయ్యాల
బాలునివద్ద పాడేరు" - 12 వ సంపుటము.
"జో అచ్యుతానంద జో జో ముకుంద
రావె పరమానంద రామగోవింద"

నిత్యానంద స్వరూపుడైన భగవంతుని బాలునిగా భావించి గోపస్త్రీ రూపంలో అన్నమయ్య పాడిన జోలపాటయే ఈ సంకీర్తన.

**చిందులు :**

కేవలం కీర్తనలను ఆలపించడమే గాక భక్తి పారవశ్యంతో చిరుతలతో చేతులు పైకెత్తి మేనువంచి అడుగులను పలుగతులుగా మారుస్తూ ఆడటం జానపదులకు సహజం. గతిభేదం గల్గి అభినయాను కూలమయ్యే రచనల్ని చిందులంటారు.

'చిత్తగించు మా మాఁటలు నారసింహ
చిత్తజ జనక ఓ నారసింహ'' - 13 వ సంపుటము.

**సంవాద పదాలు :**

మార్గ కవితలో కన్పించని హృదయాకర్షణమైన గృహస్థ వాతావరణం జానపద రచనల్లో విరివిగా కన్పిస్తుంది. ఇద్దరి మధ్య మాటకు మాటగా సాగిన పాటలు సంవాద పదాలు. వీటినే యుగళ గీతాలని కూడ అంటారు. వీటిలో అత్తాకోడళ్ళ సంవాదాలు ప్రధానంగా కన్పిస్తాయి. అత్తగారు కోడలి నేడ్పించడమో, పెత్తనంచేజిక్కాక కోడలు అత్తగారిని సాధించడమో వంటి విషయాల నాధారంగా గ్రహించి అన్నమయ్య సంకీర్తనలను రచించాడు.

"రావే కోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యా పొందులు నీతో చాలును

రంకెలు వేయుచు రాజులెదుట నీవు
కొంకుగొసరులేని కోడల

"పంకజముఖి నీవు పలు దొడ్డవారింట్ల
అంకెల దిరిగేవు అత్తయ్యా" - 12 వ సంపుటము

ఇందు అత్తాకోడళ్ళయిన లక్ష్మీ సరస్వతుల సంవాదం ఒకరి నొకరు ఎత్తిపొడుచుకునే విధంగా సాగింది.

వైష్ణవ మతాన్ని, వైష్ణవ భక్తిని ప్రచారం చేయదలచిన అన్నమయ్య ప్రజలకు సన్నిహితంగా ఉండే భాషను సంకీర్తనా రచన కుపయోగించాడు. జానపద కవితకు వ్యవహారిక భాషయే ప్రాణం. అన్నమయ్య తన సంకీర్తనలలో వ్యావహారిక భాషకే అగ్రతాంబూలమిచ్చాడు. అన్నమయ్య జానపద కవితారీతులనేగాక భాషయందుకూడ పెక్కు వినూత్న ప్రయోగాలు గావించాడు. పామర జన ప్రయుక్తమయ్యే భాష భావోద్వేగానికి దోహదమవుతుంది.

ఈ విధంగా వేదాంతసారాన్ని - లీలా మానుష విగ్రహుడైన భగవంతుని ఆయా అవతార విశేషాలను భక్తి శృంగారాల ద్వారా పండితులేగాక పామరులకుకూడ తెలియ జేయడానికి తదనుసారంగా ఆనాటి ప్రజల వ్యావహారిక భాషనే గ్రహించి సారళ్యం, బాహుళ్యం అయిన జానపద కవితాధర్మాలు ప్రతిబింబించేలాగ సంకీర్తన రచన గావించిన ప్రజాకవి అన్నమయ్య.

'సప్తగిరి' (టి.టి.డి. ప్రచురణ; నవంబరు 1981)



# అన్నమయ్య సంకీర్తనల్లో ఆవృత్తి పదాల పరుసలు



పద కవితా పితామహుడు, ద్రావిడాగమ సార్వభౌముడు అయిన అన్నమయ్య ఆంధ్ర వాగ్గేయకారులలో ప్రప్రథముడు 'వాక్' అంటే సాహిత్యాంశం, గేయం అంటే సంగీతాంశం. ఈ రెంటిని గూర్చి రచనచేసే వారిని వాగ్గేయకారులంటారు. దీనినే సంగీత పరిభాషలో మాటల కూర్పును 'మాతువు' అనీ సంగీతపు కూర్పును ధాతువు అని అంటారు.

అన్నమయ్య కాలానికి ముందు నారాయణతీర్థులవారి తరంగాలలో కీర్తనకు పల్లవి, అనుపల్లవి, చరణాలుండేవి. దానికొక విశిష్ట స్వరూపమంటూ లేదు. ఈ కీర్తన నానాటికి అనుపల్లవిని పోగొట్టుకొని తాళ్ళపాక వారి కాలానికి ఒక పల్లవి మూడు చరణాలతో సంపూర్ణ స్వరూపాన్ని సంతరించుకొన్నది. కానీ అన్నమయ్య కీర్తనల్లో మూడింటికి మించిన చరణాలున్న కీర్తనలు అరుదుగా కన్పిస్తాయి. క్షేత్రయ్య పదాలలో కూడ మూడు చరణాలే కన్పించడం కద్దు. కాని త్యాగయ్య, దీక్షితులు మొదలైన అద్యతన వాగ్గేయకార రచనల్లో కొన్నింటిలో ఒకే చరణం కన్పిస్తుంది.

కీర్తనలు మతాన్ని, భక్తిని వ్యాపింపజేయదలచి మన పూర్వులు చేయూతగా తీసుకొన్న రచనలు, కీర్తన పూర్తిగా పుణ్య రచన అని చెప్పవచ్చు. భక్తితత్వాన్ని వ్యాపింపజేయడానికి ఆ భావాన్ని సంగీతంలో ఏదో ఒక మెట్టులో రచించి ప్రజల్ని ఆకర్షించినారు. కీర్తనలో సంగీతంకంటె సాహిత్యం ప్రధానం. కీర్తనలోని సాహిత్యం భగవంతుడో లేదా భక్తుల గురించి గాని లేక పురాణ గాథల గురించి గాని తెలిపేదిగా ఉంటుంది. అన్నమయ్య కీర్తనలన్నీ ఈ అంశాలనే తెలియజేస్తాయి.

అన్నమయ్య కీర్తనల స్వరూపాన్ని నిశితంగా పరిశీలించినప్పుడు ఆ కీర్తనలోని ఆవృత్తి పదాల్లో ఎంతో వైవిధ్యం కన్పిస్తుంది. ఆవృత్తి అంటే ఒక అర్థవంతమైన పదమో లేక ధ్వని పూరితమైన శబ్దమో పలుమారులు తిరిగి ఉచ్చరించటం.

ఈ ఆవృత్తి - 1. కీర్తనలోని అన్ని పాదాంతాల్లో ఉండటం.

2. కొన్ని పాదాంతాల్లో ఉండటం.

3. ప్రతి చరణాంతంలో ఉండటం కన్పిస్తుంది.

అన్నమయ్య కీర్తనలన్నీ ఇంచుమించు భజన సంప్రదాయానికి చెందినటువంటివి. భజన సంప్రదాయానికి సంబంధించిన కీర్తనల్లో ఒకరు పాట ప్రారంభించి, పాడుతున్నప్పుడు తక్కిన వారందరు చివరి పదాన్ని అందుకొని పాడుతారు. పద్యాలకు వృత్యానుప్రాసాదులైన శబ్దాలంకారాదులు శోభను చేకూర్చి వినేవారికి ఇంపును కల్గించే విధంగానే ఈ ఆవృత్తి పదాలు కూడా కీర్తనలకు రమ్యత్వాన్ని కల్గించి వినికిడిలో హాయిని చేకూరుస్తాయి.

అన్నమయ్య కీర్తనల్లో ఆవృత్తి పదాలను మూడు వర్గాలుగా విభజింపవచ్చును.

1. వ్యాకరణాంశం
2. భావాంశం
3. గేయాంశం.

## 1. వ్యాకరణాంశం :-

వ్యాకరణాంశాలకు సంబంధించిన పదాలను ఆయా పాదాంతా లలో వాడటం.

అ) నిర్దేశ నామాంతాలు :- నామవాచక పదాలను ఆయా పాదాంతాలలో నిర్దేశించి వాడటం.

ఉదా - 1

"దీనరక్షకుశంఖల వినుతుఁడు దేవ దేవుఁడు రాఁముడు"(6-178)

ఈ కీర్తనలో అన్ని పాదాంతాలలోనూ 'రాముఁడు 'అనే దైవ నామం ఆవృత్తి అవుతూ వుఁటుంది.

ఉదా - 2

కోటి సూర్య లోక కూటునఁ గూడుక
చాటున మెరసేటి చక్రము (7-281)

ఈ కీర్తనలో ప్రతి చరణంలోని రెండు, నాలుగు పాదాంతాల్లో వస్తు వాచకమైన 'చక్రము' అనే పదం ఆవృత్తి అవుతుంది.

ఉదా - 3

అనిశము దలఁచరో అహోబలం
అనంత ఫలదం బహోబలం (9-231)

ఈ కీర్తనలో ప్రతి పాదాంతాంలోను 'అహోబలం' అనే స్థల వాచక నామం ఆవృత్తి అవుతుంది.

ఉదా - 4

సాధించి మున్ను శుకుఁడు చదివినట్టి చదువు
వేదవ్యాసులు చదివిన చదువు (10-33)

ఈ కీర్తనలో పల్లవిలో తప్ప అన్ని చరణాలలోని ఒకటి, రెండు, మూడు పాదాంతాలలో 'చదువు' అనే పదాన్ని నిర్దేశించి చూపడం జరుగుతుంది. ఇదే విధంగా ఆయా సంకీర్తనల్లో, మంత్రము, మనసు, మందు, తేరు, యోగి, రాశి, జీవుడు, సాక్షి, పొలము, అడవి, ఆత్మ, పాదము, చేయి, సుఖి, సుజాతి, పూజ మొదలైన నామ వాచక పదాలు ఆవృత్తి అవుతుంటాయి.

బి) కులవాచక పదాంతాలు :-

ఆయా కులాల వారికి, వృత్తులవారికి సంబంధించిన పదాలను కీర్తనలోని పాదాంతాల్లో వాడటం.

ఉదా - 1

గురువింద పొద మరఁగున నుండి బిగిసీని
సిరివరు నెదుటనే చెంచెత (12-146)

ఈ కీర్తనలో ప్రతి చరణంలోని రెండవ పాదంలో చెంచెత అనే పదం ఆవృత్తి అవుతుంది.

ఉదా - 2

పొడవైన శేషగిరి బోయ నాయఁడు
విడువక కిందరి గాచు వెట బోయ నాయఁడు (1-460)

ఈ కీర్తనలోని అన్ని పాదాంతాలలోను 'బోయ నాయఁడు' అనే పదం ఆవృత్తి అవుతుంది.

ఉదా - 3

భోగీంద్ర శయనుని బోయతి దివ్య
భోగాలు మరిగిన బోయతి (12-175)

ఈ కీర్తనలోని అన్ని చరణాలలోను రెండు, నాలుగు పాదాంతాలలో 'బోయతి' అనే పదం ఆవృత్తి అవుతుంది. పై పదాలే కాకుండా, బ్రాహ్మఁడు బేహారి, తిమ్మి నాయఁడా, సేన మొదలారి మొ॥గు కులవాచక, వృత్తి వాచక పదాలు కూడా ఆవృత్తిలో కన్పిస్తాయి.

ఇ) సంబోధకాంతాలు :-

సంబోధక వాచకాలైన ఓ, ఓరి, ఓయి అనే పదాలను పదానికి ముందు చేర్చి, వ్యక్తినో, లేక వస్తువునో, తత్త్వాన్నో సంబోధించిన పదం ఆవృత్తి కావటం లేక నామాంతాలలో దీర్ఘమో హ్రస్వమో కన్పించటం.

ఉదా - 1

వొద్దు నీవు నా కెదురా వోరి కంసుఁడా (10-110)

ఈ కీర్తనలో ప్రతి చరణంలోని రెండవ పాదాంతంలో 'వోరి కంసుఁడా' అనే సంబోధనపదం ఆవృత్తి అవుతుంది.

ఉదా - 2

మూఁడవమ్మ కృష్ణుఁడు నీ సుతుఁడో యమ్మ
ఆడీ వీధులవెంట యశోదమ్మా (10-161)

ఈ కీర్తనలోని ప్రతి చరణాంతంలో 'యశోదమ్మా' అనే స్త్రీ వాచక పదం ఆవృత్తి అవుతుంది.

ఉదా - 3

కన్నుల మొక్కేము నీకుఁ గడపరాయ నన్ను
గన్ననాఁడె యేలితివి కడపరాయ (24-474)

ఈ కీర్తనలో రెండు నాలుగు పాదాంతాలలో 'కడపరాయ' అనే సంబోధన పదం ఆవృత్తి అవుతుంది.

ఉదా - 4

ఒక్కరీతి నుండదోయి వో పిట్టలా (26-68)

ఈ కీర్తనలోని అన్ని చరణాలయందు రెండు నాలుగు పాదాంతాలలో 'వో పిట్టలా' అనే పదం ఆవృత్తి అవుతుంది.

ఉదా – 5

చుట్టి చుట్టి పాతాళము చొచ్చి హిరణ్యాక్షుని
చట్టలు చీరిన వో చక్రమా (1-83)

ఈ కీర్తనలోని అన్ని చరణాలయందు, రెండు, నాలుగు పాదాంతాలలో 'వో చక్రమా' అనే సంబోధన పదం ఆవృత్తి అవుతుంది.

పై సంబోధన పదాలే కాకుండా చిలుకా, మనసా, పురుషో

త్రమూ, దేహమూ, వో మనసా, తుమ్మెదరో, దైవమూ, కాపురమా, కర్మమూ, కలియుగమా మొదలైన సంబోధన పదాలు కూడ ఆవృత్తిలో కన్పిస్తాయి.

ఈ) సర్వనామాంతాలు :

వస్తువులకు, వ్యక్తులకు, సంఖ్యా వాచకాలకు సంబంధించిన సర్వనామ పదాలను పాదాంతాలలో వాడటం :

ఉదా - 1

'ఇది'

మంతనాననే నాడేమాట సహజమే కాక
అంతలోనే నిన్ను వెంగెమాడుటా ఇది (24-466)

ఉదా - 2

'నీవు'

పల్లదవు నా మాటల భావించే అర్థము నీవు (14-170)

ఉదా - 3

'వాఁడు'

మొదల జగములకు మూలమైనవాఁడు (6-98)

ఉదా - 4

'ఒకటి'

కడుఁజక్కఁదనముల గర్వమొకటి (27-177)

ఉదా - 5

'ఇందరు'

అడరిన మోక్ష సహాయు లెవ్వరు లేరు
యిడుమ పాట్ల వారె యిందరు (1-154)

ఉదా - 6

'ఎందురు'

సాఁగిన శ్రీ వేంకటాధిపతి నన్ను నేమన్నాఁ
గాఁగాదు యిది యెంత కరతలాడెందురు (20-256)

పై సర్వనామ పదాలే కాకుండా ఇతఁడు, ఇవి, ఈపె, తాము, అది, ఆఁతడు, ఆపె, తాను, నేను, మీరు, యత్కిమర్థకాలైన ఎవ్వఁడు, ఏది, ఎవ్వరు, ఎవతె మొదలైన పదాలు కూడా ఆ వృత్తిలో కన్పిస్తాయి.

ఉ) విభక్త్యంతాలు :-

విభక్త్యంత రూపాలు పాదాంతాలలో ఆవృత్తి కావడం.

ఉదా – 1 – 'ని'

ఇంత నేరమే నేము యిచ్చకములే సీతుము
చెంతలనేకిందు పరచితివే విభుని (20-152)

ఉదా - 2 - 'చేత'

వంతుకు నా మనసురావలెనంటా నాపె చేత
పంతము లిప్పించే వేర పలుమారు (17542)

ఉదా - 3 – "కొరకు"

ఉదయమందుట భవముడుగుట కొరకే
చదువుట మేలు విచారించుకొరకే (1-70)

ఉదా - 4 - "కంటె"

వనము గానివిభుని వంక చూచుటకంటె
సుసరాన మునిగోష చూచుటే మేలు (22-237)

ఉదా - 5 - "కి"

చెంత వలసినట్లఁ జేసుకొంట (?) దేహికి (9-60)

ఉదా - 6 "న"

పైపైనే యణఁగును బహిరాకాశమున (7-168)

పై విధంగా అన్ని విభక్తి ప్రత్యయ రూపాలు ఆయా పాదాంతాలలో ఆవృత్తి కావడం కన్పిస్తుంది.

ఊ) అవ్యయాంతాలు :

లింగ, వచన, విభక్తులు లేని పదాలను పాదాంతాలలో వాడటం.

ఉదా - 1

అలిగితేఁ బోసీదు ఆకెకు లోనైన మీఁద (25-457)

ఉదా - 2

హరి నొల్లని వారసులు సుండో (6-194)

ఇవి కాక యీపె, మీఁదను, సుమ్మీ మొదలైనవి కూడా ఆయా పాదాంతాలలో ఆవృత్తి అవుతుంటాయి.

ఎ) క్రియాంతాలు - క్త్వార్థక రూపాలు :-

భూతకాలిక అసమాపక క్రియలు ఆయా పాదాంతాలలో ఆవృత్తి కావడం.

ఉదా – 1

ఈ రీతి దయ పుట్టినా ఇన్నియుఁ బూచి (18-300)

ఉదా – 2

వేడుక నవ్వులనే వెన్నెల లెల్లాఁ జల్లి (18-456)

ఈ రూపాలే కాక తలఁచి, పోయి, విడిచి, చూపి, అనే క్త్వార్థక రూపాలు కూడా ఆవృత్తిలో కన్పిస్తాయి.

ఏ) వ్యతిరేక క్త్వార్థక రూపాలు :-

క్త్వార్థక రూపాలే కాక వ్యతిరేక క్త్వార్థక రూపాలు కూడ ఆవృత్తి కావడం.

ఉదా – 1 చెలరేఁగావె సుద్దులే చెప్పేవు పలుమారు చెలులతో నెల్లా నీవు సిగ్గుపడక 5-212

ఉదా - 2 మచ్చరము మాని నీతో మాట్లాడినది చాలక

ఇవేకాక ఎఱఁగక, అనక, మొదలగు పదాలు కూడా ఆవృత్తిలో కన్పిస్తాయి.

ఐ) శత్రర్థక రూపాలు :

ధాతువు చివర 'చున్' ప్రత్యయము చేరిన పదాలుకూడ పాదాంతాలలో ఆవృత్తి అవుతుంటాయి.

ఉదా :— ఇంత సీతురా యిటువలె రమణుని యింతివి నిను నెల
యించె ననుచును (25–104)

ఇలాంటి రూపాలేకాక ధాతువు చివర 'ఇనన్' చేరిన చేదర్థక రూపాలైన చూచినను వంటివి కూడా ఆవృత్తి అవుతున్నాయి.

ఒ) కృదంత రూపాలు :-

క్రియావాచక ధాతువులపై క, త, ప, ప్రత్యయాలు చేరగా ఏర్పడిన రూపాలు పాదాంతాలలో రావడం.

ఉదా - 1

చుట్టరిక మిందునేది సుదతి విరహవేళ
మెట్టు బిగించేవు రా వేయిఁక నేఁడ యలుక (22-427)

ఈ కీర్తనలోని "అలుగు" ధాతు జన్యమైన "అలుక" అనే రూపము ఆవృత్తి అవుతుంది.

ఉదా - 2

ఇన్నియుఁ జేసితివిఁక నేలనీ
చిన్న నగవు మూసెర, నీచేఁత (12–286)

ఈ కీర్తనలోని ప్రతి చరణాంతంలోను "చేయు" ధాతుజన్యమైన "చేఁత" అనే కృదంత రూపం ఆవృత్తి అవుతుంది.

ఓ) సంప్రార్థనాంతాలు :-

ప్రార్థేయపూర్వక పదాలను ఆయా పాదాంతాలలో వాడడం.

ఉదా – 1

నే నీకు వేరుగాను నీవు నా కెరవుగావు
యే నెపమూ వేయనీపై నింటికి రావయ్యా

ఈ కీర్తనలోని ప్రతి చరణాంతంలోను "ఇంటికి రావయ్యా" అనే సంప్రార్థనా పదం ఆవృత్తి అవుతుంది.

ఉదా – 2

ఒద్దేలే జగడాలు వోయింతి
సిద్దెబట్టి కోరికలు చిత్తగించఁగదవే (14-70)

ఇవేకాక చూడరావా, ఇంటికిఁబిలువవే, అనరేయమ్మా, ఆరగించవయ్యా, ఆనతిమ్మనవే అనే పదాలు కూడా ఆవృత్తిలో ఉన్నాయి.

ఔ) ఆజ్ఞార్థకాలు :

ఎదుటి వ్యక్తిని ఆజ్ఞాపించు పదాలను పాదాంతాలలో వాడడం.

ఉదా - 1 :

మెల్లనే వుద్దాలు మెట్టి మీరిన తురుము పెట్టి
తెల్లని ముత్యాలు గట్టి తిరుగకువే (12–270)

ఉదా – 2

దినదినముఁ గర్మ పాతములఁ దిరిగెడి దుర్దశ లటు చూడు
(6–128)

అః) ప్రశ్నార్థకాలు :

ప్రశ్నార్థక పదాలు ఆయా పాదాంతాలలో ఆవృత్తి కావడం

ఉదా - 1

యీ వేళ నిన్ని తఁడేలె యిచ్చకము శాయవే
పూవుల వేటులాడ జంపుల సిగ్గులేఁటికి (22–144)

ఉదా – 2

మేకుల శ్రీ వెంకటేశ మేలునన్ను భ్రమియించి
పైకొని కూడితివింక బాసడుగ నేల (15-69)

పై నుదహరించిన కీర్తనలలో ఏటికి, ఏల అనే ప్రశ్నార్థక పదాలు ఆయా పాదాంతాలలో ఆవృత్తి అవుతుంటాయి.

## 2. భావాంశం :

హృదయగత భావోద్దేశాలను వ్యక్తం జేసే పదాలను పాదాంతాలలో వాడటం.

### అ) సందేహార్థకాలు :

సందేహార్థకమైన పదాలను పాదాంతాలలో వాడటం.

ఉదా -

కలలోన నిట్లనే కాంపురము నిట్లనే
నిలువు గల్లందమో నిజమందమో (9-270)

ఇలాగే 'వచ్చేవో రావో' మొదలైన సందేహార్థక పదాలు కూడ ఆవృత్తిలో కన్పిస్తాయి.

### ఆ) విహార్యర్థకాలు :

దుస్సహమైన భావం కలిగినప్పుడు ఉచ్చరించే పదాలను పాదాంతాలలో వాడటం.

ఉదా - 1

ఏంటికి నెవ్వరి పొందు యిస్సిరో చీచీ
నాటకము లాలా చీచీ నమ్మితిం గామిమ్మును (1-195)

ఉదా - 2

అనుమానపు బ్రతుకది రోంతా తన
మనసెనయని కూటమి మరి రోంతా (1-26)

ఇలాంటి ఏకార్థక పదాలు ఆయా పాదాంతాలలో ఆవృత్తి అవుతాయి.

ఇ) బంధుత్వ బోధకాంతాలు :

బంధు వాచక పదాలను కీర్తనలోని ఆయా పాదాంతాలలో వాడటం.

ఉదా – 1

మంచమెక్కి వావి చూచీ మరఁది పీఁడే
మంచినీటి చెలమల మరఁది (12-260)

ఉదా - 2

బాపు బాపు జాణగదే బావఁగారు
కోపగించీ నోపనంటే గోల బావఁగారు (1-355)

ఈ పదాలే కాక మరఁదలా, బావ, కోడల, అత్తయ్యా మొదలైన పదాలు కూడ ఆవృత్తిలో కన్పిస్తాయి.

ఈ) జాతీయాంతాలు (లేక) సూక్త్యంతాలు :

సూక్తి పదాలను కీర్తనలోని ఆయా పాదాంతాలలో వాడటం.

ఉదా॥

ఇల్లాలయిన దానికిది గురుతు
చెల్లుబడి నాది నీ చిత్తము నా భాగ్యము (24-423)

ఈ కీర్తనలోని ప్రతి చరణంలో "నీ చిత్తము నా భాగ్యము" అనే పదం ఆవృత్తి అవుతుంది.

## 3) గేయాంశం :

అన్నమయ్య తన కాలం నాటికి ప్రచారంలో ఉన్న గేయాలను గ్రహించి వాటిని భగవత్పరంగా చెప్పాడు. ఆయా పల్లె పాటల కుండే పేర్లను పాదాంతాలలో ఆవృత్తిగా వాడటం ఇందులో

కన్పిసుండి. ఉయ్యాల, గొబ్బిళ్ళో, డోబూచి, మేలుకొనవే, తుమ్మెదా చాంగుబళా, నీరాజనం, సోబనము మొదలైన పాటలలో ఈ పదాలే పాదాంతాల్లో ఆవృత్తిగా వస్తుంటాయి. వీటిలో కొన్నిటికి ఉదాహరణలు.

ఉదా - 1

అలర చంచలమైన ఆత్మలందుండని యల
వాటు సేసె నీ వుయ్యాలా (2-68)

ఉదా - 2

బండి విరిచి పిన్న పాపలతో నాడి
దుండగీడు వచ్చె డోబూచి (12-227)

ఉదా - 3

జగడపుఁ జనవుల జాజర
సగినల మంచపు జాజర (12-274)

ఉదా - 4

క్షీరాబ్ధి కన్యకకు (శ్రీ) మహాలక్ష్మికిని
నీరజాలయమునకు (యకును?) నీరాజనం (26-295)

ఉదా - 5

కొలనిదోఁపరికి గొబ్బిళ్ళో యదు
కులము స్వామికిని గొబ్బిళ్ళో [12-98]

ఉదా - 6

భోగి శయనమును బుసకొట్టెడిని
యోగ నిద్రపాయును మేల్కొనవే [1-139]

ఉదా - 7

వొద్దు వొద్దు కిట్లానే భోగిచందయ్యా
ఇద్దరికిఁ గలిగెనేఁడిదివో సోబనము [27-417]

పై విధంగా ఆవృత్తి పదాల వైవిధ్యం కేవలం తెలుగు సంకీర్తనలలోనే కాక సంస్కృత సంకీర్తనలలో ఉండే ఇలాంటి ఆవృత్తి

పదాల విభిన్నత్వం తక్కిన వాగ్గేయకార రచనలలో కన్పించదని చెప్పవచ్చు.

ఉపకరించిన రచనలు :-

1. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము - బాలాంత్రపు రజనీకాంతరావు
2. తాళ్ళపాక కవుల పదకవితలు
   భాషా ప్రయోగ విశేషాలు - డా॥ వేటూరి ఆనందమూర్తి
3. అన్నమాచార్య
   అధ్యాత్మ సంకీర్తనలు - 1, 6, 7, 9 సంపుటాలు
4. అన్నమాచార్య
   శృంగార సంకీర్తనలు - 12, 20, 22, 24, 25, 27 సంపుటాలు

"నవభారతి" [సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక]
[హైదరాబాదు, మార్చి, 1983]



# అన్నమయ్య లోకజ్ఞత



అన్నమయ్య వైష్ణవమతసిద్ధాంతాల్ని భక్తివిశేషాల్ని పండితులకేగాక పామర జనులలోను, ఆయా వృత్తుల వాళ్ళలోను ప్రచారం చేయ తలపెట్టాడు. అందుకు వారి వృత్తి విశేషాల్నే ఆధారంగా తీసుకొని భగవదంశాల్ని ప్రబోధిస్తూ సంకీర్తన రచన గావించాడు. ఈ వృత్తి పాటల్లో వర్తక వ్యాపారానికి సంబంధించిన నేతబేహారి, ఓడబేహారి, వడ్డీవ్యాపారి, వైద్యుడు, పూతవృత్తులవాళ్ళు, చల్ల అమ్మకపు గొల్లెత, సోదెచెప్పే ఎరుకత, కుమ్మరి మొదలైన వృత్తుల విశేషాలు కనిపిస్తాయి. ఈ వృత్తులవాళ్ళంతా ఒకచోటనే స్థిరపడి బ్రతికే వాళ్ళు కాక ఒక ప్రదేశం నుంచి ఇంకొక ప్రదేశానికి సంచరిస్తూ జీవనం సాగిస్తారు. కాబట్టి వీళ్ళద్వారా భక్తితత్త్వాలు కూడా సులభంగా వ్యాప్తం కాగలవనే దృష్టితో అన్నమయ్య ఈ వృత్తుల్ని సంకీర్తన రచనకు వినియోగించుకున్నాడు. ఈ వృత్తిగేయాల్లో కొన్నింటికి ఉదాహరణ :

## నేతవృత్తి :

వ్యవసాయం తర్వాత అతిముఖ్యమైంది. నేతవృత్తిమనిషి జీవించడానికి అత్యవసరమైన వాటిలో ఆహారం ప్రధానమైంది కాబట్టి అన్నమయ్య వ్యవసాయ వృత్తిని ఎక్కువగా వర్ణించాడు. అన్నమయ్య జీవించిన ప్రాంతంలోను, దానికి చుట్టుప్రక్కల ప్రాంతాల్లోను నేతపరిశ్రమ వ్యవసాయం తర్వాత విరివిగా సాగుతుండేది. అందుకే అన్నమయ్య వస్త్రోత్పత్తికి ఆధారమైన నేతపనికి ప్రాధాన్యమిస్తూ అందలి అంశాల్ని భగవత్పరంగా పోల్చి చెప్పాడు.

"వాడలవాడల వెంట వాడెవో వాడెవో
నీడ నుండి చీరలమ్మే నేత బేహారి"

ఈ కీర్తనలో పంచభూతాల్ని పలువన్నె నూలుగా, గుణాలు, కర్మలు, చేతల్ని నూలుకండెలుగా, కుచ్చులుగా పోల్చి కర్మాన్ని పెంకట్టె మైలసంతలో భగవంతుడు నేత వ్యాపారం చేయడం కన్పిస్తుంది.

"వమ్ముల రాట్నము నిలువక గుండ్రలు నిల్చునా
నమ్మి నీయప్పణ లేక భవనములు మానునా"

ఈ అంశాల్ని ఆధారంగా తీసుకొని భగవంతుడు లేనిదే లోకాలు నిలువవని ఉద్బోధించాడు.

కమ్మరి :

మానవ జీవితానికి నిత్యావసరమైన వృత్తులలో అతి ముఖ్యమయింది వ్యవసాయం. యీ వ్యవసాయానికి అవసరమైన ఇనుప పనిముట్లను తయారు చేసేవాళ్ళు కమ్మరివాళ్ళు. వీళ్ళనే కంసాలె వాళ్ళు అని కూడా అంటారు. వీళ్ళలో లోహపు పనివాళ్ళు, కొయ్య పనివాళ్ళు అని రెండు వర్గాలున్నారు. అన్నమయ్య లోహపు పని వాళ్ళను ఆధారంగా తీసుకొని ఆ పనిలో అంశాల్ని ఆధ్యాత్మిక విషయాలతో జోడించి చెప్పాడు.

"యెఱ్ఱగాఁ గ్రూరత్వ మెప్పుడుఁగొలిమిలో
కఱ్ఱు వలెనె కడఁగాఁగీని"

క్రూరత్వం రాక్షస కృత్యం. అందుకే క్రూరత్వాన్ని కొలిమిలో కాల్చబడే కఱ్ఱుతో పోల్చి చెప్పాడు. ఇలాంటి కీర్తనలు అన్నమయ్య రచనలలో చాల కన్పిస్తాయి.

కుమ్మరి :

మట్టితో పాత్రల్ని తయారుచేసి వాటిని అమ్ముకొని బ్రతుకును సాగించేవాడు కుమ్మరి. సంపన్నులు విలువైన లోహపు పాత్రలను

కొనగలరు. కానీ సామాన్య ప్రజలకు మట్టిపాత్రలే శరణ్యం. అయినా వేసవి కాలం లోను వివాహ సమయాల్లోను, వ్యక్తి మరణానంతర కార్యాదుల్లోను యీ మట్టిపాత్రల ప్రాధాన్యమెట్టిదో అందరికీ తెలిసిన విషయమే. పైగా అనంత అష్టైశ్వర్యాలతో తులతూగుతున్న స్వామివారికి ప్రతి నిత్యమూ నైవేద్యమిచ్చేది కూడ మట్టిపాత్ర తోనే. అందుకు కారణం మట్టిపాత్ర నిర్మలత్వానికి, పవిత్రతకు సూచకమని చెప్పుకోవచ్చు. ఒక కుమ్మరి భక్తుడు నిర్మల మనస్కుడై మట్టి పూలను సమర్పిస్తే భగవంతుడు వాటినే స్వీకరించాడు కానీ అహంకార చిత్తంతో బంగారు పుష్పాలు సమర్పించిన రాజభక్తుని అనుగ్రహించలేదు. ఈ దృష్టితో అన్నమయ్య కుమ్మరి దాసుల భక్తి తత్పరతను వర్ణించి వీరి జీవనాధార వృత్తిలోని అంశాల్ని ఆధారంగా తీసుకొని భగవద్విషయాల్ని వ్యక్తం చేశాడు. దీనివల్ల తన కాలంలో కుమ్మరి వృత్తికి ఎంతటి ప్రాధాన్యం వుండేదో తెలుస్తుంది.

"ఇమ్మైన పాపంబు లెన్నవలసినఁ బ్రాణి
సమ్మతంబునఁ జేయఁ జాలుఁ గాకేమి
కుమ్మరి కొక యేడు గుదియ కొకనాఁడౌను
నమ్మి తలఁచిన విష్ణు నామంబు చేత"

కుమ్మరి ఎన్నో రోజులు శ్రమించి మట్టి పాత్రల్ని తయారు చేసినా వాటిని గుదియతో (కర్రతో) ఒక్కరోజులో పగలగొట్టవచ్చు. అలాగే జీవుడు ఏండ్లకొద్దీ ఎన్ని పాపాలు చేసినా విష్ణునామ స్మరణచే అన్నీ క్షణకాలంలో పరిహారమౌతాయని ఈ కీర్తనలోని సారాంశం.

"కుమ్మరివాఁడు లేక కుంభ దాఁబుట్టీనా
నెమ్మి నీవు పుట్టించక నేనే పుట్టితినా"

అనే కీర్తనలో కుమ్మరివాడు మట్టిపాత్రలను సృష్టించినట్లు భగవంతుడు జీవుల్ని సృష్టిస్తాడని భగవంతునికి, కుమ్మరికి సమన్వయం చేయడం కన్పిస్తుంది.

**సోదివృత్తి :**

సోది అనే మాట శోధన శబ్దభవం కావచ్చు. శోధనమంటే అన్వేషించి సత్యాన్ని తెలుసుకోవడం. సోది చెప్పేవారు ఆంతరంగిక మైన రహస్యాల్ని తమ అనుభవం చేత గాని, దైవకృపవల్ల గాని గుర్తించి ఇతరులకు చెప్తారు.

"ఎరుక చెప్పె నీయిచ్చ యెల్లా నెరుఁగుదు
మెరుఁగైన సొమ్ములిచ్చి మెచ్చవయ్యా నన్ను"

ఈ కీర్తనలో సోది చెప్పించుకొనేవాడు శ్రీ వేంకటేశ్వరుడు. వేంకటేశ్వరుని వలచింది పద్మావతి. శ్రీ వేంకటేశ్వరుని దివ్య మంగళాకారాన్ని వర్ణించడం ఈ కీర్తనలోని బాహ్యార్థం. పూతన సంహారం, కాళీయ మర్దనం మొదలైన అవతార విశేషాల్ని కీర్తించడం ఆంతరంగిక విషయం.

**చల్ల అమ్మకం :**

అన్నమయ్య కీర్తనల్లో ఈ చల్ల అమ్మకపు పాటలు చాలా

"పిల్లగోవి పట్టుమంటాఁ బెరరేఁచీని మా
గొల్లవారి పిల్లంగోవి కోరో చల్లా"

ఈ కీర్తనలో చల్ల అమ్మకపు వృత్తి చేసి జీవించే ఒక గొల్ల పడుచు వీధుల వెంట పాట పాడుతూ చల్ల అమ్మడం కన్పిస్తుంది.

**చేతివృత్తులు :**

లౌకిక, ఆధ్యాత్మిక విషయాలతో సమన్వయించి చెప్పబడిన చేతివృత్తుల అంశాలతో కూడిన పాటలు కూడా అన్నమయ్య రచన లలో కన్పిస్తాయి.

లలన జవ్వనాలు లక్క పూసకపురులు
(శ్రీ)కాంతునిపైఁ జేయని భక్తులు
చెంబుమీఁది కనకపుఁబూత

పై కీర్తనల్లో లక్క పూస కపురులు, కనకపు పూత మొదలైన చేతి వృత్తుల ప్రసక్తులు ఉన్నాయి. దీనివల్ల తన కాలంలో అన్ని వృత్తులతో పాటు పూతపనులు, పూసల అల్లికలు మొదలైనవి కూడా ఉండేవని తెలుస్తుంది.

వర్తకం :

వర్తకం సముద్ర వర్తకమని, భూమిమీద వర్తకమని రెండు రకాలు ఉంటాయి.

వ్యాపారం కాలాగుణంగా సాగుతుంటుంది. సముద్ర వ్యాపారంలో రేవుల్లో సరుకులు దించుకొంటూ, వస్తువుల ధరలు గమనించుకొంటూ వ్యాపారం సాగించాలి. ఈ విషయాల్ని ఆధారంగా తీసుకొని అన్నమయ్య —

"కాంతల మానము నేటి కరపట్నాలకు దిగె
మంతనాన జీవుఁడనే మంచి మరకాఁడు"

అనే కీర్తనలో వర్ణించాడు. సంసార సాగరంలో దేహమనే ఓడపై పాప పుణ్యాలనే సరుకుల్ని నింపుకొని జీవుడనే మరకాడు గమ్యాన్ని చేరడాన్ని గూర్చి, నిట్టూర్పులనే తుపాను గాలులు వీస్తున్నప్పుడు కోరికలనే చాపలెత్తి భగవన్నామంతో బరువుగా చేసుకొని ఓడను జాగ్రత్తగా నడపడం మొదలైన అంశాల్ని పారమార్థిక జీవితానికి పోల్చాడు.

ఓడ వ్యాపారస్తుడు ధనాన్ని దాచుకొన్నట్లు జీవిని భగవంతుడు దాచుకోవాలని —

"పోడబేరమాడే వాఁడు నొకదరి చేరిచి
కూడిన యర్థముగాచుకొనీనట — అంటాడు.

వడ్డీ వ్యాపారాన్ని ఆధారంగా తీసుకొని —

"కూడఁగానే ఆసలెక్కి కోరిన నీ రతులను
వాడికె గూడి వచ్చిన వడ్డీవలెను"

అని నాయకుని శృంగార రతుల్ని వర్ణించాడు. ఇనుమడించిన వలపు వడ్డీలాగా అధికంగా లభించేదని —

"కలసి నీ విద్దరినిఁ గాఁగిలించు కొనవయ్య
వలపు లినుమడించి వడ్డీ వచ్చె నీకును"

అని పోల్చాడు. ఇలా వ్యాపారానికి సంబంధించిన పాటలు అన్నమయ్య రచనల్లో అనేకం కన్పిస్తాయి.

## వైద్యవృత్తి :

శారీరక బాధల్ని ఆ బాధల నివారణను గూర్చి తెలియజేసేది వైద్యవృత్తి. రోగాల్ని నివారించడానికి ఔషధాలు, అనుపానాలు, ఉపశాంతికర పదార్థాలు ఆయుర్వేదంలో చెప్పబడ్డాయి. ఆయుర్వేదంలో భస్మాలు, లేహ్యాలు, చూర్ణాలు, రసాయనాలు, కషాయాలనేవి రోగ నివారణ మందులు, మందు పుచ్చుకొన్న తర్వాత దాని వల్ల నయం కన్పించడం, రోగ దోషాలు పోవడం, భయాదులు పోవడం జరుగుతుంది. ఈ వైద్యశాస్త్ర విషయాల్ని అన్వయింపజేస్తూ అన్నమయ్య ఈ కింది కీర్తన వర్ణించాడు.

"శ్రీహరి పాద తీర్థమే చెడనిమందు"
మోహ పాశాల గోసి మోక్ష మిచ్చే మందు"

శ్రీహరి పాదతీర్థమనే మందు భస్మాల వలె కారమైంది కాదని తెల్లనిదని, చూర్ణాల వలె నూరని, కాచని నున్నని మందని కషా

యాల్లోలాగా వేరు వెల్లంకులు కలవనిదే మందుల లక్షణాల్ని ఆధారంగా తీసుకొని శ్రీహరి పాదతీర్థమనే మందు సమస్త బాధల్ని నివారిస్తుందని వర్ణించాడు.

"కొనరో కొనరో మీరు కూరిమి మందు
వునికి మనికి కెల్ల నొక్కటే మందు"

అనే కీర్తనలో కూడ వైద్యవృత్తి ఆధారంతో భగవన్మహిమను కీర్తించడం కన్పిస్తుంది. ధ్రువుడు, ప్రహ్లాదుడు, నారదుడు మొదలైన భక్తాగ్రేసరులందరు కొన్నటువంటి ఉత్కృష్టమైన మందునే కొనండి అని పామర ప్రజలకు ఉద్బోధించాడు. భౌతికమైన మందులు మనిషికి శారీరక రోగాల్ని నయం చేయవచ్చుగాని భగవద్భక్తి అనే మందు జననమరణాలనే రోగాల్ని నశింపజేసి శాశ్వత సౌఖ్యాన్ని ప్రసాదిస్తుందని ఈ కీర్తనలోని అంతరార్థం. ఇలాంటి కీర్తనలు అన్నమయ్య రచనలలో చాలా కన్పిస్తాయి.

ఇలా పరిశీలించినట్లయితే భక్తునికి కులభేదాలుకాని, వృత్తి భేదాలుగాని లేవని చెప్పడం అన్నమయ్య ఉద్దేశ్యమని తోస్తుంది. అంతేగాక కవికి అవసరమైన లోకజ్ఞత అన్నమయ్య రచనలలో పుష్కలంగా ఉందని తెలుస్తుంది. సమాజానికి వివిధ వృత్తులవాళ్ళు మూల స్తంభాలని నిరూపించడం వ్యక్తమవుతుంది.

'సప్తగిరి' (టి.టి.డి. ప్రచురణ; మే 1983)



# అన్నమయ్యలోని
# కొన్ని జాతీయాలు - సామెతలు



జాతీయాలు :- ఆంగ్ల భాషలోని ఇడియమ్, యూసేజ్ అనే పదాలకు తెలుగు భాషలో జాతీయం, నుడికారం, పలుకుబడి, అనే మాటలు ఒక దానికొకటి పర్యాయ పదాలు, విడి విడి మాటలకుండే ఆయా అర్థాలు గుదిగుచ్చి చెప్పినప్పటికీ తద్భిన్నంగా అర్థస్ఫూర్తి కల్గించే పదబంధాలను జాతీయాలు అంటారు. ఒక భాషలో లేదా ఒక మాండలికం మాట్లాడే వారి విశిష్టభావ వ్యక్తీకరణ ఈ జాతీయాల్లో స్పష్టమౌతుంది.

అన్నమాచార్య శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలను పరిష్కరించిన శ్రీ గారి పెద్దిరామ సుబ్బశర్మ గారి మాటల్లో చెప్పాలంటే "అవి వాక్యాలు కావు పదాలే, కానీ అవి కొన్ని పదాల అధ్యాహారంతో ఒక సమగ్ర వాక్యార్థాన్ని స్ఫురింపజేస్తాయి. ప్రజల భాషకు అగ్రస్థానమిచ్చిన అన్నమయ్య తన సంకీర్తనల్లో అనేక రకాలైన జాతీయాలను, సామెతలను పొందుపరచాడు.

1. ఏటిలో పైరు : ఏరు ఎండిపోయినప్పుడు రైతు కష్టపడి ఏటిలో పైరు పెట్టుతాడు. కాని ఏ సమయంలో ప్రవాహం వచ్చి కొట్టుకొని పోతుందో చెప్పలేము. ఆ పంట ఫలితం తనకు దక్కే-వరకు నమ్మకం లేదు. కాబట్టి ఈ జాతీయానికి అర్థం నిలకడలేనిదని, వ్యర్థమని చెప్పుకోవాలి.

ఉదా :- యే పనులు సేసినా నిటువలెనేవో
యీ పనికిం జొరని పని, యేటిలో పైరు (2-349)

ఇదే కీర్తనలో 'నీటిలోవ్రాత' 'వరదం గలిపిన చింతపండు' అనే పదబంధాలు కూడా పై అర్థాన్నే సూచిస్తాయి.

ఉదా :- 'గరిమెనివి లేకున్నం గల కాలములు జేయు
నితరంపు దపమెల్ల నీటిలో వ్రాత'
'కోరియవి లేకున్న కోటి దానములైన
పేరుకొని వరదం గలిపిన చింతపండు'

2. చీకటి దవ్వుకొను :- దీనికి అంధకారంలో కొట్టుమిట్టాడటం, మిక్కిలి దుఃఖకరమైన పనులకు అరుగులు చాచడం అనే అర్థాలు స్ఫురిస్తాయి. లోకంలో ప్రసిద్ధి చెందిన 'దురాశ దుఃఖానికి చేటు' అనే సామెత అర్థంలో అన్నమయ్య పై పదాన్ని ప్రయోగించినట్లు తెలుస్తుంది.

ఉదా॥ 'ఎడ తెగిన మమత వేయంగరాని పెనుమోపు
కడలేని యాస చీకటి దవ్వుకొనుట (2-96)

3. నీళ్ళునమలు :- సందిగ్ధావస్థలో సతమతమవడం, దిక్కు తెలియక పోవడం అని ఈ జాతీయానికి అర్థాలు.

ఉదా॥ "నీవు నీళ్ళు నమిలితే నిండెను వేదములు
యీ వలఁ దలెత్తితే నే యింద్రపదవులు మించె(6-156)

4. కంచము చాలదన్ను :- చేరువైన వస్తువు యొక్క విలువ తెలియక నిర్లక్ష్యంగా తృణీకరించడమని అర్థం.

ఉదా॥ పెంచేటి తల్లితండ్రులు ప్రియమై వడ్డించఁగాను
కంచము చాలఁ దన్న సంగతియా బిడ్డలకు (8-20)

5. జలధిలో వానలు :- మారద వెంకయ్యగారు తన భాస్కర శతకంలో "వలపున వచ్చి మేఘుడొక వర్షము వాడిన చేల మీదటం

గఁరిసిన గాక యంబుధుఁ గుర్వగ నేమి ఫలంబు" అన్నట్లు ఈ పద బంధానికి వృథా అని అర్థం.

ఉదా॥ "హరి హరి యనినేనన్న నాఁడే గా
పరగిన జన్మము ఫలియించె
కెరలి మీఁద మిక్కిలి నీ సేవలు
వరుస జలధిలో వానలు' (9-114)

6. నీటముంచు పాలముంచు :- కష్టాలకు గురి చేసినా, సుఖాలకు గురి చేసినా నీవే దిక్కని అర్థం.

ఉదా॥ "నీటముంచు పాలముంచు నీ చిత్తమిఁకను
చాటితి నీకృప గురి సంసారమునకు (10-224)

7. కరతలామలకం :- అరచేతిలోని ఉసిరికాయ తినడానికి సులభంగా అందుబాటులో ఉన్నట్లుగా సంసిద్ధంగా ఉండే విషయానికి ఈ జాతీయం వాడటం పరిపాటి

ఉదా॥ అరసి ధ్రువుని గాచినట్టి నీవు
కరుణతోఁ బ్రహ్లాదుఁ గాచిన నీవు
కరిరాజు శరణంటేఁ గాచిన నీవు
కరతలామలకమై కలవుగానీవు" (11-1-55)

ఇలాంటిదే 'పళ్ళెములో కూడు' అనే మాట కూడా.

ఉదా॥ "పూఁత నీ గర్వముల చూపులే వారకములు"
లేఁత నీ నగవులే పళ్ళెములో కూడు" (18-206)

8. నీ చిత్తము నా భాగ్యము :- ఈ జాతీయానికి ఎలాంటి కొదువలేదని, తృప్తికరమని లేక అదృష్టమని అర్థం.

ఉదా॥ 'మనసిచ్చి యెప్పుడు నీ మాటలోని దానన్నై
చెనకఁ గానిఁక నీ చిత్తము నా భాగ్యము' (24-423)

9. వ్రూరు వాడెడు చెలమ:- ఇందులో గల మాటలకు వేర్వేరు అర్థాలున్నా ఈ పదబంధం సూచించే అర్థం మాత్రం సులభ గమ్యం లేక అందుబాటులో ఉండేది.

ఉదా॥ 'ఒడలిపై నీ చెమట వ్రూరు వాడెడు చెలమ
జడియు నీ తమకంబు సంతతగరు (12-75)

ఇదే కీర్తనలో కట్టు వదలిన కేలిపు, జిగురు చుట్టిన కండె, తెరవు పెసరు, చెఅకు వండిన పండు, తంగేటి జున్ను మొదలైన పదబంధాలు ప్రయోగించబడ్డాయి.

10. ఒగరు తీపగు :- సాధారణంగా తియ్యదనాన్ని సుఖాలకు, ఒగరు చేదులను దుఃఖాలకు అన్వయిస్తారు. ఇక్కడ కష్టాలే ప్రియ మయిందని అర్థం.

ఉదా॥ పగటున మామా ప్రాణము మాకింక
నొగరే తీపాయె నుద్ధవుండా (12-56)

సామెతలు : సామెత అనే మాట 'సామ్యత' అనే సంస్కృత శబ్ద భవమని విమర్శకుల అభిప్రాయం. ఒక భాష మాట్లాడే వారి సాంఘిక మర్యాదను, జీవితానుభవాన్ని తెల్పేదిగా ఉండి, ఆ పదాల కుండే అర్థాన్నే కాక తద్భిన్నమైన విలక్షణార్థాన్ని ద్యోతకం చేసేదిగా ఉంటుంది. సందర్భానుసారంగా ప్రయోగించడానికి అర్హత కల్గిన మాటల కూర్పును సామెత అంటారు.

సామెత విశాలమైన మానవ జీవితానికి వ్యాఖ్యాన ప్రాయంగా ఉంటుంది. ఇది సాధారణంగా సంపూర్ణ వాక్యంలో ఉంటుంది స్పష్టత, క్లుప్తత, నిశితత్వం, దీనిని రాణింపజేసే అమూల్యాంశాలు, ఇందు చమత్కారమో, హాస్యమో, నీతిబోధకమో ప్రదర్శిత మౌతుంది. ఒక అర్థాన్ని చెప్పడానికి మారుగా అనంత లోకసిద్ధి కల్గిన తద్భృశా ర్థాన్ని చెప్పడమే సామెత యొక్క పరమార్థం. ఈ సామెతలు అన్నమయ్య సంకీర్తనల్లో వేనకు వేలుగా కన్పిస్తాయి.

1. అడవికింగాయు వెన్నెలకరణి :- జన సంచారమున్నచోట వెన్నెల కాస్తే ఎంతో వుపయోగకరంగాను, ఆహ్లాదకరంగాను ఉంటుంది. నిర్జనమైన అడవుల్లో వెన్నెల కాయడంవల్ల దాని విలువ తెలియదని లేక వ్యర్థమని అర్థం.

ఉదా॥ పోయం గాలం బడవికిం గాయు వెన్నెలల కరణి

శ్రీయుతుఁ దలంచుడి నరులు మాయంబడి చెడక (2-183)

2. తప్పులేని జీతము తారమైనంజాలు :- ధర్మంగా సంపాదించిన సొమ్ము నాలుగు కాసులైనా తృప్తిని కలిగిస్తుంది. ఈ సామెత వేమన పద్యంలోని 'గంగి గోవుపాలు గరిటెడైనను చాలు, కడివెడైన నేమి ఖరము పాలు' అనే వాక్యాన్ని స్ఫురింపజేస్తోంది.

ఉదా॥ "అప్పులేని సంసారమైనపాటే చాలు

తప్పులేని జీతమొక్క తారమైనంజాలు" (2-114)

3. నీట బడబాగ్ని యారునా :- సముద్రంలో ఉండే అగ్నిని బడబాగ్ని అంటారు. ఈ బడబాగ్ని జలనిధిలో ఉన్నా కూడా ఆరే ప్రసక్తి ఉండదు. అంటే దాని స్థితిని పోగొట్టుకోదని అర్థం. ఇది వేమనగారి "బొగ్గు పాలకడుగ పోవునా మలినంబు" అనే సూక్తిని పోలియున్నది.

ఉదా॥ 'అనంతకోటి జన్మములందుఁ జేసిన పాపములు

మొనసి నేనొక జన్మమున నింగన

ననిచి కర్మానుష్ఠానము నేఁడు జేయంబోతే

పని వడినంత నీట బడబాగ్ని యారునా" (2-16)

4. పూవులు ముడిసిన సిరసున కట్టెలు మోయుట :- అత్యున్నత స్థితిలో బ్రతుకుతున్న మనిషి విధి విపరీతం వల్ల అథఃస్థితికి వచ్చినప్పుడు ఇలాంటి సామెతలను వాడటం పరిపాటి. పవిత్రమైన సుకుమారమైన పువ్వులు వుండవలసిన చోటు వేరు, కట్టెలుండవలసిన చోటు వేరు. అలా గాక పువ్వులకు యోగ్యమైన స్థలంలో కట్టెల నుంచుకోవడం అసమంజసమని అర్థం.

ఉదా॥ "మునుపు శ్రీపతికి మొక్కిన చేతుల
అనరుహులకు దండమనుట యొట్టు
మునుకొని పూవులు ముడిచిన సిరసున
కనలు కట్టెలు మోచి కాకయ్యేదా (9-167)

5. గుడ్డికుక్క సంతకుఁబోయి తిరిగిన దుడ్డు పెట్లేకాక దొరికీనా :- కళ్ళులేని కుక్క సంతకు పోయి విచ్చలవిడిగా తిరగడంవల్ల అవసరమైంది పొందలేక పోవడం కాదుకదా పైగా కర్రదెబ్బలకు గురికాక తప్పదు. యోగ్యతా యోగ్యతలు ఆలోచించకుండా చేసిన పనులవల్ల అనర్థాలే కానీ మేలు జరగదని దీని సూక్ష్మార్థం.

ఉదా॥ "జడ్డు మానవుఁడు చదువఁ జదువనాస
వడ్డవాఁడు గాక వదలేనా
గుడ్డికుక్క సంతకుఁ బోయి తిరిగిన
దుడ్డు పెటేగాక దొరకీనా (11-3-69)

6. కాలిన పుండ్లలో నుప్పులు చల్లుట :- కాలిన పుండ్లబాధనే భరించలేని స్థితిలో ఉన్నప్పుడు వాటిపై ఉప్పులు చల్లితే ఆ బాధను వర్ణించతరం కాదని అర్థం. ఈ సామెత —

"తోలుతనె వానర మాపై
గలుద్రావి మదించెఁ దేలు కాటు దినియెనా
వలదయ్యపు సోకుడుఁగనె
తరమే యీ కోతి వైకృతము జెప్పంగాన్"

అనే పద్యభావాన్ని తలపింపజేస్తోంది. ఒక దౌర్భాగ్యానికి ఇంకొక దౌర్భాగ్యం తోడైనప్పుడు ఇలాంటి సామెతలు చెప్పటం పరిపాటి.

ఉదా॥ "చెప్పకు చెప్పకు నాకు సిగ్గయ్యీనిఁక నేల
నొప్పి సేసేనాతఁడింత నొచ్చితినేను
కప్పినఁ బోవు సీఁతలు కాలిన పుండ్ల
నుప్పులు చల్లక తలరోసతులు (12-33)

7. చిచ్చు కౌగిలించుకొంటే చిమిడించకుండునా:- వస్తువులను దహించి వేయడం చిచ్చు స్వభావం. అలాంటి చిచ్చును కౌగిలించు కొంటే భస్మం అవడం కాక వేరే ఉండదని అర్థం. దుష్ట సాంగత్యం వల్ల కానీ అధర్మమైన పనులవల్ల గానీ చెడు ఫలితాలు తప్ప మంచి ఫలితాలు అసంభవమని సూక్ష్మార్థం.

ఉదా :- "చిచ్చుఁ గాఁగిలించుకొంటే చిమిడించకుండునా
గచ్చుఁబర స్త్రీల పొందు కాంచకుండునా" (8-273)

8. విత్తొకటి పెట్టితే వేరొకటి మొలచునా :- ఏ గింజలను నాటితే వాటికి తగిన మొలకలే వస్తాయి కానీ వేరేవి మొలవవని అర్థం. అంటే ప్రయత్నమెంతో ఫలితమూ అంతే ఉంటుందనడానికి పిండెంతో నిప్పటీ అంతే. పని ఎంతో కూలీ కూడా అంతే, మొదలైన సామెతలను వాడతారు.

ఉదా॥ "విత్తొకటి పెట్టితేను వేరొకటి మొలచునా
యెత్తిన శ్రీహరి నీవే యీడేర్చవయ్యా" (9-189)

9. కలగన్న చోటికి గంప యెత్తినయట్లు :- కలలో కనపడిన వస్తువు వుండే స్థలానికి గంపతో సంసారాన్ని ఎత్తుకొనిపోవడం. అంటే అసంభావ్యమైన దానికి ఆశపడడం అని అర్థం.

ఉదా॥ 'కలగన్న చోటికి గంప యెత్తినయట్లు
అలపు మీరినదెట్లనమ్మా' (3-449)

10. శిరసుండ మోకాలికి శేస పెట్టుట :- శరీర భాగాల్లో అత్యున్నతమైన శిరస్సుపై అక్షతలు చల్లకుండ మోకాలిపై చల్లడం అవివేకమని అర్థం.

ఉదా॥ 'శిరసుండ మోకాల శేస యేఁటికి
సరసము లాకె వైనే చల్లరాదా నీవు' (25-441)

11. ఈరుఁడియ్యఁ బేను వచ్చుట :- ఈరు తీస్తున్నప్పుడు పేను కూడా రావడం అంటే పని చేస్తున్నప్పుడు దానికి విరుద్ధమైన ఫలితమో లేక అనుకున్న దానికన్నా ఎక్కువ ఫలితం రావడమో జరిగిందని అర్థం.

ఉదా॥ ఈరు డియ్య బేను వచ్చె నేమనఁగా నెట్లవునో
వూరకుండు టే చాలు వొద్దుసుమ్మీ బాసలు' (25-324)

ఈ విధంగా వైష్ణవ మత సిద్ధాంతాలను సామాన్య ప్రజల మనస్సులకు సూటిగా హత్తుకేసేటట్లు ప్రచారం చేయదలచి ఆంధ్రుల ప్రత్యేకపు సొత్తు అనదగిన సాధారణమైన జాతీయాలను, సామెతలనే కాక విలక్షణమైన వాటిని కూడా ప్రయోగించి తెలుగు భాషలోని సజీవత్వాన్ని తేటతెల్లం చేసిన ప్రజాహితకారి అన్నమయ్య.

'స్రవంతి' (సాహిత్య మాసపత్రిక; ఫిబ్రవరి, 1984)



# తెలుగు సాహిత్యంలో పదకవితా వికాసం

అన్నమయ్య కాలానికి పూర్వం సాహిత్యరంగంలో పదకవిత లనే పేరుతో ప్రత్యేకమైన రచనలున్నట్లు కనబడదు. పదకవితలకు పూర్వం పండిత గౌరవంగానీ, రాజాస్థానాల్లో విలువగానీ వుండేది కాదు. ఆ రోజుల్లో పదకవితలను క్షుద్రమైన రచనలని భావించి చిన్న చూపు చూసేవారు. అయినా విద్వత్కవుల గ్రంథాల్లో అక్కడక్కడ పదకవితల ప్రసక్తి లేకపోలేదు. ఈ పదకవితా వికాసాన్ని గూర్చి తెలుసుకోవడానికి ముందు పదశబ్దానికున్న వ్యుత్పత్తి, అర్థాలు, నిర్వ చనం వీటిని గూర్చి క్లుప్తంగా తెలుసుకొందాం.

'పదం' అనే మాటకు నిఘంటువుల్లో చిహ్నం, వంచన, కళా స్థానభేదం, పాదం. నెపం, కిరణం, ప్రయత్నం, ఉద్యోగం, రక్షణం, స్థానం, సుబంత తిజంతాలు, బాణం, పదార్థం, పీటకోడు, వాక్యం, కాలి అడుగుజాడ, పాట అనే అర్థాలున్నాయి. 'పదం' అనేది పదగతౌ పద్యతే అనేన ఇతిపదమ్' అనే వ్యుత్పత్పత్తితో ఏర్పడింది. దీనికి పొందబడింది అని అర్థం. ఇది ఒక మనోహరమైన సంగీతాత్మక ప్రక్రియ. దీనికి రాగం, తాళం మూలద్రవ్యాలు. సాహిత్యానికి కూడా ప్రాధాన్యముంది.

లాక్షణికులు 'పద్యమ్ చతుష్పదమ్' అన్నారు. అంటే నాలుగు పాదాలున్న పద్యంలో నాల్గవ భాగానికి పదం అని గానీ, పాదం అని గానీ సిద్ధిస్తుంది. ద్విపదలో అయితే అది రెండవభాగం, షట్పదిలో ఆరవభాగం, సప్తపదిలో ఏడవభాగం, జయదేవుని అష్టపదుల్లో ఎనిమిదవభాగం పదమవుతుంది. తెలుగు కన్నడ భాషలలో భాగం అనే అర్థంపోయి ఇప్పుడు పాట అనే అర్థమే రూఢమయింది.

పదకవితావిర్భావాన్ని గూర్చి కీ॥ శే॥ పింగళి లక్ష్మీకాంతంగారు సాహిత్యోపన్యాసాలలో ఇలా వివరించారు. "ఏ వాఙ్మయమునందైనను ఈ పదకవిత్వం పద్యకవిత్వముకంటె ముందు పుట్టి పెరుగుననుట బహుజనాంగీకృతమైన సిద్ధాంతము. చిత్రవిచిత్రకావ్యకమనీయ పర్వతారణ్యమయమైన ప్రకృతిలో పుట్టి పెరిగిన ప్రాకృతజీవియగు ప్రాక్తన మానవుని హృదయము సంతోషమయమో దుఃఖమయమో యగు నొకానొక భావము జనించి పరవశుని చేయగా అతని నోటివెంట అప్రతర్కితముగా ఒక పాట వ్యక్తమై యుండుననియు, ఆవేశ పూరితుడై అతడా పాటకు చిందులు త్రొక్కుచు పాడియుండుననియు, అది కవిత్వమునకు శ్రీకారమనియు వెల్లడించిరి.

ఈ పదకవిత్వంలో శబ్దానికెంత ప్రాధాన్యంవుందో గీతికకు కూడా అంతే ప్రాధాన్యం ఉంది. అంటే ఇందులో సుందర శబ్దరచనతో పాటు మధురమయిన పాట కూడా కలసి వుంటుంది.

పదకవితనుంచి పద్యకవిత్వం ప్రభవించిందని, పదమే ప్రాచీనమని శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి అభిప్రాయం సతాశంగానో, వితాశంగానో కావ్య కళా రసానుభావాన్ని ప్రాచీన మానవజాతి పాట రూపంలోనే అనుభవించిందని, మన పద్యాలన్నీ కూడా పదాల పరిణామాలే అని వీరు భావించారు.

మొట్టమొదట పదకవితలను గూర్చి నన్నయ మహాభారతం, ఆదిపర్వం, అష్టమాశ్వాసంలో నాగగీతాలను పేర్కొన్నాడు.

"క॥ నీ గుణములు దొల్లియు నా
గీ గీతము లందు విని తగిలి యుపుడు మనో

రాగమునఁ జూడఁ గంటిని
భాగీరథి యందు నిన్నుఁ బరహిత చరితా !"

(ఆది-అష్టమ-॥౩॥)

ఇది అర్జునుని తీర్థయాత్రా ఘట్టంలో ఉలూచి అర్జునుని మోహించి అతనితో పలికే సందర్భంలోనిది.

ఆ తరువాత నన్నెచోడుడు కుమారసంభవంలో పేర్కొన్న అంకమాలికలు, గౌడు గీతాలు, రోకటగోని దంచు పాటలు, ఉవిద లింపుగ పాడు పాటలు పదసాహిత్యానికి నిదర్శనాలు.

ఆ తరువాత పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో—

"పదములు తుమ్మెద పదములు ప్రభాత
పదములు పర్వత పదము లానంద

పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాలేశు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు సంజ
వర్ణన మఱి గణవర్ణన పదములు"

అని పట్టిక రూపంలో పదాలను పేర్కొన్నారు. ఆనంద సమయాల్లో పాడుకొనే కోలాట పాటలు, చాగుభళాలే ఆనంద పదాలని, చప్పట్లు పెట్టి గునిసి గునిసి ఆడునప్పటి పదాలే గొబ్బిపదాలని మనం వూహించవచ్చు. యీ పాటలనే మన లాక్షణికులు పదాలనీ, ప్రబంధాలనీ, ఏలలనీ అనేక నామాంతరాలతో వ్యవహరించారు. పాల్కురికి సోమన జోలపాటలు, కోలాట పాటలు, చాగుభళాలు మొదలయిన పదసాహిత్యాన్ని వివరిస్తూ "చుట్టును చప్పటులు పెట్టి గునిసి గునిసి ఆడేవారినిగూర్చి, కోయని యార్చుచు గునిసి యాడుచు

చాగుభళాయను వారిని గూర్చి ఇతడు చాలాచోట్ల ప్రశంసించాడు. పాల్కురికి సోమన యీ పదాలను పేర్కొనడంబట్టి సంగీత శాస్త్రానికి సంబంధించిన నాటి రాగాలు శ్రుతులు, మొదలయిన అంశాలను పేర్కొనడం బట్టి అతని కాలానికే పదకవిత కొంతవరకు అభివృద్ధి చెందిందని వూహించవచ్చు.

సోమనాథుని యీ రచనల తర్వాత చక్రపాణి రంగనాథుని నమశ్శివాయ రగడలు పేర్కొనవచ్చు.

ఆ తరువాత క్రీ. శ. 13 వ శతాబ్దంనాటి కృష్ణమాచార్యులు సింహగిరినరహరివచనాలు, రామనామనృసింహనామాలు వ్రాశాడు. వీటికి వచనసంకీర్తనలని, ధ్యాన సంకీర్తనలని ప్రసిద్ధి. ఈ వచన సంకీర్తనలో, తాళం మాత్రమే కాకుండా యమకం, అంత్యానుప్రాసాది శబ్దాలంకారాలు గీతాన్ని తలపించే గురుప్లుత స్వరాలు, ప్రతి చరణాంతంలో పాడదగిన పల్లవిని పోలిన పాద నిర్మాణం మొదలయిన అంశాలన్నీ నిబంధ పదాల్లోని గేయరీతినే వ్యక్తం చేసినప్పటికి వచన సంకీర్తనలుగానే నిలబడ్డాయి.

కృష్ణమాచార్యుని తర్వాత నాచన సోమనాథుని వసంత విలాసంలోనిదిగా లక్షణకారులు పేర్కొన్న—

"వీణాగానము వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
ప్రాణమైన పిన బొమ్మలు వీట
జాణలు మెత్తురు జాజర పాట" అనేది

పదకవితా శాఖకు సంబంధించిందే.

ఇతని తర్వాత శ్రీనాథుడు, పోతనకూడా తమ తమ గ్రంథాల్లో తమకున్న పదాల ప్రీతిని, సంగీత రసికత్వాన్ని ప్రదర్శించుకొన్నారు. శ్రీనాథుడు జాజర లనబడే చర్చరీ గీతాల్ని పల్నాటి వీరకథలు గల జానపద కథాగేయాల్ని తన రచనల్లో విస్తారంగా ప్రశంసిస్తే, పోతన గోవిందుమీది పాటల్ని, బాలు నంకించి పాడే పాటల్ని పేర్కొన్నాడు. దీన్నిబట్టి చూస్తే క్రీ. శ. 15 వ శతాబ్దికి ముందే నూరు, నూటయాభై సంవత్సరాలకు పైబడిన సంగీత సంప్రదాయం మార్గదేశి సమ్మేళనంతో సోమనాథుని కాలంనుంచి తెలుగు సాహిత్యంలో వృద్ధి చెందుతూ వచ్చిందని చెప్పవచ్చు.

క్రీ. శ. 1408 - 1503 ఈ కాలంనాటి సుప్రసిద్ధ వైష్ణవ భక్తుడయిన తాళ్ళపాక అన్నమాచార్యుడు తెలుగులో పదకవిత్వానికి ఒక నిర్ణీతమైన రూపురేఖలను ఏర్పరచి పదాలను రచించిన ప్రథమ వాగ్గేయకారుడు. ఇతని కాలానికే పదం, సంకీర్తనం అనే మాటల మధ్య భేదం లేదు. అన్నమయ్యకు సంకీర్తనాచార్యుడనే బిరుదుతో పాటు పదకవితా పితామహుడనే బిరుదుకూడా వుంది. చిన తిరుమలాచార్యులు అన్నమయ్య కీర్తనలను—

"పావనములు హరి భక్తి వి
భావనములు సర్వమంత్ర రహస్యో
ద్భావనములు గాయక నిక
రావనములు తాళ్ళపాకయన్నయ పదముల్"

అని పదాలుగానే పేర్కొన్నాడు. ఇతని సంకీర్తన లక్షణం లోని మహనీయంబగు సంకీర్తన నామక పద సంప్రదాయం బెట్టి దనిన" అనే వాక్యాన్నిబట్టి, పదం సంకీర్తనం రెండూ పర్యాయ పదాలే అని స్పష్టమవుతోంది.

అన్నమయ్య తరువాత పదకర్త క్షేత్రయ్య. ఇతనికాలం 1600 - 1680. పదాలంటే సంకీర్తనలని మొదటినుండి వాడుకలో వుండినాకూడా క్షేత్రయ్యకాలంనాటికి కేవలం శృంగార రసప్రధానం గాను, అభినయనాత్మకంగాను ఉండే సంగీత ప్రక్రియగా పదానికి అర్థం స్థిరపడింది.

తంజావూరు నాయకుల కాలం క్రీ. శ. 17వ శతాబ్ది ఆనాటి కవయిత్రి అయిన రంగాజమ్మ పదాలను కోమల శృంగార రసప్రధాన మైన ప్రక్రియగా భావించినట్లు "మిగుల శృంగారంబు గన్పట్టు పద ములు మృదు రసాస్పదము లగుచు రాణింప" అనడంబట్టి తెలుస్తోంది.

తరువాత కంచెర్ల గోపన్న (రామదాసు) మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, నారాయణ తీర్థులు, ముత్తుస్వామి దీక్షితులు, త్యాగ రాజస్వామి మొదలైనవారు పదసాహిత్యంలో పేర్కొనదగినవారు. క్షేత్రయ్యకు ఆశ్రయమిచ్చిన విజయరాఘవ నాయకుడు స్వయంగా పదకర్త. తంజావూరి ఆస్థానంలోని యక్షగాన కర్తల్లో కోనేటి దీక్షిత చంద్రుడు, పురుషోత్తమ దీక్షితుడు మొదలయినవారే కాకుండా పెద్దిదాసు అనే పదకర్తకూడా వుండేవాడు. కార్వేటినగర రాజులు ఆస్థానంలో వుండిన సారంగపాణి క్షేత్రయ్య తరువాత చెప్పుకోదగిన వాగ్గేయకారుడు. ఇతనికి మధుర, తంజావూరు వాజ్యాలలో ఎనలేని పోషణ లభించింది. ఈ కాలంలోనే గిరిరాజకవి, మునం శీనయ్య, కాశీనాథయ్య, వీరభద్రయ్య, శ్రీనివాసయ్య మొదలైన పదకారులు కూడా వెలశారు.

ఇలా పదకవిత ప్రారంభంలో విద్వత్కవుల గ్రంథాల్లో రేఖా మాత్రంగా ప్రస్తావించబడినా కాలక్రమేణ అభివృద్ధిచెంది సాహిత్య రంగంలో ప్రత్యేక రచనలుగా రూపొంది స్థిరత్వాన్ని సంతరించు కొన్నది.

ఒక్క తెలుగులోనే కాకుండా సంస్కృతం, కన్నడం, హిందీ సాహిత్యాల్లోకూడా పదకవిత ఆవిర్భవించి విస్తరిల్లింది. సంస్కృతంలో క్రీ. శ. 12వ శతాబ్దినాటి జయదేవుని గీతగోవిందం అష్టపది రచన. ఇతని అష్టపదుల్లో కీర్తిధవళం, మంగళాచరణం, భ్రమరపదం, గరుడపదంవంటి దేశి ప్రబంధరీతులు కనిపిస్తాయి. ఇతని తరువాత లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృత శ్లోకాలు ప్రసిద్ధి చెందాయి.

కన్నడంలో కుమార వ్యాసయుగంలో భక్తితత్త్వం జనబాహుళ్యానికి అందుబాటులోవుండే విధంగా దాసవాఙ్మయం అనే పేరుతో ఒక విశిష్టమైన వాఙ్మయం సృష్టింపబడింది. క్రీ. శ. 16వ శతాబ్దంలో శ్రీపాదరాయలు దాన్ని పునరుద్ధరించాడు. తరువాత వ్యాసరాయలు, పురందరదాసు, కనకదాసు, జగన్నాథదాసు, మొదలయినవారు తమ పద సాహిత్యాల్లో భక్తిరచనలు చేశారు.

వ్యాసరాయల కాలంలో దీనికొక చీలిక ఏర్పడింది. అతని శిష్యుడు పురందరదాసు. ఇతడు లక్షవరకు సంకీర్తనలు వెలయించాడు. ఇతని కీర్తనలకు దాసర పదగళు అని పేరు. ఇతడు కర్ణాటక దేశంలోనేకాక ఆంధ్ర, ద్రవిడ, మహారాష్ట్ర దేశాలలోకూడా ప్రసిద్ధి గడించాడు. పురందరదాసుకు ఆదిగురువు, కర్ణాటక సంగీత పితామహుడు అనే బిరుదులున్నాయి. ఔత్తరాహ వాగ్గేయకారుల్లో అన్నమాచార్యులకు సమకాలీనుడు సూర్‌దాసు. ఇతడు 'సూర్ సగుణ్ లీలాపద్ గాయై' అని తన కీర్తనలను పదాలుగానే పేర్కొన్నాడు.

ఇలా ఇతర భాషల్లోకూడా పదకవిత ఆవిర్భవించి వికాసం చెందింది. సాహిత్యరంగంలోని అన్ని రచనా ప్రక్రియలతోపాటు పదకవితా ప్రక్రియకుకూడా సముచిత స్థానం చేకూరింది.

'స్రవంతి' సాహిత్య మాస పత్రిక (మే, 1985)

# పదం - సంకీర్తన - కృతుల లక్షణ పరిశీలన

ఒకప్పుడు పదం, సంకీర్తనం, కృతి అనే మూడు పదాలు ఒక దానికొకటి పర్యాయపదాలుగా ప్రయోగించబడేవి. కాలక్రమంలో ఇవి ఆయా ప్రత్యేకతల్ని సంతరించుకొని భిన్నార్థాలలో వాడబడు తున్నాయి.

'పదం' అనేది 'పదగతౌ పద్యతే అనేన ఇతి పదమ్' అనే వ్యుత్పత్తితో ఏర్పడింది· దీనికి పొందబడింది అని అర్థం. ఇది ఒక మనోహరమైన సంగీతాత్మక ప్రక్రియ. దీనికి రాగం, తాళం రెండు మూలద్రవ్యాలు. సాహిత్యానికి కూడా ఇందు ప్రాధాన్యం వుంటుంది. పదానికి చిహ్నం, వంచన, కళాస్థానభేదం, పాదం, నెపం, కిరణం, ప్రయత్నం, సుబన, తిజన్తాలు, బాణం, పదార్థం, పిటకోడు, వాక్యం, కాలి అడుగుజాడ, పాట అనే అర్థాలు నిఘంటువుల్లో కనిపిస్తాయి·

లాక్షణికులు 'పద్యమ్ చతుష్పదం' అన్నారు. అంటే నాలుగు పాదాలున్న పద్యంలో నాల్గవభాగం, ద్విపదలో రెండవభాగం, షట్పదిలో ఆరవభాగం, సప్తపదిలో ఏడవభాగం, జయదేవుని అష్టపదుల్లో ఎనిమిదవభాగం పదం అవుతుంది. తెలుగు కన్నడ భాషల్లో పదానికి భాగం అనే అర్థంపోయి పాట అనే అర్థమే నేడు స్థిరపడింది.

సంకీర్తన లక్షణాన్ని తెలుగు చేసిన తాళ్ళపాక చిన తిరుమలాచార్యులు 'మహనీయబంగు సంకీర్తన నామక పద సంప్రదాయం బెట్టిదనిన' అని పదానికి పర్యాయపదంగా సంకీర్తన శబ్దాన్ని ప్రయోగించాడు.

ఇతనే అన్నమయ్య సంకీర్తనల్ని స్తుతించే సందర్భంలో పదాలుగానే పేర్కొన్నాడు.

"పావనములు హరిభక్తి వి
భావనములు సర్వ మంత్ర పరమ రహస్యో
ద్భావనములు గాయక నిక
రావనములు తాళ్ళపాక యన్నయ పదముల్"

దీన్నిబట్టి అన్నమయ్య కాలానికి పదం, సంకీర్తన అనేవి పర్యాయ పదాలని కాలక్రమేణ ఇది శృంగార రసమయం, అభినయాత్మకం అయిన ఒక ప్రత్యేక పద్ధతికి చెందిన రచనకు సంకేతమైందని తెలుస్తోంది.

పదాలు వర్ణ్య విషయాన్నిబట్టి శృంగార పదాలని, వైరాగ్య పదాలని రెండు విధాలు. శృంగార పదాలు — "పదములు శృంగార వర్ష మృదు మధుర మనోజ్ఞ వాక్య మిశ్రమైనప్పటికి, విదితార్థ గ్రామ్యోక్తులు పదిలంగా పొంకమెఱిగి పలికితే చాలన్నారు. పల్లవనారీ శ్లేషచ్ఛాద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు గ్రామ్యాలైనా చెల్లుబడి అవుతాయి. "జగతిగల చెల్లుబళ్లై నగినగి భాషించునట్టి నానుడి పలుకుల్ తగ దన రహిచెడు పువ్వుల సొగడున్ పిసికి కంపు చూచిన భంగిన్" అని నానుళ్ళను పలుకుబళ్ళను స్వేచ్ఛగా వాడారు. ఇక వైరాగ్య పదాలు మాత్రం "అగ్రామ్య రమ్య విష్ణుచరితోదారములై" వుండాలన్నారు. వీనికే అధ్యాత్మ పదాలనికూడా వ్యవహారం.

పదం సంస్కృత ప్రాకృతాలలోగానీ, దేశభాషలలోగానీ, రచింపబడవచ్చు. అని సంప్రదాయబద్ధమై అలంకారం, చమత్కారం, భావం, రసం, శయ్య మొదలైన కావ్య సామాన్య గుణాలతోనే

కాకుండా దైవిక మానుష రచనా పవిత్రమై ఉండాలని లాక్షణికుల అభిప్రాయం.

లక్షణభేదాన్ని బట్టి పదాలు :— 1. వృత్తపదం 2. నిబంధపదం 3. అనిబంధపదం అని మూడు రకాలు. వీటిలో వృత్తపదాలు భరతుడు వివరించినట్లు సంస్కృత ఛందంలో ప్రసిద్ధమైన షడ్వింశచ్ఛందో భేదాలకు చెందినటువంటివి. ఇవి మళ్ళీ విషమం, సమం, అర్థసమం అని మూడు విధాలు.

## విషమం :—

పదమందలి చరణాలలోని నాలుగు పాదాలూ నాలుగు రకాలుగా వుండటం విషమం. ఉదా॥

"కాలము కర్మము మాయ గల్పించిన యట్టివాఁడు
ఆలించి సర్వజీవుల అంతర్యామి
వాలి శ్రీ వేంకటపతై వరములిచ్చేటివాఁడు
యేలిల కొల్చిన మెచ్చునీ విభుగోలువరో"

(అన్నమయ్య సంకీర్తన)

## సమం :—

చరణంలోని నాలుగు పాదాలూ ఒకే విధంగా వుండటం సమ సమపదం అవుతుంది.

ఉదా॥ "కోడెకాఁడై తిరిగేఁ గొన్నాళ్ళు తాఁ
గోడెల నావులఁగా చేఁగొన్నాళ్ళు
కోడెలవల్లెతాడై గొల్లెతలాతా
గూడిపై కొనమండె గోరి కొన్నాళ్లు"

(అన్నమయ్య సంకీర్తన)

**అర్ధసమం :-**

చరణంలోని విషమ పాదాలు ఒకరీతిగా, సమపాదాలు ఒక రీతిగా వుండడం అర్ధసమం.

ఉదా॥ "పాపవిధుల శిశుపాలుని తిట్ల,
కోపగానికిని గొబ్బిళ్ళో
యేపున కంసుని యిడుమల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో"

(అన్నమయ్య సంకీర్తన)

**నిబంధ పదం :-**

"యుతులుం బ్రాసములుం, బదంబులును మాత్రానీకముల్, తాళసంగతులుం" గల్గినవే నిబంధ పదాలు. ఈ అంగాలే కాకుండా నిబంధపదానికి ఉత్సాహం, మేళాపం, ధ్రువం, అంతరి, ఆభోగం అనే అయిదు అవయవాలుకూడా ఉన్నాయి. ఈ నిబంధ పదాల్లో పదం అనబడే నాలుగు పాదాలు కలిగిన చరణం ఒక్కటి గానీ, అంతకు మించిన సంఖ్యలోగానీ వుండవచ్చు. ఈ పదాలకు పల్లవి వుంటుంది. ఇది 1. పల్లవి, 2. శిఖాపదం అని రెండు విధాలు. 'పద సమాన పాదయుగ్మ' వుండేది పల్లవి.

ఉదా॥ "నీరు వట్టుగొన్న వేళ నేయి మందవునా
కూరిమి మమ్ముద్దరిని గూరుచరే చెలులు" ॥పల్లవి॥

2. ఏకపాదం వుండేది శిఖాపదం.

ఉదా॥ "జగమంతా నీ మయము సర్వం విష్ణుమయంబు గాన"

ఈ నిబంధ పదాల్లో పల్లవి వుంటే శిఖాపదం వుండదు. శిఖాపదం వుంటే పల్లవి వుండదు. ఈ విషయం 'సంగీత చూడామణి' అనే

గ్రంథంలో చెప్పబడినట్లు 'సంగీత చంద్రిక' అనే లక్షణ గ్రంథంలో పుదాహృతమయింది. పాటలో చరణాలెన్ని వున్నా అవి పల్లవి భావాన్నే పోషించి పల్లవితోనే అంతమవుతాయి.

**అనిబంధ పదం :—**

గేయగంధులైన కృష్ణమాచార్యుని సింహాగిరి నరహరి వచనాలు, రాగతాళబద్ధమైన పెదతిరుమచార్యుని వైరాగ్య వచనమాలికలు చూర్ణపద శాఖకు చెందినటువంటివి.

అన్నమయ్య తరువాత పదకర్తఅయిన క్షేత్రయ్య (1600-1680) కాలం నాటికి సంకీర్తన అనే పదం వాడుకలో వుండినా కూడా క్షేత్రియ్య రచనలు శృంగార రస ప్రధానమై, అభినయానుకూలమైన సంగీతాత్మకాలు కావడంవల్ల 'క్షేత్రియ్య పదాలు' అని రూఢి అయింది.

**సంకీర్తనం :—**

తాళ్ళపాకవారి కాలంలో సంకీర్తనకే పదం అని వ్యవహారం. దానికే గేయమని నేటి వ్యవహారం. "కృాతసంశబ్దనే" కీర్తించేది కీర్తనం. 'సమ్యక్ కీర్తనమ్' (గీయత ఇతి గీతం) పాడబడేది గీతం లేదా గేయం కాగా అవాఙ్మానస గోచరమైన దివ్యశక్తిని కీర్తించి పాడేది సంకీర్తనం అని డా॥ వేటూరి ఆనందమూర్తిగారి అభిప్రాయం.

ఉదా॥ "చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడగించు సంకీర్తనం ॥పల్లవి॥

సంతోషకరమైన సంకీర్తనం
సంతాప మణగించు సంకీర్తనం

జంతువుల రక్షించు సంకీర్తనం
సంతతముఁ దలచుఁడీ సంకీర్తనం"

క్రీ. శ. 13వ శతాబ్దంలో వెలసిన కృష్ణమాచార్యుడు వైష్ణవ వచన సంకీర్తన రచన కర్తల్లో ప్రథముడు. సమకాలంలో వెలసిన శైవుల, కర్ణాటకుల వచన రచనలు వచన శాస్త్రంగా పేరొందితే, కృష్ణమాచార్య కీర్తనలు వచన సంకీర్తనలుగా ప్రసిద్ధికెక్కాయి. భక్త్యాత్మకమయిన ఈ రచనల్ని కృష్ణమాచార్యులు వచన సంకీర్తనలని, ధ్యాన సంకీర్తనలని పేర్కొన్నాడు.

జయదేవుని అష్టపదులలో మొదటి వుద్గ్రాహం అనే ఖండం అనుపల్లవిగా, తరువాత ధ్రువమనే ఖండం పల్లవిగాను పరిణమించింది. నారాయణతీర్థుల కాలంనాటికి ఆయన తరంగాల్లో పల్లవి ముందుకు వచ్చి ఒక పంక్తిగాను, తరువాత రెండు పంక్తుల వుద్గ్రాహం అను పల్లవిగాను మారి తాళ్ళపాకవారి కాలంనాటివలె ఒక్కొక్కటి నాలుగేసి పంక్తులుగల మూడు చరణాలలో ముగుస్తుంది. క్షేత్రయ్య వరకు వ్రాసిన వారి కీర్తనల్లో పదాలలో మూడేసి చరణాలుండటం కనిపిస్తుంది. త్యాగయ్య దీక్షితులు మొదలైన వాగ్గేయకారుల రచనలలో కొన్నిటిలో ఒకే చరణం కనబడుతుంది. తొలిరోజుల్లో పదం, సంకీర్తనం ఒకదానికొకటి పర్యాయ పదాలుగా ఒకే అర్థంలో వుండేవి. అన్నమయ్య కాలంలోని శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రానురాను క్షేత్రయ్యనాటికి శృంగార సంకీర్తనలు పదాలనీ, త్యాగరాజనాటికి అధ్యాత్మ సంకీర్తనలు కృతులని ప్రసిద్ధికెక్కింది.

**కృతి :-**

సామాన్యార్థంలో 'కృతి' అంటే రచన అని చెప్పవచ్చు. కృతి అంటే ప్రయత్నం చేయటం, వాగ్విషయ కర్మ, ప్రబంధం,

పుస్తకం, చదువరి, ధన్యుడు, నేర్పరి, సంతానం, వర్గగణితం అని అర్థాలు నిఘంటువులలో కనిపిస్తాయి. కేవలం సంగీత రచనా ప్రధానమైన త్యాగయ్య రచనలవంటి వాటిని నేడు కృతులని పిలుస్తున్నాం. కానీ రూఢిలో పాట అనే పదానికి పర్యాయంగా దీన్ని వాడుతున్నాం.

'స్రవంతి' సాహిత్య మాస పత్రిక, (జూలై, 1986)



# అన్నమయ్య ఆత్మనివేదన

ఆంధ్ర సాహిత్య వినువీధిలో మహాకవుల వంశాలు, వాగ్గేయ కార వంశాలు ధ్రువతారలై వెలసినా తాళ్ళపాక వంశం మాత్రం శరచ్చంద్ర సమానమై ఒక ప్రత్యేకతను సంతరించుకొని శోభాయ మానంగా వెల్గొందుతోంది. ఈ వంశంలో వరుసగా నాలుగు తరాల వరకు అందరూ మహాభక్తులు, కవి-పండిత-గాయకులే. ఇదే ఇతర కవివంశాలకు లేని వీరికున్న ప్రత్యేకత. వీరు కలియుగ ప్రత్యక్షదైవ మైన శ్రీ వేంకటేశ్వరునే ధ్యానించి, ఆరాధించి తమ తమ గ్రంథాల్ని ఆ స్వామి పాదాబ్జాలకే అంకితమిచ్చిన ధన్యజీవులు· వీరి వంశానికి మూలపురుషుడే మన అన్నమయ్య· ఇతడు పదిహేనవ శతాబ్దంలో కడపజిల్లా, రాజంపేట తాలూకా, తాళ్ళపాక అనే గ్రామంలో నందవరీక బ్రాహ్మణులు, భారద్వాజస గోత్రులు అయిన లక్కమాంబా నారాయణసూరి దంపతులకు కలిగిన పుణ్యాత్ముడు.

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర వరప్రసాది కాబట్టి పుట్టుక తోనే అన్ని విద్యలూ కరతలామలకమయ్యాయి. బాల్యమాదిగా అతడు ఆడిన మాటెల్ల అమృత కావ్యంగా, పాడిన పాటెల్ల పరమ గానంగా విలసిల్లాయి. అన్నమయ్య స్వామి వారిపై ముప్పై రెండువేల అధ్యాత్మ, శృంగార సంకీర్తనల్ని రచించాడు· ప్రస్తుతానికి పద్నా లుగు వేల సంకీర్తనలే లభ్యమయ్యాయి. ఈ సంకీర్తనల పాలకడలిలో పండిత పామర జనోపయుక్తమైన ఎన్నో అమూల్యాంశాలు, వైష్ణవ మత భక్తి సిద్ధాంతాలు చోటుచేసుకొని వున్నాయి. అన్నమయ్య భక్తితత్త్వాన్ని, భగవంతుని అవతార విశేషాల్ని పామరులలో సహితం వ్యాపింపజేయడానికి వారికి అనువైన వీలైన జానపదబాణీ

లను ఎన్నుకొన్నాడు. మహాపండితుల్ని తృప్తిపరచడానికి సంస్కృత భాషలో సంకీర్తనల్ని రచించి వారి మన్ననకు పాత్రుడయ్యాడు. ఇలా సర్వమానవ జనరంజకంగా వెలయించిన అన్నమయ్య సంకీర్తనలలో ఆత్మనివేదనా పూరితమైన అంశాలు అనేకం వున్నాయి.

నవవిధ భక్తి మార్గాలైన శ్రవణం, కీర్తనం, స్మరణాదులలో ఆత్మనివేదన చివరిది. అశాశ్వతమైన ప్రాపంచిక విషయసుఖాల్ని వదిలిపెట్టి, శాశ్వతమైన భగవంతునియందే మనసు నిలిపి సోపానక్రమంలో తన్మయీభావం చెందడమే భక్తితత్త్వం. నిస్సార సంసార మాయాంధకారమైన ఈ జగత్తులో మానవుడు తనకు తామగాగానీ, ఇతరులవల్లగానీ ప్రాప్తించిన కష్టావమానాల్ని, చేసిన తప్పిదాల్ని, అజ్ఞాన ప్రవర్తనల్ని గూర్చి భగవంతునికి నివేదించుకోవడం ఈ కీర్తనలలో కనిపిస్తుంది.

అన్నమయ్య సంకీర్తనల ప్రసిద్ధిని, ఆతని గానశక్తిని విని సాళువ నరసింగరాయలు తనమీదకూడా ఒక కీర్తన పాడవలసిందిగా అతన్ని కోరినపుడు ఆ భక్తుడు హరి హరీ! అని చెవులు మూసుకొని "హరి ముకుందుని గొనియాడునా జిహ్వ నిను కొనియాడ నేరదెంతైన" అని రాజునే ధిక్కరించాడు. రాజు మండిపడి అన్నమయ్యకు 'మూరు రాయరగండ' అనే సంకెల తగిలించి కారాగారంలో వుంచాడు. అప్పుడు అన్నమయ్య —

"ఆఁకటివేళల నలపైన వేళను
తేఁకువ హరినామమేదిక్కు మరిలేదు ||పల్లవి||

కొరమాలియున్న వేళ కులము చెడినవేళ
చెఱవడి యొరులచే జిక్కినవేళ

నోటఅప్పైన హరినామ మొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన మతిలేదు తెఱఁగు ॥ఆ క॥

ఆపద వచ్చినవేళ ఆఱడిబడిన వేళ
పాపపు వేళల భయపడినవేళ
ఓపినంత హరినామ మొక్కటే
మాపుదాఁకాఁ బొరలిన మతిలేదు తెఱఁగు ॥ఆ క॥

సంకెలఁ బెట్టిన వేళ చంపఁ బిలిచిన వేళ
అంకిలిగా నప్పుల వారాఁగిన వేళ
వెంకటేశు నామమే విడిపించ గతిగాక
మంకుబుద్ధి బొరలిన మతిలేదు తెఱఁగు ॥ఆ క॥
(5-100)

అని నివేదించుకొన్నాడు.

ఆవేదనాభరితమైన ఘట్టాలు మన పురాణ కావ్యాలలోకూడా చాల కవిపిస్తాయి. గజేంద్రుడు సరస్సులో మొసలిచేత పట్టుబడి శక్తి వున్నంతవరకు పెనగులాడి చివరికి సత్త్వమంతా కోల్పోయిన తరువాత దీనంగా

"నీవే తప్ప నితఃపరంబెఱుగ మన్నింపదగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా"

అని మహావిష్ణువును ప్రార్థించి ముక్తి పొందడం మనకు తెలిసిందే. ఇలాగే ప్రహ్లాదుడు తన తండ్రి అయిన హిరణ్యకశిపునిచేత, ద్రౌపది నిండుసభలో దుశ్శాసనునిచేత పీడింపబడినపుడు భగవంతునికి ఆత్మార్పణ చేసుకొని ప్రార్థించి దుఃఖదూరులయ్యారు.

కృష్ణదేవరాయల కొలువులో అష్టదిగ్గజకవులలో ఒకరైన "భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతా

పహారి సంతత మధురాధరోదిత సుధారస ధారలు తనివితీర గ్రోలిన వాడైన ధూర్జటిమహాకవి చివరికి సంసార సుఖాలపై విసిగివేసారి—

'రోసీరోయదు కామినీ జనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్
పాసీపాయదు పుత్రమిత్ర జన సంపద్భ్రాంతి ఆశాలతల్
కోసీకోయదు నామనంబకట నీకుంప్రీతిగా సత్క్రియల్
చేసీ చేయదు దీని త్రుళ్ళడపవే శ్రీకాళహస్తీశ్వరా' అని

ఆక్రందిస్తూ తన వక్షస్థలాన్ని చేర్చి గుండెను పెకలించి పరమేశ్వరుని పాదాలపై వుంచినంతిగా కాళహస్తీశ్వరుని మొరపెట్టుకున్నాడు.

అన్నమయ్య పరమార్థతత్వాన్ని గూర్చి పాటుపడని మానవ జీవితం వృథా అని —

'సంతలే చొచ్చితిఁ గాని సరకుఁ గాననైతి
యింతట శ్రీహరి నీవే యిటు దయ జూడవే ॥పల్లవి॥

కాంత చనుగొండలు కడకు నెక్కితిగాని
యెంతైనా మోక్షపు మెట్లు యెక్కలేనైతి
అంతట జవ్వనమనే అడవి చొచ్చితిఁ గాని
సంతత హరి భక్తనే సంజీవిఁ గాననైతి (6-27)

అని తన ఆవేదనను వెల్లడించుకొని పశ్చాత్తాపం పొందాడు.

అన్నమయ్య జీవులయొక్క అనేక విధాలైన శారీరక మానసిక ప్రవృత్తులకు పరమాత్ముడే మూలకారణం. అని తెలియజేస్తూ—

"ఇట్టి నా వెట్టితనము లేమని చెప్పుకొందును
నెట్టన నిందుకు నగి నీవే దయఁజూడవే ॥పల్లవి॥

మన్నించి యిహపరాలు మరి నీవేయియ్యగాను
ఎన్నుకొందు నా తపోమహిమ యిది యనుచును

ఉన్నతి శ్రీ వేంకటేశ నన్ను నేమి చూచేవు
అన్నిటా నాయాచార్యు విన్నపమే వినవే॥" (7-70)

అని స్వామికి విన్నవించుకొన్నాడు.

అజ్ఞాన కారణంగా జనించే కామక్రోధ లోభమోహాది అరిషడ్వర్గాల బారినుంచి తమ్ము రక్షించవలసిందిగా —

"కడు నజ్ఞానపు కరవు కాలమిదె
వెడల దొబ్బి మా వెరవు దీర్పవే ॥పల్లవి॥

పాపపు పసురము బందెలు మేయఁగ
పోపుల పుణ్యము పొలవోయ
శ్రీపతి నీకే చేయి చాఁచెదము
యేపున మమ్మిక నీడేర్చవే ॥కడు॥

ఇలఁ గలియుగ మను యెండలు గాయఁగ
చెలఁగి ధర్మమను చెరువింకె
పొలసి మీ కృపాంబుధి చేరితిమిదె
తెలిసి నా దాహము తీర్పవే ॥కడు॥

వడిగొని మనసిజ వాయువు విసరఁగ
పొడవగు నెఱుకలు పుట మెగసె
బడి శ్రీ వేంకటపతి నీ శరణము
విడువక చొచ్చితి వెసఁ గావఁ గదే ॥కడు॥ (8-20)

అని అన్నమయ్య స్వామిని మొరపెట్టుకొన్నాడు.

అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో, ఇలాంటి ఆత్మనివేదనా పరమైన సంకీర్తనలు చాలా కనిపిస్తాయి. ఇవే గాకుండా వైరాగ్యం

తాత్త్వికం, సంసార, నిరసన విజ్ఞానచర్చ, మానసిక ప్రబోధం, లోకానుభవం, శరణాగతగతితత్త్వం, మొదలైన అంశాలకు సంబంధించిన కీర్తనలు కోకొల్లలు. ఇలా నిత్య సత్యమైన అంశాలతో కూడిన సంకీర్తనలు వెలయించి మనల్ని ప్రభావితుల్ని చేస్తున్న అన్నమయ్య అందరికీ ఆరాధ్యుడు.

'పండిత భారతి' (మార్చి, ఏప్రిల్ 1983)



# అన్నమాచార్య సంకీర్తనల్లో సాంఘిక దృక్పథం

భగవంతుడు సాధుజనులను రక్షించడం కోసం, దుర్జనులను శిక్షించడం కోసం ఆయా యుగాల్లో భూమిపై అవతరిస్తుంటాడు. స్థితి కారకుడైన మహావిష్ణువు త్రేతాయుగంలో శ్రీరాముడుగా, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా, ఈ కలియుగంలో శ్రీ వేంకటేశ్వరుడుగా నామరూపాలు దాల్చాడు. కృతయుగంలో ధర్మదేవత నాలుగు పాదాలతోను, త్రేతాయుగంలో మూడు పాదాలతోను, ద్వాపరయుగంలో రెండు పాదాలతోను, నడిస్తే ఈ కలియుగంలో ఏకపాదంతో నడుస్తోంది. అంటే ఈ యుగంలో ధర్మం నాలుగింట ఒక్కభాగమే ఉందని అర్థం. ప్రజలలో ధర్మబుద్ధి నశించే కొలదీ లోకంలో ఎన్నో అకృత్యాలు, మోసాలు, ద్వేషాలు, హింసాకాండలు ప్రబలుతుంటాయి. ఇలాంటి బీభత్స పరిస్థితినుంచి సజ్జనులను కాపాడి, ధర్మాన్ని ఉద్ధరించాలంటే మానవుల హృదయక్షేత్రాల్లో భక్తి భావబీజాలు నాటి, వాటిని అంకురింపజేసి, శాఖోపశాఖలుగా వృద్ధిచేయగల్గిన మహనీయులు ఉద్భవించాలి. ఇది కేవలం భగవత్సంకల్పం వల్లనే సాధ్యం. ఇలా దైవ సంకల్పంవల్ల జన్మించిన మహాభక్తుడు తాళ్ళపాక అన్నమాచార్యులు.

అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని పంచాయుధాలలో ఒకటైన నందకాంశంలో లక్కమాంబా నారాయణసూరి అనే పుణ్యదంపతులకు క్రీ. శ. 1408 క్రోధినామ సంవత్సరం, వైశాఖమాసం, విశాఖ నక్షత్రంలో జన్మించాడు. ఇతని జన్మస్థలం కడపజిల్లా - రాజపేట తాలూకాలోని తాళ్ళపాక అనే గ్రామం. అన్నమాచార్యులు

అప్పనివరప్రసాది కాబట్టి చిన్నప్పటినుంచీ దైవలీలలపట్ల ఆసక్తి, లౌకిక విషయాలపట్ల విరక్తి చూపేవాడు. ఇలాంటి పరమ భక్తుడైన అన్నమాచార్యులు భగవంతుని అనుగ్రహంవల్ల ముప్పై రెండు వేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనలను రచించి స్వామివారి పాదపద్మాలకు అంకితమిచ్చాడు. మన తెలుగులో మొట్టమొదట సంకీర్తన రచనకు ఆదిపురుషుడు అన్నమాచార్యులే. సంకీర్తనకే పదం, కీర్తన, కృతి అనే పేర్లుకూడా వ్యవహారంలో ఉన్నాయి. అన్నమాచార్యుల మనుమడైన చిన తిరుమలయ్య తన తాతగారి సంకీర్తనల గూర్చి—

"వేదంబులు పౌరాణిక
వాదంబులు వర కవిత్వ వాణీ వీణా
నాదంబులు, కృత సుజనా
హ్లాదంబులు తాళ్ళపాక యన్నమ పదముల్"

అని తెలుగు సంకీర్తన లక్షణంలో ప్రస్తుతించాడు.

అన్నమాచార్యులు భక్తి, జ్ఞాన, కర్మ మార్గాలను, భగవంతుని అవతార విశేషాలను కేవలం పండితులకే గాకుండా పామరులకు కూడా సులభంగా బోధపడడానికి మేలుకొలుపు, ఉయ్యాల, లాలి, జోలవంటి అనేక జానపద గేయ రీతులలో సంకీర్తనలు రచించాడు. వాటిలో పలువిధాలైన సాంఘికాంశాలను ఆధ్యాత్మిక విషయాలతో సమన్వయించి చెప్పాడు.

పూర్వకాలంలో రాకపోకల వాహనాలు, ఇతర సాధనాలు లేని కారణంవల్ల దూర ప్రాంతాలలోని వ్యక్తులతో సంబంధ బాంధవ్యాలు జరుపుకోవడానికి వీలుపడేదికాదు. అందువల్ల ప్రజలు పరిమిత స్థలంలోనే జీవనయాత్ర సాగించేవారు. ప్రాచీన నాగరికత అంతా గ్రామం, గ్రామీణులు, గ్రామీణ పరిసరాలచుట్టూ అల్లుకొని

ఉంటుంది. జానపదకవి తనకు అందుబాటులో ఉండే ప్రాథమిక వస్తు జాలాన్ని, పరిచయ ప్రదేశాలను కవితా వస్తువులుగా గ్రహించి రచనలు చేస్తాడు. దానివల్ల వర్ణించబడిన వస్తువులు తమవే అనే భావం ప్రజలకు కలుగుతుంది. కవి చెప్పదలచుకొన్న ప్రధానవిషయం కూడా గ్రామీణులకు పామర ప్రజలకు సులభంగా అర్థమవుతుంది.

అన్నమాచార్యులు జానపద కవిలాగే తనకు పరిచయమైన అనేక రకాల గృహోపకరణాలు, వంటకాలు, కొలతలు, పనిముట్లు, అలంకారాలు, ఆభరణాలు, సంగీత వాద్యాలు మొదలైన వస్తు జాలాన్ని గూర్చి, నెల్లి, రావి, వేప, ముష్టి మొదలైన చెట్లను గూర్చి, జాజి, పొగడ, పొన్న, నెల్లి, సంపంగి మొదలైన పువ్వులను గూర్చి, టెంకాయ, కాకర, గుమ్మడి, చింత, బీర, వెలగ మొదలైన కాయలనుగూర్చి, ఎద్దు, ఎలుక, కోతి, కుక్క, గుఱ్ఱం, చీమ, తేలు, దూడ, పొట్టేలు, మేక వంటి భూచరాలను; ఇసుళ్లు, ఈగ, దోమ, చిలుక, తుమ్మెద, మిడతవంటి ఖేచరాలను; ఏనుగు, జింక, సింహం, వంటి వనచరాలను; చేప, తాబేలువంటి జలచర జీవరాశులను; సోమ శిలకనుమ, ఎఱ్ఱశిలకనుమ, గద్దెరాతికనుమ, దొంగలసానికనుమ మొద లైన ప్రదేశాలనుగూర్చి; చదరంగం, తోలుబొమ్మలు, బొమ్మరిల్లు, దాగిలిముచ్చులు, గుజ్జనగూళ్ళు, పులిజూదం, వామనగుంటలు మొద లైన పెద్దల, పిల్లల ఆటలను; వ్యవసాయం, నేతవృత్తి, కమ్మరి, కుమ్మరి, సోది, వర్తకం, వైద్యం మొదలైన వృత్తులను కవితా వస్తు వులుగా స్వీకరించాడు. వీటిలో కొన్నింటికి ఉదాహరణలు చూడవచ్చు.

"చేతులార చేసేటి చేకొన్న కర్మానకు
ఘాతల కర్తగా నంటే కట్టువడడు

ఆతల సబక ముంచినట్టి వేడి చెయ్యంటదు.
జాతి దేహము మోచిన సహజమింతే"

అనే కీర్తనలో అబకతో వేడికూరలు తోడుకొంటున్నా గానీ ఆ వేడి చేతివరకు ప్రసరించదు. అలాగే మనం చేస్తున్న కర్మలన్నీ మనకే చెందుతాయి కానీ భగవంతునికి అంటవు కాబట్టి వ్యక్తి తాను పాపకార్యాలు చేస్తూ ఇవి భగవంతుడు చేయిస్తున్నా డను కోవడం అజ్ఞానమని అన్నమాచార్యులు బోధించాడు. అబక అంటే కర్రతో తయారు చేయబడన గరిటెవంటి పరికరం. ప్రాచీనకాలంలో లోహపు వస్తువుల తయారీ అంతగా లేదు కాబట్టి అందరూ అబకలనే వాడేవారు. నేటికీ మారుమూల పల్లెలలో పేదప్రజల గుడిసెలలో అబకలను మనం గమనించవచ్చు.

"భారమైన వేపమాను పాలుపోసి పెంచినాను
తీరని చేదేగాక తియ్యనుండేనా"

అనే కీర్తనలో ప్రకృతిసిద్ధంగా చేదు రుచికల్గిన వేపచెట్టును పాలుపోసి పెంచినాకూడా అది చేదుగానే ఉంటుంది. అలాగే స్వభావ సిద్ధంగా దురాత్ముడైన మానవుని ఎంత ప్రయత్నించినా సన్మార్గ డుగా మార్చలేమనే సత్యం చెప్పబడింది.

"పాయదీసి కుక్కతోక బద్దలు వెట్టిబిగిసీ
చాయకెంత గట్టినాను చక్కనుడీనా"

లోకంలో వక్రబుద్ధితో ప్రవర్తించే మనుష్యులను గూర్చి చెప్పేటప్పుడు కుక్కతోక వంకర అంటుంటారు. అలాగే ఈ కీర్తనలో కూడా వంకరగా ఉన్న కుక్కతోకను బద్దతో ఎంత బిగించినా చక్క బడదని మానవుని బుద్ధినైజం అనేది పుట్టుకతో రావాలి కానీ ఎంత ప్రయత్నం చేసినా వ్యర్థమే అనే భావం నిరూపించబడింది.

"సొంపుల నీ వదనపు సోమశిల కనుము
ఇంపులెల్ల చేకొనగ నిల్లు నీ పతికి

సుందరమైన స్త్రీ ముఖాన్ని చంద్రబింబంతో పోల్చి చెప్పడం కవుల సంప్రదాయం. అలాగే అన్నమయ్యకూడా నాయిక ముఖాన్ని సోమశిలకనుముతో పోల్చి, ఆమె వదనం ప్రియునికి ఇంపును, ఆనం దాన్ని ప్రసాదించే ఇల్లువంటిదని వర్ణించాడు. అన్నమాచార్యుల శృంగార సంకీర్తనల్లోని నాయికా నాయకులు జగన్మాతా పితరులైన అలమేల్మంగా శ్రీనివాసులే.

అన్నమాచార్యుల సంకీర్తనలోని ఈ సాంఘికాంశంలో ప్రధానంగా పేర్కొనదగింది. వృత్తి విశేషాలు. అన్నమయ్య వైష్ణవ మత సిద్ధాంతాలను, భక్తిభావాలను, భగవంతుని మహిమలను కేవలం విద్యావంతులకే గాకుండా అవిద్యావంతులైన పామరులకు కూడా బోధించదలచుకున్నాడు. అందుకోసం వారి జీవనాధారమైన వృత్తి విశేషాలనే ఆధారంగా చేసికొని సంకీర్తన రచన గావించాడు.

ఈ వృత్తి పాటలలో వర్తక వ్యాపారానికి సంబంధించిన నేత బేహారి, ఓడ బేహారి, వడ్డీవ్యాపారి, వైద్యుడు. పూతవృత్తులవారు, చల్ల అమ్మే గొల్లెతలు, సోది చెప్పే ఎరుకతలు, కమ్మరి, కుమ్మరి మొదలైన వృత్తులవారి విశేషాలు కనిపిస్తాయి. ఈ వృత్తులవారంతా ఒకచోట స్థిరంగా ఉండి బతికేవారుకారు. వీరు ఒక ప్రదేశం నుండి ఇంకో ప్రదేశానికి సంచరిస్తూ జీవనం సాగిస్తారు. కాబట్టి వీరిద్వారా భక్తితత్త్వాలు అన్ని ప్రాంతాలకు సులభంగా వ్యాపించగలవనే దృష్టితో అన్నమాచార్యులు ఇలాంటి సంకీర్తనలను రచించాడు. వీటిలో కొన్నింటికి ఉదాహరణలు చూడవచ్చు. —

వ్యవసాయం : మనిషి జీవించడానికి కావలసిన అత్యావసరమైన వాటిలో ఆహారం ప్రధానమయింది కాబట్టి అన్నమాచార్యులు వ్యవసాయవృత్తిని ఎక్కువగా వర్ణించాడు.

"పంటల భాగ్యులు వీరా బహు వ్యవసాయము
అంటి ముట్టి యిట్లు కాపాడుదురు ఘనులు"

అనే కీర్తనలో రైతులు పంట పైరులను ఏ విధంగా కాపాడు కుంటారో అలాగే భగవంతుడు తనను నమ్ముకొన్న భక్తులను రక్షిస్తుంటాడని చెప్పబడింది.

నేతవృత్తి : వ్యవసాయం తర్వాత అతి ముఖ్యమయింది నేతవృత్తి. అన్నమాచార్యులు జీవించిన ప్రాంతంలోను, దానికి చుట్టు ప్రక్కల ప్రాంతాలలోను వ్యవసాయం తర్వాత నేతపరిశ్రమ విరివిగా సాగుతుండేవి. అందువల్ల అన్నమాచార్యులు వస్త్రోత్పత్తికి ఆధారమైన నేతపనికి ప్రాధాన్యమిస్తూ అందులోని అంశాలను భగవంతుని పరంగా పోల్చి చెప్పాడు.

"వాడల వాడల వెంట వాడెవో వాడెవో
నీడ నుండి చీరలమ్మే నేత బేహారి

పంచభూతములనెడు పలు వన్నె నూలు
చంచలపు గంజివోసి చరిసేసి
కొంచపు కండెల నూలి గుణముల నేసి
మంచి మంచి చీరలమ్మే మారు బేహారి"

అనే కీర్తనలో పంచభూతాలను అనేక రంగులతో కూడిన దారాలుగా, గుణాలు చేతలను నూలుకండెలుగాను, కుచ్చెలుగాను పోల్చి వర్ణించాడు. ఇక్కడ బేహారి అంటే వ్యాపారి అని అర్థం. ఈ

కీర్తనలో చీరలమ్మే నేత బేహారి ఎవరో కాదు. సాక్షాత్తు శ్రీ వేంక టేశ్వరుడే. భక్తునికి ప్రపంచంలోని ప్రతి వస్తువుకూడా తన ప్రియ దైవంగానే సాక్షాత్కరిస్తుంది. అలాగే అన్నమాచార్యులుకూడా లౌకికమైన ప్రతి వస్తువును, ప్రతి జీవిని రకరకాల వ్యాపారస్థులను వేంకటేశ్వరుడుగానే భావించి వర్ణించాడు.

కమ్మరి : వ్యవసాయానికి అవసరమైన ఇనుప పనిముట్లను, కొయ్య పనిముట్లను తయారుచేసేవారు కమ్మరివారు. వీరినే కంసాలి వారు అని అంటారు. వీరిలో కొయ్యపనివారు, లోహపుపని వారు అనే రెండు వర్గాలవారున్నారు. అన్నమాచార్యులు లోహపుపనివారిని ఆధారంగా చేసుకొని ఆ పనిలోని అంశా లను ఆధ్యాత్మిక విషయాలతో జోడించి చెప్పాడు.

"ఎట్టిగా క్రూరత్వ మెప్పుడు కొలిమిలో
కట్టువడెనె కడ కాఁగిని"

క్రూరత్వం అనేది రాక్షస స్వభావం. ఈ క్రూరత్వాన్ని కొలిమిలో కాల్చబడే కట్టుతో పోల్చి చెప్పాడు.

కుమ్మరి : మట్టితో పాత్రలను తయారుచేసి వాటిని అమ్ముకొని జీవనంసాగించేవారు కుమ్మరివారు. అన్నమాచార్యులు కుమ్మరి దాసుల భక్తితత్పరతను వర్ణించి వీరి వృత్తిలోని అంశాలను భగవద్విషయాలతో సమన్వయించి చెప్పాడు.

"ఇమ్మైన పాపంబు లెన్నవలసిన ప్రాణి
సమ్మతంబున చేయజాలు గాకేమి
కుమ్మరి కొక వేడు గుదియ కొకనాడౌను
నమ్మి తలచిన విష్ణునామంబు చేత"

అనే కీర్తనలో కుమ్మరివాడు ఒక సంవత్సర కాలమంతా పరిశ్రమించి తయారు చేసిన మట్టిపాత్రలను కఱ్ఱతో ఒక్క రోజులో పగలగొట్టవచ్చు. అలాగే మానవుడు ఏండ్లకొలదీ చేసిన పాపాలను విష్ణునామస్మరణచేత క్షణకాలంలో పోగొట్టుకోవచ్చునే పరమార్థం చెప్పబడింది. అయితే యీ కీర్తనలో ఒక విశేషం ఉంది. కుమ్మరి వాడు కుండలు తయారుచేయడం అనేది మంచిపని. వాటిని పగల గొట్టటం అనేది వినాశనకృత్యం. మానవుడు పాపాలు చేయడం అనేది వినాశనకృత్యం. విష్ణునామస్మరణ చేయడం మంచిపని. యీ రెండింటి పోలికలో "వినాశనం" కావడం అనే విషయంలో తప్ప మిగతా పోలికలో ఔచిత్యం కనబడదు. భక్తుడు భక్తిరసాయనంలో ఉన్మత్తుడై సంచరించినప్పుడు ఇలాంటివి పట్టించుకోడు. తాను చెప్ప దలచుకొన్న విషయాన్ని ఏదో ఒక ధర్మంతో అన్వయించి చెప్పడం వరకే సూటిగా ఆలోచిస్తాడు. పరిశుద్ధమైన భక్తుడు ఎలాంటి కవితా నియమాలకు లొంగడు. ఆ నియమాలే స్వయంగా వచ్చి భక్తుని కవితను చేరుకోవలసిందే.

సోది వృత్తి : "సోది" అనే మాట "శోధన" అనే శబ్దానికి వికృది రూపం కావచ్చు. శోధనమంటే అన్వేషించ సత్యాన్ని తెలుసుకోవడం సోది చెప్పేవారు ఆంతరంగికమైన రహస్యా లను, భూత, వర్తమాన భవిష్యత్తు వృత్తాంతాలను తమ అనుభవం వల్లగానీ దైవకృప వల్లగాని గుర్తించి ఇతరులకు చెబుతారు.

"ఎరుక చెప్పే నీ యిచ్చ యెల్లా నెరుగుదు
మెరుగైన సొమ్ము లిచ్చి మెచ్చవయ్య నన్ను"

అనే కీర్తనలో సోది చెప్పించుకొనేవాడు శ్రీ వేంకటేశ్వరుడు. ఈ స్వామిని వలచింది అలమేల్మంగ. ఈ కీర్తనలో బాహ్యంగా

స్వామివారి దివ్య మంగళ రూపం వర్ణించబడినా, అంతరంగంగా తరచి చూస్తే అందులో పూతన సంహారం, కాళీయమర్దనం మొదలైన కృష్ణావతార విశేషాలు గోచరిస్తాయి.

చేతి వృత్తులు : లౌకిక, ఆధ్యాత్మిక విషయాలను చేతివృత్తుల అంశాలతో సమన్వయించి చెప్పిన సంకీర్తనలుకూడా అన్నమాచార్య సంకీర్తనలలో చోటు చేసుకొన్నాయి.

> "లలన జవ్వనాలు లక్క-పూస కపురులు
> శ్రీకాంతుని పై చేయని భక్తులు
> చెంబుమీఁది కనకపు పూఁత"

అనే సంకీర్తనలో లక్క-పూస కపురులు, కనకవుపూఁత, మొదలైన చేతివృత్తుల ప్రసక్తులున్నాయి. దీనివల్ల తన కాలంలో అన్ని వృత్తులతో పాటు పూఁతపనులు, పూసల అల్లికలు మొదలైనవికూడా ఉండేవని తెలుస్తుంది. ఈ కీర్తనలో స్త్రీలయావనం, దైవసంబంధం కాని పనులు చెంబుమీఁద వేయబడిన బంగారవు పూఁతవలె అశాశ్వతమని వర్ణించబడ్డాయి.

వర్తకం : వర్తకం సముద్రవర్తకమనీ, భూ ప్రదేశ వర్తకమని రెండు రకాలు. వ్యాపారం కాలానుగుణంగా సాగుతుంటుంది. సముద్రి వ్యాపారంలో రేవులలో సరకులు దించుకొంటూ, వస్తువుల ధరలు గమనించుకొంటూ వ్యాపారం సాగించాలి. అన్నమాచార్యులు ఈ విషయాలను —

> కాంతల మానమనేటి కరవట్టాలకు దిగ
> మంతనాన జీవుఁడనే మంచి మరకాఁడు"

అనే కీర్తనలో వర్ణించాడు. సంసార సాగరంలో దేహమనే ఓడపై పాపపుణ్యాలనే సరకులను నింపుకొని జీవుడనే మరకాడు గమ్యాన్ని చేరడాన్ని గూర్చి, జీవుని నిట్టూర్పులనే తుఫానుగాలులు వీస్తున్నప్పుడు కోరికలనే చాపలెత్తి భగవన్నామంతో బరువుగా చేసుకొని ఓడను జాగ్రత్తగా నడపడం మొదలైన అంశాలను వర్ణించాడు.

వైద్య వృత్తి : శారీరక బాధలను, ఆ బాధల నివారణను గూర్చి తెలియజేసేది వైద్యవృత్తి; రోగాలను నివారించడానికి ఔషధాలు, అనుపానాలు ఉపశాంతికర పదార్థాలు ఆయుర్వేదంలో చెప్పబడ్డాయి. అన్నమాచార్యులు ఈ వైద్యశాస్త్ర విషయాలను గూర్చి —

"శ్రీహరి పాదతీర్థమే చెడని మందు
మోహ పాశాల గోసి మోక్షమిచ్చే మందు"

అనే కీర్తనలో శ్రీహరి పాదతీర్థమనే మందు భస్మాలవలె కారంకాదని, చల్లనిదని, చూర్ణాలవలె నూరని, కాచని సున్నని మందని, కషాయాల్లోవలె వేరు వెల్లంకులు కలపనిదని ఆయామందుల లక్షణాలను ఆధారంగా తీసుకొని శ్రీహరి పాదతీర్థమనే మందు సమస్త బాధలను నివారిస్తుందని వర్ణించాడు. అలాగే —

"కొనరో కొనరో మీరు కూరిమి మందు
వునికి మనికికెల్ల నొక్కటే మందు

ధ్రువుడు గొనిన మందు తొల్లియు ప్రహ్లాదుఁడు
చవిగా గొనిన మందు చల్లని మందు
భవరోగములు వీడి పారఁక పెద్దలు మున్న
జవకట్టుకొనిన నిచ్చలమైన మందు"

అనే కీర్తనలో కూడా వైద్యవృత్తి విశేషాల నేపంతో భగవన్మహిమను కీర్తించడం స్పష్టమవుతుంది. ధ్రువుడు, ప్రహ్లాదుడు, నారదుడు, బ్రహ్మ, రాజశేఖరులు మొదలైన మహాభక్తులందరూ కొన్నటువంటి ఉదాత్తమైన, పరమాయువైన మందునే కొనండి అని, భౌతికమైన మందులు మనిషి శారీరక రోగాలను నశింపజేసి శాశ్వత సౌఖ్యాన్ని ప్రసాదిస్తుందని అన్నమాచార్యులు ఉద్బోధించాడు.

అన్నమాచార్య సంకీర్తనల్లోని ఇలాంటి వృత్తుల విశేషాలను గమనిస్తే అన్నమాచార్యులు ఎంతటి రసజ్ఞుడో అంతటి లోకజ్ఞుడని కూడా తెలుస్తుంది. అంతేగాకుండా భక్తునికి కులభేదాలు ఉండవని చెప్పడం అతని ముఖ్యోద్దేశ్యమని తెలుస్తుంది. కవికి అవసరమైన లోకజ్ఞత, సామాజిక పరిశీలన అన్నమాచార్య సంకీర్తనల్లో పుష్కలంగా ఉందని చెప్పవచ్చు. సమాజ సౌధానికి వివిధ వృత్తులవాళ్ళు మూలస్తంభాలవంటివారని నిరూపించడం కూడా గోచరిస్తుంది.

ఈ విధంగా అన్నమాచార్యులు తన జీవితకాలంలో ముప్పై రెండువేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనలనే కాకుండా ద్విపద రామాయణం, శృంగారమంజరి, వేంకటేశ్వర మకుటంతో అలమేల్మంగపై చెప్పిన పంన్రెండు శతకాలు, సంస్కృత వేంకటాచల మాహాత్మ్యం, సంస్కృత సంకీర్తన లక్షణం అనే కృతులను కూడా రచించి శ్రీ వేంకటేశ్వరుని పాదపద్మాలకే అంకితమిచ్చాడు. పద కవితా పితామహుడు, ద్రావిడాగమ సార్వభౌముడు, సంకీర్తనాచార్యుడు అనే బిరుదాలతో ఆంధ్ర సాహిత్య లోకంలో ప్రఖ్యాతి గాంచాడు. అన్నమాచార్యుల సంకీర్తనల్లోని శృంగార సాహిత్యాంశం క్షేత్రయ్యగా, అధ్యాత్మ విషయం రామదాసుగా, సంగీతాంశం త్యాగరాజుగా అవతరించాయని పండితులు చమత్కరించారు.

ఈ పుణ్యచరితుడు అవసాన దశలో శ్రీ వేంకటేశ్వరుని దివ్య రూపంలో లీనమయ్యేటప్పుడు —

"దాఁచుకో నీ పాదాలకు తగ నేఁ జేసిన పూజ లివి
పూఁచి నీ కీరితి రూపు పుష్పములివియయ్యా

ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండరాన దాఁచి వుండనీ
వెక్కసమగు నీ నామము వెల సులభము ఫలమదికము
దిక్కై నన్నేలితివిక నవి తీరని నాధనమయ్యా ॥దాఁచు॥

నా నాలికపై నుండి నానా సంకీర్తనలు
పూని నాచే నిన్నుఁ బొగడించితివి
వేనామాల వెన్నుఁడా వినుతించ నెంతవాఁడ
కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేనయ్యా"

అని స్వామివారికి విన్నవించి ప్రార్థించడంలో ఈ మహాభక్తుని నిర్వికార ప్రవృత్తి, వినయసంపత్తి నిష్కళంక భక్తి సహృదయ లోకానికి స్పష్టమవుతుంది.

'ఆకాశవాణి' విశాఖపట్టణ కేంద్రం, (18-4-1988)

'సూర్యోదయం' ఆధ్యాత్మిక మాసపత్రిక, (అక్టోబరు, 1988)
రాజమహేంద్రవరం.



# తనకాలం నాటి చదువుల దుస్థితి పై అన్నమయ్య ఆవేదన

ఇప్పటికి 5 శతాబ్దాల పూర్వంనాటి అన్నమయ్య దుష్టవర్తనులైన విద్యావంతులపట్ల, భగవద్భక్తి లేని విద్యావంతులపట్ల తన ఆవేదన వ్యక్తంచేసి, అలాంటివారికి జ్ఞానబోధ చేస్తూ అనేక సంకీర్తనలు రచించాడు. వీరు రచించిన 32 వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలలో ఇప్పటికి 14 వేల సంకీర్తనలు తిరుమల తిరుపతి దేవస్థానంవారి కృషి ఫలితంగా లభ్యమవుతున్నాయి. ఇందులోని అధ్యాత్మ సంకీర్తనలను పరిశీలించినప్పుడు అన్నమయ్య తనకాలంనాటి చదువుల దుస్థితిని గూర్చి ఎంతో ఆవేదనపడినట్లు తెలుస్తుంది.

మానవుని బాహ్య శత్రువుల వల్ల వచ్చే ప్రమాదం కన్న, అంతశ్శత్రువులైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలవల్ల కలిగే కీడు బలీయమయింది. అయినా మానవుడు వాటిని వదలలేడు. అన్నమయ్య అలాంట్టి నిగ్రహశక్తిలేని వారి నుద్దేశించి—

"సారమైన చదువులు సారెసారె చదివినాఁ
గోరపు దుష్టునికి కోపమేల మాను!"

"ఖారమైన వేపమాను పాలుబోసి పెంచినాను
తీరని చేఁదే గాక తియ్యనుండీనా !"

అనే సంకీర్తనల్లో, స్వభావ సిద్ధంగా దుష్టులైనవారిని సన్మార్గంవైపు మార్చలేమనీ, అలాంటివారు సారమైన చదువులు ఎన్నిసార్లు వల్లించినా తమ కోపాన్ని వదలుకోలేరని వ్యక్తంచేశాడు.

ఈ భావాన్నే వేమన —

"ఎంత చదువుచదివి ఎన్ని విన్ననుగాని
హీను డవగుణంబు మానలేడు -
బొగ్గు పాల కడుగ పోవునా మలినంబు!"

అని చెబితే,

సుమతి శతక కర్త బద్దెన - "తన కోపమె తనకు శత్రువు" అన్నాడు.

అన్నమయ్య చంచలబుద్ధి మానలేని అజ్ఞానులైన చదువరులను గూర్చి పామరజన వ్యవహారంలోని పదజాలాన్ని ఉపయోగించి —

"తన కేడ చదువులు తన కేడ శాస్త్రాలు
మనసు చంచలబుద్ధి మానీనా

జడ్డు మానవుడు చదువ చదువు నాస
వడ్డవారుగాక వదలీనా
గడ్డికుక్క సంతకు పోయి తిరిగిన
దుడ్డుపెట్లే గాక దొరకీనా" అని వ్రాసిన కీర్తనలో—

ఏదో దొరికింది తినాలని ఒక గుడ్డికుక్క సంతకుపోయి తిరిగితే, దానికి కఱ్ఱదెబ్బలే కాని, ఆహారం దొరకదు కదా! అలాగే మూర్ఖుడైన మానవుడు చదువు నేర్చేకొలదీ ఆశ పెంచుకొని, సంసార భవ బంధాల్లో చిక్కుకొని అలమటిస్తాడే కాని, ఆశ వదలుకొని ప్రశాంతంగా బ్రతకలేడు అనే భావం వ్యక్తమవుతుంది.

నాదోపాసకుడైన త్యాగరాజు కూడా హింసాత్మకులైన మానవులపట్ల, పరస్త్రీ పరధనలోలురైన, అవినీతిపరులైన మానవుల

పట్ల, అసత్యవాక్కులు పలుకుతూ పరనింద చేసే నీచమానవులపట్ల ఆవేదన చెందుతూ —

"ఎంత చేర్చిన ఎంత జూచిన
ఎంతవారలైన కాంతదాసులే

పరహింస పరభామాన్యధన
పరమానవాపవాద
పరజీవనాదుల కనృతమే
భాషించెదరయ్య త్యాగరాజ నుత"

అనే కీర్తన రచించాడు.

విద్యలేని మోటువారు అజ్ఞానులై ఉంపటంలో ఆశ్చర్యం లేదుకాని, విద్యావంతులు కూడా వంచకులుగా, వ్యసనలోలురుగా, పరదూషకులుగా, దుష్టులుగా, బ్రతకడాన్ని గూర్చి తాము నేర్చిన విద్యను కేవలం ఐహికసుఖాలకే వినియోగించుకొంటూ, భగవద్భక్తి లేకుండా, వితండవాదాలు చేస్తూ సమాజాన్ని విషపూరితం చేస్తున్న కుత్సిత విద్యావంతులను గూర్చి ఆవేదన చెంది అనేక విధాలుగా హెచ్చరిస్తూ, వారికి జ్ఞానబోధ చేస్తూ అన్నమయ్య చాలా కీర్తనలు వ్రాశాడు. అధర్మం అందలమెక్కుతున్న ఈ కలికాలంలో విద్యావంతులైన మానవులు భగవంతుని గూర్చి తెలుసుకోవడం లేదనీ, అసలు దేవుడనే మాటనే సంపదగర్వంతో మరచిపోయారనీ, వెనుకటి కృత త్రేత ద్వాపర యుగాల్లోని మహనీయులూ, బ్రహ్మ రుద్రాది దేవతలూ - అందరూ మహావిష్ణువును గూర్చి తెలుసుకోవడం కోసమే చదివారనీ, ఈ కాలపు చదువరులు ఇలా నాస్తిక భావాలతో బ్రతుకుతున్నారనీ ఎంతో విచారించి —

"నాఁటికి నాఁడే నా చదువు
మాటలాడుచును మరచేటి చదువు

ఎనయ నీతని నెరుగుటకే పో
వెనకవారు చదివిన చదువు
మనసున నీతని మరచుటకే పో
పనివడి యిప్పటి ప్రౌఢల చదువు

తెలిసి యితనినే తెలియుటకే పో
తొలుత కృతయుగాదుల చదువు
కలిగిన యీతని కాదననే పో
కలియుగంబులో కలిగిన చదువు

పరమ వేంకటపతి గనుటకే పో
దొరలగు బ్రహ్మాదుల చదువు
సిరుల నితని మరచెడి కొరకే పో
విరసపు జీవుల విద్యల చదువు"

అనే కీర్తన రచించాడు.

లోకంలో మానవులు విద్య నేర్చిన పిమ్మట ఉద్యోగం రాగానే ఫలితం వచ్చిందని మురిసిపోతూంటారు. కాని, కుటుంబ జీవనంలో, ఉద్యోగ జీవనంలో, ఇరుగుపొరుగు వారిలో సమాజంలో ఎన్నో ఒడిదుడుకులతో, సమస్యలతో తల్లడిల్లుతూ కుమిలిపోతూంటారు. వారికి ఈ విద్యలూ, ఉదోగాలూ మనశ్శాంతినీ, సుఖాన్నీ ఇవ్వడంలేదు కదా. అలాంటప్పుడు ఇవి ఎలా ఫలించినట్లు! అని తర్కిస్తూ చదువుకున్నందుకు నీచగుణాలైన అరిషడ్వర్గాలను జయించి శాంతియుతంగా బ్రతికినప్పుడే, ఆ చదువులు ఫలించినట్లవుతుందని అన్నమయ్య —

"తన శాంత మాత్మలో దగిలినప్పుడు గదా
పనిగొన్న తన చదువు ఫలియించుట"

అనే సంకీర్తనలో తెలిపాడు.

ఇలాగే త్యాగరాజు కూడా —

"శాంతము లేక సౌఖ్యము లేదు సారసదళనయన
దాంతునికైన వేదాంతునికైన
ఆగమ శాస్త్రము లన్నియు చదివిన
బాగుగ సకల సుహృద్భావము తెలిసిన

అనే కీర్తనలో - ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎన్ని పదవులు ఏలినా, ఎంత సంపద కలిగినా, వేదాంతులకైనా, శాంతం లేకపోతే సుఖమే లేదని హెచ్చరించాడు.

ఇహలోకంలో బ్రతకడానికి కావలసిన ధనం, రూపం, విద్య, చాతుర్యం, పదవి మొదలైనవి ఎన్ని ఉన్నా కూడా-అన్నీ క్షణికాలే. పీటివల్ల కామ క్రోధ లోభ మోహాదులే అధికమౌతాయి. కాని, సుఖశాంతులుండవు. ఒక్క భగవంతుడే శాశ్వతం - అతని మీద ఏర్పరచుకొన్న దివ్యమైన ప్రేమే సుఖప్రదం అంటూ అన్నమయ్య—

"భక్తి నీపై దొకటె పరమ సుఖము
యుక్తి చూచిన నిజం బొక్కటి లేదు.

ధనమెంత గలిగె నది దట్టమౌ లోభంబు
మొనయుఁ జక్కఁదనంబు మోహములు రేఁచు
ఘనవిద్య గలిగినను కప్పు పైపై మదము
మొనయంగ పరమపద మించుకయు లేదు"

అనే కీర్తనలో ఐహిక జీవితాన్ని కాచి వడబోసి నిత్య సత్యసారాన్ని నిర్ధారించి చెప్పాడు. అలాగే త్యాగరాజు కూడా భక్తి కలగడం కోసమే ప్రయత్నించాలనీ, విద్యచేత గర్వించి అవిద్యకు లోను కావద్దనీ —

"ఎటులైన భక్తి వచ్చుటకే యత్నము నేయవే
విద్యాగర్వము లేల నీ వ
విద్యా వశము గా నేల"

అనే కీర్తనలో హెచ్చరించాడు.

అన్నమాచార్యులు రామాయణ భారత భాగవతాది భక్తి జ్ఞాన గ్రంథాలను క్షుణ్ణంగా చదివి విషయాలను ఆకళింపు చేసుకొని, భక్తిరసాన్ని తనివి తీర త్రాగిన పుణ్యపురుషుడు. అందుకే ఆయన సంకీర్తనల్లో కూడా ఆ గ్రంథాల్లోని భక్తిభావాలు ప్రకటిత మవుతుంటాయి.

పోతన భాగవతంలో ప్రహ్లాదుడు తన తండ్రితో "చక్రిహాస్తుని ప్రకటించు చదువు చదువు" అని ఘంటాపథంగా చెప్పినట్లే, అన్నమయ్య కూడా కృష్ణ నామాన్ని నోరార చదవాలనీ, అలాంటి చదువునే సకల శాస్త్రాలు సమ్మతిస్తాయనీ చెపుతూ -

"చదువు గలిగిన ఫలము సంశయంబే గాని
సదమల జ్ఞాన నిశ్చయ మింత లేదు

యిది యెరిగి తిరువేంకటేశ్వరుని గొలిచినను
బ్రతుకు గలుగును భవము ప్రాణులకు లేదు"

"ఉన్నతి చదువు లెన్ని ఉండినా శ్రీవేంకటేశు
సన్నుతించిన మంత్రమే సతమై ఫలించును."

అనే కీర్తనలు వ్రాశాడు.

అన్నమయ్య తనకాలం నాటికే ఇలా చదువుల అర్థం మారి పోయిందనీ, విద్యావంతులు అవినీతిపరులూ, నాస్తికులూ అయ్యా రనీ ఆవేదనపడ్డాడు. తమ జీవితాలను వ్యర్థంచేసుకోవడమే కాకుండా, సమాజాన్ని కూడా నాస్తికమయం చేస్తున్నారనీ, అధర్మాన్ని పెంచుతున్నారనీ ఎంతో బాధ పడ్డాడు. వారిలో భగవద్భక్తిని కలి గించి, ప్రశాంతంగా సుఖంగా జీవించేట్లు చేయాలనే తపనతో ఆయన ఇలాంటి కీర్తనలను రచించి ఉండవచ్చు. అన్నమయ్య ఆనాడే ఇంతగా బాధపడి కీర్తనలు వ్రాస్తే, మరి అప్పటికి 5 శతాబ్దాల కాలం దాటి పోయి, మహమ్మదీయుల, ఆంగ్లేయుల పరిపాలనా ప్రభావాల వల్ల మన సంస్కృతి, మన విద్యావిధానం, సదాచారాలు, అలవాట్లు - అన్నీ మారిపోయి, అహంకారము, అవినీతి, అన్యాయ అక్రమాలు, ఈర్ష్యలు విలయతాండవం చేస్తున్న ఈ కాలంలో అన్నమయ్య ఉండి ఉంటే, ఇంకెంతగా ఆవేదనపడేవాడో అనే ఆలోచన సహృదయు లకు రాకపోదు.

తాళ్ళపాక అన్నమాచార్యులు ఇప్పుడు మనకు ప్రత్యక్షంగా మానవరూపంలో లేకపోయినా, సంకీర్తనల రూపంలో ఒక్క ప్రాం తంలోనే కాక, దేశదేశాలలో ఖండ ఖండాంతరాలలో కూడా జీవించి ఉన్నారు. భూమ్యాకాశాలూ, సూర్యచంద్రాదులూ గతులు తప్ప నంతవరకూ జీవించే ఉంటారు. తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులుగా, తెలుగు అధ్యయనశాఖ ఆచార్యులుగా వ్యవహరించిన డా॥ జి. యన్. రెడ్డిగారు అన్నమయ్య సాహిత్యాన్ని గూర్చి చెపుతూ - మౌలికమైన, అచ్చమైన దేశీయమైన సాహిత్య భాషా సంపన్నమైన అన్నమయ్య వాఙ్మయం తెలుగు సాహిత్యంలో అద్వితీయం. భారతీయ సాహిత్యంలో అపురూపం. ప్రపంచ సాహి త్యంలో అత్యద్భుతం. బహుముఖ ప్రజ్వలమై బహువిధ కాంతుల్ని

నవ నవోన్మేషంగా ప్రసరించే అన్నమయ్య కృతులు పరిశోధకుల పాలిట బంగారు గనులు" అని ఉద్ఘాటించారు. అంతటి విశిష్టమైన సాహిత్యం అన్నమయ్యది.

ద్రావిడాగమ సార్వభౌముడైన అన్నమయ్య చెప్పిన సంకీర్తనా సాహిత్యంలోని భక్తి విషయాలనూ, నీతులనూ, ధర్మాలనూ అలవరచుకొని, మనం నేర్చిన విద్యను సార్థకం చేసుకొంటే, శ్రీ వేంకటేశ్వరునిలో లీనమై విశ్వాన్ని తిలకిస్తున్న ఆ అన్నమయ్య ఎంతో సంతోషించి మనలను ఆశీర్వదిస్తాడు.

'ముముక్షువు'
(కర్మ జ్ఞాన భక్తి వైరాగ్య ప్రబోధక సచిత్ర మాసపత్రిక,
ఏలూరు, ప. గో. జిల్లా; నవంబరు, 1989)



# అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో భక్తి - నీతి బోధలు

అన్నమయ్య రత్నాలసీమగా ప్రఖ్యాతిగాంచిన రాయలసీమ ప్రాంతంలో ప్రభవించిన దివ్యరత్నం. లక్కమాంబ, నారాయణ సూరి అనే పుణ్యదంపతులకు తిరుపతి వేంకటేశ్వరస్వామి వారి అనుగ్రహంతో జన్మించిన నందకావతారం. ఇతని జన్మస్థలం, కడప జిల్లా రాజంపేట సమీపంలోని 'తాళ్ళపాక' అనే గ్రామం. ఇతడు మెట్టిన స్థలం తిరుపతి పుణ్యక్షేత్రం.

మన తెలుగు సాహిత్యంలో మోక్షసాధనాలైన భక్తి, జ్ఞాన, కర్మమార్గాలను, మానవతా విలువలను బోధించడానికి రామాయణ, భారత, భాగవతాది పవిత్ర గ్రంథాలు వెలసి వున్నాయి. అవి గద్య, పద్య, చంపూ కావ్యాలు కావడం మూలాన విద్యావంతులకు, పండితులకు మాత్రమే పరిమితమయ్యాయి. ఏ కొంతమంది మాత్రమే తాము నిరక్షరాస్యులైనా వినికిడి జ్ఞానంతో కొంత గ్రహించ గలిగే వారు. తదనుగుణంగా తమ జీవితాలను మలచుకొనేవారు. కానీ తక్కిన మానవాళికంతటికీ ఆ గ్రంథాల్లోని భక్తి, నీతి ధార్మిక విషయాలు అందుబాటు అయ్యేవి కావు. అందువల్ల తాళ్ళపాక అన్నమాచార్యులు వాటిలోని పరమార్థాన్ని, భక్తి తత్వాన్ని, నిసర్గ రమణీయమైన, హృదయరంజకమైన పాటల రూపంలో రచించి పామరులు మొదలు పండితుల వరకు అందరినీ అలరించి తరింపజేశారు. తెలుగు పద సాహితీ క్షీరాబ్ధిలో రాజహంసగా తేజరిల్లాడు.

అన్నమయ్య స్వామివారి వరప్రసాది. ప్రజలను అశ్వర ఐహిక లంపటాల నుంచి అనశ్వరమైన దైవ చింతనకు మరల్చి జీవ

స్మృ క్తులను చేయడమే అతని ముఖ్యధ్యేయం. మన హిందూ మతం లోని సర్వ దేవతలలో విష్ణువే అధికుడు. ఆరాధ్యనీయుడు, అగ్ర పూజార్హుడు. అని నిరూపించి ప్రజలకు చాటిచెప్పడం అతని కర్తవ్యం. పాంచభౌతిక శరీరాన్ని, అరిషడ్వర్గ పీడితమైన మనస్సును భగవంతుని వైపు త్రిప్పి సన్మార్గంలో నడిపించడమే అతని దీక్ష. అందువల్ల అన్నమయ్య తన స్వామి ఆదేశం మేరకు సంకీర్తనాయజ్ఞం చేపట్టి శ్రీ వేంకటేశ్వరుని ముద్రాంకితంగా ముప్పై రెండువేల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు రచించాడు.

అధ్యాత్మ సంకీర్తనలలో మహావిష్ణువు దివ్యరూప గుణవర్ణ నలు, స్వామి మహిమలు, అవతార విశేషాలు, నవవిధ భక్తి మార్గాలు, స్వామి ఆలయోత్సవాలు, ఆరాధనలు మొదలైన అనేక విశేషాలు వర్ణించబడ్డాయి. వీటితో పాటు సామాజికమైన కుల నిరసన, మొదలైన విషయాలను, మానవులు సన్మార్గంలో పయనించడానికి ఉపయుక్తమయ్యే అనేక నీతులను, మానవజన్మను సార్థక పరచే భక్తి బోధలను, సదసద్వివేకాన్ని కలిగించే అనేక విషయాలను సంకీర్తనలలో పొందుపరచాడు. వీటిని అక్షర జ్ఞానం లేని అతి సామాన్యుడు సహితం విని అర్థం చేసుకోగల్గినంత వ్యవహారిక భాషలో రచించాడు.

అన్నమయ్య తన కాలంనాటి దేశ, కాల, రాజకీయ సాంఘిక, నైతిక పరిస్థితులను దృష్టిలో వుంచుకొని సంకీర్తనలు వ్రాసినా అందు లోని సత్యాలు ఆనాటివారికేకాక, ఈ నాటి ప్రజలకు, రాబోయే తర తరాల, యుగయుగాల ప్రజలకు మణిద్వీపాల్లా మార్గదర్శకమవు తాయి. కాలం గడిచేసరికి లోకంలో ధర్మం, నీతి, దయ, భక్తివంటి ఉదాత్త గుణాలు అడుగంటి పోతున్నాయి. అందుకే వైజ్ఞానికంగా, సాంకేతికంగా ఎంత అభివృద్ధి చెందినా కులమత విద్వేషాలవల్ల, పర

హింసలవల్ల రాజకీయ కుట్రలవల్ల, అవినీతి ప్రవర్తనలవల్ల సమాజంలో సౌఖ్యాలు నశించిపోతున్నాయి. ప్రగతి పతనోన్ముఖం అవుతోంది.

అన్నమయ్య తన కాలంనాడే ఈ దుస్థితిని గమనించి —

"కాల విశేషమో లోకము గతియో సన్మార్గంబుల
కీలు వదలె సౌజన్యము కిందయి పోయినది ॥

ఇందెక్కడి సంసారం బేపెస జూచిన ధర్మము
కందయినది విజ్ఞానము కడకు దొలంగినది
మందుకు వెదకిన గానము మంచితనంపు పనులు॥"

(1-63)

కాలప్రభావం వల్లనో, లేక లోకం పరిస్థితుల వల్లనో ప్రజలలో మంచి మార్గాలు సడలిపోయాయి. మంచితనం లేకుండా పోయింది, ధర్మం క్షీణించింది. విజ్ఞానం తొలగి పోయింది. అని ఎంతో ఆవేదన చెందాడు.

ఇప్పటికి ఐదువందల సంవత్సరాల వెనుకటి కాలంలోనే లోక పరిస్థితి, ప్రజల దుష్ప్రవర్తన ఇలా ఉంటే మరి ఈ కాలంనాటి సమాజంలోని బీభత్సాలను వివరించనవసం లేదు. ఎక్కడ చూచినా పరపీడలు, అసూయా ద్వేషాలు, అత్యాచారాలు, బలవంతుల హత్యలు, దుర్బలుల ఆత్మహత్యలు, దార్జన్యాలు, కులభేదాలు, కుట్రలు, దురాశలు, విలయతాండవం చేస్తున్నాయి. దీనికి కారణం లోకంలో పాపభీతి నశించడమే. ప్రజలలో పాపభీతి కలగాలంటే దైవంపట్ల భయభక్తులు కలిగించాలి. భగవంతునిపై అనురక్తిని పెంచాలి. జ్ఞానబోధ చేసి నిత్యానిత్య వివేకం కలిగించాలి. అందువల్ల అన్నమయ్య ప్రజలకు కోరిన కోర్కెలు, తీర్చే శాశ్వతధనంగా

హరినామాన్ని అభివర్ణించి తెలియజేశాడు. ఆ ధనాన్ని ఎవరెవరు చేపట్టారో వివరిస్తూ—

"ఇచ్చలో గోరేవల్లా ఇచ్చే ధనము
అచ్చుత నామమెపో అధికపు ధనము ॥

నారదాదులు వొగడే నాలుకపయి ధనము
సారపు వేదములలో చాటే ధనము
కూరిమి మునులు దాచుకొన్నట్టి ధనము
నారాయణ నామమిదే నమ్మినట్టి ధనము ॥

పొంచి శివుడు కాశిలో బోధించే ధనము
మంచిన ఆచార్యుల మూలధనము
పంచి (శ్రీ) వేంకటపతి పాలించే ధనము
నించి విష్ణునామ మదే నిత్యమైన ధనము" (3-27)

అని విష్ణునామాన్ని నారదాది భక్తులు కొనియాడిన ధనమని, మునులు తపస్సు చేసి సాధించి దాచుకొన్న ధనమని, కాశీలో శివుడు బోధించే ధనమని, వైష్ణవాచార్యుల మూలధనమని ఈ కీర్తనలో వివరించాడు. ప్రజల మనస్సులోని చెడు వాసనలను హరింపజేయ గల్గిన దివ్యశక్తి ఒక్క హరినామానికే ఉందని అన్నమయ్య గాఢ నమ్మకం.

మానవునికి వచ్చే అనేక కష్టాలను లౌకిక బంధువు లెవ్వరూ పోగొట్టలేరు, ఒక్క దైవచింత మాత్రమే భయాన్ని పోగొట్టి జయాన్నిచ్చి శాశ్వత సౌఖ్యం కలిగిస్తుందని అన్నమయ్య ప్రజలకు బోధిస్తూ —

"ఇంతకంటె ఘనమిఁక లేదు
సంతత సౌఖ్యము జనార్దనుఁడే

భయ నివారణము పరమాత్ముని నుతి
జయకారణ మీశ్వర చింత
ఆయుత పుణ్యఫల మచ్యుతుని సేవ
క్రియతో నిజమెరిఁగిన వారికి" (3-259)

అనే కీర్తన వ్రాశాడు.

సంసారులు ఎన్నో బాధలతో సతమతమవుతుంటారు. పేదలు డబ్బు లేక, ధనికులు ఆరోగ్యం లేక, అన్నీ వున్న వాళ్ళు మనశ్శాంతి లేక విచారిస్తూ వుంటారు. పేదలకు జబ్బులువస్తే వైద్యుల దగ్గరకు వెళ్ళలేరు. వారికి దేవుడే గతి. అలాంటి సంసారులను వుద్దేశించి అన్నమయ్య —

"ఉన్నవిచారము లేల వోహో సంసారులాల
యిన్నిటికితఁడే రక్ష యిదే మీకు మనరో ॥

భవరోగ వైద్యుని పాదములు సేవించి
భువి రోగములఁ బాసి పొదలరో
తవిలి పదిదిక్కులు తానైనవాని
గావిపి పొగడి దిక్కుగలిగి బ్రదుకరో ॥

తల్లి దండ్రీ నీతఁడే తగ జుట్టమీతఁడే
యెల్లగాఁ బుట్టించి పెంచే యేలికీతఁడే
చల్లగా శ్రీవేంకటేశు శరణంటిమిదె మేము
కొల్లగా మీరెల్లా మమ్ము గురిగా వర్ధిల్లరో ॥

ఓ సంసారులారా ! మీరేమీ బాధపడకండి. మీకు భగవంతుడే దిక్కు. భవరోగ వైద్యుడైన భగవంతుని పాదాలు సేవించి మీకున్న భవి రోగాలను పోగొట్టుకోండి. తల్లి, తండ్రి, బంధువు, పోషకుడు అన్నీ ఇతడే, మేమంతా ఇతన్నే శరణువేడి బ్రతికాము. మీరుకూడా మమ్మలను మార్గదర్శకంగా తీసుకొని శ్రీ వేంకటేశ్వరుని శరణుకోరి వర్ధిల్లండి. అని ఈ కీర్తనలో సందేశమిచ్చాడు.

ఐహిక సంబంధమైన కులం, ధనం, విద్య, సంపద స్త్రీ వాంఛ మొదలైన వాటివల్ల దుఃఖాలు, తాపాలేకానీ ఇంకేమీ మిగలదు. కేవలం భగవంతుని మీది భక్తి ఒక్కటే నిజమైన సుఖాన్ని ఇస్తుంది. ఈ విషయం అందరికీ అనుభవవేద్యం అయినా మానవుడు మరచిపోయి తిరిగి వాటికోసమే తిప్పలు పడుతుంటాడు. ఇలాంటి వారికి జ్ఞానబోధ చేయడానికి —

“భక్తి నీపై దొకటె పరమ సుఖము
యుక్తి చూచిన నిజం బొక్కటీ లేదు ॥

కులమెంత గలిగెనది కూడించు గర్వంబు
చలమంత గలిగెనది జగడమే రేచు ॥

ధనమెంత గలిగెనది దట్టమగు లోభంబు
ఘనవిద్య గలిగినను కప్పుఁ బైపై మదము ॥

తరుణు లెందరయిన తాపములు సమకూరు
సిరులెన్ని గలిగినను చింతలే పెరుగు” ॥ (3-322)

అని అన్నమయ్య స్వామికి విన్నవిస్తూ ఈ కీర్తన వ్రాశాడు. కులంవల్ల గర్వం, పంతంవల్ల జగడం, ధనంవల్ల లోభం, విద్యవల్ల

అహంకారం, స్త్రీల సంబంధాలవల్ల తాపాలు, సంపదలవల్ల చింతలు కలుగుతాయే కానీ సుఖం ఉండదని, వైవభక్తియే నిజమైన సుఖం అని, ఇంతకు మించిన సత్యం ఇంకేమీ లేదని అన్నమయ్య ఈ కీర్తన ద్వారా తెలియజేశాడు.

మానవుడై పుట్టినందుకు నిత్యానిత్య వివేకం కలిగివుండాలి. తనువు అనిత్యమయింది. భగవంతుడే శాశ్వతమైనవాడు. ఈ సత్యాన్ని వదలి కొంతమంది అశాశ్వతమైన శరీరపోషణకోసం, స్వార్థచిత్తంతో పరులను పీడిస్తుంటారు. ఇతరులపై కోపాలనలజ్వాలను ప్రజ్వరిల్లజేస్తుంటారు. ఇలా చేయడం పాపం అని, ఇతరులకు మేలు చేయాలని, ఎల్లప్పుడూ శాంతబుద్ధిని కలిగి వుండాలని, అనేక ఘన శాస్త్రాలను శోధించి కనుగొన్న అర్థం ఇదేనని, ఇంతకుమించిన ఉత్కృష్ట ధర్మం ఎక్కడా లేదని తెలియజేస్తూ అన్నమయ్య —

"కంటిని దే యర్థము ఘనశాస్త్రములు దవ్వి
నంటున నిందుకంటెను నాణెమెందూ లేదు ॥

పరపీడన సేయుకంటే పాపము మరెందు లేదు
పరోపకారము కంటే బహు పుణ్యము లేదు
నిరత శాంతముకంటే నిజధర్మ మెందు లేదు" (1-443)

అనే కీర్తన వ్రాశాడు. ఇలాగే అన్నమయ్య మరో కీర్తనలో —

"మనుజుడై ఫలమేది మరి జ్ఞానియౌదాకా
తనువెత్తి ఫలమేది దయగలుగుదాకా

ధనికుడై ఫలమేది ధర్మము సేయుదాకా
చదివియు ఫలమేది శాంతము గలుగుదాకా
పెదవెత్తి ఫలమేది ప్రియమాడుదాకను
మది గల్గి ఫలమేది మాధవు దలచు దాకా" (1-437)

ధనికుడైనందుకు ఫలం దానం చేయాలి. చదివినందుకు ఫలం శాంతగుణం కలిగి ఉండాలి. పెదవి విప్పినందుకు ఇంపుగా మాట్లాడాలి. మనసు కలిగినందుకు మాధవుని తలచాలి. అని అన్నమయ్య ప్రజలకు హితబోధ చేశాడు.

మానవుడు ప్రత్యేకించి కష్టపడి జపతపాలు చేయవలసిన పని లేదు. మానవుడు తాను దానవుడుగా మారకుండా సద్గుణాలు కలిగి వుంటే జపతపాలు, పుణ్యకార్యాలు చేసినంత ఫలమని బోధ చేస్తూ—

"కోపము మానితేనే కోటి జపాలు సేయుట
పాపము సేయకుంటేనే బలు తపము ॥

పరకాంత నంటకుంటే బలు పుణ్యాలు సేయుట
సరిమోనాన నుండుటే సన్యాసము చేకొనుట ॥
పలు సుఖదుఃఖముల బాసి వుండుటే మోక్షము
అల చంచలము మానుటడి యోగము" ॥ (21241)

అనే కీర్తన వ్రాశాడు. కోపంవల్ల తనకు, ఎదుటివ్యక్తికి అనేక సమస్యలు, దుఃఖాలు కలుగుతాయి. అందువల్ల కోపం వదలుకోగల్గితే కోటి జపాలు చేసినంత ఫలితం వస్తుంది. తన ధర్మం తప్పి అధర్మపు పనులు చేస్తే పాపం వస్తుంది. అలాంటి పాపపు పనులు చేయకుంటే అనేక తపస్సులు చేసినంత ఫలితం. పరస్త్రీలను తాకడం చాలా తప్పు.

కోరికలపై చంచలత్వం వదులుకొంటే అదే యోగం అని అన్నమయ్య ఎంతో గొప్ప విషయాన్ని చాలా సూక్ష్మంగా సులభంగా బోధించాడు.

సృష్టిలో కొన్ని సాధుజీవులు కొన్ని విషజీవులు వుంటాయి. సాధుజీవులు ఇతరులకు హాని చేయవు. విషజీవులు ఇతరులకు మేలు చేకూర్చవు. పైగా కీడు చేస్తాయి. ఈ వైరుధ్యం వాటి స్వభావ సిద్ధం. అలాగే మానవులలో కూడా కొందరు సాధుస్వభావులు, కొందరు విషస్వభావులు వుంటారు. మంచి స్వభావం వున్నవారు ఇతరులకు హాని చేయరు. ఇతరులను నొప్పించరు. చెడు స్వభావం కలవారు ఇతరులకు అనేక విధాలుగా కష్టాలు కలిగిస్తూ, ఏదోవిధంగా నొప్పిస్తూనే వుంటారు. ఇతరుల అభివృద్ధిని, సుఖాన్ని చూసి సహించలేరు. కొంతమంది పట్టెడు కూడుపట్టే చిన్న పొట్టకోసం చేయకూడని పనులుచేసి పడరాని పాట్లు పడుతుంటారు. అన్నమయ్య ఇలాంటివారి దేహాలు, బ్రతుకులు దండగ అంటూ —

"కడుపెంత తాఁగుడుచు కుడుపెంత దీనికై
పడని పాట్ల నెల్ల బడి పొరలనేలా ॥

పరుల మనసునకు నాపదలు గలుగఁగ జేయు
పరితాపకరమైన బ్రదుకేలా ॥
పొరిది నితరుల మేలు చూచి సైపఁగలేక
తిరుగుచుండేటి కష్టదేహమిదియేలా ॥ (1-302)

అనే కీర్తన రచించాడు.

కొంతమంది పురుషులు అజ్ఞానంవల్ల భావోద్వేగాలకులోనై స్త్రీ వ్యామోహంలోపడి చివరికి నానారకాల కష్టాలకు, దుఃఖాలకు గురి అవుతుంటారు. అలాంటివారిని జాగృతి చేస్తూ అన్నమయ్య—

'మొదలే తెలియవలె మోసపోక మానవులె
పదిలపు యోగికైనా బ్రహ్మకైనాను

చిచ్చుఁగా గాగిలించుకొంటే చిమిడించకుండునా
గచ్చు బరస్త్రీల పొందు కాఁచకుండునా
తచ్చి విషము మింగితే తల కెక్కకుండునా
పచ్చి సతుల వలపు భ్రమయించకుండునా" (3-273)

అనే కీర్తన వ్రాశాడు. జూదం, మద్యపానంవంటి సప్తవ్యసనాలలో కెల్లా పరస్త్రీ వ్యసనం ప్రాణాంతకమయింది. ఈ వ్యసనం వల్లనే బ్రహ్మదేవుని ఐదు తలల్లో ఒక తల ఎగిరిపోయింది. యోగీంద్రుల వ్రతాలు చెడిపోయాయి. రావణుడు హతుడయ్యాడు. కీచకుడు చిత్రవధ అయ్యాడు. అందువల్ల వీరందనీ గుర్తించుకొని తమకూ అలాంటి గతి పడుతుందని స్త్రీవ్యామోహంలో పడకుండా ముందే జాగ్రత్త వహించాలి. చిచ్చును కౌగిలించుకొంటే ఏ విధంగా చిమిడిస్తుందో అలాగే పరస్త్రీల పొందుకూడా దహించివేస్తుంది. విషం మింగితే తలకెక్కుతుంది. అలాగే పచ్చిసతులైన వారాంగనల ప్రేమలు కూడా పురుషుల మతిని పాడుచేస్తాయి. కాబట్టి ఒక్క సామాన్య మానవునికే కాక యోగికి, బ్రహ్మకు కూడా ఈ వ్యసనం చేటు కలిగిస్తుందని ఈ కీర్తనలో అన్నమయ్య హెచ్చరించాడు.

మానవులను సంసార బందీకృతులను చేసి అలమటింప చేసేవి కామక్రోధ లోభమోహాది అరిషడ్వర్గాలు. ఇవి ఎంతో హీనమైనవని, హేయమైనవని తెలియజేస్తూ —

"మాలతనము వంటిది మతిఁ దగులుఁ గామము
అలరు ముట్టువంటిది అంటు క్రోధము
కేలి నొడిగించు నెంగిలివంటిది లోభము ॥

చుట్టి మద్యము వంటిది చొక్కించు మోహము
వట్టి మాంసము వంటిది వయోమదము
పుట్టిన భ్రమవంటిది పొదిగిన మచ్చరము" (2-221)

అనే కీర్తన వ్రాశాడు. ఈ అంతశ్శత్రువుల తాకిడి నుంచి తప్పించుకోవడం ఎంతటివారికైనా సాధ్యంకాదు అంటూ —

"ఎట్టు దోయవచ్చు వీని నెంతటివారికైనాను
వట్టి నీకు శరణంటే బ్రతికింతువుగాక"

అనే పల్లవిలో శ్రీ వేంకటేశ్వరుని శరణు వేడితే అతడే రక్షిస్తాడని అన్నమయ్య ప్రజలకు హితబోధ చేశాడు.

మానవుడు తన అమూల్యమైన కాలాన్నంతా నిద్రాహారాలు, శరీర సౌఖ్యాలు మొదలైన భౌతికజీవిత అవసరాలకే వినియోగిస్తుంటాడు. కాలధర్మానికి లోబడిపోయి శరీరమే స్థిరమని భ్రమిస్తాడు. పరమాత్మను మరచి పోతుంటాడు. అలాంటి మానవులకు భగవంతుని కీర్తించుమని హెచ్చరిక చేస్తూ —

"అలరి నుతించరో హరిని
మెలయించి మిము భ్రమియించీని గాలము ॥

సేయరో, మనుజులార చింత హరినికనైన
రోయరో మీ భుజియించు రుచులమీఁద
కాయ మస్థిరము యీ కలి మధ్రువము చాల
బోయఁబోయెందుకు గాక పోయఁగాలము

మెచ్చరో మనుజులార, మీరే హరికథలు
పుచ్చరో మీ మదిలోని పొరులెల్లాను

కొంచ్చరో మనుజులార కోరికలెల్లను మీకు
నిచ్చీని శుభములు యిది యెల్లకాలము" (1-338)

అనే కీర్తన వ్రాశాడు. ఓ మానవులారా! ఈ కలిమి, ఈ తనువు అశాశ్వతమైనవి. కాలమంతా వీటితోనే ఎందుకూ కొరగాకుండా గడచిపోతోంది. ఇన్నాళ్ళు ఎలాగో కాలం వ్యర్థా అయింది. ఇకనైనా దైవచింతన చేయండి. మీరు భుజించే రకరకాల రుచుల మీద మనసును పోనివ్వకండి. ఓ మానవులారా మీమీ మనస్సుల లోని కోరికలను, పారమార్చ్యాలను తొలగించండి. మీరు హరిని గూర్చిన కథలపై అనురక్తి కలిగి వుండండి. అవే మీకు ఎల్లప్పుడూ శుభదాయకమవుతాయి. అని ఈ కీర్తనలో అన్నమయ్య సాటి సోదరులకు సందేశాన్ని ఎలుగెత్తి చాటాడు.

అన్నమయ్య రచించిన అధ్యాత్మ శృంగార సంకీర్తనలలో నేడు మనకు తిరుమల తిరుపతి దేవస్థానంవారి యాజమాన్యంలో సుమారు పదిహేను వేల సంకీర్తనల్లో శృంగార సంకీర్తనలే అత్యధిక సంఖ్యలో వున్నాయి. అధ్యాత్మ సంకీర్తనలు సుమారు ఐదారువేల సంఖ్యకు మించక వుండవచ్చు. ఈ అధ్యాత్మ సంకీర్తనలను ఎలుగెత్తి రాగాలాపనతో హాయిగా పాడుకోవచ్చు. లేదా పద్యాల్లా వచనాల్లా చదువుకోవచ్చు. సాహిత్య పరమావధి ఆనందోపదేశాలు. అన్నమయ్య పదసాహిత్యం ఈ రెండింటికీ ఆలవాలమైన రసధుని. సహృదయ పాఠకులు తమ శక్తికొలది, ఓర్పుకొలది వాటిని అవగాహన చేసుకొని, ఆచరించగలగాలి. అప్పుడే మహాభక్తుడైన అన్నమయ్య ఆనాడు నిర్వహించిన సంకీర్తనా సాహితీ యజ్ఞ లక్ష్యం నెరవేరినట్లు అవుతుంది.

'పశ్యన్తి' ప్రత్యేక సంచిక
(పరిశోధకమండలి, సాహిత్య పీఠం, రాజమండ్రి ప్రాంగణం)

# తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క

తొలి తెలుగు వాగ్గేయకారుడు, ద్రావిడాగమ సార్వభౌముడు అయిన తాళ్ళపాక అన్నమాచార్యుని మొదటి భార్య తాళ్ళపాక తిమ్మక్క. ఈమె అసలు పేరు తిరుమలాంబ. కాలక్రమేణ ఈ పేరు తిమ్మక్కగా మారింది. ఈమె "మిన్నందె మొరసె నరసింగన్న కవి త్వంబు పద్యగద్య శ్రేణిన్" అని తెనాలి రామకృష్ణునిచే ప్రశస్తి కెక్కిన నరసింగన్నకు తల్లి. ఈ మహాసాధ్వియే తెలుగులో మొట్టమొదటి కవయిత్రి. తెలుగులో తొలి కవయిత్రి కాగలిగిన అదృష్టం తాళ్ళపాక అన్నమాచార్యుల భార్యకే దక్కడం పసిడికి పరిమళం అబ్బినట్లే. తిమ్మక్కకు తరువాతివారే రామాయణం వ్రాసిన కుమ్మరి మొల్ల, వెంకటాచల మహాత్మ్యం వ్రాసిన తరిగొండ వెంగమాంబ మొదలైనవారు.

తిమ్మక్క రచించిన కృతి సుభద్రా కల్యాణం. ఈమె తన గ్రంథాన్ని కేవలం పండితయోగ్యమైన ప్రబంధ ధోరణిలో కాకుండా బాలపామరాదులు సయితం చదివి అర్థం చేసుకొని పాడుకోవడానికి వీలైన మంజరీ ద్విపద ఛందోగేయ రీతిలో రచించింది. ఈ కృతిలో వున్న కథ సుభద్రార్జునుల పరిణయం. ఇందులో వెయ్యిన్ని నూట అరవై మూడు ద్విపద పాదాలున్నాయి. ద్రౌపదీ వివాహానంతరం పంచపాండవులు ఇంద్రప్రస్థంలో వుండగా ఒకసారి అర్జునుడు ద్రౌపదితో ధర్మరాజు వున్న శయ్యాగృహానికి వెళ్ళడం వెళ్ళిన తప్పిదానికి నారదుని సలహా ప్రకారం తీర్థయాత్రలకు పోవడం, ఆ సమయంలో ఉలూచిని, చిత్రాంగదను వివాహమాడడం, బలరామాదులు రైవతక పర్వతం మీద వున్న సమయంలో మాయాయతి రూపంలో వున్న అర్జునుడు సుభద్రను ప్రేమించి వివాహమాడడం మొదలైన

అంశాలతో కూడిన మహాభారత కథా విశేషమే ఇందులోని కథ. ఇది నన్నయ భారతంలోని ఆదిపర్వం - అష్టమాశ్వాసంలో ఉంది. తిమ్మక్క తాను ఒక స్త్రీ కాబట్టి స్త్రీ జాతిపై తనకున్న అభిమానాన్ని వ్యక్తం చేసుకొన్నదా అన్నట్లు తన కృతికి సుభద్రా కల్యాణం అని నామకరణం చేసింది.

తిమ్మక్క నన్నయ్య భారతంలో లేని కొన్ని సందర్భోచితమైన, రమ్యమైన కల్పనలు చేసింది. కపటముని చేష్టల్ని సుభద్ర తన అన్న అయిన కృష్ణునితో చెప్పడం, కృష్ణుడు ఓదార్చడం, చిలుక రాయభారం మొదలైన అంశాలను ఈమె క్రొత్తగా కల్పించింది. ఇందలి శైలి మృదుమధురంగా, తేనెలొలుకు తేట తెలుగులోని తియ్యదనాల పలుకుబళ్ళతో నుడికారపు సొంపుతో విరాజిల్లుతోంది. తిమ్మక్క తన గేయ రచనలో కూడా తన ప్రియదైవాలైన వేంకటేశ్వరుని, కంచివరదుని, కావేటి రంగని ప్రసక్తి తెచ్చింది. అర్జునుడు ఎన్నో పుణ్యక్షేత్రాలు, ఎన్నో దివ్యతీర్థాలు దర్శించి సేవిస్తూ ప్రయాణించే సందర్భంలో నన్నయభారతంలో లేని ఒక అమూల్యమైన కల్పన చేసింది. అర్జునుడికి తన ప్రియదైవాల దర్శనం చేయించింది తన ద్విపదలో. ఆ సందర్భంలో —

"అమరనహోబళంబా వేంకటాద్రి
వరుసనాపై కంచి వరదుల గొలిచె
క్రనమున కావేటి రంగనాయకుల
ప్రేమమున దర్శించి పిదప తానంత"

అని కథను సాగిస్తుంది. ద్వారకానగరంలో చతుర్మాసవ్రతానికి పూనుకొన్న కుహనా మునికి సుభద్ర పరిచర్య చేసే సందర్భంలో అర్జునుడు ఆమెతో శృంగార సంభాషణం జరిపి హాస్త లక్ష

గాలు చెప్పుతానని చెయ్యి పట్టుకుంటాడు. అతని చేష్టలకు సుభద్ర నివ్వెరపడి తన అన్న అయిన శ్రీకృష్ణునితో —

"ఎక్కడియతి వరుండితడు వోయన్న
చూడసంయమి గాని మూఅకాడితడు
ఆడెడి మాటలిట్లని పల్కరాదు
సరసమాడగ వచ్చు వారెనాతోను
ఎంత జేసిరి మీరు ఇటువంటివాని
నంతః పురంబులో నర్హమాయుంచ
కటకట ఇటువంటి కపట సన్యాసి
నెటువలె పూజింతు నిందిరా రమణ"

అని మొరపెట్టుకొంటుంది. ఈ ఘట్టంలో శ్రీకృష్ణుడు ప్రదర్శించిన నేర్పును యతిరూపంలో వున్న అర్జునుని పట్ల సుభద్రలో కల్గించిన మార్పును తిమ్మక్క హృద్యంగా వర్ణించింది.

"అమ్మరా ముద్దుల గుమ్మ రా వేగ
కొమ్మ రా నవకంపు బొమ్మ రావమ్మ
ముత్యాల సరమరా ముద్దరాలా రా
చిత్తజు బాణమా చెలియ రావమ్మ"

అని శ్రీకృష్ణుడు బుజ్జగించిన వైనంలో తిమ్మక్కయొక్క స్త్రీ సహజసిద్ధమైన ప్రేమానురాగాలతో కూడిన శ్లేషార్థ కవితాదృష్టి వ్యక్తమవుతోంది.

తిమ్మక్క రచించిన ఈ సుభద్రా కల్యాణంలోని కొన్ని కథాంశాలతో పాటు కొన్ని వర్ణనలను కూడా చేమకూర వేంకటకవి తన విజయవిలాసంలో పొందుపరచుకున్నాడు. దీన్నిబట్టి ఈ కృతి

ఎంతటి ఆదర్శప్రాయమయిందో, ఎంతటి విలువయిందో తెలుస్తుంది. తిమ్మక్క అర్జునుని గంభీర సుందరాకారాన్ని గూర్చి ఇలా వర్ణించింది.

"ఎగుభుజంబులవాడు మృగరాజునడుము
నడచిపుచ్చుకొను నెన్నడుము గలవాడు
గరగరనివాడు చక్కనివాడు గొప్పకన్నులవాడు
చిగురొత్త చంద్రిక చెలగుపాదములు"

చేమకూర వేంకటకవి అర్జునుని ఆకార వర్ణనను ఇదేశైలిలో చాలావరకు ఈ పదజాలాన్నే వుపయోగించి ఆమె కవితపై వున్న గౌరవాన్ని, మక్కువను ప్రకటించుకొన్నాడు.

"ఎగుబుజంబులవాఁడు మృగరాజ మధ్యంబు
బుడికి పుచ్చుకొను నెన్నము వాఁడు
.................................
మెరుఁగుఁ జామనచాయ మేనివాఁడు
గొప్ప కన్నులవాఁడు..................
గరగరనివాడు, నవ్వు మొగంబువాఁడు"
(విజయవిలాసం, ఆశ్వా. 2, ప. 164)

తిమ్మక్క తన సుభద్రా కల్యాణం చివరలో తనను గూర్చి, శ్రుతిఫలాన్ని గూర్చి ఇలా చెప్పుకొన్నది —

"అవనిలో తాళ్ళపాకన్నయ్యగారి
తరుణి తిమ్మక్క చెప్పె దాను సుభద్రా
కల్యాణమను పాట కడుమంచి తేట
పలుకుల నీపాట పాడినా విన్న

శ్రీహరి వారికి చేరువై యుండు
నానాటి పాపములు నాశనం బౌను
ఆపులు బంధువులను నొందగలరు
సప్తసంతానములు సమకూరగలవు"

తిమ్మక్క రచించిన ఈ సుభద్రా కల్యాణం ఆకారంలో అల్పమైనా, గుణంలో గొప్పది. సౌకుమార్యం, సౌజన్యం, సౌహార్ద్రం, సారస్యం మొదలైన ఉత్కృష్ట గుణాలు ఉట్టిపడేలా ఆనాటి జనజీవన స్రవంతి ప్రతిబింబించేలా ఈ కవితా కళామతల్లి ఎంతో రమణీయంగా పాదుచేసి పెంచి పోషించిన నవరసభరిత సుమమల్లెతోట, తేనెలొలుకు తేట తెలుగు కవితావిరుల మూట, ఈ సుభద్రా కల్యాణ పాట.

('ఆంధ్రప్రదేశ్' ఏప్రిల్, 1990 పునరారంభ సంచిక,
'తెలుగు సమాచారం' మొదటిపక్షం, ఫిబ్రవరి, 1988)



# అన్నమయ్య సంకీర్తనల్లో సామాజిక చైతన్యం

ప్రజలు అజ్ఞానాంధకారంతో దురాచార శృంఖలాబద్ధులై బ్రతుకుతున్నప్పుడు వారికి జ్ఞానబోధ చేసి మానసిక మార్పులను కలిగించి బ్రతుకును సుఖవంతమైన మార్గంవైపు మళ్ళించే ప్రయత్నమే సామాజిక చైతన్యం. ఆధునిక కాలంలో వేమన, రాజారామమోహనరాయలు, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, గాంధీ, కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు మొదలైన ఎందరో సంఘ సంస్కర్తలు సమాజంలోని కన్యాశుల్కం, వరకట్నం, బాల్య వివాహాలు, వృద్ధ వివాహాలు, జాతి, కులభేదాలు, మత వైషమ్యాలు, సతీ సహగమనం, హింసాత్మక పూజా కార్యక్రమాలు మొదలైన దురాచారాలను ఖండించి వీటి నిర్మూలనకు అహర్నిశలు కృషిచేసి తమ జీవితాలనే త్యాగం చేశారు. ఒక వైపు సంఘ సంస్కరణల కార్యక్రమాలతో పాటు ప్రజలను ఉద్దేసింపజేసే సంస్కరణల సాహిత్యాన్ని సృష్టించి అపారమైన సేవచేశారు.

ఈ సంఘ సంస్కర్తలు సమాజభివృద్ధికోసం చైతన్యంకోసం ఎలాంటి ఉద్బోధలు చేశారో ఇంచుమించు అలాంటి ఉద్బోధలే 15వ శతాబ్దంలోనే తాళ్ళపాక అన్నమయ్యకూడా తన అధ్యాత్మ సంకీర్తనల ద్వారా సమాజానికి హితబోధ చేశారు. అన్నమయ్య పెద్దమనుమడైన చిన తిరుమలయ్య తన తాతగారి సంకీర్తలను గూర్చి —

"వేదంబులు పౌరాణిక
వాదంబులు వరకవిత్వ వాణీ వీణా

నాదంబులు కృత సుజనా,
హ్లాదంబులు తాళ్ళపాక యన్నయ పదముల్"
(తెలుగు సంకీర్తన లక్షణం)

అని స్తుతించాడు. అన్నమయ్య వేద, వేదాంగ పురాణ, రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలను క్షుణ్ణంగా చదివిన మహా పండితుడు, జ్ఞాని, కాబట్టి అందులోని సారాన్ని. నీతులను సంకీర్తనల్లో చొప్పించాడు.

మన సంఘ సంస్కర్తలందరూ 'మానవ సేవయే మాధవ సేవ'గా భావించి సంఘానికి సేవ చేశారు. కానీ భగవద్భక్తిని వారు వదలలేదు. వారు ఏ చిన్న కార్యం చేయాలన్నా దైవ ప్రార్థనలతోనే ప్రారంభించేవారు. ఉదయం, సాయంత్రాలలో విధిగా దైవ ప్రార్థనలు చేసేవారు. తాము చేసే మానవ సేవలన్నీ భగవత్ప్రీతికోసం కృతజ్ఞత కోసమే అని కూడా చెప్పుకొన్నారు. ఆ భగవంతుడు వారి వారి అభిరుచులను, ఆదర్శాలను, సంస్కారాన్ని, వంశానుగతిని బట్టి రాముడు కావచ్చు, కృష్ణుడు కావచ్చు, వేంకటేశ్వరుడు కావచ్చు, శివుడు కావచ్చు లేదా నిరాకార నిర్గుణ పరబ్రహ్మ కావచ్చు.

అన్నమయ్య విశిష్టాద్వైత సిద్ధాంతవాది. ఇతని దృష్టిలో విష్ణువే ఉత్తమ దేవుడు. బ్రహ్మనుగన్న తండ్రి అతడే. ఆతడే శివునికీ బావ. బ్రహ్మ, రుద్ర, మహేంద్రాది సకల దేవతలను, మునులను, మానవులను, సర్వ జీవరాశులను అనేక రకాలైన ఉత్పాతాలనుంచి రక్షించే అవతారమూర్తి విష్ణువే అని అన్నమయ్య ప్రతిపాదన అందుకే —

'మరల విచారించితే మంచము కిందే నయ్యీ
శిరుల హరి వార్లైరి శివాదులు

తాడు పడ్డ మనసుకు దైవము విష్ణుడే యని
పాడి కొలిచిరి తొల్లి బ్రహ్మాదులు.

తట్టువడ్డ జీవునికి దైవము శ్రీహరి యని
ఇట్టె మొరయిడిరి యింద్రాదులు.

గొప్పగా శ్రీ వేంకటేశుఁడొక్కఁడే దైవమని
చొప్పునట్టి కొలిచిరి శుకాదులు'

అంతేగాక వేదాలు స్తుతించేది మహావిష్ణువునే అనీ, ఆ మహా విష్ణువులోని విశ్వమంతా దాగిఉందని తెలియజేస్తూ —

'వేదం బెవ్వని వెదకెడిని
ఆ దేవుని గొనియాడుఁడీ'

'విశ్వాత్మ నీకంటె వేరేమియును గాన
ఐశ్వర్యమెల్ల నియతివ చందములే

కలవు మతములు పెక్కు కర్మ భేదములగుచు
కల వెల్ల నీ యందె కల్పితములే
కలరు దేవతలు బహుగతుల మహిమల మెరయ
అలరి వారెల్ల నీ యంగ భేదములే'

అనే కీర్తనలను రచించాడు.

దైవాలను సరిపోల్చేటప్పుడు, పూజించేటప్పుడు యుక్తాయుక్త వివేకాన్ని పాటించాలని చెబుతూ —

'అన్నిటాను హరి దాసులధికము
కన్నుల వంటి వారు కమల జాదులకు'

అందరును సమమైతే నరుహాసరుహము లేదా
అందరిలో హరియైతే నౌగాక
పొందితో విప్రుని దెచ్చి పూజించినట్టు వేరే
పొందుగాని శునకము బూజింప దగునా

ఎన్నగ స్వర్ణాటంకమింతటాను జెల్లినట్టు
సన్నపు దోలు బిళ్లలు సరిగా జెల్లునా'

సర్వజీవరాశులలోనూ భగవంతుడున్నాడు. కానీ శుభకార్యాలలో బ్రాహ్మణుని రప్పించి పూజించినట్లు కుక్కను పూజించరుకదా. అలాగే విలువైన బంగారు నాణేలు చెల్లినట్లు హీనమైన తోలు బిళ్లలు చెల్లుతాయా? కాబట్టి విష్ణువుతో విష్ణుదాసులతో సమానంగా ఇతర తక్కువ దేవతలు పూజారులు, గౌరవార్హులు కాదని అన్నమయ్య బోధించాడు. అన్నమయ్య ఇదే భావాన్ని మరో కీర్తనలో కూడా తెలియజేశాడు.

'అంతరు మాలినట్టి అధముతాల
పొంత సంత కూటమి పొరిచూపుగాదా

కనక మిత్తడి తోట కలయ సరిదూంచితే
అనువవునా అది దోషమవు గాక
మునుకొనైన హరితో గడు హీన దేవతల
ననిచి సరిపెట్టితే నయమౌనా భువిని'

ఇతర దేవతలను పూజించడాన్ని చాలామంది కవులు, తాత్త్వికులు, కూడా నిరసించారు. శ్రీనాథుడు 'చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు' అని, తాత్త్వికుడైన బ్రహ్మంగారు —

చిల్లర రాళ్ళకు మ్రొక్కుచునుంటే
చిత్తము చెడునుర ఒరే ఒరే

చిత్తము నందున చిన్మయరూపుని
జూచుచు నుండుట సరే సరే'

అనే తత్త్వగేయం వ్రాశాడు.

మన ఆధునిక నాగరిక సమాజంలో నేటికీ శక్తి దేవతల ప్రీతికోసం, అనుగ్రహంకోసం జంతుబలులను, అరుదుగా నరబలులను కూడా నైవేద్యంగా ఇచ్చే మూఢాచారం, మూఢ విశ్వాసం కొనసాగుతూ ఉండటం చాలా శోచనీయం. ప్రాణులకు సుఖశాంతులను ఇవ్వవలసిన వారు దేవతలు, అలాంటి దేవతలకు జీవహింసాత్మకమైన పూజలు నిర్వహించడం, అగ్నిగుండాలలో దూకడం వంటివి అన్నమయ్యకు ఎంతో ఆవేదన కల్పించాయి. కేవలం భగవన్నామస్మరణ చేసి నీ వారమని భగవంతునికి మ్రొక్కితే చాలు, భగవంతుడు అనుగ్రహిస్తాడని జంతుబలులు ఇవ్వడం మూర్ఖత్వం అని అజ్ఞానులైన లోకులకు జ్ఞానబోధ చేస్తూ —

'మొక్కరో మీరు మోసపోక మీకు
దిక్కుదెసైన ఆధి దేవునికి

మారు చేతులీయవద్దు మారుగాళ్ళీయవద్దు
బీరాన గుండెలు కోసి పెట్టవద్దు
గోరవడి చిచ్చులోన గుండాలు చొట్టవద్దు
ఊరకే మీ వారమని వున్న చాలు'

అనే కీర్తన వ్రాశాడు.

అన్నమయ్య తన కీర్తనల్లో కులభేదాలనుకూడా ఖండించాడు. మానవుడు తాను చేసే పనిని బట్టి కులం అనేది ఏర్పడింది.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో —

'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః'

అని వారి వారి వృత్తులను, గుణాలను బట్టి నాలుగు వర్ణాలు తనచే సృష్టించబడ్డాయని తెలియజేశాడు. కులం అంటే వృత్తికి పేరు మాత్రమే. ఇంతమాత్రానికి కులభేదాలతో, వర్ణభేదాలతో ఈర్ష్యా ద్వేషాలు పెంచుకొని మానవులు ఒకరికొకరు కీడు చేసుకోవడం జీవితాభివృద్ధికి, సమాజ శ్రేయస్సుకు హానికరం. ఈ ద్వేష భావం కేవలం అజ్ఞానం, అహంకారం వల్లనే కలుగుతుంది. ఇలాంటి కుల భేదాన్ని నిరసిస్తూ అన్నమయ్య —

'ఎక్కువ కులజుఁడైన హీనకులజుఁడైన
నిక్కమెరిగిన మహానిత్యుఁడే ఘనుఁడు'

'ఏ కులజుఁడేమి యెవ్వడైన నేమి
ఆకడ నాఁతడే హరి నెఱింగిన వాఁడు'

శ్రీకాంతు నామము జిహ్వ దగిలితే జాలు
ఏ కులజుఁడైనాను హీనమేమి'

'ఆతుమ సకల వ్యాపకమని తలపోసిన పిమ్మట
జాతియుం గులాభిమానము జర్పింపనెరాదు'

మొదలైన అనేక కీర్తనల్లో జాతి, కుల భేదాలు పాటించరాదని, భగవంతునికి సర్వ మానవులు, సర్వజీవులూ సమానమేనని, అయితే భక్తి, జ్ఞానం మాత్రం ప్రతి మానవునికీ ఉండాలని ప్రజలకు ఉద్బోధ చేశాడు.

14వ శతాబ్దంలో ఎర్రన కూడా కులభేదాన్ని ఖండించి సత్య శౌచాలకే ప్రాధాన్యమిస్తూ —

'పాపర్తనుండు బ్రాహ్మణుండయ్యు
నిజము శూద్రుకంటె నీచతముడు
సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యును
అతఁడె సద్ద్విజుండు యనిరి మునులు'

అనే పద్యం వ్రాశాడు.

ఆధునిక సంఘ సంస్కర్త, కవి అయిన గురజాడ అప్పారావు కులభేదాన్ని ఖండించి మంచి చెడులను మాత్రమే గుర్తిస్తూ —

'మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాల యయితే
మాల నేనగుదున్'

అని ఉద్ఘాటించాడు.

వేమన కూడా —

'మాల మేలు గుణము మంచిది కలిగిన
మాల కూడు కుడుచు మనుజు కంటె
గుణము మేలుగాని కులమేమి మేలురా'

అని దుర్మార్గుడైన, నీచుడైన అధిక కులస్థునికన్నా మంచి గుణవంతుడుగా బ్రతికే నీచ కులజుడే మేలని చాటి చెప్పాడు.

అన్నమయ్య అద్వైత వాదులను, నాస్తికులను ఖండిస్తూ —

"ఏటి మాటలివి విన నింపయ్యీనా మది
నేఁట వెట్టి దాసు డోటిది సరియా
జీవుడే దేవుఁడని చెప్పుదురు కొందరు
దైవము చేఁత లెల్లా దనుకున్నావా

మిగుల గొందరు దైవమే లేదందురు
తెగనీ ప్రపంచమెల్లా దన చేతులా.
ఎగ్గ మిది గుణాలే ఇతని వందురు గొంద
రనయము మిగిలినవి దమవా"

అనే కీర్తనలో అన్నమయ్య జీవాత్మ పరమాత్మ ఒక్కటే అయితే దైవమహిమలన్నీ జీవుని కెక్కడున్నాయి? దేవుడే లేకుంటే ఈ సృష్టి అంతా తమ చైతన్యమా? దేవుడికి అష్టగుణాలే అయితే తక్కినవి తమవా అని ప్రశ్నిస్తూ విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ఆస్తికత్వాన్ని ప్రజలకు బోధించాడు.

వేమన సంసార జీవితంలోని కష్టాలను గమనించి 'ఇంటిలోని పోరు ఇంతింత కాదయా' అని ఆవేదన పడ్డాడు. అన్నమయ్య ఇలాంటి భావాలతో కూడిన సంసార నిరసన కీర్తనలు కూడా వ్రాశాడు.

"బూటకముల నెల్ల బొరలి సంసారపు
పాటు దెచ్చిన యీ బ్రదుకు
నీటుగ నెద్దు దన్నినని గుఱ్ఱము
చాటున కేఁగిన యట్టి చందమాయె
పగగొన్న పొగ కోపక మంట బడిపడి
పగలు రేయైన యీ బ్రదుకు"

అని సంసారంలోని కష్టాలను గూర్చి ఎద్దు తన్నిందని గుఱ్ఱం చాటుకెళితే ఏమవుతుందో, పొగబాధకు ఓర్చుకోలేక సెగవైపు కెళ్ళితే ఎలా ఉంటుందో అలా ఉంటుంది సంసారపు బ్రతుకు అని తెలియ జేసి చివరికి —

'ఏమి గల దిందు నెంత కాలంబైన
పామరపు భోగమాపద వంటి దరయ'

అని తేల్చి చెప్పాడు. సంసార సమస్యల వలయంలో పడి అలమటిస్తున్న సంసారులకు జ్ఞానబోధ చేస్తూ —

'ఉన్న విచారము లేల వోహో సంసారులాల
ఇన్నిటికితఁడే రక్ష యిదే మీకు మనరో

భవరోగ వైద్యుని పాదములు సేవించి
భువి రోగముల బాసి పొదలరో
తల్లిదండ్రీ నీతఁడే తగ జుట్ట మీతడే
ఎల్లగా బుట్టించి పెంచే యేలికితఁడే'

జనన మరణాలనే రోగాలను పోగొట్టి తానే తల్లిగా తండ్రిగా, బంధువుగా ఆదరించి రక్షించే శ్రీ వేంకటేశ్వరుని పాదాలను సేవించుకొమ్మని ఉద్బోధ చేశాడు.

కలికాల ప్రభావంవల్ల లోకంలో సత్యం, ధర్మం, నీతి, న్యాయం, వినయం, దయ వంటి సద్గుణాలు నశించి పోయాయని, బ్రతుకులు దుర్భర మయ్యాయని ఆవేదన చెందుతూ —

"కాల విశేషమో లోకము గతియో సన్మార్గంబుల
కీలు వదలె సౌజన్యము కిందయి పోయినది

ఇందెక్కడి సంసార వేదన జూచిన ధర్మము
కందయినది విజ్ఞానము కడకు దొలంకినది
గొందులు దరి బడె శాంతము కొంచెం బాయ వివేకము
మందుకు వెదకిన గానము మంచి తనంపు బనులు

మఱియిక నేటి విచారము మాలిన్యంబై పోయిన

వెలుకలు సంతోషమునకు నెడమే లేదాయ
కొలమారెను నిజమంతయు. కొండల కేగును సత్యము
మరగై పోయను మనుకులు మతిమారెను తెలివి”

అనే కీర్తన వ్రాసాడు.

వేమన చదువుకున్న వారైనా, చెడు బుద్ధులను వదలరని జన్మతో కలిగిన స్వభావ బలీయాన్ని గూర్చి చెబుతూ —

‘ఎంత చదువు చదివి ఎన్ని విన్నను గాని
హీను డవ గుణంబు మానలేడు.
బొగ్గు పాలకడుగ పోవునామలినంబు’

అనే పద్యం వ్రాశాడు. అన్నమయ్య కూడా ఇదే భావాన్ని చెబుతూ —

‘సారమైన చదువులు సారె సారె చదివినా
కోరపు దుష్టునికి కోపమేల మాను’

‘భారమైన వేపమాను పాలు బోసి పెంచినాను
తిరని చేదేగాక తియ్యనుండీనా’
‘తన కేడ చదువులు తన కేడ శాస్త్రాలు
మనసు చంచల బుద్ధి మానీనా

జడ్డు మానవుడు చదువ చదువ నాస
వడ్డ వారు గాక వదలీనా
గుడ్డి కుక్క సంతకు బోయి తిరిగిన
దడ్డు పెళ్లేగాక దొరకీనా’

మొదలైన కీర్తనలను వ్రాశాడు. చదువు పెరిగే కొలది సందేహాలే ఎక్కువౌతాయని, నిశ్చయమైన నిర్మల జ్ఞానం కొంచెం కూడా రావడం లేదని చెబుతూ —

'చదువు గలిగిన ఫలము సంశయంబేగాని
సదమల జ్ఞాన నిశ్చయ మింత లేదు
ఇది యెరిగి తిరు వేంకటేశ్వరుని గొలిచినను
బ్రతుకు గలుగును భవము ప్రాణులకు లేదు'

అనే కీర్తనలో అన్నిటికి శ్రీ వేంకటేశ్వరుని నమ్ముకొని కొలుచుకొంటే సుఖం ఉంటుందని, చావు పుట్టుక లుండవని ఉద్బోధించాడు.

అన్నమయ్య తనకాలం నాటి చదువరుల నాస్తిక భావాలను, వారి వాదోపవాదాలను గమనించి ఎంతో ఆవేదన పడ్డాడు. మన పూర్వులందరూ భగవంతుని గూర్చి తెలుసుకోవడం కోసం చదివితే, ఇప్పటివారు భగవంతుని మరచిపోవడం కోసం చదువుతున్నారని, కృతయుగాదులలోని భక్తులందరూ భగవంతుని గూర్చి తెలిసిన వారైనా, మరలా అతన్ని తెలుసుకోవడం కోసమే తిరిగి చదివారనీ, ఈనాటివారు, భగవంతుని లేదనడం కోసమే చదువుతున్నారని, బ్రహ్మాది దేవతలందరూ మహావిష్ణువైన శ్రీ వేంకటేశ్వరుని గూర్చి తెలుసుకోవడం కోసమే చదివారని, ఈ నాటి విద్యావంతులు వితండ వాదులై సంపద గర్వంతో భగవంతుని మరచిపోతున్నారని ఆవేదన చెందాడు.

"నాటికి నాడే నా చదువు
మాటలాడుచును మరచేటి చదువు

ఎనయ నీతిని నెఱుగుటకే పో
వెనక వారు చదివిన చదువు
మనసున నీతిని మరచుటకే పో
పనివడి యిప్పటి ప్రౌఢల చదువు ॥

తెలిసి యితనినే తెలియుటకే పో
తొలుత కృత యుగాదుల చదువు
కలిగిన యీతని కాదననే పో
కలియుగంబులో కలిగిన చదువు ॥

పరను వేంకటపతి గనుటకే పో
దొరలగు బ్రహ్మాదుల చదువు
సిరుల నితని మరచెడి కొరకే పో
విరసపు జీవుల విద్యల చదువు,"

అన్నమయ్య సంకీర్తన రాశిలో ఇలాంటి సామాజిక చైతన్యాన్ని కలిగించే కీర్తనలు పరిశీలన సాగించే కొలదీ నవనవోన్మేషమైన కీర్తనలు కనిపిస్తూనే ఉంటాయి. 'లోకో భిన్నరుచిః' అన్నట్లు సమాజంలో అనేక రకాల మనస్తత్వాలు కలిగిన మానవాళిని ఉద్ధరించి, తరింపజేయడం కోసమే అన్నమయ్య భిన్న భిన్న రీతులలో కీర్తనలు వ్రాసినా అందులోని సత్యాలు ఆ కాలం వారికే కాకుండా ఈ కాలం వారికీ రాబోయే తరతరాలవారికీ అందరికీ ఆమోదయోగ్యంగాను ఆచరణీయంగాను ఉంటాయి. అన్నమయ్య సంకీర్తనలు నిత్య సుగంధ సంభరిత పారిజాత సుమాల వంటివి.

'స్రవంతి' (నవంబరు, 1990)



# అన్నమయ్య సంకీర్తనల్లో కృష్ణమాచార్య వచన సంకీర్తనల ప్రభావం

తెలుగు సాహిత్యంలో మొట్టమొదట పద కవితకు పట్టంకట్టిన మహనీయుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. అందుకే ఇతడు పద కవితా పితామహుడుగా ప్రసిద్ధి కెక్కాడు. అన్నమయ్య కాలానికి (15వ శతాబ్దం) ముందుకూడా విద్వత్కవుల గ్రంథాలలో ఆనాటి ప్రజల వాడుకలో వున్న తుమ్మెద, ప్రభాత, వెన్నెల, గొబ్బి, ఏల, జోల, ఉయ్యాల, జాజర మొదలైన పదాల ప్రసక్తులు కనిపిస్తాయి. కానీ పద సాహిత్యం పేరుతో ప్రత్యేక రచనలున్నట్లు కనిపించవు. దీనికి కారణం రాజాస్థానాలలో పండితాదరణ, గౌరవం పదకవిత్వానికి ఉండేదికాదు. అందువల్ల ఆనాటి కవులు, పండితులు పదకవిత్వాన్ని క్షుద్రసాహిత్యంగా భావించి నిరాదరించారు. పదకవితలు వ్రాయుడానికి నిరాకరించారు. అలాంటి కాలంలో అన్నమయ్య రాజుల ప్రాపును, పండితారాధనలను, స్వార్థప్రయోజనాలను తృణీకరించి కేవలం వైష్ణవ మతాన్ని, భక్తిబోధలను ధ్యేయంగా పెట్టుకొని, ప్రజాశ్రేయస్సు కాంక్షించి పదాలను రచించదలచాడు. పద లక్షణాలను తెలియజేసే సంకీర్తన లక్షణ గ్రంథాన్ని రచించి పదం లేదా సంకీర్తన అంటే ఇలా ఉండాలి అని తెలియజేశాడు. తాను నిర్దేశించిన సంకీర్తన లక్షణాల ప్రకారం యతులు, ప్రాసలు, మార్గదేశి తాళాలు, మాత్రాగణాలు, ముద్ర అనే ఐదు ప్రధానాంగాలతో; పల్లవి, చరణాలతో కూడిన ముప్పై రెండువేల భక్తి, శృంగారాత్మకమైన సంకీర్తనలను శ్రీ వేంకటేశ్వర ముద్రాంకితంగా రచించాడు.

అన్నమయ్య తెలుగులో లక్షణబద్ధంగా పదాలను రచించి పద కవితా పితామహుడైతే, అన్నమయ్యకు రెండు శతాబ్దాలకు

పూర్వమే (13వ శతాబ్ది) కృష్ణమాచార్యులు సింహాచల నృసింహ స్వామిపైన అనిబంధ రూపమైన వైష్ణవ వచన సంకీర్తనలను వ్రాసి ప్రసిద్ధికెక్కాడు. ఇతని వచన సంకీర్తనలు అన్నమయ్య నిబంధ పదాలకు, భజన కీర్తనలకు మూల రూపాలుగా కనిపించడంవల్ల కృష్ణమాచార్యుని పద కవితా ప్రపితామహుడని, వచన సంకీర్తనా పితామహుడని సాహితీలోకం గుర్తించింది. అన్నమయ్య సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణ గ్రంథాన్ని అతని పెద్ద మనుమడు చిన తిరుమలాచార్యులు తెలుగులోకి అనువాదం చేశారు. ఆ సంకీర్తన లక్షణ గ్రంథంలో చూర్ణాఖ్య పదాలను గూర్చి —

"ధర కృష్ణాచార్యాదిక
పరికల్పిత పదము తాళ బంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగునది నిరుక్త నామ భాసితమగుచున్"

మఱియుం దచ్చూర్ణ విధం బెట్టిదనిన —

"ఛందో గుణముల నియుతిం
బొందక తాళప్రమాణమున గడు జెలువై
కొందరిచే దచ్చూర్ణం
బందముగా తాళగంధి యన బొగడొందున్"

అని చెప్పబడింది. ఈ లక్షణాన్ని కృష్ణమాచార్యులు పరికల్పించిన చూర్ణపదం నిరుక్త నామ భాసితమై, తాళ బంధ చ్ఛందో రహితమై వెలసినట్లు తెలుస్తోంది. ఆ చూర్ణికల్ని తాళప్రమాణంతో ఒప్పితే తాళగ్రంధి అవుతుందని వివరించారు. ఈ వివరణను బట్టి అన్నమయ్యకు పూర్వమే అతడు నిర్మించిన పదసాహితీ సౌధానికి కృష్ణమాచార్యులు పునాదులు వేశాడని తెలుస్తుంది.

కృష్ణమాచార్యుని వచన సంకీర్తనలన్నీ వైరాగ్యపూరితమైన భక్తిని ప్రపంచిస్తాయి. దేవతాంతర, మతాంతర, సాధనాంతరాలను తృణీకరించి వైకుంఠవాసుడైన మహావిష్ణువునే నమ్మి "అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ' తస్మాత్ కారుణ్య భావేన రక్ష రక్ష"అని ఆత్మనివేదన చేసుకోవడం వీటిలో ముఖ్యంగా కనిపిస్తుంది. శైవుల, కర్ణాటకుల వచన రచనలు "వచన శాస్త్రం"గా ప్రసిద్ధి చెందగా కృష్ణమాచార్యుని రచనలు వచన సంకీర్తనలుగా ప్రసిద్ధి కెక్కాయి. ఇతని రచనలలో మనకు ప్రస్తుతం ఐదు విధాలైన వచనాలు మాత్రమే లభిస్తున్నాయి. ఈ వచనాల్లో కొన్నింటి లోని భావం, రచనావిధానం, భాష మొదలైన అంశాల ప్రభావం అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలలో కొన్నింటిపై కనిపిస్తుంది.

## 1. వచన సంకీర్తనలు :-

కృష్ణమాచార్యులు తాను రచించిన చాతుర్లక్ష వచన సంకీర్తనలకు వచనాలు, విన్నపాలు, సంకీర్తనలు సింహగిరి నరహరి వచనాలు, నామ సంకీర్తనలు, వేదాంత సంకీర్తనలు, ధ్యాన సంకీర్తనలు, అని అనేక రకాలుగా పేర్కొన్నాడు. కృష్ణమాచార్యుడు దండెను, చిటి తాళాలను సంధించి, పౌతకమూరి భాగవతుల సన్నిధిలో నారాయణుని నామ గుణ కథలను ఘణ ఘణ ధ్వనులు మ్రోయగా దండెమీటుతూ, తాళాన్ని ఉగ్గళిస్తూ వచన భావంతో విన్నపం గావించినట్లు చెప్పుకొన్నాడు. కాబట్టి ఇతని వచనాలు తాళ గంధి చూర్ణాలే అనవచ్చు. ఇందులో తాళమేకాక యమక, గమక, అంత్యప్రాసాది శబ్దాలంకారాలు ఛందోగంధం, చిత్తమా, మనసా, జయ విజయీభవ మొదలైన సంబుద్ధులు, గీతాన్ని తలపించే గురు పుతస్వరాలు, ప్రతి చరణాంతంలో పాడదగిన పల్లవిని పోలిన పాద నిర్మాణం మొదలైన అంశాలు స్పష్టంగా కనిపిస్తాయి.

ఉదాహరణకు ॥

"ఒకపరి మిమ్ము నెరుంగుదుమయ
ఒక పరిమిమ్ము నెరుంగమయ్య
జ్ఞానిని చేయుమయా అ
జ్ఞానిని చేయకువయ్యా"

ఈ వచన సంకీర్తనలో భక్తుడు తాను భగవంతుని ఒక్కోసారి తెలుసుకొంటున్నానని, ఒకోసారి తెలుసుకోలేక పోతున్నానని, తనను జ్ఞానిని చేయవలసిందని, అజ్ఞానిని చేయవద్దని భగవంతునికి విన్నవించుకోవడం వ్యక్తమవుతుంది. ఈ వచన సంకీర్తనలోని పాదాలు పల్లవి, చరణాలను పోలి ఉన్నాయి. ఈ ప్రభావమే అన్నమయ్య పల్లవి చరణాలతో కూడిన సంకీర్తనలు వ్రాయడానికి దోహదం చేసి వుండవచ్చు.

మన వేదాలలో, పురాణాలలో, రామాయణ, భారత, భాగవతాది ప్రామాణిక పవిత్ర గ్రంథాలలో ఉద్ఘాటించబడిన పరమాత్మ మహావిష్ణువు. బ్రహ్మ రుద్రాది దేవతలు, మానవులు సృష్టిలోని సకల జీవరాశులు మహావిష్ణువును ఆశ్రయించే తమ తమ దుఃఖాలను పోగొట్టుకొని శాశ్వత సౌఖ్యాన్ని పొందగల్గుతారు. శిష్టరక్షణ దుష్ట శిక్షణ కోసం అనంతకోటి అవతారలతో భూమిపై అవతరించి భక్తులను తరింపజేసే శక్తిమంతుడైన సత్యగుణ తేజోవంతుడైన దేవుడు మహావిష్ణువు. అలాంటి దేవునిపై భక్తి గలిగి వుండడం మానవుల కనీసధర్మం. కృష్ణమాచార్యుల, అన్నమయ్య కాలాలలో వర్ణాశ్రమ ధర్మాలు పాటించబడేవి. అగ్రకులస్థులకు గౌరవ సత్కారాలు జరిగేవి. నిమ్నజాతుల వారిని హీనంగా చూసేవారు. ఈ కులాల తారతమ్యతను కృష్ణమాచార్యులు నిరసించారు. విష్ణుభక్తియే మిన్న

అని భావించాడు. విష్ణుభక్తి లేని గొప్ప పండితునికన్నా, బ్రాహ్మణుని కన్నా కూడా హరి కీర్తన చేసే అంత్య జాతివాడే గొప్ప కులస్థుడని, అతడే విద్వాంసుల తలమానికమని కృష్ణమాచార్యులు చాటి చెబుతూ —

"విష్ణుభక్తి లేని విద్వాంసుని కంటెను
హరి కీర్తనము సేయు నతఁడె కులజుండు

శ్వపచుఁడైనన్నేమి ఏ వర్ణంబైన నేమి
ద్విజునికంటె నతడె కులజుండు దృష్టించి చూడంగ
విద్వజ్జన భవ్య భూషణము
సింహగిరి నరహరిం దలంచిన యతఁడె కులజుండు"

అనే వచన సంకీర్తన వ్రాశాడు. ఈ వచన సంకీర్తన చక్కగా తాళానికి ఒదిగి గేయ రచనలా భాసిస్తోంది. ఇందులోని విష్ణుభక్తి ఆధిక్యత, భక్తుని విలువ, కుల నిరసన, రచనా విధానం, పద ప్రయోగం మొదలైన అంశాల ప్రభావం తాళ్ళపాక అన్నమాచార్యులు రచించిన —

"ఎక్కువ కులజుఁడైన హీన కులజుడైన
నిక్కమెరిఁగిన మహా నిత్యుఁడే ఘనుఁడు ॥

వేదములు చదివియును విముఖుఁడై హరిభక్తి
యాదరించని సోమయాజికంటె
యేదియును లేని కులహీనుఁడైనను విష్ణు
పాదములు సేవించు భక్తుఁడే ఘనుఁడు ॥

పరమమగు వేదాంత పఠన దొరకియు సదా
హరిభక్తి లేని సన్యాసికంటె

సరవిమాలిన యంత్యజాతి కులజుడైన
నరసి విష్ణు వెదకు నాతఁడే మనుఁడు॥ (1-318)
"ఏ కులజుఁడేమి యెవ్వఁడైన నేమి
ఆకడ నాతఁడే హరినెఱిఁగిన వాఁడు" (1-292)

అనే సంకీర్తనలపై కనిపిస్తుంది.

మానవ శరీరం రక్త మాంసాదులతో కూడుకొన్నది. మిక్కిలి హేయమయింది. ఈ శరీరం అశ్వరమయిందని మానవుడు తెలుసుకోకుండా ఎంతోమంది బ్రతుకులను బుగ్గిపాలు చేస్తుంటాడు. ఇలా కర్మలు చేయడానికి ఆధారమైన శరీరం కామ క్రోధ లోభ మోహాది అరిషడ్వర్గాలతో, ఆశా పాశాలతో చుట్టుకొన్నది. ఇలాంటి భౌతిక శరీరంపై విరక్తి కలిగి కృష్ణమాచార్యులు —

"దేవా! తనువులు మాయ. తలపోసి తలపోసి చెప్పేనంటెనా కలకలల మోహమిది. ఆశల పాశంపమిది. అతుకుల జల్లెడ యిది. తన బ్రతుకు కొరకు పోరాడి పోరాడి యొరుల చెరిచెడి దుర్గంధపు డొంక యిది... ఇది నాటకము లాడేటి బూటకపు బొమ్మ" అని భగవంతునికి విన్నవించుకున్నాడు. ఈ వచనంలో అక్కడక్కడ కొంత ఛందస్సు, శబ్దాలంకారాలు గోచరిస్తాయి. ఇందులోని శరీర హేయత్వం, శరీర పోలిక, భాషా పదజాలం అన్నమయ్య కీర్తనల్లో కొన్నింటిలో కన్పిస్తాయి.

మానవుడు శరీరధారియై ఎన్నో జన్మలు ఎత్తి, ఎన్నో కష్టాలు పడినా తనకు తన శరీరంపై విసుగు కలగదు. ఈ విపత్తుకు కారణం అజ్ఞానమే. ఈ తత్త్వాన్నే అన్నమయ్య తనకు తానుగా చింతిస్తూ—

"అయ్యొక కడు బెదు దేహాలు మోచితి
నయ్యోయిం కావలయును

నెయ్యపు పేయము నిచ్చలు గడిగెద
చియ్యని రోయను సిగ్గూ బడను" (3-317)

అనే కీర్తన వ్రాశాడు. ఇందులో ఎన్ని శరీరాలు ధరించినా ఇంకా అలపు రావడం లేదు. ప్రతి నిత్యం పేయాన్ని కడుగుతున్నా ఇంకా నాకు రోత కల్గడం లేదు, సిగ్గురావడం లేదు. అంటూ భక్తుడు భౌతిక శరీరంపై విరక్తిని వ్యక్తం చేయడం కనిపిస్తోంది.

ఎన్నో పాప పుణ్యాలు చేసి ఇతరులను ఆశ్రయించి ఎన్నో కష్టనష్టాలకు గురి అయ్యావు. ఇకనైనా వీటిపై విసిగి శ్రీ వేంకటేశ్వరుని తలచుకొమ్మని జీవునికి హెచ్చరిక చేస్తూ అన్నమయ్య—

"పాప పుణ్యాలు సేసి పరుల గొలిచి తొల్లి
తాతముల బొందితివి దానికేమి
జిగి శ్రీ వేంకటపతి చిత్తములో నున్నవాఁడు
తగవెందుకో జీవుఁడి దానికేమి" (3-331)

అనే కీర్తన వ్రాశాడు. ఇలాగే మానవ చర్మం యొక్క హీనతను జుగుప్సను వర్ణిస్తూ ప్రాణి ఇలాంటి శరీరంలో బ్రతుకును కోరుకుంటున్నాడని, ఇందులోనే సుఖాన్ని వెదకుతున్నాడని, ఎంత చదువుకున్నా, ఎంత విజ్ఞానం సంపాదించినా, జ్ఞానవంతుడై వీటిని అసహ్యించుకోవడం లేదని, భక్తి మార్గంతో వీటినుంచి బయటపడే తెరువును తెలుసుకోవడం లేదని ఎంతో ఆవేదన చెంది కొన్ని కీర్తనలు రచించాడు.

"ఏఁటి విజ్ఞాన మేఁటి చదువు
గూటఁ బడి వెడలు గతిగురుతు గన లేదు ॥

ఏడు నుడకల చర్మ మింతయునుఁ దూంట్లై
గాడఁ బెట్టుచుఁ జీముగారఁ గాను
పాడైన యిందులో బ్రిదుకుగోరి బ్రాణి
వీడఁ దన్నుక చనెడి వెరవు గనలేఁడు ॥

కడుపు నిండిన మహాకష్టంబు నలుగడల
వెడలుచును బెనుమురికి వేయఁగాను
యిడుమఁ బొందుచు సుఖం బిందుకే వెదకీని
వొడలు మోవఁగ జీవుఁ డోపనలేఁడు ॥ (1-77)

"ఎక్కడి దురవస్థ లేఁటి దేహములోన
జిక్కి జీవుఁడు మోక్షసిరిఁ జెందలేఁడు

ఒడలు మాంసపూరమొక పూఁటయిన మీఁదు
గడుగకున్నఁ గొరగాదు
కడలేని మలమూత్ర గర్హితమిది, లోను
గడుగరాదు యెంత గడిగినఁ బోదు" (1-106)

"శ్రీహరి సేసిన చిహ్నాలివి యీ
మోహము విడచుట మోక్షమది

మలినంబేది మణుఁగన నేది
కలుషపు మలముల కాయమిది
కలిగిన దేది కడులేంబేది
చలనపు మాయల జన్మమిది" (1-406)

మొదలైన కీర్తనలు శరీర వైరాగ్యాన్ని సూచిస్తున్నాయి.

కృష్ణమాచార్యులు "ఇది నాటకము లాడేటి బూటకపు బొమ్మ" అన్నట్లుగానే అన్నమయ్య కూడా జీవుని ఆటలోని ప్రతిమగా వర్ణిస్తూ —

"ఎవ్వరి వాఁడో యెఱఁగ రాదు
అవ్వ లివ్వలి జీవుఁ డాటలో పతిమే" (1-472)

అనే కీర్తన వ్రాశాడు. అలాగే మరో కీర్తనలో తనను వెంబడిస్తున్న కర్మలతో తాను అలమేల్మంగా వేంకటేశ్వరులను కొలిచే సూత్రపు బొమ్మనని చెబుతూ —

"ఏలినవాఁడు (శ్రీ) వేంకటేశుఁడితఁడొక్కఁడింతే
నేలిక సాన్నై పెంచేది యీతని సతే
జాలినే వీరి గొలిచే సూత్రపు బొమ్మ నింతే
పొలుపుఁ గర్మములాల పట్టకురో మమ్మును" (1-464)

అనే కీర్తన రచించాడు.

ఇలాగే మహాభక్తుడు, వినయ శీలుడు అయిన అన్నమయ్య మరో కీర్తనలో —

తాను రాతి బొమ్మనని, తోలు బొమ్మనని తనను కాపాడమని తన ప్రియ దైవానికి విన్నవించుకొంటూ —

"ఏమీ నెఱఁగని నాకేడ పుణ్యము
తామసుండ జుమ్మీ మందర నున్న దైవమా ॥

చేతనముఁ బోది సేయు చిత్తము నీదే కాన
రాతిబొమ్మఁ జుమ్మీ భారము నీది దైవమా ॥

తేనె పూసి నీ విట్లాఁ దిప్పఁగానే తిరిగేటి
మానిబొమ్మఁ జుమ్మీ నా మతిలోని దైవమా ॥

పాలుపోసి పెంచిన నా పాలి వేంకటేశనే
తోలిబొమ్మఁ జుమ్మీ కాతువుగాని దైవమా ॥

(1-286)

అనే కీర్తన రచించాడు.

మహాత్ములు ఇతరులకు చెప్పదలచిన నీతులను, బోధలను ముందుగా తమ మనస్సుకు. బోధించుకొని సాధనచేసి ఇతరులకు బోధిస్తారు. అలాగే కృష్ణమాచార్యులు కూడా తన చిత్తానికి, అజ్ఞానంతో కూడిన ఎడతెగని కర్మబంధాలలో చిక్కుకోవద్దని, సుజ్ఞానిగా మారి సింహగిరి నరహరిని కొలిచి సుఖపడమని విన్నవించుకుంటూ—

"అజ్ఞాత జనిత కర్మములందగిలి కలంగకా
సుజ్ఞానివై సింహగిరి నరహరిం దగిలియుండే
సుఖిగమ్మా — చిత్తమా" అని

చిత్తమా అనే సంబుద్ధితో వచన కీర్తన వ్రాశాడు. ఈ వచన పాదాలు అన్నమయ్య కీర్తన పాదాలనే తలపింపజేస్తున్నాయి. ఇందులోని గురుప్లుత స్వరాలు పాటపాడే వైఖరిని చాటుతున్నాయి. అన్నమయ్య సంకీర్తనల్లో కూడా "చిత్తమా" అనే సంబుద్ధితో కూడిన తాత్త్విక సంకీర్తనలు కనిపిస్తాయి.

"పరమాత్మ చింతచేత బదుకు నిశ్చయమాయ
ధరఁ గైవసము గావో తగు చిత్తమా" (3-135)

"చింతలు రేఁచకు మమ్ము చిత్తమా" (3-63)

కృష్ణమాచార్యుడు "చిత్తమా" అనే సంబుద్ధి వచనంలో చెప్పిన భక్తి విషయమే అన్నమయ్య "మనసా" అనే సంబుద్ధి కీర్తనలో చెప్పాడు. కృష్ణమాచార్యులు సింహగిరి నృసింహస్వామిని

తలచి సుఖపడమని తన చిత్తానికి హెచ్చరించినట్లే అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని తలచుమని, విసుగుపడకుమని తన మనస్సుకు బోధిస్తూ —

"మున్నిటి సురలు బ్రహ్మాదులకైనను
ముక్తిసాధనము వో మనసా
వెన్నని వేంకటపగిరిపతిఁ దలఁచుము
వేసారకుమీ వో మనసా" (1-188)

అనే కీర్తన వ్రాశాడు.

కృష్ణమాచార్యులు "ఓం నమో నారాయణాయ" అనే ఎత్తుగడతో కీర్తనలు వ్రాసినట్లే అన్నమయ్య కూడా —

"నమో నారాయణాయ
నారాయణాయ సగుణ బ్రహ్మణే సర్వ
పారాయణాయ
శోభన మూర్తయే నమో" (1-269)

"నమో నారాయణాయ నమః
సమధికానందాయ సర్వేశ్వరాయ" (1-245)

"నారాయణాయ నమో నమో నానాత్మనే నమో
నమో
యీ రచనలే యెవ్వరు దలఁచిన
యిహ పరమంత్రము లిందరికి" (1-380)

అనే కీర్తనలు రచించాడు.

కృష్ణమాచార్యులు భక్తిరస సాగరంలో తన్మయీభూతులై మహావిష్ణువు నామాలను సంబుద్ధి రూపంగా స్తుతిస్తూ — "దేవా!

శ్రీమన్నారాయణా! పరబ్రహ్మ స్వరూపా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! వేదవేదాంతవేద్యా! పురాణపురుషోత్తమా! ............... దశరథ రాజనందనా! కౌసల్యా గర్భశుక్తి ముక్తాఫలా! భరతాగ్రజా! సౌమిత్రి మిత్రా! శరణాగత వజ్రపంజరా! భక్తి ముక్తి ఫల ప్రదాయకా!............తాటకీ ప్రాణాపహారా! విశ్వామిత్ర యజ్ఞ పాలకా!.........పరశురామ బాహుబల పరాక్రమ హరణా!.........విభీషణ రాజ్య స్థాపనాచార్యా! ఆనంద మయా! జయాజయ రాఘవేశ్వరా! మాయతిరామానుజముని పరందాతారు సింహగిరి నరహరీ నమో నమో దయానిధీ అనే నామ సంకీర్తనను రచించాడు. ఇందులో మహావిష్ణువు నామాలు, రామావతార సంఘటనలను తెలియజేసే నామాలు ఎక్కువగా ఉన్నాయి. ఆశు కవితా రీతిలో అవ్యవధానంగా సాగిన ఈ నామ సంకీర్తన దండక ప్రాయమైనదని చెప్పవచ్చు.

అన్నమయ్య సంకీర్తనల్లో కూడా ఇలాంటి విష్ణునామ సంకీర్తనలు రామావతార సంఘటనలను తెలియ జేసే నామ సంకీర్తనలు కనిపిస్తాయి.

"ఆది దేవ పరమాత్మా
వేదవేదాంత వేద్య నమో నమో ॥

పరాత్పర భక్త భవభంజనా
చరాచర లోక జనక నమోనమో
గదాధరా వేంకటగిరి నిలయా
సదానంద ప్రసన్న నమోనమో" (1-289)

"నవనీతచోర నమోనమో
నవమహిమార్ణవ నమోనమో ॥

హరినారాయణ కేశవాచ్యుత శ్రీకృష్ణ
నరసింహ వామన నమోనమో
మురహర పద్మనాభ ముకుంద గోవింద
వరనారాయణ రూప నమోనమో" (3-24)

"రామభద్ర రఘువీర రవివంశ తిలక
నామమే కామధేనువు నమోనమో ॥

కౌశల్యానంద వర్ధన ఘన దశరథ
భాసుర యజ్ఞ రక్షక భరతాగ్రజ

మారీచ సుబాహు మర్దన తాటకాంతక
దారుణవీర శేఖర ధర్మపాలక
కారుణ్య రత్నాకర కాకాసుర వరద" (3-304)

కృష్ణమాచార్యులు ధ్యాన సంకీర్తనలో విష్ణుభక్తులు భగవంతుని నామ,రూప,గుణ మాహాత్మ్య కథలు తప్ప ఐహికమైన ఇతర ఆభరణాలను, రూపాలను కథలను ఇచ్ఛగించరని విన్నవించుకుంటూ, లోకబాంధవుడైన విష్ణుదేవుడు తనను రక్షించవలసినదని ప్రార్థించడం వ్యక్తమవుతుంది.

"దేవా! మీ తిరుమణి తిరుచూర్ణంబులు మేన ధరించిన
వారికి సువర్ణాలంకారములు వికారములు ॥

దేవా! మీ సౌందర్యము దరిశించిన కన్నుంగవలకు
ఇతరములైన రూపములు చూడ పాపములు ॥
దేవా! మీ అసంఖ్యాక పరిమళ కథామృతంబు
ఘనతరముగ గ్రోలిన జనులు
ఇతర కథలు నెరుంగరు ॥

దేవా! సర్వగంధా! సకల బాంధవుడవై
ఇటువలె నిఖిలేంద్రియ
భోగ్యమై నన్ను రక్షింపవే అనాథపతి,
సింహాగిరి నరహరి
నమోనమో దయానిధీ"

ఈ ధ్యాన సంకీర్తనలోని ముఖ్యమైన భావమే అన్నమయ్య సంకీర్తలో కూడా వ్యక్తమవుతుంది.

భగవద్భక్తులకు ఎప్పుడూ భగవంతునిమీదే అనురక్తి, భక్తి ఉంటుంది. వారికి కావలసింది తిరుమంత్రం; ఆచార్యకృప, భగవద్దాస్యం, వైష్ణవుల ఆదరణ, అంతేకానీ బాహ్యమైన ఐహిక విషయాలు, తపస్సు, తీర్థాలు కావు. ఈ భక్త్యాత్మకమైన ఈ విషయాలను అన్నమయ్య భగవంతునికి విన్నవిస్తూ —

"నీవారైన వారికి నీవై భక్తేకాక
భావించనేరక వట్టి భ్రమఁ బడవలెనా ॥

కరుణానిధి నీవు గలిగి వుండగాను
తిరుమంత్రమే నాకు దిక్కై వుండఁగా
బలిమి శ్రీ వేంకటేశ బంధవిముక్తుని జేసి
తలఁపులో నెలకొని దయఁ జూడవయ్యా" (1-332)

అనే కీర్తన రచించాడు.

"సకల జీవహింసలు చేసి జంతువుల మేనులు ఖండించిన లోహముున్ను వేదశాస్త్ర పురాణంబులు వ్రాసే లోహమున్నూ పరుసవేది సోకినంతనే స్వర్ణంబైనట్లు" అని కృష్ణమాచార్యులు వ్రాసిన వచన సంకీర్తనలాగే అన్నమయ్య కూడా —

"తతి నీ నామము దలఁచిన వారి
అతి పాపమె పుణ్యం బాయ
గతియై పరుసము గదిసిన లోహమె
ప్రతిలేక ధరణి బసిఁడి యైనట్లు" (3-307)

"పక్కన లోహము బరుసము దాఁకిన
యెక్కువ నంతా హేమమే కాదా" (3-539)

ఎలాంటి పనులు చేసిన లోహమైనా పరుసవేది సోకినంతనే పసిడిగా మారినట్లే ఎన్ని పాపాలు చేసినవారైనా భగవన్నామం తలచినంతనే పుణ్యాత్ములవుతారని బోధించాడు.

అభ్యసించరానివి గురుకృప, భగవద్దాస్యం అని కృష్ణమాచార్యులు చెబుతూ — దేవా! అభ్యసింపరానివి రెండు. ఆచార్య కటాక్షం బొక్కటి. అటు మీదట మీ దాసుఁడౌ టొక్కటి" అని చెప్పినట్లే అన్నమయ్య ఈ భూమిపై కోరిన కోర్కెలిచ్చేటి భగవంతుడు. అతని శరణాగతి అంటూ —

"కలవి రెండే భూమి కామ నిధానంబులు
జలజాక్షుడు అతని శరణాగతియును

మాటలు లేవా భూమి మంత్రము లెంచి
తేటల హరినామమే తేఁకువ గాక
కోటిపూజలిల లేవా కుమతులు సేసేవి
పాటల ప్రపన్నుని భక్తి దొడ్డుగాక" (3-412)

అనే కీర్తన వ్రాశాడు.

అన్నమయ్య కృష్ణమాచార్యుని లాగే భగవద్దాస్యానికి, గురు కృపకు ప్రాధాన్యమిస్తూ —

"వృట్టుగులకు వెఱవ భువిలోన వారి నీకు
నట్టె నీ దాసుడ నేనై తేజాలు" (1-403)

వరుస నాచార్యుడు వహించుక వుండగాను
పరగ దపము చేసి బడలగ వలెనా!

కమలాక్ష నీ ముద్రలే కామక నాకుండగాను
అమరి దాస్యము కాణాచై వుండగా
తమితోడ వైష్ణవులు దాపుదండై వుండగాను
తెమలి తీర్థాలెల్లా దిరిగ్గించవలెనా ॥ (3-219)

అనే సంకీర్తన రచించాడు.

కృష్ణమాచార్యులు వేదాంత సంకీర్తనలతో స్థూల, సూక్ష్మ కారణ తనువులను గూర్చి తెలియజేస్తూ, దుఃఖపూరితమైన వీటిని పోగొట్టుమంటూ — "ఈతను త్రయముం బాపవే పరబ్రహ్మ సింహగిరి నరహరీ నమోనమో దయానిధీ" అనే వచన సంకీర్తన రచించాడు. అలాగే మానవులకు కలిగే ఐదు విధాలైన కష్టాలను తుంచి వేయమంటూ —

"దేవా ! తానుగాని దేహమందు తానని దుఃఖపడేది అవిద్యా క్లేశము. దేహాదులందు అభిమానమువలన దుఃఖపడేది అస్మితా క్లేశము. విషయముల గోరి దుఃఖపడేది రాగక్లేశము. విషయములు దొరుకక దుఃఖపడేది ద్వేష క్లేశము. విషయములందు తగిలి విడువలేక దుఃఖపడేది అభినివేశ క్లేశము. ఈ పంచ క్లేశముల జిక్కి నొచ్చినాడను. ఈ దుఃఖముల దుంపవే పరబ్రహ్మ సింహగిరి నరహరి నమోనమో దయానిధీ" అని స్వామిని ప్రార్థించాడు. అన్నమయ్య సంకీర్తనల్లో కూడా అనేక రకాల బాధలు వర్ణించబడ్డాయి.

"కటకటా యిటు చేసెఁ గర్మబాధ
యెటువంటి వారికిని నెపయ దీబాధ !

దినదినముఁ బ్రాణులకు దీపనముచే బాధ
తనుపోషణములు కందర్పబాధ
మనసు శాంతికి సదా మమకారముల బాధ

తనివోని కోర్కులకు దైవగతి బాధ
తిరువేంకటాచలాధిపుని గనమని కొలుచు
వెరవు చేతనెకాని వీడదీ బాధ ! (1-239)

కృష్ణమాచార్యుని లాగే అన్నమయ్య కూడా ఐహిక సంబంధమైన అనేక బాధలను పోగొట్టి రక్షించమంటూ —

"దేవ నీ మాయ తిమిరమెట్టిదో నా
భావము చూచి గొబ్బునఁ గావవే

"ప్రసన్న లెదుటఁ బడిన యాతుమకు
చపలతమరి నాశము లేదు
ఉపమల గురుకృప నొనరిన మనసుకు
రసముల మఱి నేరము లేవు" (1-408)

"మిక్కిలి పుణ్యులు హరి నీ దాసులే హరి
తక్కినవారు మీ కృప దప్పినవారు హరి" (1-411)

"గోవింద నీ దాసులే ఎక్కువ ఘనులిందరిలో
వేవేలు పెద్దలటు వేల సంఖ్యలుండనీ" (1-442)

మొదలైన సంకీర్తనలను వ్రాశాడు.

కృష్ణమాచార్యులు శ్రీవైష్ణవులకు అత్యంత ప్రాధాన్యమిస్తూ వారు ఏ కులస్థులైనా వారే బ్రాహ్మణులని ఉద్ఘాటిస్తూ —

"శ్రీవైష్ణవులే పరమ సాధకులు శ్రీవైష్ణవులె బ్రాహ్మణులు" అనే కీర్తన వ్రాశాడు. అన్నమయ్య కూడా ఇంచుమించు ఇదే అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ —

"కొంచెమును ఘనమును గను గొననేల హరిఁదలచు
పంచ మహాపాతకుఁడే బ్రాహ్మణోత్తముఁడు ॥
పరమ వేదాంత పఠన దొరకియు సదా
హరిఁ దలఁచలేని సన్న్యాసికంటె
మరగి పసురము దినెడి మాలవైనను వాఁడె
పరమాత్మఁ గొలిచినను బ్రాహ్మణోత్తముఁడు"(1-329)

"అణు రేణు పరిపూర్ణుడైన శ్రీ వల్లభుని
బ్రణుతించు వారు వో బ్రాహ్మలు" (1-365)

కృష్ణమాచార్యులు భగవంతునిపై అపారమైన భక్తి కల వాడు. తాను భగవంతునికి ఏ విధమైన సేవచేసి మెప్పించాలన్నా తనకన్నా ముందే జాంబవంతుడు, విభీషణుడు, హనుమంతుడు, గంగాదేవి మొదలైన భక్తులందరూ స్వామి సన్నిధిలోనే ఉండి సేవలు చేస్తున్నారని భగవంతునికి విన్నవించుకుంటూ —

"శ్రీకాంతుఁడ నీ పాద సేవకులయిన వారు
పాక శాసనాదులును బ్రహ్మాదులు
పైకొని నరుఁడ నేను బంటు గాగా నెంతవాఁడ
కైకొని నీ పుణ్యానకుఁ గాచుటింతే కాక" (3-286)

అనే కీర్తన వ్రాశాడు.

ఈ కీర్తనలో బ్రహ్మ, ఇంద్రాది దేవతలు, నారద సనక సనందనాదులు, అనంత గరుడాది దేవతా భక్తాగ్రేసరులంతా విష్ణు

దేవుని పాదదాసులై వుండగా తాను ఏపాటి వాడనని, తనను అన్ని విధాల రక్షించుమని భక్త శిఖామణి అయిన అన్నమయ్య స్వామిని ప్రార్థించడం వ్యక్తమవుతోంది.

## 2. తులసీ మాహాత్మ్యం :

వైష్ణవ పరమ భక్తాగ్రేసరులకు, పతివ్రతా శిరోమణులకు అత్యంత పూజనీయమయింది తులసిమొక్క. ఈ తులసీ మాహాత్మ్యాన్ని చాటిచెప్పే గ్రంథం తులసీ మాహాత్మ్యం. దీనిని కృష్ణమాచార్యులు సంకీర్తనాత్మకంగా రచించాడు.

నిశీ సమయమందు తులసీ దరిసెనము చేసినవారికి శిశుహత్య, స్త్రీహత్య, గోహత్య మొదలైన పాతకంబులు పోవును......... తులసికి కోట వేయించి కొమ్మలు దీర్చిన పుణ్యాత్ములకు అశ్వమేధ ఫలంబులు గలుగును. తులసికి దీపం బెత్తినవారికి సూర్యచంద్ర లోకంబులు గలుగును............ ప్రొద్దుననే లేచి తులసి దరిసెనము చేసినవారికి సర్వపాపంబులు తొలగును." ఇలా తులసి మాహాత్మ్య కథ వచన సంకీర్తనలుగా రచించాడు. అన్నమయ్య సంకీర్తనలలో ఇలాంటి తులసీ మాహాత్మ్యాన్ని చాటిచెప్పే కీర్తనలు కనిపించడంలేదు. కానీ శృంగార సంకీర్తనలలో అక్కడక్కడ తులసీ ప్రసక్తులు మాత్రం కొన్ని కనిపిస్తాయి.

## 3. నృసింహ నామాలు :

కృష్ణమాచార్యులకు అత్యంత ప్రియదైవం శ్రీ నృసింహస్వామి. అందువల్ల నృసింహ నామాలు రచించాడు. ఇది కృష్ణమాచార్యుని స్తోత్రరూపమైన ధ్యాన సంకీర్తన. ఈ ధ్యాన సంకీర్తనలో ప్రతి పాదాంతంలోను "శ్రీ నృసింహ" అనే దైవ నామం ఆవృత్తి

అవుతుంది. ఇది మాత్రాబద్ధ ఛందస్సు ననుసరించి సాగిన వచన రచన. ప్రారంభంలో —

"శ్రీకరంజ భూరుహాఖ్యఁ జెలఁగి వెలయు శ్రీ నృసింహా
భీకరావతార ధీరపృథుల వక్ష శ్రీ నృసింహా
వేడినట్టి ఫలములిచ్చు వినుతకీర్తి శ్రీ నృసింహా
వేదరాశి తుదను వెలుగు విశ్వభర్త శ్రీ నృసింహా
ఆదిదేవ నీ చరిత్ర మద్భుతంబు శ్రీ నృసింహా"

దీని అంతంలో —

"తపము నీవె శ్రీ నృసింహా జపము నీవె శ్రీ నృసింహా
నీడనీవె శ్రీనృసింహా తోడు నీవే శ్రీ నృసింహా
హితుడ నీవె శ్రీ నృసింహా మతివి నీవె శ్రీ నృసింహా
గతివినీవె శ్రీ నృసింహా పతివి నీవె శ్రీ నృసింహా"

దీని చిట్టచివరలో శ్రుతిఫలం చెప్పబడి "మాయతి రామానుజ ముని పరందాతారు అనాథపతి సింహగిరి కృష్ణమవ్వారుస్వామి సింహ గిరి నరహరీ నమో నమో దయానిధీ" అని ముగిస్తుంది.

అన్నమయ్య కూడా నృసింహావతార విశేషాలను తెలియ జేస్తూ నరసింహా, శ్రీనరసింహా అనే దైవనామాంత కీర్తనలు రచించాడు.

"చేపట్టి మమ్ము గావు శ్రీ నరసింహా నీ
శ్రీపాదములే దిక్కు శ్రీ నరసింహా ॥

చెలఁగు వేయి చేతుల శ్రీ నరసింహా
చిలికేటి నగవుల శ్రీ నరసింహా

సిలుగులేని మంచి శ్రీ నరసింహా నీ
చెలిఁ దొడక్కించుకొన్న శ్రీ నరసింహా ॥

క్షీరసముద్రమువంటి శ్రీ నరసింహా దైత్యుఁ
జీరిన వజ్రపుగోళ్ళ శ్రీ నరసింహా
చేరి ప్రహ్లాదుని మెచ్చె శ్రీ నరసింహా నుతిం
చేరు దేవతలు నిన్ను శ్రీ నరసింహా ॥" (2-496)

కృష్ణమాచార్యులు నృసింహనామాలకు అంతంలో వ్రాసిన వచన రచనను పోలిన అన్నమయ్య కీర్తన కనిపిస్తుంది. ఇది విష్ణు నామాంత కీర్తన.

"తనువును నీవే దామోదరా నా
మనికియు నీవే మధుసూదనా
వినికియు నీవే విట్ఠలుఁడా నా
వెనకముందు నీవే విష్ణుదేవుఁడా" (1-335)

## 4. రామనామ కీర్తనం :

కృష్ణమాచార్యులకు నచ్చిన అవతారాలలో రామావతారం కూడా ఒకటి. అందుకే రామనామ కీర్తనం వ్రాశాడు. ఇది నృసింహ నామాలను పోలిన రచన. ఇందులో ప్రతి పాదాంతంలోనూ "రామ నామము" అనే పదం ఆవృత్తి వస్తుంది. ఇదికూడా మాత్రా ఛ్ఛంద స్సుతో ప్రారంభంలో —

"శ్రీమదఖిల రహస్య మంత్ర విశేష ధామము
రామ నామము
సామవేద విధూత శాస్త్ర విచార నామము
రామ నామము
నీలకంధర వరపురందర నిత్యకృత్యము రామ నామము
శైలరాజసుతా తనూభవ సతత కృతము
రామ నామము

దీని అంతంలో —

"దివ్య మంత్రము రాము నామము
భవ్యమంత్రము రాము నామము
సులభగమ్యము రాము నామము
ముక్తిదము రాము నామము
తలపగమ్యము రాము నామము
భుక్తిదము రాము నామము
కడు విచిత్రము రాము నామము
కల్పభూజము రాము నామము"

దీని చిట్టచివర ఫలశ్రుతి చెప్పబడి నృసింహ నామాలలో వలె "...............సింహాగిరి నరహరీ నమో నమో దయానిధీ" అని ముగిస్తుంది.

## 5. రామనామాలు :

ఇది కృష్ణమాచార్యుని రఘుకృతులలో ఐదవది. ఈ సంకీర్తన పాదాలలో "రామా రామా" అని ఆవృత్తి అవుతుంది. ఇందులో క్రమంగా రామావతార విశేషాలు వర్ణించబడ్డాయి. కొన్ని పాదాలలో యతి ప్రాసలు చెల్లుతున్నాయి. ఇది భక్తులు భక్తిపారవశ్యంతో భజన చేసుకొంటూ పాడుకోవడానికి యోగ్యమైన గేయ రచనను పోలివుంది.

ప్రారంభంలో —

"దశరథాత్మజా రామా రామా
ధన్యచరిత్రా రామా రామా
భరతాగ్రజ రామా రామా
పంకజేక్షణా రామా రామా

దండకావీర రామా రామా
తాటకాంతకా రామారామా
చాపఖండన రామా రామా
భూపమండన రామా రామా"

దీని అంతంలో కూడా ఇలాంటి రీతిలో సాగిన పాదాలే వున్నాయి. దీని చిట్ట చివర కూడా సింహగిరి నరహరీ నమో నమో దయానిధీ" అని ముగిస్తుంది.

అన్నమయ్య కీర్తనలలో "రామారామా" అనే పాదాంతావృత్తి కీర్తన, "రామా" అనే పాదాంతావృత్తి కీర్తనలు కనిపిస్తాయి. ఇందులో శ్రీరాముని బాహుబల విక్రమం, సాహస కృత్యాలు వర్ణింపబడ్డాయి.

"ఎంతని మతియింతు రామా రామా
ఇట్టె నీ ప్రతాపము రామా రామా
పంతాన సముద్రము రామా రామా
బంధించ వచ్చునా రామా రామా"

"సౌమిత్రి సహోదర దశరథ రామా
చేముంచి గుత్తిలో వెలసిన రఘురామా

ధరణివంశ తాటకాంతక రామా
నరనాథ కౌసల్యానందన రామా
సిరుల బెండ్లాడిన సీతారామా
గరిమతో సేతువు గట్టిన రామా" (౬-409)

కృష్ణమాచార్యులు తన వచన సంకీర్తనలకు వాడిన భాష స్వాతంత్రమయింది. ఇతడు వ్యాకరణ శాస్త్ర నియమాలకు లొంగని

సజీవ వ్యావహారిక భాషనే ఉపయోగించాడు. భక్తుడైన తనకు కావలసింది భగవదనుగ్రహం, ప్రజా జాగృతి కాబట్టి పండితుల గౌరవాలతో భాషాసూత్రాలతో నిమిత్తంలేకుండా భక్తిపారవశ్యంతో అప్రయత్నంగా దొర్లిన ఆడుతా, పాడుతా, కుమ్మరి సారెవలె తిరుగుతా, మూలుగుతా, లేస్తా, అరుహముగాదు, చదివి నన్నేమి, ఆచరించి నన్నేమి, వచ్చీని, కలిగినివంటి పదాలను తన ఇష్టానుసారం ప్రయోగించాడు.

అన్నమయ్య కూడా ఇలాగే స్వేచ్ఛాయుతమైన వ్యావహారిక భాషనే తన సంకీర్తనలలో ఎక్కువగా ప్రయోగించాడు. ఆశ్చరియం (3-109)

"ఆడుతా బాడుతా నీతో నట్టె
ముద్దుగునుసుతా" (3-390)

"ఏల వచ్చీ యేలపోయీ
నెందుండీ బ్రాణి" (1-299)

"అన్నలంటూ దమ్ములంటూ ఆండ్లంటూ బిడ్డలంటూ" (1-224)

చక్కనుండీనా, బుద్ధివినీనా వంగినా, సోకినా (1-187)

వెఱ్ఱులాల, అరుహముగాదు (2-494(

మొదలైనవి.

ఈ పరిశీలనను బట్టి అన్నమాచార్యుల నియమబద్ధమైన పదకవితలకు కృష్ణమాచార్యుని వచన సంకీర్తనలు కొంతవరకు మార్గదర్శకమని చెప్పవచ్చు. కృష్ణమాచార్యుని వచనాలలో అక్కడక్కడా పల్లవి, చరణాలను పోలిన పాదాలు, యతి, ప్రాస నియమాలు, సూత్రాచ్ఛందస్సులు, రాగ తాళ నియమం, భజన పద్ధతి,

శబ్దాలంకారాలు, వ్యావహారిక భాష మొదలైన అంశాలతో కూడిన సంకీర్తన ప్రక్రియ కృష్ణమాచార్యుని కాలంలో శైశవావస్థలో నుండగా అన్నమయ్య కాలంనాటికి నిండు యౌవన రూపాన్ని సంతరించుకొని నిబంధ పదకవితగా సాహితీలోకంలో సమున్నత స్థానాన్ని ఆక్రమించుకొన్నది.

కృష్ణమాచార్యులు అశాశ్వతమైన, దుఃఖభాజనమైన హేయమైన భౌతిక శరీర సౌఖ్యాలను తృణీకరించి అమూల్యమైన తన జీవిత కాలాన్నంతా సింహాచల నారసింహునికే అంకితం చేశాడు. భక్త్యాత్మకమైన, జ్ఞానదాయకమైన చాతుర్లక్ష సంకీర్తనలను తన స్వామిపై రచించాడు. ఈ మహనీయుని వచన సంకీర్తనలోని విష్ణుభక్తి తత్పరత, ఆచార్య సేవ, వైష్ణవాధిక్యం, కుల నిరసన, భగవద్దాస్యం, వైరాగ్యం, ఏహ్యభావం మొదలైన భావాంశాల ప్రభావంతో పాటు రచనా విధానం భాష మొదలైన వాటి ప్రభావం కూడా అన్నమయ్య సంకీర్తనలపై ప్రస్ఫుటమవుతోంది. కేవలం అన్నమయ్య సంకీర్తనలపైనే కాకుండా కృష్ణమాచార్యుని రచనల ప్రభావం పోతన, ధూర్జటి, శ్రీకృష్ణదేవరాయలు మొదలైన భక్తాగ్రేసరుల కావ్యాలపై కూడా కనిపిస్తుంది. వీటిపై పరిశీలన చేయవలసిన అవసరం వుంది.

**ఉపయుక్త గ్రంథాలు :**


1. తాళ్ళపాక కవుల పదకవితలు భాషా ప్రయోగ విశేషాలు.
వేటూరి ఆనందమూర్తి.

2. అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలు 1, 2, 3 సంపుటాలు
తి. తి. దే. ప్రచురణలు తిరుపతి.


"శ్రీ అన్నమయ్య" 580 వ జయంత్యుత్సవ సంచిక
(అభినయ ఆర్ట్సు అకాడమీ, విశాఖపట్టణం)

# అన్నమయ్య హితబోధ

తాళ్ళపాక అన్నమాచార్యులు 15వ శతాబ్దంలో రాయలసీమ ప్రాంతంలో లక్కమాంబ, నారాయణసూరి అనే పుణ్య దంపతుల నోము పంటగా ప్రభవించిన రత్నదీపం. ఈ తేజోమూర్తి కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీ వేంకటేశ్వరుని ఖడ్గ స్వరూపం. ఈ మహనీయుడు అజ్ఞాన తిమిరంలో అలమటిస్తున్న జనులను ఉద్ధరించి తరింపజేయడానికి సంకీర్తనా రచన ఒక్కటే శరణ్యమని భావించాడు. ఈ భాగవతోత్తముడు ముప్పై రెండువేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనలను శ్రీ వేంకటేశ్వరుని ముద్రాంకితంగా రచించి తరతరాల వారికి అందించిన పుణ్యమూర్తి. తిరుమల తిరుపతి దేవస్థానం వారి భక్తి శ్రద్ధలవల్ల, కృషివల్ల వారి యాజమాన్యంలో నేటికి పద్నాలుగువేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు లభించాయి. ఆది దంపతులు, జగన్మాతా పితరులైన అలమేల్మంగా శ్రీనివాసుల దివ్య శృంగార సంకీర్తనలు. స్వామివారి అనంత కల్యాణ గుణ గానమే అధ్యాత్మ సంకీర్తనలు.

ఈ అధ్యాత్మ సంకీర్తనలలో కేవలం స్వామివారి అవతార విశేషాలు, మహిమలు, వైరాగ్య భక్తితత్వం మొదలైన అంశాలే కాకుండా ప్రజాహిత బోధనాంశాలు కూడా చోటు చేసుకున్నాయి. ప్రజలను భక్తి, నైతిక మార్గాలవైపు నడిపించి మానవ జన్మను ప్రయోజనాత్మకం గావించడమే అన్నమయ్య సంకీర్తనల లక్ష్యం. పద్య సాహిత్యం విద్యావంతులు, పండితులైన వారికే ఉపకరిస్తుంది. ఇది నిశ్చలమైన కాసారపు నీరు వంటిది. పద సాహిత్యం ప్రధానంగా సామాన్య జనుల కోసమే అవతరించింది. ఇది ప్రవాహికమైన నదీ

జలము వంటిది. అన్ని వర్గాల మనుష్యులను జాగృతి చేసే శక్తి, ఆకర్షణ పద సాహిత్యానికే వుంది. ఈ పద సాహిత్య సామ్రాజ్యానికి పట్టభద్రుడైన పద కవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యులు మనకు అనేక రీతులలో భక్తి, జ్ఞానహిత బోధలు చేశాడు.

మానవునికి సంపద ఎక్కువయ్యేసరికి కష్టాలు కూడా హెచ్చు తుంటాయి. అయినా సంపదకోసం మానవుడు పడరాని పాట్లు పడు తుంటాడు. ధనార్జనకోసం ఎన్నో మోసాలు, అన్యాయాలు, అక్రమాలు, హత్యలు, దోపిడీలు మొదలైన హింసాత్మక చర్యలకు పాల్పడుతుంటాడు. కోపతాపాలు ప్రదర్శిస్తూ పరనిందలు చేస్తుంటాడు. దురాశలకు, దుర్వ్యసనాలకు బలి అయిపోతాడు. ఇలాంటి దుర్గుణాలను, దుశ్చేష్టలను వదలి పెట్టినప్పుడే మానవ జీవితం ధన్యమవుతుంది. అదే మానవుని తెలివికి, జ్ఞానానికి నిదర్శనమని అన్నమయ్య హితబోధ చేస్తూ —

"ఎంత విభవము గలిగె నంతయును నాపదని
చింతించినది గదా చెడని జీవనము ॥

చలము గోపంబు దను జంపేటి పగతులని
తెలిసినది యదిగదా తెలివి
తలకొన్న పరనింద తనపాలి మృత్యువని
తొలిఁగినది యదిగదా తుదగన్న ఫలము ॥

మెఱయు విషయములే తపమోహ నున్న పురులుగా
యెఱిఁగినది యదిగదా యెరుక
పఱివోని యాస దను బట్టుకొను భూతమని
వెఱచినది యదిగదా విజ్ఞాన మహిమ ॥

యోనలేని తిరు వేంకటేశుడే దైవమని
విన గలిగినది గదా వీనికి
అనయంబు నతని సేవానందపరులయి
మన గలిగినది గదా మనుజులకు మనికి ॥ (1-181)

అనే కీర్తన రచించాడు.

మన పెద్దలు మనకు ఎప్పటికప్పుడు ఆయా సమయాల్లోనే పనులు చేసుకోవాలని ఆలస్యం చేయకూడదని బుద్ధి చెబుతూ దీపం వుండగనే ఇల్లు చక్కబెట్టుకోవాలని, గాలి ఉన్నప్పుడే తూర్పార పట్టాల'ని, కొన్ని సామెతల ద్వారా విషయం స్పష్టం చేస్తుంటారు. మన అన్నమయ్య కూడా మనిషి అహంకారి గాకముందే, జ్ఞానిగా ఉన్నప్పుడే భగవంతుని మహిమ తెలుసుకోవాలని; వెన్నెల వున్నప్పుడే అల్లోనేరెళ్ళు పాడుకోవాలని, గతంలో ఉన్నట్లు వర్తమానంలో ఉండదని, మానవుడు ఇంద్రియ బాధలనుంచి తప్పించుకోలేకపోయినా అందులోనే ఎలాగైనా భక్తిని సాధించాలని, సంసార జీవితంలోనే పరలోక సౌఖ్యాన్ని కూడా సాధించాలని, భగవంతుని దాసుల ద్వారా గమ్యం తెలుసుకోవాలని చెబుతూ —

"చదువులోనే హరిని జట్టిగొన వలె గాక
మదము గప్పిన మీద మగుడనది గలదా ॥

జడమతికి సహజమే సంసారయాతన యిది
కడు నిందులోఁ బరము గడియించవలె గాక
తొడరి గాలప్పుడు తూర్పెత్తక తాను
విడిచి మరచిన వెనక వెదకితే గలదా ॥

భవబంధునకు విధిపాప పుణ్యాపులంకె
తివిరి యిందునే తెలివి తెలుసుకోవలెఁ గాక

అవల పెన్నలలోన అల్లునేరేళ్ళింతే
నివిరి నిన్నటి వునికి నేఁటికి గలదా ॥

దేహధారికి గలదే తెగని యింద్రియ బాధ
సాహసంబున భక్తి సాధించవలెఁ గాక
యిహాలను శ్రీ వేంకటేశు దాసులవలన
వూహించి గతిగానక వోదిగితే గలదా ॥" (1-449)

అనే కీర్తన రచించాడు.

అన్నమయ్య విశిష్టాద్వైత సిద్ధాంతవాది. ఈ భాగవతోత్తముడు విష్ణువే అధికుడని, తక్కిన దైవాలు ఇతని క్రిందివారేగాని సమానులు కారని "ఎన్నఁగ నొర్గాటంక మింతటా చిల్లినట్లు తోలు బిల్లలు సరిగా చెల్లునా" అంటూ తన కీర్తనలలో నిరూపించాడు. లోకంలో పెఱ్ఱి వాళ్ళు చాలామంది ఉంటారు. అయితే అన్నమయ్య దృష్టిలో మతి స్థిమితంలేక వీధుల్లో తిరిగే వెఱ్ఱివాడు నిజంగా వెఱ్ఱివాడుకాదట. విష్ణు దేవుని దాస్యం చేయక విఱ్ఱవీగే అహంకారియే వెఱ్ఱివాడట. అలాగే శ్రీహరి నామాన్ని మరచిన నీచుడు, విశ్వమంతా విష్ణురూపమే అని భావించనివాడు; లోకాలన్నింటినీ కడుపులో ఉంచుకొని కాపాడు తున్న విష్ణువుకన్నా ఇతరదైవం ఉన్నాడనే దుష్టుడు, తనలోని దైవాన్ని వదలి వృథా ప్రయాసలతో దూర దేశాలు తిరిగేవాడు, సులభమైన శరణాగతి తత్వాన్ని వదలి వ్యయ ప్రయాసలతో కర్మ మార్గాన్ని చేపట్టేమూర్ఖుడు, ఇలాంటివాళ్ళే అసలైన వెఱ్ఱివాళ్ళంటూ తెలియజేసి సులభమైన విష్ణుదాస్యాన్ని, శరణాగతి తత్త్వాన్ని చేపట్టమని బోధచేస్తూ —

"వెఱ్ఱివాఁడు వెఱ్ఱిగాఁడు విష్ణుని దాస్యము లేక
విఱ్ఱవీగే యహంకారి వెఱ్ఱివాఁడు ॥

నాలుకపై శ్రీహరి నామ మిట్టే వుండఁగాను
జోలితే మరచిన నీచుఁడే వెఱ్ఱివాఁడు
ఆలరి యీ జగమెల్లా హరి రూపై వుండఁగాను
వాలి తలపోయ లేనివాఁడు వెఱ్ఱివాఁడు ॥

కూడిమి బ్రహ్మాండాలు కుక్షినున్న హరికంటే
కోరి వేరే కలఁడనే కుమతి వెఱ్ఱివాఁడు
చేరి తన యాత్మలోన శ్రీరమణుఁ డుండఁగాను
దూరమై తిరుగువాఁడే దొడ్డ వెఱ్ఱివాఁడు ॥

సారపు శ్రీ వేంకటేశు శరణాగతి వుండఁగా
సారె గర్వములంటెడి జడుఁడు వెఱ్ఱివాఁడు
చేరువ నాతని ముద్ర చెల్లుబడి నుండఁగా
మోరతోపై వున్నవాఁడే ముందు వెఱ్ఱివాఁడు॥" (1-413)

అనే కీర్తన రచించాడు.

మానవుడు తనకు అన్నీ తెలిసినందుకు జయశీలుడు కావాలట. తాను బ్రతికి వున్నందుకు ఫలం దయ గలిగి వుండాలట. శరీరం వున్నందుకు మేలు చేయాలట. మానవత్వం కలిగినందుకు మంచివాడ గా మెలగాలట. తత్త్వపరుడు కావాలట. కులం వున్నందుకు చదువుకోవాలట. చదువుకున్నందుకు పురుషార్థ సారాన్ని తెలుసుకోవాలట. శాస్త్రార్థాలను గ్రహించినందుకు శ్రీ వేంకటేశ్వరునికి దాసుడు కావాలట. అప్పుడే వీటన్నిటికి ఫలితం వుంటుందని, లేకపోతే ప్రయోజనం లేదని హితబోధ చేస్తూ —

"ఏమిఫలము దానిన్నియును దెలిసినను
సాము చేసిన ఫలము జయశీలుఁడౌట గాక ॥

తాను గలిగిన ఫలము దయ సేయ గలుగుట
మేను గలిగిన ఫలము మేలెల్లగనుట
మానుషము గల ఫలము మంచివాఁడౌట తను
దానె తెలిసిన ఫలము తత్త్వపరుఁడౌట గాక ॥

పదిలమగు కులము గల ఫలము తాఁజదువుట
చదివిన ఫలంబర్థ సారంబు గనుట
పొదలి శాస్త్రార్థంబు పొందగన్న ఫలము నుతి
దలఁక కిటు వేంకటేశు దాసుఁడౌట గాక ॥" (1-236)

అనే కీర్తన రచించాడు.

లోకులు మంచి రాజమార్గాన్ని వదలిపెట్టి అడవులలో పడి పెడదారులు త్రవ్వుకుంటూ, కష్టాలపాలవుతుంటారు. అలాగే మన పూర్వులైన పెద్దలు రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలలో ప్రస్తుతించబడుతున్న విష్ణువును పెద్ద దేవుడుగా గుర్తించగా, నేటి కాలపు పెద్దలు ఈ దైవాన్ని వదలిపెట్టి ఇంక ఎవరో దైవం ఉన్నారని భావించి వెదకుతుంటారని, చివరికి ఎవ్వరికీ కాకుండా పోతున్నారని, ఇతరులు సుదూర దేశాల నుంచి శ్రీ వేంకటేశ్వరుని వెదుకుకుంటూ వచ్చి స్వామిని సేవించి ముక్తులవుతుండగా ఇక్కడివారు అన్నీ తెలిసి కూడా అజ్ఞానంగా మాయలకు లోబడుతున్నారని చెబుతూ —

"పెద్దతెరువు-డఁగాను పెడగంతులు దీసుక
పొద్దువోక యడవులఁ బుంగుడయ్యేరు ॥

తొల్లిటి పెద్దలెంచిరి దొడ్డవాఁడు హరియంటా
అల్లదె భారత రామాయణ భాగవతములు
ఇల్లిదె నేఁటి పెద్దలు యెవ్వరో దైవము లంటా
వెల్లవిరిగా నింకా నెదకేరు ॥

దేవలోకము వారు దేవుడు శ్రీపతియని
భావించి మొరవెట్టి బ్రదికిరి
యీవల నిప్పటివారు ఇందరికి మొరవెట్టి
కావిరి నివ్వనివారు గాక వున్నారు ॥

నానాభూములవారు నమ్మి శ్రీ వేంకటపతిఁ
గానవచ్చి యేఁటి నేఁట ఘనులయ్యారు
యీ నిజ మిక్కడివారు యిన్నియుఁ దెలిసుండియు
మానక చలాలఁ బోయి మాయలఁ బొందేరు ॥"

అనే సంకీర్తన రచించాడు. (౩-౩౭౩)

మానవునికి ఐహికమైన సిరులవల్ల, దురాశవల్ల చింతనలు; స్త్రీలోలత్వంవల్ల వేదనలు; శరీరంవల్ల పాపపు పనులు, మనస్సువల్ల దుర్బుద్ధులు, చదువులవల్ల సందేహాలు ఈ అలజడులే తప్ప నిశ్చలత్వం, జ్ఞానం, సుఖం లేదని, ఈ సత్యాన్ని గ్రహించి వీటిపై మమకారం వదలిపెట్టి శ్రీ వేంకటేశ్వరుని సేవిస్తే భవబంధాలు తొలగి పోతాయని అన్నమయ్య బోధిస్తూ —

"ఎందుఁజూచినఁ దనకు నిన్నియును నిట్లనే
కందులేని సుఖము కలనైన లేదు ॥

సిరులు గలిగిన ఫలము చింతఁ బొరలనె కాని
సొరిది సంతోషమించుకయైన లేదు
తరుణి గల ఫలము వేదనలఁ బొరలుటె కాని
నెరసు లేని సుఖము నిమిషంబు లేదు ॥

తనువు గల ఫలము పాతకము సేయనె కాని
అనువైన పుణ్యంబు అదియింత లేదు

మనసుగల ఫలము దుర్మతి బొందనే కాని
ఘన మనోజ్ఞాన సంగతి కొంత లేదు ॥

చదువు గలిగిన ఫలము సంశయంబే కాని
సదమల జ్ఞాన నిశ్చయమింత లేదు
యిది యెఱిగి తిరువేంకటేశ్వరుని గొలిచినను
బ్రదుకు గలుగును భవము బ్రాణులకు లేదు" (1-340)

అనే కీర్తన రచించాడు.

అన్నమయ్య "సడిబెట్టె కటకటా సంసారము, చూడ జలధిలోపలి యీత సంసారము" అని సంసారంలోని కష్టాలను వ్యక్తం చేశాడు. అయితే మానవుడు చంచల బుద్ధులు వదలితే సంసారమే సుఖవంత మవుతుందని తెలియజేశాడు. అలాగే హరిదాసుడు కాగల్గితే లోక మంతా సుఖమేనని, ఇతరులను వేడుకోకుండా ఉన్నంతలో తృప్తి పొందితేనే సుఖమని, ఇతరులను కోపించకుంటే, జన్మమంతా సుఖమే నని, అలాగే చేయకూడని పనులు చేయకుంటే యీ తనువే సుఖ మని, మానంగా ఉంటే మరులే సుఖమని, దైన్యాన్ని విడిచితే అన్ని రోజులూ సుఖమేనని, ఆశలు వదులుకుంటే ఐహిక జీవితమంతా సుఖమేనని, అన్నిటికన్నా ఆ హరిని తలచి, కొలిచి, దాసులు కాగలి గితే అంతటా అన్నిటా సుఖమేనని చెబుతూ —

"చంచలము మానితేను సంసారమే సుఖము
పొంచి హరిదాసుడైతే భూమెల్లా సుఖము ॥

వారుల వేడకవుంటే వున్నచోనే సుఖము
పరనింద విడిచితే భావమెల్లా సుఖము
సరవిఁ గోపించకుంటే జన్మమెల్లా సుఖమే
హరి గొలిచిన వారి కన్నిటాను సుఖమే ॥

కానిపని సేయకుంటే కాయమే సుఖము
మానమున నుండితేను మరుతైనా సుఖము
దీనత విడిచితేను దినములెల్లా సుఖము
అని హరిఁ దలఁచేతే నంతటా సుఖమే ॥

చలము విడిచితేను సంతతము సుఖము
యిల నాసలుడిగితే నిహమెల్లా సుఖమే
తలఁగి శ్రీ వేంకటేశు దాసులైనవారు వీని
గెలిచి నటించఁగాను కిందా మీఁదా సుఖమే॥"(3-414)

అనే కీర్తనలో స్పష్టం చేశాడు.

'మోక్షం' అంటే పునర్జన్మ రాహిత్యం. జనన మరణ ప్రవాహాన్ని అధిగమించడం. జన్మ కలిగితే కర్మలు, వాటి సుఖ దుఃఖాలు తప్పవు. కాబట్టి సుఖదుఃఖాలకు అతీతమైన, దివ్యానంతమైన మోక్షం కోసం మానవుడు ప్రయత్నించాలి. వున్నతమైన మోక్షం వూరకే దొరకదు. ఎంతో నిగ్రహం కలిగి వుండాలి. పాపకర్మలు వదలాలి. నిశ్చలత్వంతో సంసార సాగరాన్ని తరించాలి. త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణేంద్రియాల సుఖాలను వదలి మంచి బుద్ధి కలిగి హరిపై భక్తి కలిగి ఉండాలి. ఆశలు వదలి గురుసేవ చేసి పునీతుడు కావాలి. ఆపైన శ్రీ వేంకటేశ్వరుని కృప కలిగితే అంతరంగంలోనే మోక్షం ఉందని, అన్నమయ్య మోక్ష లబ్ధికి మానవుడు ఆచరించవలసిన నియమాలను వ్యక్తం చేస్తూ —

"ఊరకే కలుగునా వున్నతపు మోక్షము
శ్రీరమణు కృపచేతఁ జేరు మోక్షము ॥

కలుషముఁ బెడఁబాసి కర్మగంధము గడచి
నులసినప్పుడుగా మరి మోక్షము

చలనమించుక లేక సంసార వారధి దాటి
నిలిచినప్పుడుగా నిజ మోక్షము ॥

పంచేంద్రియాల మీరి భక్తి హరిమీఁదఁబెట్టి
మంచివాఁడైనప్పుడుగా మరి మోక్షము
అంచల యాసలు మాని ఆచార్య సేవ చేసి
మించినప్పుడుగా ఆమీఁది మోక్షము ॥

శాంతమే కూడుగా నుండి సమచిత్తమునఁ బొంది
మంతు కెక్కినప్పుడుగా మరి మోక్షము
అంతట శ్రీ వేంకటేశుఁడాదరించి మన్నించితే
నంతరంగమున నున్న దనాది మోక్షము ॥ (2-505)

అనే కీర్తన రచించాడు.

అన్నమయ్య ప్రజలకు ఒకవైపు హితబోధ చేస్తూ మరొకవైపు ఏది మంచిదో వివేకులైన మీరే విచారించుకోండి అని, ఇతర దైవాలను గూర్చి చేసే పైపై మెరుగుల ప్రచారాలకు లోనుగాకండి అనే హెచ్చరిక చేశాడు. నారదుడు కోరుకుంటే బ్రహ్మపదవి లభిస్తుంది. అయినా దానిని వదలి నారాయణ మంత్రాన్ని చేపట్టి, తనను చూడగానే దేవతలందరూ లేచి మొక్కే పదవిని పొందాడు. తమకున్న అపారమైన జ్ఞానాన్ని, చాకచక్యాన్ని వ్యర్థమైన సంసారం పాలు చేయడంకన్నా హరిదాసులై వైకుంఠాన్ని చేరుకునే మార్గాన్ని సాధించడం ఎంతో మేలు. ఈ సత్యాన్ని శ్రీ వైష్ణవులు పూర్వాచార్యులు వెదకి వెదకి చదివి తెలుసుకున్నారు. కాబట్టి దుర్మార్గుల సాంగత్యంతో కాలం వ్యర్థాపుచ్చక స్వామిని నమ్మి బ్రతకడం మంచిది. బ్రహ్మ మునులు తమకు మంచి బుద్ధులిమ్మని గాయత్రి మంత్రాన్ని జపించడం కూడా ఇందుకోసమే. కాబట్టి శంఖ చక్ర

ముద్రాంకితులై స్వామి సన్నిధిలో ఉంటూ స్వామివారితో సమాన వైభవంగా తుఃతూగండి అని బోధిస్తూ —

"విచారించుకోరో యిది వివేకులాల మెండు
పచారాలు చూచి మీరు భ్రమయకురో ॥

భావింప నారదునికి బ్రహ్మపట్ట మరుదా
వేవేలైనాఁ గొంచెమని విడిచె గాక
దేవతలు తన్నుఁ జూచి దిగ్గనలేచి మొక్కేటి
ఆ వైభవపు పదమందెఁ గాక ॥

మిక్కిలి జ్ఞానము గల్గి మించి తమ నేరుపెల్లా
చిక్కి సంసారము పాలు సేయవలెనా
యెక్కువ హరిదాసుఁడై యిట్లానే వైకుంఠ
మెక్కేడి త్రోవ సాధించే దిది మేలుగాక ॥

ఇదియే శ్రీ వైష్ణవులు యిలఁ బూర్వాచార్యులు
వెదకి చదివి కన్న వివరమెల్లా
తుదమొదలెరఁగని దుష్టుల కతలు మాని
పదిలమై యిట్టే నమ్మి బ్రతుకుటగాక ॥

సంకుఁజక్రములు మాని సమాన భోగముతోడ
అంకెల శ్రీ వేంకటేశు నంపద నుండరో
పొంకపు బుద్ధులిమ్మని పొంచి గాయత్రి జపించి
ఇంక బ్రహ్మవేత్త లెంచే దిందుకేకాక ॥" (3-241)

అనే కీర్తన రచించాడు.

వక్రిమార్గాన్ని అనుసరిస్తున్న వారికి పెద్దలు, మహనీయులు నయాన, భయాన అనేక విధాలుగా నీతి బోధలు హిత

బోధలు చేస్తుంటారు. ఫలితం కనిపించకపోతే 'కుక్కతోక వంకర' అని, 'వేపచేదు', 'చింత పులుపు' పోదని, అలాగే జన్మసిద్ధమైన దుర్గుణాలను పోగొట్టడం అసాధ్యమని అంటుంటారు. ఈ భావాన్నే ఎందరో కవులు తమ తమ కావ్యాలలో ఎన్నో పద్యాలలో అనేక రీతులుగా వ్యక్తం చేశారు. ఎంతో కష్టపడి ఇసుకలో నూనెను తీయవచ్చు. ఎండమావులలో నీరు త్రాగవచ్చు. కానీ మూర్ఖుడైన వాని మనస్సును మాత్రం రంజింప చేయడం అసాధ్యమని భర్తృహరి భావించాడు. అలాగే వేమన కూడా 'ఎంత చదువు చదివి ఎన్ని విన్నను గాని హీనుడవగుణంబు మానలేడని, బొగ్గు పాల కడుగ పోవునా మలినంబని' ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాడు. అన్నమయ్య కూడా వేపచెట్టుకు పాలు పోసి పెంచినా చేదుగానే ఉంటుంది గానీ తీపిగా మారదని, కుక్కతోకకు బద్దను బిగిసికట్టినా చక్కబడదని, గొడ్డలిని నీటిలో ఎంత నానబెట్టినా మెత్తబడదని, ఎంతో ప్రేమతో తేలును తెచ్చి చీరలో పెట్టుకున్నా కుట్టకుండా చక్కగా ఉండదని, అలాగే దుష్ట వర్తనులు కూడా ఎంత చెప్పినా వినరని, చివరికి శ్రీ వేంకటేశ్వరుని కృప కలిగితే ఘోరమైన ఆశ అనే కోర పోదని తెలియజేస్తూ —

"భారమైన వేఁపమాను పాలువోసి పెంచినాను
తీరని చేఁదే కాక తియ్యనుండీనా ॥

పాయఁదీసి కుక్కతోఁక బద్దలు వెట్టి బిగిసి
చాయ కెంత గట్టినాను చక్కనుండీనా
కాయపు వికారమిది కలకాలముఁ జెప్పినా
పోయిన పోకలే కాక బుద్ధి వినీనా ॥

ముంచి ముంచి నీటిలోన మూల నానఁబెట్టుకొన్నా
మించిన గొడ్డలి నేఁడు మెత్తనయ్యీనా
పంచ మహాపాతకాల బారిఁ బడ్డచిత్తమిది
దంచి దంచి చెప్పినాను తాఁకి వంగీనా ॥

కూరిమితోఁ దేలు దెచ్చి కోకలోన బెట్టుకొన్నా
సారె సారెఁ గుట్టు గాక చక్కనుండీనా
వేరు లేని మహిమల వేంకట విభుని కృప
ఘోరమైన ఆస మేలు కోర సోకీనా" (1-287)

అనే కీర్తన రచించాడు.

ఇలాగే దైవమిచ్చిన సహజగుణాలు తప్ప ఎంత కోవిదునికైనా వేదనలు వదలవు. ముష్టిగింజను పంచదారలో అద్దుకొని తిన్నా చేదుపోదు. మాటి మాటికి ఎన్ని చదువులు చదివినా దుష్టుడికి కోపగుణం పోదు. నిప్పును ఒడిలో భద్రంగా దాచుకొన్నా రగిలించక మానదు. మూర్ఖుడు ఎన్ని ఆచారాలు చేసినా దయాగుణం పొందలేడు. అలాగే పందికొక్కును ఇంట్లో తెచ్చి పెట్టుకొంటే గోడలు తవ్వకుండా ఉండదు. అలాగే శ్రీ వేంకటేశ్వరుని సేవించనివాడు సంసారి అవుతాడే తప్ప ధీరుడు కాలేడు అనే భావాలను వ్యక్తం చేస్తూ అన్నమయ్య —

"దైవము పుట్టించినట్టి తన సహజమే కాక
కోవిదునికైనా జాలి గుణమేల విడుచు ॥

అరయఁ బంచదారనద్దుక తినఁ బోతే
చేరరాని ముష్టిగింజ చేఁదేల మాను
సారమైన చదువు సారెసారెఁ జదివినా
గోఁపుదుష్టునికి కోపమేల మాను ॥

నిప్పుదెచ్చి వొడిలోన నియమానఁ బెట్టుకొంటే
ఎప్పుడును రాఁజుఁగాక యిదియేల మాను
ముప్పిరిఁ బాతకుఁడైన మూఢుఁడెన్ని యాచారాలు
తప్పకెంత సేసినాను దయ యేలకలుగు ॥

ఇంటిలోనఁ గొక్కుదెచ్చి యిరవుగఁ బెట్టుకొంటే
దంటయై గోడలు వడఁ దవ్వకేల మాను
గొంటరై శ్రీ వేంకటేశుఁ గొలువకుండిన వాఁడు
తొంటి సంసారవుఁ గాక దొరయేఁటికాను ॥" (1-476)

అనే కీర్తన రచించాడు.

మానవుడు ఎంత చదివి ఎంత విజ్ఞానాన్ని సంపాదించినా సంసార సాగరం నుంచి జన్మను తరింప చేసుకొనే మార్గాన్ని చూడలేకున్నాడు. ఏడు జానల చర్మమంతా రంధ్రాలు కలిగి, చీము కారుతున్నా కూడా రోయకుండా ఇందులోనే బ్రతుకును కోరుకుంటున్నాడే కానీ దీనిని విడిచి వెళ్ళే ఉపాయాన్ని ఆలోచించడు. ఈ మురికి శరీరంలోనే సుఖానికై వెదుకుతాడు కానీ ఈ శరీరం భారం మోయలేనని అనడు. ఈ కన్నులతో దేనినైనా చూచి మోహవికారంతో మలిన చిత్తుడవుతాడే కానీ శ్రీ వేంకటేశ్వరుని చూచి నిర్మలమైన ఆనందపు రుచి చూడలేకున్నాడని అన్నమయ్య విచారిస్తూ —

"ఏఁటి విజ్ఞాన మేఁటి చదువు
గూఁటఁబడి వెడలు గతి గురుతు గన లేఁడు ॥

ఏడు మూడుకల చర్మ మింతయును దూంట్లై
గాడఁబెట్టుచుఁ జీము గారఁ గాను
పాడైన యిందులో బ్రదుకు గోరిఁ బ్రాణి
వీడఁ దన్నుక చనెడి వెరవు గనలేఁడు ॥

కడుపు నిండిన మహాకష్టంబు నలుగడల
వెడలుచును బెనుమురికి వేయఁగాను
యిడుమఁ బొందుచు సుఖంబిందుకే వెదకీని
వోడలు మోవఁగ జీవుఁ డోప ననలేఁడు ॥

పుడకమయమగు కన్నులురికి యేమైనఁ గని
మద వికారము మతికి మరుపఁగాను
యిది యెరిఁగి తిరువేంకటేశుఁ గని జీవుఁడా
సదము లానందంబు చవిగాన లేఁడు" (1-77)

అనే కీర్తన వ్రాశాడు.

మానవుడు సర్వమూ చదివాడు. ఈ నీ సంపద అస్థిరమని, ఈ చేష్టలు అశాశ్వతమని, సంసారం శూన్యమని సుఖాలు దుఃఖాలకు హేతువని, కలిమిలేములు దాటరానివని, పరులకు చేసే మేలు తనదే నని, నోటి రుచులు దుఃఖ భాజనాలని అన్నీ తెలిసికూడా ఈ చదువు మీాది చదువును చదువలేదు. లోభ బుద్ధులను వదలుకోవడం లేదు అని అన్నమయ్య మానవుల అజ్ఞానానికి చింతిస్తూ —

"చదివెఁబో ప్రాణి సకలము యీా
చదువుమీాఁది విద్య చదువఁడాయఁగాని ॥

సిరులు చంచలమని చేఁత ల ధ్రువమని
పరగు సంసారము బయలని
తొలగిన సుఖమెల్ల దుఃఖమూలమని
యెరిఁగి లోభము వీడ నెరఁగఁ డాయఁగాని ॥

యేచిన పరహితమంతయుఁ దమదని
వాచవులిన్నె నెవ్వగలని

యీ చందమున వేంకటేశు చేతలని
చూచి లోభము వీడఁ జూడడాయఁగాని ॥ (1-339)

అనే కీర్తన రచించాడు.

లౌకికమైన సిరులవల్ల మనస్సుకు శాంతి వుండదు. శాశ్వత సుఖాన్ని ఇవ్వగలిగినవే నిజమైన సిరులు. ఈ సిరులు చింతలను వదలుకుంటే వస్తాయి. కానీ మానవుడు ఎంత చదివినా ఏమి విన్నా ఐహిక చింత వదలుకోలేడు. సిరులను పొందలేడు. ఇతర దూషణ లను, కాముక చపలత్వ గుణాలను, పరధనాశను, దుష్టవర్తనను, కరకు మాటలను వీటన్నింటినీ వదలుకొంటే తప్ప సద్గతులు, పర లోక సౌఖ్యం, విజయం చేకూరదని అన్నమయ్య హితబోధ చేస్తూ—

"ఎంత చదివిన నేమి వినిన తన
చింతయేల మాను సిరులేల కలుగు ॥

ఇతర దూషణములు యెడసినఁ గాక
అతి కాముకుఁడుఁగాని యప్పుడుగాక
సుతి చంచలము గొంత మానినఁగాక
గతియేల కలుగు దుర్గతులేల మాను ॥

పరధనముల యాస పాసినఁ గాక
అరిది నిందలు లేని యప్పుడు గాక
విరస వర్తనము విడిచినఁ గాక
పరమేల కలుగు నాపదలేల మాను ॥

వేంకటపతి నాత్మ వెదకినఁ గాక
కింక మనసునఁ దొలఁగినఁ గాక
బొంకు మాటలెడసి పోయినఁ గాక
శంకయేల మాను జయమేల కలుగు ॥" (1-62)

అనే కీర్తన రచించాడు.

"జిహ్వకొక్క రుచి, పుఱ్ఱెకొక్క బుద్ధి" అన్నట్లు లోకంలో వారి వారి బుద్ధికి తగినట్లుగా ఒక్కొక్కరికి ఒక్కొక్క పదార్థం రుచికరమైనట్లే ఒకొక్కరికి ఒక్కొక్కటి దైవం అవుతుంది. అన్నమయ్య ఎవరెవరికి ఏదేది దైవమవుతుందో మానవ మానసిక విశ్లేషణ చేసి నిపుణంగా వ్యక్తం చేశాడు. పుణ్యులకు హరి దైవమట. అలాగే సంసార బద్ధులకు దేహం, కాముకులకు మగువలు, ఏమీ తెలియని వారికి ఇంద్రియాలు, సంసారికి ఊరిదొర, తామసుడికి ధనము, అహంకారులకు తమకు తామే దైవమని, దరిద్రులకు దాతయే దైవమని భావించుకుంటారు. ఇలాంటి పామరుల అజ్ఞాన భ్రమలను పోగొట్ట డానికి సాధ్యం కాదని చెబుతూ —

"అంచిత పుణ్యులకైతే హరి దైవమవుఁ గాక
పంచ మహాపాతకుల భ్రమ నాప వశమా ॥

కానని యజ్ఞానులకు కర్మమే దైవము
ఆనిన బద్ధులకు దేహమే దైవము
మానని కాముకులకు మగువలే దైవము
పానిపట్టి వారి వారి భ్రమ మాన్పవశమా ॥

ఏమీ నెఱఁగని వారి కింద్రియములు దైవము
దోమటి సంసారి కూర దొర దైవము
తామసుల కెల్లాను ధనమే దైవము
పామరుల బట్టినట్టి భ్రమఁ బాపవశమా ॥

ధర నహంకారులకు తాఁదానే దైవము
దరిద్రుడైన వానికి దాత దైవము
యిరవై మాకు శ్రీ వేంకటేశుఁడే దైవము
పరుల ముంచిన యట్టి భ్రమఁ బాప వశమా॥"(1-498)

అనే కీర్తన రచించాడు.

మానవుడు భగవంతుని అనుగ్రహం పొందాలంటే సద్గుణాలను అలవరచుకోవాలి. వాటిని ఆచరించాలి. హింసాత్మకమైన చర్యలను వదలిపెట్టాలి. ఎప్పుడూ సత్యమే పలకాలి. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను అణచుకోవాలి. పంచేంద్రియాల సుఖాలను వదలిపెట్టాలి. ఓర్పు వహించాలి. ఆపైన శ్రీపతికి శరణాగతి చేయాలి. ఇలాంటి వారికి దేవుడే దిక్కుగా ఉంటాడని హితబోధ చేస్తూ —

"ఎఱిఁగిన వారికి హింసలన్నియు మాని
నుఱి సత్యమాడితేను మాధవుఁడే దిక్కు ॥

కలుగుఁ గారణములు కామ క్రోధములు లేఁగ
వెలసిన మాయా వికారమది
కలఁగఁగ వలవదు కర్తలెవ్వరుఁ గారు
తెలిసి వోరుచుకొంటే దేవుఁడే దిక్కు ॥

పదార్థాలెదుట నిలుచుఁ బంచేంద్రియాలు లేఁగ
వెదచల్లేటి మాయా వికారమది
పదరిపై కొనవద్దు పట్టితేఁ బసలేదు
చెదరక నోరిచితే శ్రీపతే దిక్కు ॥

సిరులు తానే వచ్చు చిత్తాన నాసలు లేఁగ
విరసపు మాయా వికారమది
పరగ నలమేల్మంగ పతి శ్రీ వేంకటేశ్వరు
శరణంటే నితని చరణాలే దిక్కు ॥ (2-359)

అనే కీర్తన రచించాడు.

ఎంతటి మహనీయులకైనా కష్టసమయాలలో ఇతరుల హితబోధలు అవసరం. ఆ హితబోధలవల్ల మనస్సుకు ఎంతో

ధైర్యం, ఉత్సాహం, ప్రశాంతత కలుగుతుంది. ఆపైన మళ్ళీ కర్తవ్యోన్ముఖులవుతారు. ఇలాంటి ప్రయోజనం అన్నమయ్య కీర్తనలు పరిపూర్ణంగా కలిగిస్తాయి.

"తత్తిగాని ఈ పాటు దైవమా విచారించవే
కతలాయ చెప్ప నేడు కలికాల మహిమ"

అని అన్నమయ్య తన కాలంనాడే ఈ కలికాలంలో శిష్టులు పడుతున్న కష్టాలను చూచి ఎంతో వ్యథ చెంది, ఈ పాట్లను గూర్చి విచారించమని ఆ దైవాన్ని ప్రార్థించాడు. మరి నేటి కాలంలో కలికాలం చేస్తున్న ప్రళయతాండవ త్రొక్కిళ్ళలో పడిపోయి ఎందరో సాధుజనులు, పేదలు, భక్తులు, ఆర్తులు, అబలలు నలిగిపోతున్నారు. ఇలాంటివారి పాలిట చింతామణి ఆ శ్రీనివాసుడే.

'శ్రీ అన్నమయ్య' 582వ జయంత్యుత్సవ సంచిక
(అభినయ ఆర్ట్స్ అకాడమీ, విశాఖపట్టణం)



# వెంకన్న హృదయంలో అన్నమయ్య

ఎందరో పుణ్యపురుషులు లోక కళ్యాణార్థం అప్పుడప్పుడూ భువి నవతరిస్తుంటారు. వారు ఇహపర సౌఖ్యసాధనకు నిత్యసత్యమైన సులభతరమైన భక్తి, మార్గాన్ని చూపిస్తూ తమ హితైకకార్యాల చేత మానవాళిని తరింపచేస్తూంటారు. అట్టివారిలో ప్రాతఃస్మరణీయుడు మన తాళ్ళపాక అన్నమయ్య. ఇతని ఆపాత మధురమైన హరినామ సంకీర్తనల గాన లహరి ఆంధ్రదేశమంతటా వెల్లివిరిసింది. ఆ లహరిలో అద్భుత తరంగాలైన 'అదివో అల్లదివో హరివాసము' 'చందమామ రావో జాబిల్లి రావో' 'జో అచ్యుతానంద జో జో ముకుంద' 'బ్రహ్మ కడిగిన పాదము' 'తందనాన ఆహి, తందనాన' వంటి ప్రసిద్ధమైన పాటలు విననివారుండరు. ఇలా పండిత పామర జనరంజకంగా సంకీర్తనలు రచించి వాటి ద్వారా వైష్ణవ మత భక్తి సిద్ధాంతాలను, భగవంతుని అవతార విశేషాలను నిత్య జీవితానికి ఉపయుక్తమయ్యే ఎన్నో హితబోధలను మన గుండె గూడుల్లో గుబాళింపజేసిన అమృత ప్రాయుడైన అన్నమయ్య దివ్యావతరణను గూర్చి తెలుసుకోవడం సంగీత సాహిత్య రసికుల కెంతైనా అవసరం.

ఆంధ్ర వాగ్గేయకారుల్లో (వాక్కును, గేయాన్ని రెండింటిని చేయగల్గినవారని అర్థం. అంటే తాము రచనలు చేసి సంగీతాన్ని కూర్చుకొని పాడగల్గినవారు) సుప్రసిద్ధుడైన అన్నమయ్య జన్మస్థలం నేటి కడపజిల్లా రాజంపేట తాలూకాలోని 'తాళ్ళపాక' అనే గ్రామం. క్రీ. శ. 1408 క్రోధి సంవత్సరం వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు విశాఖ నక్షత్రంలో అన్నమయ్య జన్మించాడు. అన్నమయ్య (శ్రీ) వేంకటేశ్వరుని వరప్రసాది కాబట్టి చిన్ననాటి నుండికూడా "ఇది తిరుమలప్ప

ప్రసాదమని చెప్పుకుంటే ఉగ్గుపాలైనా త్రాగేవాడు కాడు. ఇతనికి ఐదేండ్లు నిండగనే ఉపనయనం చేసి విద్యాభ్యాసానికై గురుదగ్గర చేర్చారు. అది కేవలం శాస్త్రమర్యాదగానే సాగింది. దైవానుగ్రహం వల్ల అన్నమయ్యకు సర్వవిద్యలూ కరతలామలకం అయ్యాయి. అతడు ఆడిందే ఆట పాడిందే పాట. ఇతడు మంచి ప్రాయంలో ఉన్నప్పుడే వాల్మీకి రామాయణాన్ని సంకీర్తనాత్మకంగా వెలయించాడు. ఇతని సంకీర్తనాసుమాల సౌరభం నలుదిక్కులా ప్రసరించింది. ఇతని హరిభక్తిని, సంకీర్తన రచనాశక్తిని, గాన రక్తిని గమనించి ఇతడు తుంబురుడో లేక నారదుడో అని ప్రజలు కీర్తింప సాగారు. ఆ వార్తలు విన్న ఆనాటి ప్రభువైన సాళువ నరసింగరాయలు అన్నమయ్యను తన ఆస్థానానికి పిలిపించి ఒక పాట పాడమన్నాడు. అన్నమయ్య రసరాగాలు పుట్టిపడేలాగా.

"ఏమొకో చిగురు టధరమున యెడ నెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు గదా"

కలికి చకోరాక్షికిc కడకన్నులు కెంపై తోచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన యాకొన చూపులు
నిలువున పెరుకగ నంటిన నెత్తురు కాదుకదా"

అని స్వామివారిపై శృంగార సంకీర్తన పాడి వినిపించాడు.

ప్రభువు ఆ పాటకు తన్మయుడై ఆ పాటలోని శృంగార భావ వైచిత్రి కాళిదాసాది ప్రముఖ కవుల రచనల్లో కూడా చూడలేమని శ్లాఘించాడు. ధన కనక వస్తు ఆడంబరాదులిచ్చి ఘనంగా సత్కరించాడు. అలాంటి పాటను తన మీద కూడా వ్రాసి పాడమని కోరాడు. వెంటనే అన్నమయ్య హరి హరి! అని చెవులు మూసుకొని

"నరహరి కీర్తన నానిన జిహ్వా నరుల నుతింపగ నోపదు జిహ్వా" అని ప్రభువు కోరికను తిరస్కరించాడు. రాజు మండిపడి అన్నమయ్యకు "మూరు రాయరగండ' అనే సంకెలను వేయించి కారాగారంలో బంధించాడు. అప్పుడు అన్నమయ్య ప్రస్తోదుసిలా :

"ఆకటి వేళల నలపైన వేళను
తేకువ శ్రీహరి నామమె దిక్కు మరిలేదు"

సంకెలఁబెట్టిన వేళ చంపఁబిలిచిన వేళ
అంకిలిగానప్పుల వారాగిన వేళ
వేంకటేశు నామమే విడిపించ గతిగాక
మంకు బుద్ధి బొరలిన మరిలేదు తెఱగు"

అని స్వామివారిని కీర్తించడంతో సంకెల వీడి క్రిందపడింది. భటుల ద్వారా ఈ వార్తను విన్నరాజు మరింతగా ఆగ్రహించి అన్నమయ్యకు తన సమక్షంలోనే మళ్ళీ సంకెల వేయించాడు. అన్నమయ్య మునుపటి లాగే స్వామిని ప్రార్థించి బంధవిముక్తుడయ్యాడు. రాజు తన పొరపాటును గ్రహించి అన్నమయ్య పాదాలపై బడి శరణు కోరాడు.

దివ్య తేజో విరాజితుడైన అన్నమయ్య వృద్ధుడై తిరుమలలో ఉన్నప్పుడు కన్నడ వాగ్గేయకారుడైన పురందరదాసు అతన్ని దర్శించడానికి వచ్చాడు. పురందరదాసు అన్నమయ్యను సాక్షాత్తు విష్ణువుగా భావించి కీర్తించాడు. అలాగే అన్నమయ్య కూడా పురందరదాసును విఠ్ఠలునిగా దలచుకొని శ్లాఘించాడు.

అన్నమయ్య తిరుమల తిరుపతిలోని దేవళ్ళనేకాక అహోబలం, ఉదయగిరి, ఊటుకూరు, ఒంటిమిట్ట, కంచి, కదిరి, కలశాపురం, గండవరం, తిరుపట్ల, మంగాపురం మొదలైన ప్రసిద్ధ పుణ్యక్షేత్రాల్ని

సందర్శించి ఆయా క్షేత్రాల్లోని దైవాల్ని కీర్తిస్తూ తన భార్యలైన అక్కలమ్మ, తిరుమలాంబలతో జీవిత శేషాన్ని గడిపాడు స్వామి వారి ఆదేశానుసారం తన జీవితకాలంలో ముప్పైరెండు వేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనల్ని రచించి స్వామివారి చరణాంబుజాలకు అంకితమిస్తూ;

"దాఁచుకో నీ పాదాలకు తగ నేజేసిన పూజలివి
పూఁచి నీ కీరితి రూప పుష్పము లివి యయ్యా

ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండారాన దాఁచి ఉండనీ
.................................
................................. ॥

నా నాలికపై నుండ నానా సంకీర్తనలు
పూనినాచే నిన్ను బొగడించితివి
వేనామాల వెన్నుడా వినుతించ నెంతవాడ
కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేనయ్యా"

అని స్వామికి విన్నవించి ప్రార్థించడంలో అతని నిర్వికార ప్రవృత్తి తెలుస్తోంది. అన్నమయ్య కేవలం సంకీర్తనలే కాకుండా శృంగార మంజరి, పన్నెండు శతకాలు, సంస్కృత వేంకటాచల మహాత్మ్యం, సంకీర్తన లక్షణం, ద్విపద రామాయణం మొదలైన గ్రంథాల్ని రచించాడు. వీటన్నిటినీ తన కుమారుడైన పెదతిరుమలాచార్యుడు రాగిరేకులపై చెక్కించి దేవాలయ ప్రాంగణంలో భూ నిక్షిప్తం చేశాడు. ఆ రాగిరేకుల్ని తిరుమల తిరుపతి దేవస్థానంవారు యాభై సంవత్సరాల క్రితమే వెలికి తీసి వాటిని శుభ్రపరచి అందు లోని సంకీర్తనల్ని పుస్తకాల కెక్కించారు. ప్రస్తుతం అన్నమయ్య

కృతుల్లో పద్నాలుగువేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు, శృంగార మంజరి, అలమేలు మంగమ్మపై వేంకటేశ్వర మకుటంతో వ్రాసిన ఒక్క శతకం మాత్రమే లభించాయి. ఇలా బాల్యమాదిగా మహా భక్తుడై వైష్ణవ మతభక్తితత్వాన్ని, భగవంతుని దివ్యావతార లీలల్ని కీర్తించి. ఆడి, పాడి తన్మయుడై ఆబాల గోపాలాన్ని మురిపింప జేశాడు. ఇతని తరువాత ప్రఖ్యాత వాగ్గేయకారులైన క్షేత్రయ్య, రామదాసు, త్యాగరాజు వంటి మహనీయులకు మార్గదర్శకుడయ్యాడు. ఈ పావన చరితుని జీవిత యశోకాంతిరేఖలు క్రీ. శ. 1503 దుందుభి సంవత్సరం ఫాల్గుణ బహుళ ద్వాదశి తిథి యందు శ్రీ వేంకటేశ్వర స్వామివారి హృదయకమలంలో లీన మయ్యాయి.

'ఆంధ్రప్రభ' దినపత్రిక (4-5-86), 'కోస్తావాణి' (6-4-88)



# కొలలనిదొపరికి గొబ్బిళ్ళో
# యదుకులమున స్వామికిని గొబ్బిళ్ళో

గొబ్బి పాటల్ని సంక్రాంతి పండుగ సమయంలో ఆడపిల్లలు వర్తులాకారంలో తిరుగుతూ, చప్పట్లు తట్టుతూ పాడుతారు. ఈ పండుగ మార్గశిర పుష్యమాసాల్లో వస్తుంది. సంక్రాంతి అంటే 'చేరడం' అని అర్థం. సూర్యుడు నెలకొక్కసారి ఒక్కొక్క రాశిని చేరుతాడు. దీన్నే సంక్రాంతి సంక్రమణం, సంక్రాంతి పండుగ అంటారు.

ఈ పండుగ తెలుగు స్త్రీలకు ముఖ్యంగా అరమరలు లేని అమాయకపు పల్లె పడుచులకు అత్యంత ప్రీతికరమైన, ఆనందదాయకమైన పండుగ. ఉన్నవారు, లేనివారు అనే భేదం లేకుండా అందరూ కలిసి మెలసి వుండి వారి వారి శక్తి కొలది ఈ పండుగను జరుపుకుంటారు. స్త్రీలు ఉదయాన్నే లేచి ఇల్లూ వాకిళ్ళూ శుభ్రం చేసి కళాపీలు చల్లి అందాలు పొంగే రంగవల్లులు తీర్చి గొబ్బి ముద్దలు పెడతారు. పనులన్నీ పూర్తి అయ్యాక తలంటి స్నానాలు చేసి క్రొత్తబట్టలు ధరిస్తారు. రకరకాల పిండివంటలు చేస్తారు. భూత భవిష్యత్ బాధలన్నీ మరచి హాయిగా కాలం గడుపుతారు. ఊరూరా గొబ్బి తట్టే ముక్కుపచ్చలారని చిన్నిపాపల జట్టులతో, ఒయ్యారం మొలికించే అందాల కన్నెపిల్లల జట్టులతో, పౌరుషత్వం వుట్టిపడే యువతుల జట్టులతో పల్లెసీమలన్నీ పూచిన సంపెంగ పుష్పాల్లా కళకళలాడుతూ ధవళకాంతులు చిందిస్తుంటాయి.

సాధారణంగా యీ గొబ్బి పాటల్ని ఒక్కో ప్రాంతంలో ఒక్కో విధంగా పాడతారు. రాయలసీమ ప్రాంతంలో —

"గొబ్బియళ్ళో గొబ్బియని పాడరమ్మ
కంచి వరదరాజునే గొబ్బియళ్ళో"

అనే తీరుగా వుంటే, తెలంగాణా ప్రాంతంలో

"సుబ్బి గొబ్బెమ్మా సుఖములియ్యావే,
మొగలి పువ్వంటి మొగుణ్ణియ్యవే
చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యవే
తామర పువ్వంటి తమ్ముణ్ణియ్యవే"

అని సాగుతుంది.

పల్లెప్రజలు పాడుకొనే ఇలాంటి పాటల్ని ప్రముఖ వాగ్గేయకారులు కూడా కీర్తనలుగా వ్రాశారు. పల్లీయులకు ఎలాంటి భాష ఇష్టమో, ఎలాంటి గేయాలు ఇష్టమో బాగా ఆలోచించి ఆ తీరులో తాము చెప్పదలచిన భగవంతుని అవతార విశేషాల్ని, వేదాంత సారాన్ని చెప్పారు. దాని మూలాన అలాంటి గేయాలు బాగా ప్రసిద్ధమయ్యాయి. కన్నడ హరిదాస సాహిత్యంలో ప్రసిద్ధులైన శ్రీ వాదిరాజ తీర్థులవారు ఒక గొబ్బి పాటలో మహావిష్ణువును చతుర్వింశతి (ఇరవై నాలుగు) నామాలతో కీర్తించారు. వాటికున్న అర్థాల్ని కూడా విశదీకరించారు.

"గుబ్బియాళో గోవింద గోవింద
గోవింద గోవిందా నెందు నెనయినో గుబ్బియాళో
కేశవన్న నెనదరె క్లేశ పరిహారవూ గుబ్బియాళో
నారాయణధ్యాన నింద నరక భయవిల్లనో గుబ్బియాళో"

ఇలాగే తెలుగు వాగ్గేయకారులలో సుప్రసిద్ధుడు ప్రథముడు అయిన తాళ్ళపాక అన్నమయ్య కూడా సామాన్య ప్రజా హృదయ రంజనం కోసం ఒక గొబ్బి పాటను గానం చేశారు.

"కొలని దోపరికి గొబ్బిళ్లో యదు
కులము స్వామికిని గొబ్బిళ్లో॥

కొండ గొడుగుగా గోవులఁగాచిన
కొండొక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యుల కెల్లను తల
గుండు గండనికి గొబ్బిళ్లో॥

పాప విధుల శిశుపాలుని తిట్ల
కోపగానికిని గొబ్బిళ్లో
యేపునఁ గంసుని యిడుమల బెట్టిన
గోప బాలునికి గొబ్బిళ్లో॥

దండివైరులను తరిమిన దనుజుల
గుండె దిగులునకు గొబ్బిళ్లో
వెండి పైడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో॥"

ఈ గొబ్బి పాటలో కొలని దొంగ, యదుకుల స్వామి అయిన శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని గొడుగుగా పట్టి గోవుల్ని సంరక్షించడం, రాక్షసుల్ని సంహరించడం, శిశుపాలుని, కంసుని అంతమొందించడం మొదలైన సాహసాల్ని వివరించి చివరకు ఆ శ్రీకృష్ణభగవానుడే ఈ యుగంలో వేంకటగిరిపై వేంకటేశ్వరుడుగా వెలసిన తీరును ఈ గేయ రీతిలో ఎల్లరకూ అర్థమయ్యే సులభమైన పదజాలంతో అన్నమయ్య కీర్తించాడు.

'ఆంధ్రజ్యోతి' దినపత్రిక (15-1-1987)



# అన్నమయ్య భక్తి బోధ

"మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి" అని శంకరాచార్యుల వారన్నట్లు మోక్షసాధన మార్గాల్లో 'భక్తి శ్రేష్ఠ'మయింది, సులభమయింది. ఈ సకల చరాచర సృష్టికి కారణభూతుడైన భగవంతునియందు అనురక్తి కలిగి వుండడమే భక్తి, భగవంతునియందు ప్రీతి కలిగిన మానవుడు తోటి మానవులకు సహాయపడుతూ ప్రశాంతంగా ఐహిక జీవనం కొనసాగిస్తాడు. భక్తిలేని మానవుడు పాపభీతిలేక ఎన్నో వితండవాదాలు చేస్తూ పాపకృత్యాలకు పాల్పడుతుంటాడు. ఉపకారం చేసినవారికి అపకారం తలపెడుతూ తిన్న ఇంటికి వాసాలు లెక్కపెడుతుంటాడు. మానవుడుగా తన కర్తవ్యాన్ని మరచి 'తాచెడ్డకోతి వనమెల్ల చెఱచు' అన్నట్లు సమాజాన్ని కూడా క్షోభ పెడుతుంటాడు. కాలం గడిచేసరికి ఇలాంటివారు తామరతంపరలుగా పెరిగిపోతుంటారు. లోకమంతా అధర్మభూయిష్ఠమయినపుడు భగవంతుడు సాధుజనులను రక్షించడంకోసం, దుష్టులను శిక్షించడంకోసం భూమిపై అవతరిస్తుంటాడు. తాను అవతరించడానికి ముందు లోకులకు హితబోధ చేసి వారిని భక్తిజ్ఞానులుగా తీర్చిదిద్దడం కోసం భగవంతుడు తన అంశలో మహాభక్తులను ఉద్భవింప జేస్తుంటారు. ఇలా దైవాంశసంభూతుడైన పరమభక్తుడే మన అన్నమయ్య.

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహం వలన 1408, క్రోధినామ సం॥ వైశాఖశుద్ధ పూర్ణిమనాడు లక్కమాంబా నారాయణసూరి అనే పుణ్యదంపతులకు కడపజిల్లా రాజంపేట తాలూకాలోని తాళ్ళపాక అనే గ్రామంలో జన్మించారు. ఇతడు కారణ

జన్మించాడు కాబట్టి బాల్యంనుంచీ మహాభక్తుడయి కీర్తనలు వ్రాయడం ప్రారంభించాడు ఇతడు శ్రీ వేంకటేశ్వరుని ముద్రాంకితంగా అలమేల్మంగా శ్రీ వేంకటేశ్వరుల పైన ౩౨ వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలను రచించాడు.

అన్నమయ్య భాగవతంలో చెప్పబడిన నవవిధ భక్తిమార్గాలకు సంబంధించిన కీర్తనలను అనేకం రచించాడు. దివ్యదంపతులు, మాతా పితరులైన అలమేల్మంగా వేంకటేశ్వరుల అందచందాలను, గుణ విశేషాలను, మహాత్మ్యాన్ని, వారి ప్రణయలీలలను, ప్రణయ కోపాన్ని, చెలికత్తెల ఊరడింపును ఎంతో సరసంగా, మనోహరంగా శృంగార సంకీర్తనల్లో వర్ణించాడు. మహావిష్ణువు అవతార లీలలు మహిమలు ఉత్సవాలు మొదలగునవే కాకుండా భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయాలు, సాంసారిక నిరసన మొదలయిన అంశాలను తెలియజేశాడు. అన్నమయ్య భక్తిభావాన్ని శృంగారంగా చెప్పినా, వైరాగ్యంగా చెప్పినా అందులోని సారాంశం మాత్రం ఒక్కటే. మానవులు కేవలం ఐహిక సంబంధమయిన విషయలంపటాలతో, దుర్గుణాలతో తమ మానవ జన్మలను వృథా చేసుకోకుండ ఈ కలియుగంలో ప్రత్యక్షదైవమయిన శ్రీ వేంకటేశ్వరుని ఆరాధించి, ధ్యానించి తరించేటట్లు చేయడమే ఆ భక్తుని ముఖ్యోద్దేశం

మన వేదాలు, వేదాంగాలు. పురాణాలు, రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలన్నీ మహావిష్ణువును కీర్తిస్తాయి. మహావిష్ణువును నమ్మి చెడినవాడు ఏ గ్రంథాలలోను కనబడడు. భగవంతుని నమ్మని దురాత్ములు, అవినీతిపరులయిన మానవులు ఎన్నటికీ బంధవిముక్తులు కాలేరు. లోకంలో భగవంతునితో ముడిపడి చేయని ఏపని అయినా శాశ్వతంగా నిల్చి ఉండదు. శాశ్వత సౌఖ్యం ఇవ్వదు. ఈ విషయాన్నే అన్నమయ్య "ఏ పురాణముల నెంత విదకినా శ్రీపతి దాసులు చెడ రెన్నడును" అని ఒక అధ్యాత్మ సంకీర్తనలో తెలియజేశాడు.

కృత, త్రేత, ద్వాపర యుగాల్లో మహర్షులు, రాజులు, సామాన్యులు భగవంతుని అనుగ్రహంకోసం జపతపాలు, యజ్ఞయాగాదులు, అర్చనలు వ్రతాలు మొదలైనవి నిర్వహించేవారు. ఇవి చాలా ప్రయాసతో చేయవలసినవి. కానీ వీటన్నిటికన్నా సులభమయిన మార్గం భక్తులు తమ హృదయాలను భగవంతునకు అర్పించి నిర్మల చిత్తులయి హరి నామస్మరణ చేయడమే. దీనికి మించిన మార్గం వేరే లేదు. ఒక్క భగవన్నామంలోనే శాస్త్రోక్తమైన అన్ని మంత్రాలు ఇమిడి ఉన్నవి. కాబట్టి హరినామమంత్రమును పఠిస్తే చాలు, సర్వ బాధలూ సమసిపోతాయి. సులభంగా దైవానుగ్రహమునకు పాత్రం అయి ముక్తి పొందవచ్చు. ఇలా భగవంతుని నామమంత్రాన్ని పఠించి యేయే భక్తులు ముక్తి పొందారో అన్నమయ్య 'అన్ని మంత్రములు యిందే ఆవహించెను,'వెన్నతో మాకు వచ్చె వేంకటేశు మంత్రము' అనే ఒక అధ్యాత్మ సంకీర్తనలో లోకానికి తెలియజేశాడు.

అన్నమయ్య సులభమయిన భక్తిమార్గాన్ని బోధించి ఉద్ధరించడం కోసం అవతరించిన పుణ్యచరితుడు. ఇతడు రచించిన వేలాది సంకీర్తనలు సర్వకాల సర్వావస్థలయందలి మానవులందరికీ ఎంతో ఉపయోగకరమయినవి. అక్షర జ్ఞానం ఉన్న ప్రతి మానవుడూ చదివి అర్థం చేసుకోగలిగినంత సులభమయిన వ్యావహారిక భాషను అన్నమయ్య ఉపయోగించాడు. అక్షర జ్ఞానం లేని మానవుడయినా సంకీర్తన తన చెవిని పడగానే పులకాంకితుడయి అందలి విషయానికి స్పందించగలడు. ఇలా సర్వజనానురంజక మయిన ఆహ్లాదకమయిన సులభ రీతిలో అన్నమయ్య భక్తిబోధ చేశాడు.

'ఈ రోజు' దినపత్రిక, కాకినాడ, 27-11-1988.

# గృహస్థులకు అన్నమయ్య హితోక్తులు

కారణ జన్ములైన మహనీయులలో తాళ్ళపాక అన్నమా చార్యులు ఒకరు. ఇతడు శ్రీ వేంకటేశ్వర స్వామి పంచాయుధా లలో ఒకటైన నందకాంశంలో జన్మించారు కాబట్టి పుట్టినది మొదలు అతని మాటలలో, చేష్టలలో సామాన్య శిశువులలో కనిపించని విలక్షణాలు కనిపించేవి. ఇది తిరుమలప్ప ప్రసాదమని చెప్పకపోతే ఉగ్గుపాలైనా త్రాగేవాడు కాడు. ఇలాంటి ప్రత్యేకతలు కారణ జన్ములైన వారిలో కనిపించడం సహజమేకదా. కొందరు మహ నీయులు జన్మాంతం బ్రహ్మచారులుగానే ఉండి మహాభక్తులై భగవంతుని సేవించి లోకాన్ని తరింపజేసి ముక్తి పొందుతారు. మరి కొందరు మహానుభావులు "నళినీదళ గత బిందువు" వలె సంసార బంధాలలో ఉంటూనే భగవంతుని స్మరించి, సేవించి, భక్తిగ్రంథాలు రచించి తరిస్తారు.

అన్నమాచార్యులవారు బాల్యంనుంచీ కూడా సాంసారిక విషయాలమీద విముఖత చూపేవాడు. కాని —

"ప్రారబ్ధ మనుభవింపక
తీరదు లోకంబులందు దివిజులకైనన్
నీరజ నాభునకైనను
భూరమణులకైనగాని భువిలో రామా"

అని రామ శతకాన్ని రచించిన బుర్రి చెంగారెడ్డిగారు అన్నట్లు ఎలాంటి వారికైనా కర్మబంధం తప్పదుకదా. అందుకే అన్నమా చార్యులవారు ఇద్దరు సతీమణులకు భర్త అయ్యారు. అయినా భార్యల

వల్ల ఇతడు ఎలాంటి బాధలూ అనుభవించినట్లు కనిపించదు. అన్నమాచార్యులు లౌకికంగా సంసారి. ఆయన హృదయం మాత్రం వెంకన్న పైన లగ్నమై ఉండేది. అయినా సంసారిగా మారిన తర్వాత ఎలాంటి వారికైనా తిప్పలు తప్పవుకదా. అలాగే అన్నమయ్యకూడా సామాన్య మానవునిలాగా ఎన్నో కష్టాలు, అవమానాలు, బాధలు అనుభంచాడు. ఐశ్వర్యంలేని సామాన్య సంసారులకు కష్ట సమయాలలో అప్పులు చేయక తప్పదు. అలాగే అన్నమయ్యకుకూడా అప్పులు బాధలు తప్పలేదు. అందుకే అన్నమయ్య —

"అంకిలిగా నప్పుల వారరాగిన వేళ శ్రీ
వేంకటేశు నామమే విడిపించ గతిగాక
మంకుబుద్ధి బొరలిన మరి లేదు తెరగు"

అని తన బాధను తన ప్రియదైవమైన స్వామివారికే నివేదించుకొన్నాడు.

అన్నమాచార్యులు తాను శ్రీ వేంకటేశ్వరునిపై వ్రాసిన వేలాది సంకీర్తనలలో మానవాళికి ఉపయుక్తమయ్యే ఎన్నో అమూల్యమైన అంశాలు చోటు చేసుకొన్నాయి. వాటిని తరచి చూచి చదువుకోగలిగితే మన జన్మలు సార్థకంఅయినట్లే. మానవుడు ఇహలోకంలో నిర్భయంగా, నిర్మలంగా బ్రతకాలంటే ధర్మమార్గంలో బ్రతుకు కొనసాగించాలి. నిందాయుతమైన అధర్మ మార్గంలో పయనించి బ్రతుకును ఆటోపం చేసుకొని కష్టాలకు లోను కాకుండా ఉన్నంతలోనే తృప్తి పడుతూ బ్రతుకును కొనసాగించడం సుఖప్రదమని అన్నమాచార్యులు ఇలా హితబోధ చేశాడు.

"అప్పులేని సంసారమైన పాటే చాలు
తప్పులేని జీతమొక్క తారమైనఁజాలు

కంతలేని గుడి సొక్కా గంపంతయినఁజాలు
చింతలేని యంబలొక్క చేరేఁడే చాలు
జంతగాని తరుణి యే జాతైన నదె చాలు
వింతలేని సంపదొక్క వీసమే చాలు

తిట్టులేని బ్రదుకొక్క దినమైన నదె చాలు
ముట్టులేని కూడొక్క ముద్దేఁడే చాలు
గుట్టుచెడి మనుకంటె కొంచెపు మేలైనఁ జాలు
వట్టిజాతిఁ బడుటకంటె వచ్చినంతే చాలు

లంపట పడని మేలు లవలేశమే చాలు
రొంపికంబమౌ కంటె రోయుటే చాలు
రంపపుఁ గోరికకంటె రతి వేంకటపతి
పంపున నాతనిఁ జేరే భావమే చాలు"

ఈ భావాన్నే "కుమతి" శతకాన్ని రచించిన శ్రీ కొలకుల నారాయణరావుగారు కూడా —

"హెచ్చు ఋణంబులు చేయుచు
ముచ్చట పరమాన్నము తిని పొంగుట కంటెన్
వచ్చిన జీతము తోడం
పచ్చడి యన్నంబు దినుటె భాగ్యము కుమతీ"

అని అప్పచేసి ఆటోపంగా బ్రతికేవాళ్ళకు హితబోధ చేశాడు. తప్పుత్రోవలో ఆర్జించిన అధిక ధనంకన్నా సన్మార్గంలో ఆర్జించిన స్వంత ధనమే చాలు. ఈ భావాన్ని ఆది శంకరాచార్యులవారు —

"మూఢ జహీహి ధనాగమ తృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాం

యల్లభసే నిజ కర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తం"

ధనార్జన దాహాన్ని విడిచిపెట్టి మనస్సులో మంచి బుద్ధిని ప్రవేశపెట్టాలి.

ధరబద్ధంగా సంపాదించిన ధనంతోనే తృప్తి పడవలసిందని బోధించాడు.

ఎండా వానల వల్ల కష్టనష్టాలు కలిగే పెద్ద మేడలకన్నా చక్కగా కప్పబడిన ఇల్లు చిన్న గుడిసె అయినా మేలు. అనేక బాధలకు గురియై తినే పంచ పక్వ పరమాన్నాలకన్నా ఎలాంటి చింతలు లేని అంబలి చేరడైనా అదే మేలు. ఈ భావాన్నే వేమనకూడా —

"గంగిగోవుపాలు గరిటెడైనను చాలు
కడవడైన నేమి ఖరము పాలు
భక్తి కలుగు కూడు పట్టెడైనను చాలు"

అని హితబోధ చేశాడు.

దూర్తురాలైన కులస్త్రీకన్నా గుణవతి అయిన స్త్రీ తక్కువ జాతి అయినా మేలే. మను స్మృతిలో కూడా 'స్త్రీరత్నం దుష్కులాదపి' అని చెప్పబడింది.

ఇతరుల నిందలకు పాల్పడి గుట్టు చెడి వంద సంవత్సరాలు బ్రతకడం కన్నా ఎలాంటి నిందలు పడకుండా ఒక్కరోజు బ్రతికినా మేలే. ఈ భావమే సుభాషిత రత్నావళిలోని ఈ క్రింది పద్యంలో కానవస్తుంది.

"పౌరుష జ్ఞాన కీర్తులఁ బరగెనేని
వాని బ్రతుకు ఒక పూటయైన చాలు

ఉదర పోషణ మాత్రికై వుర్వి మీద
కాకి చిరకాలమున్న ఏ కార్యమగును"

కేవలం పొట్టకూటికోసం నూరేండ్లు బ్రతకడంకన్నా అభిమానంగా, జ్ఞానవంతంగా త్యాగశీలంతో ఒక్కపూట బ్రతికితే చాలని ఇందులోని నైతికాంశం.

పెద్దపెద్ద ఆశలతో ప్రాకులాడి పదిమందిలో గుట్టు చెడి బ్రతకడం కన్నా ఏ కొద్దిపాటి మేలు గలిగినా దానితోనే తృప్తి చెందడం ఉత్తమం. అనేక విషయాలకు - చిక్కుపడి బాధ పడడం కన్నా ఏ లంపటం లేకుండా సుఖంగా ఉండటం మేలు. బురదలోని స్తంభంలాగా సంసారంలో బ్రతకడంకన్నా సుఖాలకు దూరంగా ఉండడం మేలు.

రంపంలాంటి క్లిష్టతరమైన కోరికలను పెంచుకొని బాధపడడం కన్నా "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అని శ్రీకృష్ణ పరమాత్మ వాక్కు ప్రకారంగా భగవంతుని చేరడానికి ప్రయత్నించే మానవుని పుట్టుకే ఉత్కృష్టమని అన్నమాచార్యులవారు లోకానికి హితబోధ చేశాడు.

"కోస్తావాణి" (17-6-1988)



# తాళ్ళపాక అన్నమాచార్యుల భక్తితత్త్వం

భక్తి అంటే భగవంతునిపై అనురక్తి, లౌకిక విషయాలపై విరక్తి అని అర్థం. ఈ భక్తిని గూర్చి శ్రీ శంకరాచార్యులవారు

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ
స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే"

అని "వివేక చూడామణి" అనే గ్రంథంలో నిర్వచించాడు. ముక్తిని కోరేవారికి భక్తి ప్రధాన నిరపాయ సాధన మార్గం. అశాశ్వతమైన పరమాత్మయందు మనస్సు నిలిపి సోపానక్రమంలో పరమాత్మయందే తన్మయత్వం పొందటం భక్తి లక్ష్యం. అన్నమాచార్యులు తన అధ్యాత్మ సంకీర్తనలలో తాత్త్విక దృష్టితో వైరాగ్య చింతనతో స్వామివారి దివ్యావతార లీలలను, మహిమలను, విపులంగా వర్ణించాడు.

భవరోగవైద్యుడవు పాటించ నీవొకడవే
నవనీతచోర నమోనమో"

ఇట్టి కీర్తనలలో భక్తి భావం, వైరాగ్య భావం వ్యక్తమౌతుంది. పోతన తన భాగవత గ్రంథంలో శ్రవణం, కీర్తనం, స్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం అని తొమ్మిది రకాలైన భక్తిమార్గాలను పేర్కొన్నారు. భక్తుడు ఈ భక్తి మార్గాలలో తనకు ఇష్టం వచ్చిన భక్తి మార్గాన్ని ఎన్నుకోవచ్చు. అయితే ఏ మార్గాన్ని అనుసరించినా మనఃపూర్వకంగా చేయాలి. అప్పుడే భగవంతునికి భక్తునిపై ప్రీతి కలుగుతుంది. అన్నమాచార్యులు వీటిలో సంకీర్తనా మార్గాన్ని చేపట్టాడు. అయినా, ఇతని అధ్యాత్మ, శృంగార సంకీర్తనలలో ఈ

తొమ్మిది భక్తిమార్గాలు కనిపిస్తాయి. ఇవే కాకుండా వాత్సల్య భక్తిపూరితమైన కీర్తనలు కూడా ఉన్నాయి.

"ఉగ్గుపెట్టరో వోయమ్మా చె
యుగ్గిడె శిశు వో యమ్మ
కడుపులోని లోకమ్ములు గదలీ
నొడలూఁచకురే ఓయమ్మ"

అనే కీర్తనలో ఒక కన్న తల్లి ఉత్కంఠ కనిపిస్తుంది. ఇందులో ఉన్న తల్లి యశోద. బాలుడు చిన్నికృష్ణుడు. తల్లి తన శిశువు పట్ల గోపకాంతలు చేయవలసిన కర్తవ్యాన్ని తెలియచేస్తూ వారి తొందర పాటును హెచ్చరించి జాగ్రత్త చెప్పడంలో వాత్సల్య భక్తి వ్యక్త మవుతుంది. ఇక్కడ తల్లి అయిన యశోద ఎవరో కాదు మన అన్నమయ్యే. శిశువు సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మ.

అన్నమాచార్యుల సంకీర్తనలలో అధ్యాత్మ సంకీర్తనల కన్నా శృంగార సంకీర్తనలే ఎక్కువ. ఇవి స్థూల దృష్టికి నాయికా నాయక అంగాంగ సౌందర్య వర్ణనలతో, సరస సల్లాపాలతో కూడి నవిగా కనిపించినా, సూక్ష్మంగా పరిశీలిస్తే మాత్రం అందులో ఏదో ఒక పరతత్త్వం గోచరిస్తుంది. తాత్త్విక దృష్టితో భగవంతుని గూర్చి తెలుసుకోకుండా కేవలం విషయలంపటులై మానవ జన్మను నిస్సారం చేసుకుంటున్న మానవాళి మనసులను భగవంతునివైపు ఆకర్షింప చేయడానికి అన్నమాచార్యులు శృంగార సంకీర్తనలను రచించినట్లు తెలుస్తుంది. ఇందులో కనిపించే నాయికానాయకులు దివ్య దంపతు లైన అలమేల్మంగా వేంకటేశ్వరులే.

అధ్యాత్మ సంకీర్తనలలో అన్నమయ్య భగవంతునికి తానొక బంటుగా, సఖుడుగా మారి ఆరాధించి ఆత్మ నివేదన చేసుకొన్నాడు.

వైష్ణవ సంప్రదాయ ప్రకారం భగవంతుడు ఒక్కడే పురుషుడు. తక్కిన లోకమంతా స్త్రీ మయమే. ఈ ప్రకారంగా శృంగార సంకీర్తనలలో అన్నమయ్య మనకు కొన్నిచోట్ల చెలికత్తెగా సాక్షాత్కరిస్తాడు.

"ఏల రాఁడమ్మ యింతిరో వాఁ
డేల రాఁడమ్మ నన్నేలినవాఁడు ॥

పచ్చని పులుగుల బండిమీఁద నుండు
పచ్చవింటి పిన్న బాలుని తండ్రి
పచ్చని చాయలఁ బాయని బంగారు
పచ్చడము గట్టిన బాగైనవాఁడు"

అనే కీర్తనలో నాయిక ప్రియుని కోసం నిరీక్షిస్తున్నట్లు తెలుస్తుంది. తన ప్రియుడు మన్మథుని కన్న తండ్రి. సౌందర్యంలో మన్మథునే మించినవాడు. బంగారు వన్నె గల పట్టు పీతాంబరం కట్టిన శృంగారరాయుడైన శ్రీ వేంకటేశ్వరుని రాక కోసం తపిస్తూ నాయిక చెలికత్తెతో తన విరహబాధను వ్యక్తం చేసుకోవడం ఇందులో కనిపిస్తుంది. ఈ కీర్తనలోని నాయిక అన్నమయ్యే. నాయకుడు శ్రీ వేంకటేశ్వరుడు. ఇది అన్నమయ్య యొక్క నాయికా నాయక తాదాత్మ్యం ఇలాంటి భక్తిని శృంగార భక్తి లేదా మధుర భక్తి అంటారు.

తమిళ భక్తులైన ఆళ్వారులలో ఈ భక్తి తత్త్వమే అధికం. రాధ, గోపికలు ఈ మార్గంలోనే మోక్షసిద్ధి పొందారు. అలాగే గోదాదేవి శ్రీరంగనాథునికి ఆత్మార్పణం చేసుకొన్నది. అన్నమాచార్యులు కూడా ఈ భక్తుల మార్గంలోనే విశ్వనాయికా నాయకులైన పద్మావతీ శ్రీనివాసులను యోగ వియోగ భేదాలతో సర్వ శృంగార ప్రక్రియలతో కీర్తించి ఆరాధించాడు.

'కోస్తావాణి' (17-4-1988)

# అన్నమయ్య పదాలలో దశావతార వర్ణన

పదకవితాపితామహుని వేలాది సంకీర్తనలలో దశావతార వర్ణన ఒకటి.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥"

అనే భగవద్గీతా శ్లోకాన్ని బట్టి మహావిష్ణువు దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించడం కోసం ఆయా యుగాలలో భూమిపై అవతరిస్తుంటాడు. భగవంతుడు ఎన్నో సార్లు భూమిపై అవతరించాడు. వాటిలో ప్రధానంగా పేర్కొనదగిన అవతారాలు పది.

"మత్స్య కూర్మో వరాహశ్చ నారసింహోథ వామనః
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిరేవచ"

అనే శ్లోకంలో అవతారాల పేర్లు కనిపిస్తాయి. ఈ దశావతారాలలో కొంతమంది బలరామావతారానికి బదులు కృష్ణావతారాన్ని చేరుస్తారు. కొంతమంది బలరామ కృష్ణులలో ఏ ఒక్కరిని స్వీకరించినా ఇద్దరినీ స్వీకరించినట్లే అని భావించారు.

తెలుగు సాహిత్యంలో పదకవితకు పట్టం కట్టిన ఆద్యుడు అన్నమయ్య. పూర్వకాలంలో పదకవితకు, పదకవులకు, తత్త్వాలకు, తత్త్వకవులకు రాజాస్థానాలలోగానీ, పండితులదగ్గర గానీ ఆదరణా, గౌరవం, విలువ ఉండేది కాదు. విద్వత్కవులు, పదకవితలను పామరులు, స్త్రీలు పాడుకొనే క్షుద్ర రచనలుగా భావించి బూతు పదాలతో తిట్టేవారు. అందువల్ల అనాటి కవులు పదకవితా రచనకు పూనుకోలేదు. అయినా ఆయా విద్వత్కవుల గ్రంథాలలో పదాల

ప్రసక్తి మాత్రం ఉన్నది. ఏ వాఙ్మయంలోనైనా పద్యకవితకన్నా ముందుగా ప్రజల హృదయాలనుంచి పదకవిత పుట్టి పెరుగుతుంది. అసలు పదకవితనుంచే పద్యకవిత ప్రారంభం కాగలదు. కాబట్టి పద్య కవుల గ్రంథాలలో పదాల ప్రసక్తి కనిపించడం ఆశ్చర్యం కాదు. మొదటిసారిగా నన్నయభారతం-ఆదిపర్వం-అష్టమాశ్వాసంలో "నాగీ గీతాల ప్రసక్తి కనిపిస్తుంది. అర్జునుని తీర్థయాత్రా ఘట్టంలో ఉలూచి అర్జునుని చూచి మోహించే సందర్భంలో —

"నీ గుణములు తొల్లియు నా
గీ గీతములందు విని తగిలి యపుడు మనో
రాగమున చూడగంటిని
భాగీరథియందు నిన్ను పరహిత చరితా!"

అని అర్జునునితో పలుకుతుంది. నన్నయ దేశిచ్ఛందస్సులయిన తరువోజ, మధ్యాక్కరలను కూడా వాడాడు.

నన్నయ తరువాత 12 వ శతాబ్దంలో నన్నెచోడుడు తన కుమార సంభవకావ్యంలో 'ఉవిదలింపుగ పాడే ఊయలపాటలు, శబర కామినులు రోకట గొనిదంచు పాటలు, కల్లుదించువారి గొడుగీతాల ప్రసక్తులు కనిపిస్తాయి. ఇతని తర్వాత పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర - పర్వత ప్రకరణంలో శివరాత్రి రోజు శివ భక్తులు శ్రీశైలాన్ని అధిరోహిస్తూ - తుమ్మెదపదాలు, ప్రభాత పదాలు, పర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేసు, గొబ్బి, వెన్నెల, సంజవర్ణన, గణవర్ణన, పదాలను పాడినట్లు తెలుస్తుంది. పాల్కురికి సోమన వాడిన ఛందస్సుకూడా దేశి అయిన ద్విపద. 13 వ శతాబ్దంలో కృష్ణమాచార్యులు సింహగిరి నరహరి వచనాలను, రామనామ నృసింహ నామాలను రచించి ప్రచారం చేశాడు. నాచన సోమ

నాథుని వసంతవిలాసంలోనిదిగా శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఒక జాజరపాటను ఉత్తర హరివంశ పీఠికలో ఉదహరించారు.

"వీణాగానము వెన్నెల తేట
రాణ మీరగా రమణుల పాట
ప్రాణమైన విన బ్రాహ్మణు పీట
జాణలు మెత్తురు జాజర పాట"

నేటికి ఈ పాటఒక్కటే లక్ష్యోదాహరణగా మిగిలింది. నాచన సోమన తర్వాత శ్రీనాథుడు భీమఖండంలో 'కీర్తింతురెదాని కీర్తి గాంధర్వమున గంధర్వులు యక్షగాన సరణి' అంటూ చర్చరీ ప్రసక్తి చేశాడు. తరువాత పోతన భాగవతం దశమస్కంధంలో బాలునంకించి పాడే పాటలు, గోవిందుమీది పాటల ప్రసక్తులు కనిపిస్తాయి.

ఈ విధంగా పూర్వకవుల గ్రంథాలలో ప్రసక్తిమాత్రంగా ఉన్న పదాలకు అన్నమయ్య ఒక రూపకల్పన చేసి స్థిరత్వం చేకూర్చి పదకవితకు సాహిత్యంలో సమున్నత స్థానాన్ని చేకూర్చాడు. పదం అంటే ఇలా ఉండాలి అని లక్షణాన్ని నిర్దేశించే 'సంకీర్తన లక్షణం' అనే గ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. పదానికి ప్రధానంగా రెండు పాదాల పల్లవి, నాలుగేసి పాదాల మూడు చరణాలుండాలి. యతులు, ప్రాసలు, మాత్రాగణాలు, మార్గదేశి తాళాలు, ముద్రి అనే ఐదు ప్రధాన అంగాలుండాలి. ఈ లక్షణాల కనుగుణంగా లక్ష్యాలను (పదాలు) కూడా రచించి సాహిత్యరంగంలో పదకవితా పితామహుడుగా అన్నమయ్య ప్రఖ్యాతి గాంచాడు.

పదకవితా పితామహుడైన అన్నమయ్య మహావిష్ణువు దశావతారాలను అచ్చమైన దేశీయ పదజాలంతో పొడుపుకథల రూపంలో వర్ణించాడు. పొడుపుకథలను ప్రహేళికలంటారు. తెలుగు ప్రజల

దేశీయతను ప్రతిబింబింపజేసేవి పొడుపుకథలు. ఇవి ఆబాలగోపాలాన్ని ఉత్తేజపరచి, ఆలోచనాశక్తిని పెంపొందింపజేస్తాయి. ఇవి ప్రశ్నల రూపంలో పరస్పర విరుద్ధంగా కనిపిస్తాయి. ఇందులో ఆయా ప్రాణుల లేదా వ్యక్తుల స్వభావాన్ని భిన్న రీతులలో చెప్పడం కనిపిస్తుంది. సాధారణంగా గ్రామీణ ప్రజలలో ఈ పొడుపుకథలు ప్రచారంలో ఉంటాయి.

"అడవిలో పుట్టింది అడవిలో పెరిగింది మాయింటి కొచ్చింది పైతెక్కలాడింది" — కవ్వము.

"నల్లబండకింద నలుగురు దొంగలు" — గేదె.

అన్నమయ్య ఇలాంటి పొడుపుకథల రూపంలో దశావతార కీర్తన వ్రాశాడు.

"ఎవ్వఁడో కాని యెరఁగరాదు కడు
దవ్వులనే వుండు తలఁపులో నుండు ॥పల్లవి॥

ఎడయవు తన రెక్కలెగిసి పోఁలేడు
కడు దాగుఁగాని దొంగయుఁ గాఁడు
వడిఁగిందుపడును సేవకుఁడును గాఁడు
వెడఁగు గోళ్లు వెంచు విటుఁడును గాఁడు ॥ఎవ్వ॥

మిగులాఁ బొట్టివాఁడు మింటికినిఁ బొడవు
జగడాలు తపసి వేషములును
మగువకై పోరాడు మరి విరక్తుఁడును
తగుఁగాపుఁ బనులు నెంతయుఁ దెల్లఁ దనము ॥ఎవ్వ॥

తరుణుల వలపించు తగిలిపై కొనఁడు
తురగముఁదోలు రాతునుఁగాఁడు

తిరు వేంకటాద్రిపైఁ దిరుగు నెప్పుడును
పరమ మూర్తియై పరుగు నీ ఘనుఁడు ॥ఎవ్వ॥

భగవంతుడు సర్వాంతర్యామి. ఎందెందు వెదకి చూచిన అందందే ఉంటాడు. కానీ వాడే ఏడని, ఇలా ఉంటాడని తెలుసుకోవడం అసాధ్యమని అన్నమయ్య పల్లవిలో చెప్పాడు. కానీ చివరి రెండు పాదాలలో వేంకటాద్రిపై వెలసిన ఘనుడే వాడనీ, వాడే యుగాలలో అవతారాలెత్తినవాడని వర్ణించాడు.

ఈ కీర్తనలో మొదట మత్స్యావతారం వర్ణించబడింది. చేపకు రెక్కలుంటాయి. అంతమాత్రం చేత అది పక్షిలా ఎగురలేదని సారాంశం. దొంగకు దాగుకొనే లక్షణం ఉంటుంది. తాబేలు కూడా తన తలను లోపలికి ముడుచుకొని దాక్కొంటుంది. అంతమాత్రం చేత అది దొంగకాదు అనడంలో కూర్మావతారం వర్ణించబడింది. సేవకుడు ఎప్పుడూ తలవంచుకొని వస్తువులను మోస్తూ ఉంటాడు. అలాగే విష్ణువు వరాహావతారంలో తనతలనువంచిభూమినిమోశాడు. అంతమాత్రానికి అతడు సేవకుడు కాదని అర్థం. నరసింహావతారంలో నరసింహస్వామి గోళ్ళు పెంచింది హిరణ్యకశిపుని చీల్చడానికేగానీ విటుడుగా మాత్రం కాదు. వామనుడు మొదట పొట్టిగా ఉండి తర్వాత ఇంతింతై వటుడింతయై' అన్నట్లుగా బ్రహ్మాండాన్నంతా ఆవరించాడు. ఈ విషయం రెండవ చరణంలో వర్ణించాడు. తాపసులకు శాంతం ముఖ్యలక్షణం. కానీ ఇక్కడ వేషం తపసి. కానీ ముఁకోపి. క్షత్రియులతో జగడాలాడిన పరశురామావతారం ఇక్కడ వర్ణితం. సీతకోసం రావణునితో పోరాడి జయించిన తర్వాత మరలా లోకాపవాదంవల్ల సీతను త్యజించిన రామావతారం స్పష్టమవుతుంది. కాపులు నాగేలు ధరించి సేద్యం చేసి నల్లబడి ఉంటారు. కానీ నాగేలును ధరించిన వాడైనా తెల్లగా ఉన్నాడనడంలో బలరాముడని

తెలుస్తుంది. త్రిపురాసుర స్త్రీలను వలపించి తానుమాత్రం వారి వలలో తగలని బుద్ధావతారం స్పష్టం చేయబడింది. గుర్రంమీద సంచరిస్తాడు కానీ గుర్రపు కాతు కాదనడంలో కల్క్యవతారం వ్యక్తమవుతుంది. అన్నమయ్య గ్రామీణ వాతావరణాన్ని, వారి చమత్కారాలను, వినోదాలను క్షుణ్ణంగా గ్రహించిన తపస్వి కాబట్టి భగవంతుని లీలలను ఏయే రూపాలలో చెబితే వారి మనస్సుకు హత్తుకుంటుందో ఆయా రూపాలలో కీర్తనలను రచించాడు.

అన్నమయ్య వివిధ జానపద గేయ రీతుల్ని రచించినట్టే అనేక వర్ణనాత్మక గేయాలను కూడా రచించాడు.

"తానే కాకెవ్వరు మాకు దాతయు దైవము తన
లోనఁబెట్టుకొని మాకు లోనైన వాఁడు" ॥పల్లవి॥

చదివించి, కూడువెట్టి, జారకుండ నిల్లుగట్టి,
బెదురులేని బుద్ధి పిన్ననాఁడే చెప్పి,
ఎదిరినడిగి, ద్రవ్యమిది గొమ్మనుచు నిచ్చి,
పదిలమై తమ్ముఁ బాలించువాఁడు ॥తానే॥

మోహ వియోగమ్ము, మోహానురాగమ్ము
దేహ విభాగంబు దెలిపిన కలికి
ఐహికమున వేంకటాధీశుఁడై సర్వ
దేహ రక్షకుఁడై తిరుగాడుచున్నాఁడు ॥తానే॥

లోకంలోని దాతలు యాచకుల సర్వకోరికలను తీర్చలేరు. ఒక్క భగవంతుడే సర్వ కోరికలను తీర్చగలడు. అన్నమయ్య తనను సర్వవేళలా రక్షించేదాత, దైవం శ్రీ వేంకటేశ్వరుడేనని, ఆ దేవుడు లోకానికి చేసిన దానాలను గూర్చి పై కీర్తనలో అలతి అలతి పదాలతో చమత్కరించాడు.

'చదివించి' అనే పదంలో సోమకాసురుని సంహరించి, వేద సంరక్షణం చేసి లోకులందరు చదివేటట్లు చేసిన మత్స్యావతారం సూచించబడింది. 'కూడుపెట్టి' అనే పదంలో క్షీరసాగర మథనానికి కవ్వంగా మంథరాద్రి ఉపయోగపడింది. విష్ణువు కూర్మావతారమెత్తి దాన్ని ధరించగా, దేవదానవులు వాసుకిని తాడుగా చేసుకొని మథించగా అమృతం వెలువడింది. ఆ అమృతాన్ని దేవతలు ఆరగించారని సూక్ష్మార్థం. 'జారకుండ నిల్లుగట్టి' అనడంలో అందరికీ నివాస యోగ్యమైన భూమిని హిరణ్యాక్షుడు చాపగాచుట్టి నీటిలో పడవేశాడు. అప్పుడు విష్ణువు వరాహావతారమెత్తి భూమినిరక్షించి అందరికీ నివాసయోగ్యంగా చేశాడని అర్థం. 'ఎదురులేని బుద్ధి విన్నా నంచే చెప్పి' అనడంలో నృసింహావతారమెత్తి చిన్నవాడైన ప్రహ్లాదుని బెదురు పోగొట్టాడని అర్థం. 'ఎదిరినడిగి' అనేపదంలో తాను ఇతరులకు ఇవ్వడమే కాకుండా ఇతరుల కోసం ఇంకొకరిని "దేహి" అని అడగడమే ఎదిరినడగడం అనడానికి అర్థం. దేవతలను రక్షించడం కోసం బలి చక్రవర్తిని మూడడుగుల నేలను యాచించిన వామనావతారం ప్రసక్తి ఇది.

'ద్రవ్యమిది గొమ్మనుచు నిచ్చి' అనడంలో భూమండలమంతా జయించి క్షత్రియులపై పగతీర్చుకొన్నవాడు పరశురాముడు. ఆ ద్రవ్యాన్ని కశ్యపునికి దానంగా ఇచ్చాడు. 'పదిలమై తమ్మ బాలించువాడు' అనడంలో త్రేతాయుగంలో శ్రీరాముడు పదిలంగా రాజ్యమేలి రామరాజ్యమని కీర్తి కెక్కాడు. "మోహ వియోగమ్ము" అనడంలో తనకు అష్ట మహిళలు, పదారు వేల గోపికలు ఉన్నా తాను మాత్రం అంటీ అంటనట్లు ఉండిన కృష్ణావతారం అభివర్ణితం. 'మోహానురాగమ్ము' అనే పదం త్రిపురాసురుల భార్యల పాతివ్రత్య భంగం చేసిన బుద్ధావతారం గాథను తెలియజేస్తుంది. చివరగా వీరు

పుణ్యులు, వీరు పాపులు అని దేహ విభాగం చేసిన కల్క్యవతారం గురించి చెప్పడం జరిగింది.

ఈ కీర్తనలో ఇంకొక విశేషం కూడా చెప్పకోవచ్చు. విద్యాదానం, అన్నదానం, గృహదానం, అభయప్రదానం, ఇతరులకై తాను యాచన చేయడం, దానమివ్వడం, రక్షించడం, తన ప్రేమను త్యాగం చేయడం, పరుల బాధలను తొలగించడం వంటి గుణాలను అన్నమయ్య తెలుపుతూ ఇవి ఉత్తమ దాతకు ఉండవలసిన లక్షణాలుగా పేర్కొన్నాడు.

అన్నమయ్య తన ప్రియమైన వేంకటేశ్వరుని "భూతము"గా వర్ణించి దశావతారాలను చొప్పించిన తీరు చాలా అద్భుతంగా ఉంది. సాధారణంగా భూతాలు లోకంలో ఎవరినో కొందరిని పట్టడం సహజం. కానీ తిరుమలపై వెంచేసియున్న శ్రీ వేంకటేశ్వరుడనే నల్లని భూతం భూమిమీదనున్న అందరినీ ఆవహించిందని యుక్తిగా వర్ణించాడు.

"పుడమి నిందరిఁ బట్టె భూతము కడుఁ
పొడవైన నల్లని భూతము ॥

కినిసివోడ మింగెడి భూతము
పునుక వీఁపు పెద్ద భూతము
కనలికవియు చీఁకటి భూతము
పునుగు సోమపు మోము భూతము ॥పుడ॥

చేటకాళ్ళ మించిన భూతము
పోటుదారుల పెద్దభూతము
గాఁటపు జడల బింకపు భూతము
జూటరి నల్ల ముసుగు భూతము ॥పుడ॥

కెలసి బిత్తలే తిరిగేటి భూతము
పొలుపుదంట్ల పెద్ద భూతము
బలువు వేంకట గిరిపయి భూతము
పలుగు మీంది మహాభూతము ॥పుష॥

పెద్ద వోడలను మ్రింగడం, ఎముకలను మోయడం, కోపముతో పైనబడడం, భీతిగొల్పు ముఖం కలిగి ఉండడం, పెద్ద చేటకాళ్ళు కలిగివుండడం, ధీరులైన మగవారిని కూడా పట్టడం, బిరుసైన జడలు కలిగి ఉండడం, నల్లని ముసుగుతో నుండడం, బిత్తలతో తిరగడం. పెద్ద పెద్ద అంగలతో నడవడం, పరుగెత్తడం వంటివి భూత లక్షణాలు. ఈ లక్షణాలలో అవతారాలను ఇలా నిర్దేశించాడు. ఓడలు సముద్రాల లోనే ఉంటాయి. ఆ ఓడలను మింగే భూతం అనడం మత్స్యావతార సూచకం. ఎముకను వీపున మోసున్న భూతంగా చెప్పినందువల్ల వీపున చిప్పగల కూర్మావతారం తెలుస్తుంది. చీకట్లో సంచరించే నల్లని భూతం కోపంతో మీదికి కవ్వించినట్లుగా దూకుతుంది. అంటే హిరణ్యాక్షుడు భూమిని నీళ్ళలో త్రోసినప్పుడు లోకం చీకటై పోయింది. ఆ చీకట్లోనే మహావిష్ణువు కోపోద్రిక్తుడై నల్లని వరహావతార మెత్తాడని తెలుస్తుంది. విష్ణువు భయంకరమైన ముఖం గల నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని చంపి ప్రహ్లాదుని రక్షించాడు. దీని తర్వాత తన కాళ్ళతో బ్రహ్మాండాన్నంతా ఆవరించిన వామనావతారాన్ని వర్ణించాడు అన్నమయ్య.

ఆ తరువాత వరుసగా ఘోరులైన క్షత్రియులను వధించిన పరశురామావతారం, పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేసిన రామావతారం, నీలి వస్త్రాన్ని ధరించే బలరామావతారం, త్రిపురాసురుల భార్యలను మోసం చేసిన బుద్ధావతారం, గుర్రాన్నెక్కి పెద్ద అంగలతో దాటిపోయే కల్క్యవతారం వర్ణించడం జరిగింది.

ఇలా భూత లక్షణాలద్వారా మహావిష్ణువు యొక్క దశావతారాలను వర్ణిస్తూ ఇన్ని రకాల ఆకారాలను చూపించిన ఈ మహాభూతం తిరుమలగిరిపై విడిదిచేసి ఉన్నదని, అది పక్షిపై ఎక్కి తిరుగుతుందని అన్నమయ్య వివరించాడు.

భగవంతుడు ఆయా అవతారాలలో చేసిన సాహస కార్యాలను స్పష్టం చేస్తూ వ్రాసిన దశావతార కీర్తన కూడా కనిపిస్తుంది. శ్రీ వేంకటేశ్వరుని వరదహస్తాన్ని కీర్తిస్తూ దశావతారాలను వర్ణించిన తీరు తెన్నులు —

"ఇందరికి నభయంబు లిచ్చుఁ జేయి
కందువగు మంచి బంగారు చేయి ॥పల్లవి॥

వెలలేని వేదములు వెదకి తెచ్చిన చేయి
చిలుకు గుబ్బలి కిందఁ జేర్చు చేయి
కలికియగు భూకాంతఁ గాఁగిలించిన చేయి
వలనైన కొనగోళ్ళ వాఁడి చేయి ॥ఇంద॥

తనివోక బలిచేత దానమడిగిన చేయి
వొనరంగ భూదాన మొసఁగు చేయి
మొనసి జలనిధి యమ్ము మొనకుఁ దెచ్చిన చేయి
ఎనయ నాఁగేలు ధరియించు చేయి ॥ఇంద॥

పురసతుల మానములు పొల్ల సేసిన చేయి
తురగంబుఁబరపెడి దొడ్డ చేయి
తిరువేంకటాచలాధీశుఁడై మోక్షంబు
తెరువు ప్రాణులకెల్లఁ దెలిపెడి చేయి ॥ఇంద॥

ఈ కీర్తనలో వరుసగా మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, బలరామ, బుద్ధ, కల్కి అవతారాల వర్ణన జరిగింది. అన్నమయ్య పదాలను సాహిత్య జిజ్ఞాసువులు తరచి చూచే కొలదీ కొత్త కొత్త అంశాలు వింతవింతలుగా కనిపిస్తూనే ఉంటాయి. అవి —

"ఎంతమాత్రమున నెవ్వరు దలచిన
నంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడ
బిండంతే నిప్పటి యన్నట్లు"

అని ఒక భక్తి కీర్తనలో అన్నమయ్య చెప్పినట్లు ఎవరెవరికి ఎంతెంత శక్తి ఉన్నదో ఎవరెవరికి ఏయే అంశాల మీద అభిరుచి ఉన్నదో అవి అంతంతమాత్రంగా దర్శనమిస్తుంటాయి. అయితే పద సాహిత్యం జిజ్ఞాసువులకు, ముఖ్యంగా అన్నమయ్య పద సాహిత్య ప్రియులకు భక్తి, నీతి, సంగీతప్రీతి, నియమస్థితి ఉండితీరాలి. ఇంతకు భిన్నమైన వ్యక్తులకు, వితండవాదులకు అన్నమయ్య పదసాహిత్యం పాత సాహిత్యంగా, సమాజానికి పనికిరాని సాహిత్యంగానే కనిపిస్తుంది. అన్నమయ్య స్పృశించినన్ని మానవ జీవితాంశాలు, శాస్త్రవిషయాలు, అధ్యాత్మ విషయాలు, శృంగారవిషయాలు, ప్రబంధ వర్ణనలు అన్నమయ్యకు పూర్వాపర కవుల గ్రంథాలలో ఎక్కడా కనిపించవు. తెలుగు సాహిత్యమంతా అన్నమయ్య సాహిత్యంలో ఏకదేశంగా ఉంటుంది. అందుకే ప్రఖ్యాత పండిత పరిశోధకులు, తెలుగు శాఖాధ్యక్షులు, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ

మూజీ ఉపాధ్యక్షులు ఆచార్య జి.యన్. రెడ్డిగారు అన్నమయ్య సాహిత్యాన్ని గురించి ప్రశంసిస్తూ "అన్నమయ్య సాహిత్యం తెలుగు సాహిత్యంలో అద్వితీయం. భారతీయ సాహిత్యంలో అపురూపం. ప్రపంచ సాహిత్యంలో అత్యద్భుతం" అని ప్రశంసించారు. అన్నమయ్య సాహిత్యం అంతటి ఉదాత్తమయింది.

'కోస్తావాణి' (ది. 30-9-88, 1-10-88) రాజమహేంద్రవరం.



# అన్నమయ్య సాహిత్యంలో సామెతలు

సామెతలు ప్రజల జీవితానుభవంనుండి ఆశువుగా ఉద్భవిస్తాయి. ఇవి ఒకరి అనుభవంలో పుట్టి ఇంకొకరికి పాఠంగా మిగిలిపోతాయి. శూరుల పుట్టుక, నదుల పుట్టుక, ఏరుల పుట్టుక తెలుసుకోవడం ఎంత అసాధ్యమో, సామెతల పుట్టుకను గూర్చి తెలుసుకోవడం అంత అసాధ్యం. ఇవి ఆయా సందర్భాలలో సూక్తులుగా, దృష్టాంతాలుగా, సాదృశ్యాలుగా, నిదర్శనాలుగా, అర్థాంతరన్యాసాలుగా పుడుతుంటాయి. ప్రజల హృదయాలు సుఖదుఃఖ భావావేశాలతో ఉప్పొంగినప్పుడు వారి జీవితానుభవం పురస్కరించుకొని వారి హృదయం నుండి హఠాత్తుగా ఒక మాట దూసుకొనివస్తుంది. ఆ మాట లయబద్ధంగా, రసవంతంగా, కర్ణపేశలంగా, వాడిగా, వేడిగా ఎదుటివారి హృదయంలో హత్తుకొనేలా ఉంటుంది. సామెతలను సమాజంలోని అన్ని వర్గాల ప్రజలు ప్రతినిత్యం వాడుతుంటారు. ఇవి వారి వారి స్థాయినిబట్టి అవసరాన్నిబట్టి ప్రయోగించడం జరుగుతుంటుంది. ఇవి ఎక్కువగా పల్లీయుల వాడుకలో ఉంటాయి.

సామెతలకు నానుడులు, నుడులు, సూక్తులు, శాస్త్రాలు, జనశ్రుతులు, చాటువులు లేక సాటువలు అనే పదాలు జనవ్యవహారంలో పర్యాయపదాలుగా ఉన్నాయి. అయితే బాగా సామెతలను సూక్ష్మంగా పరిశీలించినట్లయితే ఈ పదాలకు ఒక్కొక్క ప్రత్యేకార్థం ఉన్నట్లు తెలుస్తుంది.

మనిషికి మాటే అలంకారమని, ఆ మాటకు అలంకారాన్ని కూర్చేది సామెత అని, సామెతలేని మాట ఆమెత లేని ఇల్లువంటిదని మన పెద్దలు అంటుంటారు. విందు భోజనంవల్ల గృహస్థుకు, అతిథికి

ఇద్దరికీ ఎంత ఆనందం కలుగుతుందో అంత ఆనందం సామెతను మాటలో వాడినవారికి, విన్నవారికి కలుగుతుంది. ఎదుటివారితో మాట్లాడే టప్పుడు సందర్భానుకూలంగా సామెతను వాడడం ఒక చమత్కారం; కళ అని చెప్పాలి. సామెతలకు సహజత్వం, పరవశత్వం, సరసత్వం, శ్రావ్యత, సంక్షిప్తత, సూటిధనం మొదలైనవి ముఖ్యలక్షణాలు. సామెలతలో సునిశిత హాస్యం, వ్యంగ్య వైభవం, లోకానుభవం, లోకహితవు, విమర్శనా వైశిష్ట్యం మొదలైనవి నిక్షిప్తమైఉంటాయి.

సామెతలు దేశ చరిత్రకూ, జాతి సంస్కృతికీ, మానవ నైజ స్వరూపానికి అద్దం పడుతుంటాయి. ఒక వ్యక్తి ఎదుటివారితో మాట్లాడుతున్నప్పుడు సందర్భానికి తగిన సామెత గుర్తురానప్పుడు "ఏదో సామెత చెప్పినట్లు' అని మాటకు ఊత నివ్వడం తెలుగువారికి అలవాటు. సామెతలు మాటకు జీవాన్ని, సొంపును, నిండుదనాన్ని చేకూర్చుతాయి. సామెతలలో ప్రజల అనుభవాలు, అభిరుచులు, విశ్వాసాలు, ఆచారాలు, సంప్రదాయాలు, వ్యక్తిగతమైన జీవిత సత్యాలు, హితోపదేశాలు మొదలైనవి వ్యక్తమవుతుంటాయి. వీటి మూలాన ఆయా కాలాల్లోని ప్రజల జీవన విధానాన్ని మనం గుర్తించవచ్చు.

అన్నమయ్య సమాజంలోని అన్ని రకాల ప్రజల మన స్తత్వాలను క్షుణ్ణంగా గ్రహించిన జ్ఞాని కాబట్టి తాను ప్రజలకు చెప్పదలచు కొన్న అధ్యాత్మ విషయాలను బోధించదలచుకొన్న వైష్ణవమత సిద్ధాంతాలను, భక్తితత్వాన్ని, ఐహికసంబంధమైన జీవిత సత్యాలను, పద్ధతులను అనేక రకాలైన జానపదగేయ రీతులద్వారా చెప్పినట్లే అనేక రకాలైన సామెతలద్వారా కూడా వ్యక్తం చేశాడు. అన్నమయ్య రచించిన శృంగార అధ్యాత్మ సంకీర్తనలను పరిశీలించి చూచి నప్పుడు ప్రధానంగా మూడు రకాలైన సామెతలు కనిపిస్తాయి.

మొదటిది, పూర్వంనుండీ జనబాహుళ్యంలో ప్రచారం పొందు తున్నవి. రెండవది, లోకప్రసిద్ధమైన సామెతలకు పోలికగా కనిపించే బింబప్రతిబింబాలు. మూడవది, లోకవ్యవహారంలో లేకపోయినా అన్నమయ్య ప్రత్యేకంగా వాడి సామెతలుగా నిలిచిపోయినవి.

**వీటిలో మొదటిరకం సామెతలు :**

"అందని పండ్లకేల అఱ్ఱిచాచేవీవు" ఇలాంటి సామెతను తిక్కన విరాటపర్వం - కీచకవధ ఘట్టంలో కీచకుడు ద్రౌపదిని మోహించి బలాత్కరించబోయినప్పుడు ద్రౌపది అతనికి —

"చను జనదని చూడకయం
దని మాకుల పండ్లు గోయందలచుట హితవె
మును చెడిన రావణాదుల
విని యెరుగవె యెన్నడును వివేక విహీనా"

అని ముందు యుగంలో రావణాసురుడు పరస్త్రీ వ్యామో హంతో ఏమయ్యాడో తెలియదా, అందని మాకుల పండ్లవంటి మాలాంటి వారితో ఇలాంటి వ్యర్థపు పనులెందుకని బుద్ధి చెబుతున్న సందర్భంలో ఉపయోగించాడు. సామెతలను వాడడంలో తిక్కన సిద్ధహస్తుడు.)

"అడవిగాచిన వెన్నెల
ఊరకున్నవారి కూరోపదన్నట్లు
ఏనుగుదిన్న వెలగవంటి బేసమువలె
కాలినపుండ్లలో నువ్వులు చల్లుట

కుక్కకాటుకు చెప్పుటాట (చెప్పుదెబ్బ అనడానికి అన్న మయ్య చెప్పుటాట అనే పదం వాడాడు.)

కొంచెపు దేవరకు కొంతంత పత్రి
కోటివిద్యలు కూటికొరకే

గోరబొయ్యే పనికిగా గొడ్డలేటికి
గోరుచుట్టుమీఁద రోకటిపోటాయె
తినదిన వేమైన తీపవును

(తినగ తినగ వేము తియ్యనుండు అని వేమన ప్రయోగం)

దేవుడిచ్చినా పూజారి వరమీడు
నిప్పుల నెయి బోసినట్లు
నీరుపట్టుగొన్నచోట నేయి మందుగా చెపుడు

(శ్రీనాథుడు శృంగార నైషధంలో ఇలాంటి సామెతనూపాన్ని ఉపయోగించాడు. నలుడు దమయంతిని పరీక్షింపగోరి, గొప్పవారైన దేవతలలో ఒకరిని పెండ్లి చేసికొమ్మని, తనవంటి తక్కువవారు ఎందుకని? చెబుతుండాగా దమయంతి నలునే వివాహమాడగోరి తన నిశ్చయాన్ని చెప్పే సందర్భంలో —

"అధికతరులైనగాక దిశాధిపతులు
కౌతుకము నాకు నీవంశ కథలయందె
దప్పిగల్గినవారి కా దప్పి దీర్ప
సలిలపూరంబు హితవొ యాజ్యంబు హితవొ"

అని నీటికోసం కలిగిన దప్పిని నెయ్యి తీర్చలేదని చెబుతుంది)

నెలకొన్న పిండెంత సిప్పటే నంతే (రాయలసీమ మాండలికంలో 'సిప్పటి' అంటే అరిసెలు, అత్తిరసాలు అని అర్థం)

మగడు విడిచినా మాడు విడువనియట్లు
విత్తొకటి వెట్టితేను వేరొకటి మొలచునో

వెన్న చేతబట్టి నేయి వెదకినట్లు
శిరసుండ మోకాలికి సేసకోటికి (సేస అంటే అక్షతలు)
హంసచేత పాలు నీరగునట్లు

**రెండవ రకం సామెతలు :**

మెడమీద మేకపిల్లను పెట్టుకొని వూరంతా వెదికాడు (లోకంలో ఉన్న సామెత)
అరుతలింగము గట్టి పరువత మేగిన భక్తుడు (అన్నమయ్య సామెత)
చనువున్నప్పుడే చంకనెక్కాలి (లో. సా.)
ఆసగలిగినచోట నాడినవె సరసము (అ. సా.)
తాగేది గంజి మీసాలు పట్టే వాళ్లిద్దరు (లో. సా.)
ఎంగిలి బూరె కడుగనేల (అ. సా.)
పొగలో పడలేక సెగలో పడ్డట్టు (లో. సా.)
ఎద్దు దన్నీనని గుఱ్ఱముచాటున కేగినయట్టి చందము (అ. సా.)
గాడిదకేమి తెలుసు గంధంపొడి వాసన (లో. సా.)
ఎద్దే మెరుగు అడుకుల చవి (అ. సా.)
కుక్కతోక వంకర (లో. సా.)
ఏటివంకలు దిద్ద వసమా (అ. సా.)
కొండను త్రవ్వి ఎలుకను బట్టినట్లు (లో. సా.)

కుప్ప నురుచుట కసవుకొరకా
కూడు వండుట గంజికొరకా
కొండ ఎక్కుట దిగుటకొరకా
కొలుచు దంచుట పొట్టుకొరకా (కొలుచు అంటే ధాన్య) (అ సా.)

కంబళ్ళలో అన్నం తింటూ వెంట్రుక లేర నేల (లో. సా.)
చనవు లిచ్చినచోట సాధించ పనిలేదు (అ. సా.)

చేతులు శివుని ముందు చిత్తం చెప్పులమీద (లో. సా.)
చేతులొక్కరియందు చిత్త మొక్కరియందు (అ. సా.)
దిల్లికి దిల్లే పల్లికి పల్లే (లో. సా.)
జాజు జాజే గాక దిరిశపు పువ్వౌనా (అ. సా.)
తిన్న ఇంటి వాసాలు లెక్కించినట్లు (లో. సా.)
పూవుల వేసిన వారి బొగ్గిట కేతురా (అ. సా.)
తన నీడ తనదగ్గరే వుండు (లో. సా.)
మాని పండ్లు మరి మాని కిందనే వుండు (అ. సా.)
ముందు నుయ్యి వెనక గొయ్యి (లో. సా.)
వెనక నుయ్యి తగరు ముందు (అ. సా.)
రాజు వలచిందే రంభ (లో. సా.)
రాజు వలచినదే దేవులందురు (అ. సా.)
సిగ్గే స్త్రీకి సింగారము (లో. సా.)
నవ్వే మూలధనము నాతులకు (అ. సా.)
అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల (లో. సా.)
సాదించ నేటికి సొట్టులెంచ నేటికి (అ. సా.)

**మూడవ రకం సామెతలు :**

అగ్ని పొంత నుంటే కాక లేగాక చలువలు గలుగునా (కాక = వేడి)
అడవి బడినవాడు వెడల చోటు లేక కంపలకింద దూరినట్లు
అద్దములో నీడ పొడ సూచినట్లు
ఆడుదనము అంకడి వేయుదగునా
ఆపరానిది వలపు అణచరానిది చూపు
ఆశగలిగినచోట నాడినదె సరసము
ఈరు దియ్య బేనువచ్చు

ఉక్కువంటి గుండెలోన లక్కవంటి మనసు
ఉడికినందు మీదట పుప్వులు చల్లినట్లాయ
ఎంత తొండమున్నా దోమ ఏనుగవునటె
ఏనిగె గుజ్జై యెక్కినవారికి
ఏనుగుతో యేలాటలు యెవ్వరికేల
కంచములో కూడు కాలదన్నుదురా
కంతిలేని గుడిసొక్క గంపంతైనా చాలు
కలగన్న చోటికి గంప యెత్తినయట్లు
కాయ పండు సేయబోతే కడు పులుసే గాక యేయెడ తీపుగాదు
కూడులేక యాకటికి కూర దిన్నట్లు
కూలిచ్చినవారు పనిగొనక విడుతురా
కొక్కునింట బెట్టుకొంటే గోడలు తవ్వకుండునా
కొక్కెరలు హంసల బోలీనా
కొలిమి గూటిలో సూదులమ్మ్రట
గుట్టు చెడి మనుకంటే కొంచెపు మేలైన చాలు
చింతలేని యంబలొక్క చేరెడే చాలు
చిచ్చు గాగిలించుకొంటే చిమిడించకుండునా
చీమలపుట్ట చిమ్మ్ర రేగినట్లుండు
చెంది విత్తిన కొలదే చేరి మొలచేటి పైరు
చెలిమి చెట్టడిచితే చేటవును
చేరి యగ్ని పొంత నుంటే చెమరించకుండునా
చేపట్టితే రానిది చిక్కిసన్నకు వచ్చీనా
జంతగాని తరుణి యే జాతైన నదెచాలు
జిగురు కండెం బక్షులు చిక్కినట్లు
తప్పులేని జీతమొక్క తారమైన జాలు

తల్లికి లేని ముద్దు దాదికా
తిట్టులేని బ్రదుకొక్క దినమైన నదె చాలు
నిండు నీటనుండే తమ్మి నెడగక మానునా
నిజము బలికిన వైరములే యగును
నూతులు దవ్వగబోతే బే తాళములు పుట్టె
నెయ్యాని పోసుకోరాదు నీళ్ళని చల్లగరాదు.
పాసిన కూటికంటె పస్తైన మేలు
పూటకూటిమీద తమ్మి పుమియుట
పూవువల్ల తుంగ తలకెక్కినట్లు
పెంచు దెచ్చి మాణికపు బిల్ల సేయు
మంచు కుంచాన కొలిచినట్లు
ముచ్చగన్న తల్లి మూల కొడిగినట్లు
ముట్టు లేని కూడొక్క ముద్దడే చాలు
ముల్లుదీసి కొఱ్ఱు మొత్తినట్లాయ
ముల్లు ముంటదీసి సుఖమున నుండినట్లు
మొదలి నీరు కొనకెక్కదా
రొంపికంబమూకంటే రోయుటే మేలు
వరి చెఱ నూదర బలిసినయట్లు
వెన్నదిన్ననోటనే వేశిఫాలు తాగినట్లు
సముద్రము గడచి వోడలో గదిసి యినుము దెచ్చినయట్లు

అన్నమయ్య వాడిన లోకప్రసిద్ధమైన సామెతలు పూర్వాపర కవుల గ్రంథాలలోకూడా అక్కడక్కడా కనిపిస్తాయి. అన్నమయ్య లోక వ్యవహారంలోని సామెతలను, తదనురూపమైన సామెతలను తద్విలక్షణమైన సామెతలను కూడా ప్రయోగించాడు. అన్నమయ్య పల్లె ప్రాంతంలో జీవించడంవల్ల అనేక వృత్తులవారి పదజాలంతో

విశేష పరిచయం ఏర్పడింది. అందువల్ల సామెతలలో అడుసు, వరి, ఊదర, మంచు, పెంచు, కుంచం, బొగ్గు, కొలిమి, ఇనుము, లక్క, ఉక్కు, వెలగపండు, జాజి, దిరిసెనపువ్వు, కూడు, పాసిన కూడు, పూటకూడు, కూర, నిప్పటి మొదలైన అచ్చ తెనుగు పదాలను విరివిగా ఉపయోగించాడు. తన కాలంలో రాయలసీమ ప్రాంతంలో ముఖ్యంగా కడప మండలంలోని వ్యావహారిక పదజాలాన్ని, ప్రజలకు అత్యంత సన్నిహితమైన నిత్యం వాడుకలో నున్న ఇలాంటి పద ప్రయోగాలద్వారా అన్నమయ్య ప్రజలకు ఎంతో విజ్ఞానాన్ని, వేదాంతాన్ని బోధించాడు.

అన్నమయ్య తన సంకీర్తనలలో అక్కడక్కడా ఇలాంటి సంకీర్తనలను పూర్తిగా సామెతల రూపంలోనే రచించాడు.

"కడు నడుసు చొరనేల కాళ్లుగడుగనేల
కడలేని జన్మ సాగర మీఁదనేల ॥

తలపులో హరి నెంత దలఁచెనేఁడే వాని
కలిమియు సుఖమును గలదంతే
తులఁ దూచఁ బైడెంత తూకమునంతే
నెలకొన్న పిండెంత నిప్పటీ నంతే ॥

సిరివరు పూజెంత సేసె నేడే వాని
దరియు దాపు నెంతయు నంతే
పురిగొన్న యీవెంత నగవూనంతే
నరపతి చనవెంత నగవూ నంతే

(శ్రీ) వేంకటపతి చింతయంత నేఁడే
భావపరవశము పలుకూనంతే

దైవము కృపయెంత తానూనంతే
ఏ వంక జయమెంత యిరవూ నంతే

అడుసు త్రొక్కినవాడు కాళ్లు కడుగుకోవలసివస్తుంది. అలాగే ఎన్నో కర్మలు చేస్తూ భగవంతుని గూర్చి చింతించనివాడు కూడా ఎన్నో జన్మలు ఎత్తి మళ్ళీ భవబంధాలలో బందీ కావలసివస్తుంది. కర్మలు చేయనేల మళ్ళీ జన్మ ధరించి భవసాగరంలో ఈదనేల అని హెచ్చరించడానికి ఈ సామెత ఉపయోగించాడు. ఈ భవబంధాల నుండి విముక్తుడు కాదలచిన మానవుడు భగవంతుని ఎంతగా కొలిస్తే అంతగా సుఖపడతాడు అని చెప్పడానికి పని ఎంతో కూలీ అంతేనని, పైడి ఎంతో తూకమంతేనని, పిండెంతో నిప్పటి అంతేనని మొదలైన ప్రసిద్ధ సామెతలను ఉపయోగించాడు. అన్నమయ్య ఇలాంటి సామెతలను వాడటం మూలాన ప్రజలకు విషయం స్పష్టంగా అర్థమవుతుంది. అంతేగాక వారి హృదయాలలో చెదరని ముద్ర పడుతుంది. ఆయా సన్నివేశాలు వచ్చినప్పుడు ప్రజలకు ఆయా సామెతలు గుర్తువచ్చి జ్ఞానవంతులుగా బ్రతకడానికి దోహదం చేస్తాయి. కాబట్టి అన్నమయ్య భక్తి, జ్ఞాన విషయాలను అనేక రకాలైన సామెతల ద్వారా అనేక రీతులుగా చెప్పి ప్రజల మనస్సును రంజింజేసి ప్రజాకవిగా ప్రసిద్ధి గాంచాడు.

'కోస్తావాణి' ప్రాంతీయ దినపత్రిక, రాజమహేంద్రవరం
(జూన్ 4, 5, 6 తేదీలు, 1989)



# అన్నమయ్య సంకీర్తనలతో నాకున్న అనుబంధం

ఇప్పటికి సుమారు ఇరవై సంవత్సరాల క్రితం నాటిమాట. నేను ప్రాథమిక పాఠశాలలో చదువుతున్న రోజులవి. మా తాత పొన్నా కోదండరామయ్యగారు ఎప్పుడూ పాటలు పాడుతుండేవారు. వారికి సంగీతం, సాహిత్యం అభ్యాసపూర్వకంగా లేకపోయినా తన కాలంనాటి సంగీత సాహిత్య పండితుల, భాగవతకళాకారుల సాంగత్యంవల్ల వారు పాడుతున్న భారత, భాగవత పద్యాలను, పాటలను ఏక సంథాగ్రాహిగా నేర్చుకొని అప్పటికప్పుడే అవలీలగా గళమెత్తి మధురంగా పాడుతుండేవారు. ఇలా కేవలం వినికిడి పాండిత్య జ్ఞానంతో ఒక మంచి గాయకుడుగా తన కాలంలో తన ప్రాంతంలో మంచి పేరు తెచ్చుకొన్నారు.

ఆ రోజుల్లో మా ఇంటిదగ్గర పందిరిక్రింద మా తాతగారి పాటలకోసం పిచ్చుగాళ్లు మొదలుకొని ఆ వూరి పెద్దలవరకు ఆడ, మగ, చిన్న, పెద్ద అనే భేదం లేకుండా సంగీత ప్రియులు, భక్తి హృదయులు ఆబాలగోపాలం వచ్చి వేచి యుండేవారు. అప్పుడు మా తాతగారు ఎక్కువగా అన్నమయ్య అధ్యాత్మ కీర్తనలైన "అదివో అల్లదివో హరివాసము, బ్రహ్మకడిగిన పాదము, జో అచ్యుతానంద జోజో ముకుంద, చందమామ రావో జాబిల్లి రావో, ఒకపరి ఒకపరి ఒయ్యారమై" అనే శృంగార కీర్తన మొదలైన పాటలు పాడుతుండేవారు. ఈ అన్నమయ్య పాటలతో పాటు ప్రసిద్ధమైన రామదాసు కీర్తనలు, త్యాగరాజు కృతులు, బ్రహ్మంగారి తత్వాలు కూడా పాడుతుండేవారు. ఇలా అనువంశికత, పూర్వసుకృతం, దైవాను

గ్రహం కారణాలుగా ఆ రోజుల్లో భుక్తి ముక్తిదాయకమైన అన్నమయ్య సంకీర్తనా బీజాలు నా పసి హృదయక్షేత్రంలో నాటుకొన్నాయి.

ఆ కాలంలోనే తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆంధ్ర ప్రాంతంలోని ఆయా ప్రసిద్ధమైన వైష్ణవ క్షేత్రాలలో దొరుకుతున్న అన్నమయ్య సంకీర్తనల రాగిరేకులను వెలికితీసి శుద్ధి చేయించి ఆ కీర్తనలను ప్రఖ్యాత పండితుల చేత వ్రాయించి పుస్తకాలను అచ్చువేయించే బృహత్కార్యం చేపట్టారు. అప్పుడు మా పొరుగూరు వ్యక్తి మిట్టమీద జగన్నాథం నాయుడుగారు దేవస్థానం ముద్రణాలయంలో పని చేస్తుండేవారు. మా తాత తండ్రుల కోరికపైన మాకు కొన్ని ముద్రిత ప్రతులను తెచ్చి ఇస్తుండేవారు. అప్పుడు నేను ఆ ప్రతుల్లోని శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలను చదువుతుండేదాన్ని. అందులో ఉన్న అధ్యాత్మ సంకీర్తనలలోని దైవలీలలు చదివి చాలా బాగున్నాయి అనుకొని వాటిని వ్రాసిన అన్నమయ్యపై అభిమానం పెంచుకున్నాను. కానీ శృంగార సంకీర్తలను చదివినప్పుడంతా అందులోని స్త్రీ అంగాంగ వర్ణనలను గమనించి అన్నమయ్య అంటే విముఖత చూపుతుండేదాన్ని. నాలో నేను "నాకు అన్నమయ్య అంటే అంతగా ఇష్టంలేదు. నాకు రామదాసు, త్యాగయ్య అంటేనే ఇష్టం. వారంతా మంచి భక్తిపూర్వకమైన కీర్తనలే వ్రాశారు. కానీ అన్నమయ్య శృంగార విషయాలను పచ్చి పచ్చిగా వ్రాశాడు. ఈ పద్ధతి ఏమీ బాగలేదు. వీటిని చదివిన వారంతా చెడిపోతారు" అని అజ్ఞానగా ఆ చిన్న ప్రాయంలో భావించుకొంటూ ఉండేదాన్ని.

అన్నమయ్య శృంగార సంకీర్తనలను ఎందుకు వ్రాశాడు? అందులోని అంతరార్థం ఏమిటి? అందులోని స్త్రీ పాత్ర లెవరు? అది ఎలాంటి శృంగారం? అన్నమయ్య ఆశించిన ప్రయోజనం

ఏమిటి? అని పెద్దలైన తాతతండ్రులను అడిగి తెలుసుకోవాలని కూడా తెలియని చిన్న వయస్సు అది. అందువల్ల కొన్ని సందేహాలు అలాగే నా హృదయంలో నిక్షిప్తమైపోయాయి. నాకు పన్నెండు సంవత్సరాలు కూడా నిండని ప్రాయంలోనే మా తాత దైవ సన్నిధిని చేరుకొన్నారు. మాకు శాశ్వతంగా దూరమయ్యారు. తరువాత లౌకిక విద్యలతోనే కాలం గడువసాగింది. ఇలా పది సంవత్సరాలు గడచిన తరువాత 1978 వ సం॥లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో ఎం. ఏ. తెలుగులో చేరడం జరిగింది. సరిగ్గా అదే కాలంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు అన్నమాచార్య సంకీర్తనల వ్యాప్తికై తిరుపతిలో అన్నమాచార్య ప్రాజెక్టును స్థాపించారు. ఒకవైపు సంగీత కళాకారులకు ఉపకార వేతనాలిచ్చి సంకీర్తనలలో శిక్షణ ఇవ్వడం, వారిచేత గాన కచ్చేరీలు చేయించడం, ఇంకోవైపు పండిత శ్రేష్ఠులను నియమించి వారిచేత సంకీర్తనలను పరిష్కరింపజేసి పుస్తకాలను ముద్రించడం, అన్నమయ్య జయంతులు, వర్ధంతుల సందర్భంగా సంగీత సాహిత్య మహోత్సవాలను బాహాటంగా జరిపించడం మొదలైన కార్యక్రమాలను ముమ్మరంగా సాగిస్తున్నారు.

ఆ కాలంలోనే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, మాజీ వైస్ చాన్సలర్ అయిన ఆచార్య డా॥ జి. యన్. రెడ్డిగారు తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులుగా పనిచేస్తున్నారు. వారు భక్తి హృదయులు, సంగీత ప్రియులు, వినయశీలురు, మానవతా మూర్తులు కావడంవల్ల, అన్నమయ్య సంకీర్తనల వైశిష్ట్యాన్ని గుర్తించినవారు కావడంవల్ల అన్నమయ్య సంకీర్తనల వ్యాప్తిలో వారూ ఒక భాగ స్వాములుగా ముందుకు వచ్చి విశ్వవిద్యాలయస్థాయిలో మొట్టమొదటి సారిగా తెలుగు అధ్యయనశాఖలో అన్నమాచార్య శృంగార సంకీర్తనలు - పన్నెండవ సంపుటాన్ని ఐచ్ఛిక పాఠ్యాంశంగా నిర్ణ

యించారు. అప్పుడు నా బాల్యదశ, తాతగారి పాటలు గుర్తు కొచ్చాయి. మా గురుదేవులు పుణ్యమూ అంటూ ఎం. ఏ. రెండవ సంవత్సరం అన్నమాచార్య శృంగార సంకీర్తనలను ఐచ్ఛిక పాఠ్యాంశంగా చదవడానికి నిర్ణయించుకున్నాను.

సాధారణంగా పద కవితలంటే ప్రాచీనకాలంలోనే కాదు, నేటికీ చిన్నచూపు చూసేవారు లేకపోలేదు. కానీ ఆ పద కవితల్లోని సారం తెలిసినవారికే వాటి విలువ తెలుస్తుంది. సంకీర్తనలలోని రమ్యత తెలియాలంటే ముఖ్యంగా దైవభక్తి, సంగీతప్రీతి, వినయం, మానవత్వం మొదలైన సద్గుణాలు తప్పనిసరిగా ఉండాలి. ఇవి లేని వారు సంకీర్తనల జోలికి పోలేరు. అందువల్ల ఐచ్ఛిక పాఠ్యాంశంగా అన్నమయ్య సంకీర్తనలను చదవటానికి ఎక్కువమంది సుముఖంగా లేరు. కేవలం ముందుకు వచ్చినవారు ఇద్దరు అమ్మాయిలు మాత్రమే. వారిలో నేనొకర్తెను; ఇద్దరమే ఉన్నాము కాబట్టి పాఠ్యాంశాన్ని తొలగిస్తారేమో అనే శంక కూడా నాకు రాకపోలేదు. కానీ శాఖా ధ్యక్షులవారు సంకీర్తనలపై మాకున్న అభిరుచికి విలువనిచ్చారే తప్ప సంఖ్యకు కాదు. అందువల్ల నిరాటంకంగా సంకీర్తనల చదువు కొనసాగింది. అప్పుడు సంకీర్తనలపై భాషా బోధనా గురువుగా ఆచార్య డా॥ కేతు విశ్వనాథరెడ్డిగారు, సాహిత్య బోధనా గురువుగా డా॥ కె. సర్వోత్తమరావుగారు నియమితులయ్యారు. వారు సంకీర్త నలలోని భాషా వైవిధ్యాలను, సాహితీ సౌందర్యాలను, భక్తి తత్త్వా లను, నీతి బోధలను వెలికితీసి బోధించడమే కాకుండా మధురమైన కంఠంతో శ్రావ్యంగా పాడి వినిపించేవారు. అన్నమయ్య సంకీర్త నలపై నాకు అనురక్తి, భక్తి ప్రవర్ధమానం కాసాగింది. ఎం. ఏ. పూర్తి అయిన తరువాత అన్నమయ్య సంకీర్తనపై పరిశోధన చేయా లనే తపన కలిగింది. కరుణా హృదయులైన గురువర్యులు ఆచార్య

# అన్నమయ్య కీర్తనలలో జానపద కవితా రీతులు

ఆంధ్ర సాహిత్య వినువీధిలో ఎందరో మహా కవుల వంశాలు, వాగ్గేయకార వంశాలు ధ్రువతారలై వెలశాయి. అయితే తాళ్ళపాక వంశం మాత్రం శరచ్చంద్ర సమానమై ఒక ప్రత్యేకతను సంతరించుకొని తేజోయమానంగా వెలుగొందుతున్నది. ఈ వంశంలో నాలుగు తరాల వరకు అందరూ మహాభక్తులే. కవి పండిత గాయకులే. ఇదే ఈ వంశం ప్రత్యేకత. వీరు కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని ఆరాధించి తమ తమ గ్రంథాలను ఆ స్వామి పాదాబ్జాలకే అంకితమిచ్చిన ధన్యజీవులు. వీరి వంశానికి వన్నె తెచ్చిన మూలపురుషుడు అన్నమయ్య.

ఇతడు స్వామివారి వరప్రసాది కాబట్టి పుట్టుకతోనే అన్నమయ్యకు అన్ని విద్యలూ కరతలామలకమయ్యాయి. బాల్యమాదిగా ఆతడు ఆడిన మాటెల్ల అమృత కావ్యంగా, పాడిన పాటెల్ల పరమ గానంగా మారాయి. అన్నమయ్య స్వామివారి ఆదేశానుసారం సంకీర్తనల రచనకు పూనుకొని, స్వామివారిపై ముప్పై రెండు వేల శృంగార అధ్యాత్మ, సంకీర్తనలను రచించాడు. ప్రస్తుతం పన్నెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలే లభించాయి. ఈ సంకీర్తనా కవలిలో పండిత పామర జన రంజకమైన ఎన్నో అంశాలు చోటు చేసుకొన్నాయి.

పల్లెప్రజలు పాడుకోవడానికి ముగ్ధ మనోహరమై సహజ సిద్ధంగా భాసించేవి జానపదగేయాలు. పల్లీయులచే సృష్టించిబడిన ఈ గీతాలు మౌఖిక సంప్రదాయం, ప్రాచుర్యం, సారళ్యం, జాతీయత మొదలైనవి జానపద గేయాలకు ప్రధాన లక్షణాలు.

అన్నమయ్య వివిధ జానపదగేయ లక్షణాలను క్షుణ్ణంగా తెలుసుకొని తన మధుర భక్తి భావాలతో, ఆధ్యాత్మిక తత్త్వాలతో మాత్రాబద్ధ ఛందస్సులో సంకీర్తనలను రచించాడు. పల్లె పట్టులలో పామరజన ప్రచారంలో ఉన్న అనేక జానపద కవితా రీతులు అన్నమయ్య సంకీర్తనలలో కనిపిస్తాయి.

జానపదగేయాలలో లయబద్ధమైన మాటల కూర్పుతో ప్రతి చరణం చివరగానీ లేక కొన్ని పాదాల చివరగానీ ఒకేపదం పునరావృత్తమవడం ఒక లక్షణం. అన్నమయ్య సంకీర్తనలో కొన్నింటిలో ఇలాంటి లక్షణాన్ని మనం గమనించవచ్చు.

"దొరకెేగా పూజకందువ పూజ నీ
విరహపు తనుతావి విరవాది పూజ
కలికి నీ కనుమావు కలువ రేకుల పూజ
లలన నీ నగవు మొల్లల పూజ"

ఈ సంకీర్తనా పాదాలలో 'పూజ' అనే పదం ఆవృత్తమయింది.

జానపదుల నడుమ సెలయేరువలె పరుగులిడే జానపద గేయ స్రవంతి వేంకటేశ్వరుని సన్నిధిలో సంగీతం నింపుకొని పరిపూర్ణ మయింది. ఆనాడు భాగవతుల వాడుకలో ఉండిన పాటలన్నీ అన్న మయ్య చేతిలో నిబద్ధ పదాలుగా మారాయి.

అన్నమయ్య సంకీర్తనలో పెండ్లి పాటలు, ధవళపుపాటలు, సువ్విపాటలు, గొబ్బిపాటలు, అల్లోనేరెళ్ళ పదాలు, సోదిపాటలు, చల్ల అమ్మకపు పాటలు, భజన కీర్తనలు, చిందులు, లాలిపాటలు, ఉగ్గుపాటలు, దోబూచిపాటలు మొదలైనవే కాకుండా సంవాదపదాలు సంబుద్ధి పదాలు, ఏలపాటలు, శోభనపుపాటలు, మంగళగీతాలు

మొదలైన జానపద గేయ రీతులు కూడా ఉన్నాయి. వీటిలో కొన్నింటికి ఉదాహరణలు చూపవచ్చు.

పెండ్లిపాటలు : అన్నమయ్య సంకీర్తనలలో పెండ్లిపాటలు చాలా ఉన్నాయి. అవి గంధం పాటలు, బంతులాటలు, వధూవరుల పాటలు, నలుగుపాటలు మొదలైనవి.

> "పిడికిట తలంబ్రాల పెండ్లికూతురు కొంత
> పెడమరలి నవ్వెనె పెండ్లికూతురు
> పేరుకల జవరాలె పెండ్లికూతురు పెద్ద
> పేరుల ముత్యాల మేడ పెండ్లికూతురు"

అనే ఈ పాటలో పెండ్లికూతురైన అలమేలుమంగయొక్క అలంకారాలను, హావభావ విలాసాలను అన్నమయ్య చక్కగా వర్ణించాడు.

ధవళపుపాటలు: ఇవి శుభకార్యాలలో అక్షతలు చల్లేటప్పుడు ఆశీర్వదిస్తూ పాడేవి.

> "జయ జయ రామా సమర విజయ రామా
> భయహర నిజభక్త పారీణ రామా"

నివాళిపాటలు: ఇవి దృష్టిదోషాన్ని నివారించడానికై పారాణి పళ్లెం తిప్పుతూ పాడేవి.

> "వలవులు వలపులు వయ్యాళి
> చెలమరి మరుడును సమేళి"

సువ్విపాటలు : ఇవి దంపుడు పాటలు. ధాన్యం దంచేటప్పుడు శరీర కష్టాన్ని పోగొట్టుకోనడానికి 'ఇస్' అనే ధ్వన్యనుకరణ శబ్దమే

వేగంగా దంచేటప్పుడు ఆ ఊపులో సువ్వి, సువ్వి అని వినిపిస్తుంది. ఈ శబ్దం ఊతగా పాడేవి సువ్వి పాటలు.

"సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందనుగనియె"

గొబ్బి పాటలు : మార్గశిర మాసంలో యువతులు, బాలికలు గుమ్మాలముందు గుంపులు చుట్టి వలయాకారంతో తిరుగుతూ చప్పట్లు తడుతూ పాడే పాటలు గొబ్బి పాటలు.

"కొలనిదోపరికి గొబ్బిళ్లో యదు
కులము స్వామికిని గొబ్బిళ్లో
కొండగొడుగుగా గోవులగాచిన
కొండొకశిశువుకు గొబ్బిళ్లో"

అల్లో నేరేళ్ళు పదాలు : ఇవి రాత్రిపూట వెన్నెలలో స్త్రీలు పాడే పాటలు. అల్లో నేరెళ్ళు అంటే అల్ల నేరేడు పండ్లు అనే అర్థంలో కాకుండా కేవలం ఊతపదంగానే అన్నమయ్య ఇక్కడ వాడడం జరిగింది.

"నెయ్యములల్లో నేరేళ్లో
ఒయ్యన పూరెడి వువ్విళ్లో

తొటతొట గన్నుల దొరకెటి నీళ్ళ
చిటిపొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీ పన్నెల మోవికి
గుటుకలలోన గుక్కిళ్లో"

ఏలపాటలు : ఆంధ్రుల దేశిగానం ఏలపాటల రూపంలో కూడా సాగింది. ఏలలందు ఔదార్యం, ధార్మికత ప్రదర్శితం కావాలనే

లక్షణం ఉన్నా కూడా అన్నమయ్య పాటలలో శృంగార విలతే వేంకటేశ సంబోధనతో కూడుకొని ఉన్నాయి.

"మేడలెక్కి నిన్ను చూచి
కూడేననే యాసతోడ
వాడుదేరి పుస్సురందుర వేంకటేశ
యోడనుంటి విందాకనుర"

లాలిపాటలు : అన్నమయ్య సంకీర్తనలలో శ్రీకృష్ణుని బాల్య లీలా విలాసాలు ఎక్కువగా లాలి పాటల ద్వారానే వర్ణించబడ్డాయి.

"ఉయ్యాలా బాలు నూచెదరు కడు
నొయ్య నొయ్య నొయ్యనుచు

బాల యవ్వనలు పసిడి వుయ్యాల
బాలుని వద్ద పాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మ యెల్ల
లాలి లాలి లాలి లాలనుచు"

ఉగ్గుపాటలు : ప్రతి తెలుగు తల్లి తమ బిడ్డలకు విద్య నేర్పటం ఉగ్గుపాలను తాగిపిస్తూ పాడే పాటతోనే ప్రారంభం అవుతుంది. బిడ్డను కాళ్ళపై పరుండబెట్టుకొని చిన్న గిన్నెలో కొంచెం ఆముదం, పాలు, ఉప్పుకల్లు వేసి రంగరించి బిడ్డకు తాగిపిస్తుంది. ఆ సమయంలో పాడే పాటలు ఉగ్గుపాటలు.

"ఉగ్గువెట్టరే వోయమ్మా చె
య్యొగ్గీనీదె శిశువోయమ్మా ॥

కడుపులోని లోకమ్ములు గదలీ
నొవ్వలూఁచకురే వోయమ్మా

తోడికెడి సరుగనఁ దొలఁగఁదీయరే
ఉడికెడి పాలివి వోయన్నా”

దోబూచిపాటలు : చిన్నపిల్లలు ఆడుకొనే ఆటలలో దోబూచి ఒకటి. బూచి అనే మాటకు భూతమని అర్థం. లోక వ్యవహారంలో బూచిగాడు, దొంగ అనే అర్థాలున్నాయి. చిన్నపిల్లలు ఏడుస్తున్నప్పుడు వారిని భయపెట్టి ఏడుపు మాన్పించడానికి 'అదిగో బూచి, అద్దో బూచి' అంటూ చెప్పే పదమే కాలక్రమేణ 'దోబూచి'గా మారి ఉంటుంది. తల్లులు సాధారణంగా తమ కళ్ళకు అడ్డంగా చేతులుంచుకొని బూచీ అంటూ ఉన్నటులుండి కళ్ళు తెరచి ఏడుస్తున్న బిడ్డల ఏడుపు మాన్పించి ఆశ్చర్యపరుస్తుంటారు. ఇలాంటి ఆటను దోబూచి అని, దాగిలి ముచ్చులాట అని అంటారు.

“బండి విరచి పిన్నపాపలతో నాడి
దుండగీఁడు వచ్చె దోబూచి

పెరుగు వెన్నలు ప్రియమునవే
మరుముచ్చిలించు మాయఁకాడు
వెరవునా తన విధము దాఁచుకొని
దొంగదొంగవచ్చె దోబూచి”

చిందులు : కేవలం సంకీర్తనలను ఆలాపించడమే కాకుండా భక్తిపారవశ్యంతో చిరుతలతో చేతులు పైకెత్తి మేను వంచి అడుగులను పలుగతులుగా మారుస్తూ ఆడటం జానపదులకు సహజం. గతిభేదం కలిగి అభినయానుకూలమయ్యే రచనలను చిందులంటారు.

“చిత్తగించు మా మాటలు (శ్రీ) నారసింహ
చిత్తజ జనక ఓ శ్రీ నారసింహా”

సంవాద పదాలు : మార్గ కవితలో కనిపించని హృదయాకర్షక మైన గృహస్థ వాతావరణం జానపద రచనలలో విరివిగా కనిపిస్తుంది. ఇద్దరిమధ్య మాటపనూటగా సాగిన పాటలు సంవాదపదాలు. వీటినే యుగళగీతాలనికూడా అంటారు. వీటిలో అత్తాకోడళ్ళ సంవాదాలు ప్రధానంగా కనిపిస్తాయి. అత్తగారు కోడల్ని ఏడ్పించడమో, పెత్తనం చేజిక్కిన కోడలు అత్తగారిని సాధించడమో వంటి విషయాల నాధారంగా గ్రహించి అన్నమయ్య లక్ష్మీ సరస్వతులకు సంబంధించిన సంవాద గేయాన్ని రచించాడు.

"రావే కోడలా రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యా పొందులు నీతో చాలును ॥

రంకెలు వేయుచు రాజులెదుట నీవు
కొంకు గొసరులేని కోడల
పంకజముఖి నీవు పలు దొడ్డవారింట్ల
అంకెలు దిరిగేవు అత్తయ్యా"

మంగళగీతాలు : ఈ పాటలను దేవాలయాలలో ఉత్సవం సందర్భంలోను, కుటుంబ శుభకార్యాలలోను పాడతారు. ఇవి షష్ఠీ విభక్తి రూపంలో ఉంటాయి.

"చిత్తజగురుడ నీకు శ్రీ మంగళం నా
చిత్తములో హరి నీకు శ్రీమంగళం ॥

బంగారు బొమ్మవంటి పడతి నురముమీఁద
సింగారించిన నీకు శ్రీమంగళం
రంగుమీర పీతాంబరము మొలగట్టుకొని
చెంగలించిన హరి నీకు శ్రీమంగళం"

# అన్నమయ్య పొడుపు కథలు

తెలుగు జాతి జీవన స్రవంతి సంపూర్ణంగా వెల్లివిరిసేది పల్లె పట్టుల్లోనే. నగరజీవన సంపర్కంవల్ల జానపదుల్లో కూడా వేషంలో, భాషలో, ప్రవర్తనలో, బ్రతుకు మార్గాలలో కొంత కృత్రిమత్వం ఏర్పడుతున్నా మౌలికమైన సంప్రదాయాలు, ఆచారాలు మాత్రం పల్లె ప్రాంతాలల్లోనే మనకు ఎక్కువగా కనిపిస్తుంటాయి. పొలాలలో వరిపైరు నాటేటప్పుడు, కలుపులు తీసేటప్పుడు, పంట కోసేటప్పుడు, కసవు త్రొక్కిళ్ళప్పుడు, పొలం దున్నేటప్పుడు, మనకు పల్లీయుల పాటలు వినబడుతుంటాయి. అలాగే ఇళ్లలో కూడా ధాన్యం దంచేటప్పుడు, విసిరేటప్పుడు, పిల్లల్ని లాలిస్తున్నప్పుడు జానపద స్త్రీలు కూనిరాగాలు తీస్తుంటారు. ఆ పాటలలో ఎంతో ఆనందం ఉంటుంది. అందుకే ఎంత శ్రమపడుతున్నా వారికి కష్టం తెలియదు. అక్షరాలు కూడా రాని ఆ అమాయక జనుల హృదయాలలోనుంచి ఎంతో లయబద్ధమైన లలితపదాలు గేయాలుగా పెల్లుబుతుంటాయి.

ఆ గేయాలలో ఎన్నో పౌరాణికాంశలు, చారిత్రాత్మక విశేషాలు, మానవాళి మనుగడకు ఉపయుక్తమయ్యే హిత వచనాలు అంతర్గతంగా ఉంటాయి. ఆ జానపదులు కేవలం గేయాలు పాడుకోవడమే కాక అప్పుడప్పుడూ సరదా కోసమో, కాలక్షేపం కోసమో, ఉత్సాహం కోసమో పొడుపుకథలు వేసుకొంటుంటారు. ఇది కుటుంబ సభ్యులమధ్య కావచ్చు లేదా ఇరుగు పొరుగు ప్రజలమధ్య కావచ్చు. ఇందులో కథ వేసేది ఒక్కరైతే ఆ కథ విప్పేది ఇంకొకరు.

పొడుపుకథలను కొన్ని ప్రాంతాలలో కథలు అని, మరికొన్ని ప్రాంతాలలో తట్లు అని, తెలంగాణా ప్రాంతంలో శాస్త్రాలని

అంటారు. వీటిని సంస్కృతంలో ప్రహేళికలు అని అంటారు. ఉదాహరణకు కొన్ని —

కిటకిట తలుపులు కిటారి తలుపులు ఎంత మూసినా చప్పుడు కావు. (కను రెప్పలు) అడవిలో పుట్టింది అడవిలో పెరిగింది మా ఇంటి కొచ్చింది హైతక్క లాడింది. (కవ్వం), నేల నాకి మూల కూర్చుంటుంది. (చీపురు), అన్నకు అందదు తమ్ముడికి అందుతుంది. (పెదవులు), పెట్టె తెరిస్తే కృష్ణుడొచ్చె (వేరుశనగకాయ)

ఈ పొడుపు కథల రీతులలో తాళ్ళపాక అన్నమయ్య కూడా భగవంతుని దశావతారాలను ఒక సంకీర్తనలో వర్ణించాడు.

"ఎవ్వఁడో కాని యెఱఁగరాదు కడు
దవ్వులనే ఉండు తలఁపులో నుండు ||పల్లవి||

ఎడయవు తన రెక్క లెగసిపోలేఁడు
కడు డాఁగుఁగాని దొంగయుఁగాఁడు
వడిఁగిందు పడును సేవకుఁడునుఁగాఁడు
వెడఁగు గోళ్ళు నెంచు విటుఁడునుఁగాఁడు ||ఎవ్వఁడో||

మిగులఁబొట్టివాఁడు మింటికినిఁబొడవు
జగడాలు తపసి వేషములను
మగువకై పోరాడు మరి విరక్తుఁడును
తగుఁగాపుఁబనులు నెంతయుఁ దెల్లఁదనము ||ఎవ్వఁడో||

తరుణుల వలపించు తగిలి పైకొనఁడు
తురగముఁదోలు రాతునుఁగాఁడు
తిరు వేంకటాద్రిపైఁ దిరుగు నెప్పుడును
పరమ మూర్తియై పరగు నీ ఘనుఁడు ||ఎవ్వఁడో||

ఈ కీర్తన మొదట్లో భగవంతుడు అవాఙ్మానస గోచరుడని, సర్వాంతర్యామి అని స్పష్టంగా తెలుస్తుంది. మూడవ చరణం చివర్లో మాటకు, మనస్సుకు గోచరం కాని ఆ భగవంతుడు వేంకటాచలంపై వెలసిన శ్రీ వేంకటేశ్వరుడే అని మనస్సుకు స్పష్టం చేశాడు అన్నమయ్య.

ఈ కీర్తన మొదటి చరణంలో "ఎడయవు తన రెక్కలు ఎగసిపోలేదు" అంటే చేపకు రెక్కలున్నాయి. కానీ పక్షిలాగా ఎగిరిపోలేదు. అని అర్థం. ఇది మత్స్యావతారాన్ని సూచిస్తుంది. సోమకాసురుడు వేదాలను ముచ్చిలించి సముద్రంలో దాగుకొన్నప్పుడు మహావిష్ణువు మత్స్యావతారాన్ని దాల్చి వేదాలను ఉద్ధరిస్తారు. కడు దాగుగాని దొంగయు గాడు. ఇది కూర్మావతార సూచన. తాబేలు తన తలను ముడుచుకొని దాక్కుంటుంది గాని దొంగ మాత్రం కాదు. సముద్ర మథన సందర్భంలో మంధర పర్వతాన్ని కవ్వంగా గ్రహించినప్పుడు అది మునగకుండా ఉండడానికి మహావిష్ణువు కూర్మావతారం ఎత్తవలసి వచ్చింది. "పడికిందు పడును సేవకుడును గాడు" ఇది వరాహావతార సూచన. యజమాని పైనుంచి ఆజ్ఞాపిస్తుంటే సేవకుడు చేతులు కట్టుకొని వింటూ పనులు చేస్తుంటాడు. హిరణ్యాక్షుడు భూదేవిని చాపగా చుట్టి సముద్రంలో పడవేసినప్పుడు మహావిష్ణువు వరాహావతారమెత్తి భూదేవిని కాపాడుతాడు. అంత మాత్రానికి సేవకుడు కాదని అర్థం. 'వెడగు గోళ్లు పెంచు విటుడును గాడు' ఇది నరసింహావతారం. హిరణ్యకశిపుని చంపడానికి వాడిగోళ్లను పెంచాడే కానీ అంత మాత్రానికి అతడు పెక్కులు తిరిగే విటుగాడు గాదు.

"మిగులా పొట్టివాడు మింటికిని పొడవు" ఇది వామనావతార సూచన. బలిచక్రవర్తి గర్వం అణచడానికి మహావిష్ణువు వామనావ

తారం ఎత్తాడు. మొదట్లో పొట్టిగా వుండి ఆ తర్వాత బ్రహ్మాండా న్నంతా ఆవరించిన విషయం ఇందు తెలుస్తోంది. "జగడాలు తపసి వేషములును" ఇందులో పరశురామావతార సూచన వుంది. జటా ధారులైన తపస్వులకు కోపం వుండకూడదుగానీ ఇతను మహాకోపి. క్షత్రియులమీద ఇరవై ఒక్కసార్లు దండెత్తి వారిని ఆమూలాగ్రం నశింప జేసిన పరశురాముని తెలియ జేయడం జరిగింది. "మగువకై పోరాడు మరి విరక్తుడును" ఇది రామావతార సూచన. రావణా సురుని సంహరించి సీతను తెచ్చుకొని మళ్ళీ ఆమెను అపనిందల కారణంగా, అడవుల పాలు చేశాడు. తగుకాపు పనులు నెంతయు తెల్ల దనము" ఇది బలరామావతార సూచన. కాపులు పొలంలో నాగలితో పనులు చేసి నల్లబడతారు. కానీ నాగలిని ధరించి కూడా తెల్లగానే వున్నాడనడంలో బలరాముడు స్పష్టమవుతున్నాడు. "తరుణుల వల పించు తగిలిపై కొనడు" ఈ వాక్యంలో త్రిపుర స్త్రీలను వశం చేసు కొని తాను మాత్రం వారి వలలో తగులకుండా వుండిన బుద్ధావ తారం స్పష్టమవుతోంది. 'తురగము దోలు రౌతునుకాడు' గుర్రాన్ని నడుపుతాడు కానీ రౌతు మాత్రం కాదనడంలో కల్క్యవతారం సూచించబడింది.

అన్నమయ్య తన సంకీర్తనా రచనకు కేవలం జానపద గేయాల్ని, సామెతల్ని కాకుండా పొడుపుకథల రీతుల్ని కూడా స్వీకరించాడంటే పొడుపుకథలకు జానపదుల్లో ఎంతటి ప్రాధాన్య ముందో, ఆ జానపదులు వాటిపై చూపే ఉత్సాహం, శ్రద్ధ ఎంత టిదో మనకు స్పష్టమౌతుంది.

'ఆంధ్రప్రభ' దినపత్రిక (2-12-1986)



# అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో అద్భుత వర్ణనలు

శృంగారం నవరసాలలో రసరాజంగా ప్రసిద్ధికెక్కింది. 'ఏకో రసః శృంగార ఏవ' అని లాక్షణికులు శృంగారరసానికి అగ్రస్థానం ఇచ్చారు. శృంగారం లేనిదే ఈ జగత్తే లేదు. ఈ సృష్టిలో సర్వ జీవరాసులూ తన్మయీభూతులయ్యేది ఒక్క శృంగార రసంలోనే. అందుకే మన పూర్వ కవులు తమ కావ్యాలలో శృంగార ఘట్టాలను రీతిగా వర్ణించేవారు. శృంగార వర్ణనలు లేని కావ్యాన్ని నీరస కావ్యమని, రసికావతంసులు పెదవి విరుచుతారు. కాబట్టి సర్వజన సమాదరణీయమైన శృంగార రసాన్ని ఆనాటి కవులు తమ కావ్యాలలో తనివి తీర పోషించి తమ కాలంనాటి రాజులను, పండితులను మెప్పించారు. అలాంటి కవులలో మేటి అయిన శ్రీనాథుడు, శృంగార శ్రీనాథుడుగా, స్త్రీ నాథుడుగా సాహిత్య ప్రియులచే కీర్తించబడుతున్నాడు.

ప్రేమ రసైక మూర్తులైన ప్రేయసీ ప్రియుల అందచందాలు, వారి సంయోగ వియోగాలు, చెలికత్తెల ఊరడింపులు, పరిహాసాలు మొదలైన శృంగార ఘట్టాలను అద్భుతంగా వర్ణించడంలో పూర్వ కవులకు తీసిపోనివిధంగా మన పద కవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమయ్య కూడా తన సంకీర్తనలలో అతివేలంగా వర్ణించాడు. అందుకే అన్నమయ్య శృంగార, అధ్యాత్మ సంకీర్తనలను చదివితే ఎంతటి భోగి అయినా యోగి అవుతాడని, శృంగార సంకీర్తనలను చదివితే ఎంతటి యోగి అయినా భోగి అవుతాడని" చమత్కరించారు. అలాగే మరికొందరు "అన్నమయ్య శృంగార సంకీర్తనలు వట్టి బూతులబుంగలు" అనికూడా నిరసించారు.

అన్నమయ్య రచించిన శృంగార సంకీర్తనలను గూర్చి ఇలా ఎవరు ఎన్నివిధాలుగా విమర్శించినా, చమత్కరించినా, శ్లాఘించినా అందులోని పరమార్థం మాత్రం ఒక్కటే. అది ప్రకృతి పురుషులైన జీవాత్మ పరమాత్మల ఐక్యం. అదే అమలిన శృంగారం. మానవ మనస్సులను తాత్కాలిక ఉద్రేకాలకు గురిచేయక ఆనంద సాగరంలో ముంచి తేల్చే నిశ్చలమైన దివ్య శృంగారం ఇది.

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని ఆదేశానుసారం ప్రజలలో విష్ణుభక్తిని వ్యాపింపదేయదలచి భువిపై అవతరించిన పరమ భాగవతోత్తముడు. కాబట్టి పండితులకు మాత్రమే పరిమితమయ్యే పద్య రచనలను చేపట్టక రాజు మొదలు గోపాలుర వరకు అందరినీ అలరించగల సంగీతాత్మక ప్రక్రియ అయిన పదరచనలను చేపట్టాడు. సాధారణంగా మానవులందరూ ఇష్టపడేది శృంగారరసమే అని అన్నమయ్య భావించి ప్రజల మనస్తత్వాన్ని ఆకళింపు చేసుకొని శృంగార రసాత్మకంగా సంకీర్తనలను రచించి వుండవచ్చు. ఆది దంపతులు, జగన్మాతాపితరులైన అలమేల్మంగా శ్రీనివాసులను తన సంకీర్తనలకు కవితా వస్తువుగా గ్రహించాడు. లోకాతీతమైన దివ్య నాయికా నాయకుల ప్రణయాన్ని మనోహరంగా వర్ణించి పాఠకులను మధుర భక్తి మార్గం వైపు మళ్ళించాడు. భక్తుడు ప్రేయసీ ప్రియ భావంతో భగవంతుని ఆరాధించి తపించి ఐక్యం కావడమే మధురభక్తి. ఈ భక్తి మార్గంలోనే గోపికలు, రాధ, గోదాదేవి, మొల్ల, తరిగొండ వెంకమాంబ మొదలైన భక్తురాండ్రు తమ తనువులను, మనస్సులను పరమాత్మకు అర్పించి, ఆరాధించి, ఆనందించి, తమ జీవితాలను తరింప చేసుకున్నారు. వైష్ణవ భక్తి సంప్రదాయంలో విష్ణువు ఒక్కడే పురుషుడు. తక్కిన వారందరూ స్త్రీప్రాయులే. అందుకే అన్నమయ్య కూడా ఒక్కొక్కసారి తానే ప్రేయసిగా మారి స్వామిని ప్రియుడుగా

భావించి ఆరాధించి తన సర్వస్వాన్ని అంకితం చేస్తాడు. ఈ భావాన్ని వ్యక్తం చేస్తూ అన్నమయ్య —

'మచ్చికలమగసిరి మందులాడనీ
కిచ్చిన దేహమిది యెట్టయినాఁజేయరా॥

ఓడక యెక్కడనైన నుండి నీవు
వేడుకతో మా యింటికి విచ్చేయఁగాను
వాడు మోమొఁజూచి నవ్వు వచ్చుఁగాని కోప
మేడఁ దెచ్చుకొన్న రాదు యెట్టైనాఁజేయరా॥

ఎంతవొద్దు వోయియైనా యిటు నీవు
వింతలేక మా యింటికి విచ్చేయఁగాను
చింతతో నీ కెదురు చూచితిఁగాని
యెంతైనాఁ బాయలేను యెట్టయినాఁజేయరా॥

కుంకుమ చెక్కుల మెఱుఁగుల తోడ తిరు
వేంకటేశ మా యింటికి విచ్చేయఁగాను
వంకలాడి నినుఁగూడవలెగాని
యింక నిన్నుఁబాయలేను యెట్టయినాఁజేయరా॥

అనే సంకీర్తన రచించాడు.

భగవంతుడు అందరివాడు. ఏ ఒక్కరికీ స్వంతం కాడు. అందుకే ప్రేయసీ రూపంలో ఉన్న మన అన్నమయ్య తన ప్రియుడైన శ్రీ వేంకటేశ్వరుడు ఇతర స్త్రీలతో కూడి వివిధ గుర్తులతో ఇంటికి వచ్చినా ఏమీ అనలేదు. పైగా మరచిపోకుండా వచ్చినందుకు జాలితో చేరదీసి తన మనసును, తనువును స్వామికి అర్పించాడు. సహజంగా లోకంలో ఆత్మాభిమానం ఉన్న స్త్రీలు తమ భర్తలు

గాని లేక ప్రియులుగాని పరస్త్రీలను కన్నెత్తి చూచినా సహించరు. అలాంటిది పరస్త్రీ సంగమ గుర్తులతో ఇంటికి వస్తే ఇంట్లో సుడి గుండం విజృంభిస్తుంది. కొంతమంది స్త్రీలు మాత్రం తమ భర్తలు లేక ప్రియులు పరస్త్రీ వ్యామోహితులైనా కూడా తమను మరచిపోకుండా తమ చెంతకు వస్తున్నందుకు, తమపై ప్రేమ చూపుతున్నందుకు అంతే చాలని తృప్తి పడుతూ సహనం వహిస్తారు. ఈ కీర్తనలోని ప్రేయసికూడా తన ప్రియుడు ప్రేమతో కూడిన మగసిరి కలవాడని, వలపు మందు చల్లేవాడని తాను ఎక్కడ తిరిగి వచ్చినా, ఎంత రాత్రి అయినా, పరస్త్రీ సంగమ గుర్తులు ఒంటిపై కనిపించినా, తనకు కోపం లేదని, పైగా వాడిపోయిన ముఖం చూస్తూవుంటే నవ్వు వస్తుందే కాని కోపం రాదని తనను వదలి ఉండలేనని ప్రియునిపై తనకున్న ప్రేమానురాగాలను వ్యక్తం చేస్తోంది. ఇందులోని నాయకుడు దక్షిణ నాయకుడైన శ్రీ వేంకటేశ్వరుడు. ఇలా చేయడం అన్నిటా ప్రవీణుడైన ఆజగత్పతికే చెల్లుతుంది గానీ సామాన్య మానవుడు చేసే చిక్కుల వలయంలో చిక్కుకొనిపోతాడు.

అన్నమయ్య వర్ణించిన దివ్య నాయిక జగన్మోహిని అయిన అలమేలు మంగ ఆమె అందచందాలు లోకాతీతమైనవి. అనశ్వర మైనవి. అన్నమయ్య సర్వశాస్త్ర పారంగతుడు. ఇతడు అలమేల్మంగ సౌందర్యాన్ని శిరస్సు మొదలు పాదం వరకు కనులార తిలకించాడు. అన్నమయ్యకు జ్యోతిషశాస్త్రంలో చెప్పబడిన పంద్రెండురాశులు గుర్తుకు వచ్చాయి. అవి ఆ దివ్య మోహన శృంగార రూపిణిలో దర్శనమిచ్చాయి. నాయిక విల్లువంటి కనుబొమలు ధనురాశిగా, చేపలవంటి కన్నులను మీనరాశిగా, కుండలవంటి కుచములను కుంభ రాశిగా, సింహపు నడుము వంటి నడుమును సింహరాశిగా, మకర ముద్ర కలిగిన పైట చెరగును మకరరాశిగా, లేప్రాయపు వయసును

కన్నె రాశిగా, బంగారుతో తులతూగు శరీరాన్ని తులారాశిగా పదు నైన గోళ్ళను వృశ్చికరాశిగా, మదవతిగా ఒప్పుటచే వృషభరాశిగా, గోప్యపు మాటలచే కర్కాటరాశిగా, లేత చిగురుమోవిని మేష రాశిగా తన ప్రియుడైన వేంకటేశ్వరునితో కలిసినందుకు మిథున రాశిగా ఇలా వర్ణించాడు.

"ఇన్ని రాసులయునికి యింతి చెలువపురాశి
కన్నెనీరాశి కూటమి గలిగినరాశి ॥

కలికి బొమవిండ్లుగల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచ కుంభముల కొమ్మకును కుంభరాశి
చెలగు హరి మధ్యకును సింహరాశి ॥

చిన్ని మకరాంకపుఁ బయ్యెద చేడెకు మకరరాశి
కన్నెపాయపు సతికి కన్నెరాశి
వన్నెమై పైఁడి తులఁదూఁగు వనితకుఁ తులారాశి
తిన్నని వాఁడిగోళ్ల సతికి వృశ్చికరాశి

ఆముకొను నొరపుల మెరయు నతివకు వృషభరాశి
గామిడి గుట్టుమాఁటల సతికర్కాటకరాశి
కొమలపు చిగురుమోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతిఁ గలసె ప్రియ మిథున రాశి ॥

చంద్రవదన అయిన నాయికకు ప్రియుని ఎడబాటు కలిగింది. అప్పటివరకు బాధేమి లేదు కానీ ఇప్పుడు ఎలావుందో అని చెలికత్తెలు దిగులుపడుతూ నాయిక విరహావస్థను నాయకునికి తెలియజేస్తున్నారు. ప్రియుని ఎడబాటు వల్ల ప్రేయసికి సంతాప జ్వరం వచ్చింది. అది

ఎక్కువై శరీరం దహించుకొనిపోతోంది. అప్పుడు శీతలోపచారాలు చేయవలసి వుంటుంది. ఇవి నాయికకు వాటంతట అవే సమకూరాయి. నాయిక చంద్రకాంత శిలపై పడుకొని వుంది. విరహజ్వరం ఉడికిపోతోంది. అప్పుడు చంద్రుని వంటి ఆమె ముఖకాంతులకు చంద్రకాంత శిలకరిగి ఆమెకు చల్లదనాన్ని చేకూర్చింది. నాయిక విరహవేదనలో పొన్న చెట్టు నీడలో చిగురుటాకు పాన్పుపై పడుకొని ప్రియుని తిడుతూ పాటపాడుతోంది. అప్పుడు పొన్న పుష్పాల నుండి మకరందం స్రవించి ఆమెకు కొంత తాపోపశమనం కలిగించింది. విలాసంగా తూగు మంచంపై పడుకొని కొంత జారిన పైటతో హాయిగా పాడుతుండగా శ్రీ వేంకటేశ్వరుడు వచ్చి ప్రియురాలిని కలిసి సంతోషాన్ని కలిగించాడు. విరహగీతలలో కూడా చివరి చరణంలో మాత్రం నాయికా నాయకులను ఐక్యంచేసి సుఖాంతం చేయడం అన్నమయ్య ప్రత్యేకత. ఈ సందర్భంగా అన్నమయ్య —

"ఇప్పుడెట్లున్న దో యిందువదన
అప్పటికి కొంత గుణమాయె నా వేళ ॥

తెరప శశికాంత వేదికమీఁద మలఁగుపై
నొరగి పరితాపాగ్ని నుడుకఁగాను
నెఱిదొలఁకు మోము వెన్నెలకు శశికాంతంపు
టఱుఁగు కరఁగిన శైత్యమాయె నా వేళ ॥

చెలియపొన్నల నీడ చిగురుఁబాన్పు మీఁద
పలుమారు నినుదూరి పాడఁగాను
చెలఁగి పొన్నల విరియు చిలుకుఁదేనెల సోనఁ
దెలివొంది కొంత వడదీరె నా వేళ ॥

తోయ్యలి విలాసమున తూఁగు మంచము మీఁద
పయ్యెదరజార నినుఁబొందఁగాను
తియ్యమునఁ గూడితివి తిరువేంకటేశ్వరుఁడ
నెయ్యంపు వేడుకలు నినిచెనావేళ ॥

అనే కీర్తన రచించాడు.

నాయిక శ్రీ వేంకటేశ్వరుని కలసి, అలసిపోయి చెదరిన కేశాలతో భూషణాంబరాదులతో పూలపాన్పుపై ఒళ్ళు మరచి మత్తుగా పడుకొని వుంది. అప్పుడు చెలికత్తెలు నాయికను పరిహాసాలాడుతున్నారు. నాయిక, కస్తూరి నామం పెట్టుకొని ఉన్న స్వామి సౌందర్యాన్ని చూచి ముగ్ధురాలై అతని లలాటాన్ని చుంబించింది. అప్పుడు ఆమె చిగురుటాకు వంటి పెదవిపై అక్కడక్కడ కస్తూరి అంటుకొన్నది. అది ప్రేయసి ప్రియునకు వ్రాసిన ప్రేమ లేఖవలె ఉందట. మనోహరి, చకోరాక్షి అయిన ఆమె కన్నుల తుదలు ఎఱ్ఱగా ఉన్నాయి. అందుకు కారణం స్వామిపై నాటిన తన చూపుల బాణాలను వెనకకు లాగుకొనగా చిమ్మిన రక్తమట. ఆమె చనుకట్టుపైనున్న మెఱుగులు పైటను అధిగమించాయి. అవి వేడుకతో ప్రియుడొత్తిన గోళ్ళ ముద్రలనే చంద్రరేఖలు వెదజల్లిన వేసవి కాలపు వెన్నెలట. పద్మం వంటి ముఖం కలిగిన ఆమె చెక్కిళ్ళకు ఇరువైపులా ముత్యాల వరుసలు అమరి ఉన్నాయి. అవి ప్రియుని సంగమం వల్ల కలిగిన చెమట బిందువులట. అన్నమయ్య సాళువ నరసింగరాయల కొలువులో రాజు కోరిక మేరకు ఈ శృంగార గీతిక ఆలపించాడు. ఆ రాజు ఇందులోని శృంగార భావ సౌందర్యానికి పరవశించి కాళిదాసాది మహాకవుల కావ్యాలలో కూడా ఇంతటి అద్భుత వర్ణనలు కానరావని శ్లాఘించాడు. అన్నమయ్య పాడిన ఆ శృంగార పదం—

"ఏమొకో చిగురుటధరమున యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు గదా ॥

కలికి చకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువు నఁ బ్రాణేశ్వరుపై నాఁటిన యాకొన చూపులు
నిలువు నఁ బెరుకఁగ నఁటిన నెత్తురు కాదు గదా ॥

పడఁతికి చనుఁగవ మెఱుఁగులు పైపైఁ బయ్యెద వెలుపల
కడు మించిన విధమేమో కనుఁగొనరే చెలులు
ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడలఁగ వేసవి కాలపు వెన్నెల గాదు గదా ॥

ముద్దియ చెక్కుల కెలఁకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దిక లాగులివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపుఁజెమటల అందము గాదు గదా ॥

దివ్యనాయకుడైన శ్రీవేంకటేశ్వరుడు శృంగారపురుషుడు. ఆయన మూర్తిత్వం, వేషాలంకరణాలు జగదేకమనోహరమైనవి. ఆ స్వామిది ఎంత చూసినా తృప్తితీరని అమృత స్వరూపం. నాయిక తన ప్రియుని రూపలావణ్యాలను తన చెలికత్తెకు చెప్పుకొని సంబర పడుతోంది. అతడు ఒంటినిండా కమ్మని వాసనలు వెదజల్లే కస్తూరిని ఎఱ్ఱటి కుంకుమను పూసుకొని ఉన్నాడు. అతని చెక్కులలోని మకర కుండలాలతో కలసి కాంతులను వెదజల్లుతోంది. స్వామి గొప్పవైన ముత్యాల పథకాల హారాలతో ప్రకాశిస్తున్నాడు. బాహువులు శంఖ చక్రాల కాంతులతో మించాయి. అంత శ్రీ వేంకటేశ్వరుడు వేంకటా చలంపై తనకు ఘనమైన కౌగిలినిచ్చాడు. ఆ సందర్భంగా అన్నమయ్య-

"ఆతఁడే వో చెలియా మాయాతఁడు
చేతనే పరము చూపి చెలువైనయాఁతడు ॥

కుప్పలుగాఁ గస్తురియు కుంకుమయు మయినిండ
నప్పళించు కొనియున్న యాతఁడు
గొప్ప గొప్ప ముత్తేల కుప్పె సవరము పెద్ద
కొప్పుతోఁ జెలగీఁనదిగో మాయాతఁడు ॥

మలయుఁజెక్కుల నవ్వు మకరకుండలముల
అలర సిగ్గులె చల్లేయాతఁడు
బలువైన ముత్యాల నధకాల హారాల
వెలుఁగొందినదె చూడవే మాయాతఁడు ॥

అనే సంకీర్తనను రచించాడు. అన్నమయ్య ఎంతటి భక్తాగ్రేసరుడో కూడా. ఇతడు విధివశాన ఇద్దరాండ్రకు మగడయ్యాడు. అనురాగామృత జలధిలో ఓలలాడి వుండవచ్చు. అందుకే అలమేల్మంగా శ్రీనివాసుల ప్రణయాన్ని కూడా హృదయాహ్లాదంగా వర్ణించాడు.

శ్రీ వేంకటేశ్వరుడు అలమేల్మంగను కలసి నందువల్ల నిలువెల్లా సొంపుగా ఉన్నాడని, ఆమె కడగంటి చూపు స్వామి హృదయాన్ని తాకడం వల్ల వేంకటేశ్వరుడు శ్రీ వత్సలాంఛనుడయ్యాడని, ప్రేయసి ఎడబాటు వల్ల కందిపోయి నీలవర్ణుడయ్యాడని ఆమె చక్రాల వంటి చనుగుబ్బలను చేతబట్టడం వలన చక్రపాణి అయ్యాడని, ఆమె శరీరంలోని కుంకుమపూలు అతిశయించడం వల్ల పీతాంబరుడయ్యాడని, ఎప్పుడూ ప్రియురాలి కౌగిలిని అపేక్షించడంవల్ల నాలుగు చేతులు కలిగి ఉన్నాడని అన్నమయ్య ఇలా అద్భుతంగా వర్ణించాడు.

"నిన్నుఁగూడిన విభుని నిలువెల్ల సొంపాయ
నిన్నియును నొసగూడె నింత లోపలనె ॥

సోఁపు నీకడగంటి చూపు హృదయముగాఁది
లలిసేఁతఁడు శ్రీ వత్సలాంఛనుండాయ
వెలఁచి నినుఁబెడఁబాసి విరహంపు మెయికాఁక
వలన నితఁడు నీలవర్ణుఁడై నాఁడు ॥

అదన నీ చనుగుబ్బలను చక్రములచేతఁ
బడిల పరవుచు చక్రపాణియైనాఁడు
సుదతినీ దేహమున సొబగు కుంకుమపూఁత
ెదిని పీతాంబరం బీతనికి నాయ ॥

ఆలింగనాపేక్ష ననయంబు నినుఁగూడ
లోలుఁడటుగాన నాలుగు చేతులాయ
శ్రీ లలిత మూర్తియగు శ్రీ వేంకటేశ్వరుఁడు
పాలించె నిను నీకు పరితోషమాయ॥

అన్నమయ్య శృంగార వర్ణనలు అపూర్వమైనవి, ఆనంద దాయకమైనవి, శ్రేయోదాయకమైనవి. మానవులలో నానాటికీ స్వచ్ఛమైన ప్రేమ, అనురాగం, భక్తివిశ్వాసాలు అడుగంటి పోయి ధన దురాశ, పరహింసా ప్రవృత్తి పెరిగిపోతున్న ఈ రోజులలో అన్నమయ్య సంకీర్తనల ఆవశ్యకం ఎంతైనా వుంది. అన్నమయ్య శృంగార సంకీర్తనామృత సింధువులో ఈ వ్యాసం ఒక్క బిందువు మాత్రమే.

'సమాలోచన' (16-11-91)



# అన్నమయ్య కీర్తనల్లో ప్రజాబోధ

విజ్ఞాన శాస్త్రం మానవుడు మేధావి కావడానికి, సుఖజీవి కావడానికి తోడ్పడితే సాహిత్యం మానవుని మానవుడుగా, నీతి మంతుడుగా దైవాంశ సంభూతుడుగా తీర్చి దిద్దడానికి ఉపయోగ పడుతుంది. సాహిత్యంలో పద్య, గద్య, చంపూ, నాటక, శతక ప్రక్రియలు ఎన్నో వెలశాయి. అన్నింటి ముఖ్యోద్దేశ్యం మానవునికి ఆనందాన్ని ఉపదేశాన్ని అందించడమే. కాని అన్ని ప్రక్రియలు ప్రజానీకాన్ని ప్రభావితం చేయజాలవు. ఈ ప్రక్రియలన్నీ చాలా వరకు విద్యా జ్ఞానం, తెలివితేటలు వున్న వ్యక్తులనే ప్రభావితం చేస్తాయి. అందువల్ల పదిహేనవ శతాబ్దంలో తాళ్ళపాక అన్నమయ్య సమస్త ప్రజలకు పురాణ, రామాయణ, భాగవతాది పవిత్ర గ్రంథా లలోని భక్తి, జ్ఞాన, కర్మ, వైరాగ్య మార్గాలను సులభంగా బోధించ డానికి, వైష్ణవ మతాధిక్యతను నిరూపించడానికి, ప్రజలలోనికి అవ లీలలగా దూసుకొనిపోగల్గిన సంగీతాత్మకమైన పదకవితా ప్రక్రియను చేపట్టాడు. ముప్పై రెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలను రచించి తన ప్రియదైవం, కలియుగ ప్రత్యక్షదైవం అయిన శ్రీ వేంక టేశ్వరునికి అంకితమిచ్చాడు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి అపూర్వ కృషి ఫలితంగా ప్రస్తుతం పద్నాలుగు వేల సంకీర్తనలు వెలువడ్డాయి. శృంగార సంకీర్తనలలో జీవాత్మ పరమాత్మలకు ప్రేయసీ ప్రియభావాన్ని ఆపాదించి ఆరాధించే మధుర భక్తి తత్వం చెప్పడం జరిగింది. వైరాగ్య సంకీర్తనలలో విష్ణుదేవుని మహిమలు, దశావతార విశేషాలు, భక్తి, జ్ఞాన, వైరాగ్య నీతిబోధలు చెప్ప బడ్డాయి.

అన్ని జన్మలలో మానవ జన్మ శ్రేష్ఠమయిందని పెద్దలు చెబుతారు. అలాంటి మానవ జన్మను ఎత్తికూడా ఏదీ సాధించలేక పోతే ఆ జన్మ వ్యర్థమయినట్లే. మానవుడు ఏయే విధులను నిర్వర్తించాలో అన్నమయ్య తెలియజేశాడు. మానవుడు వేదాంత విద్యా వివేకవంతుడు కావాలి. భగవంతుని ధ్యానంలో ప్రీతి కలిగి వుండి ఉత్కృష్టమైన ఆనంద సంపదను అనుభవించాలి. ముఖ్య ప్రయోజనంగా దైవాన్ని ఆత్మలో భావించి పరమే తానై ఉండాలి. వేదశాస్త్రార్థాలను తెలిసినవాడై వుండి వేదాంత వేత్తలను సేవించాలి. పుణ్య సత్కర్మలు చేస్తూ ఆనందంగా హరి భక్తి కలిగి వుండాలి. ప్రాణులపట్ల ఎల్లప్పుడూ దయా విచారం కలిగివుండి ఇంద్రియ నిగ్రహంతో స్థిరచిత్తుడుగా ఉండాలి. అధికుడైన శ్రీ వేంకటేశ్వరుని దాసులే తనకు గతి అనే బుద్ధి కలిగి వుండాలి అంటూ —

పాట

"ఏదియును లేని దేంటి జన్మము
వేదాంత విద్యావివేకి గావలెను

పరమ మూర్తి ధ్యానపరుడు గావలె నొండె
పరమానంద సంపదలొందవలెను
పరమార్థముగ నాత్మ భావింపవలెనొండె
పరమే తానై పరగుండవలెను ॥

వేదశాస్త్రార్థకో. దుడు గావలెనొండె
వేదాంతవిదుల సేవించవలెను
కాదనక పుణ్యసత్కర్మి గావలెనొండె
మోదమున హరి భక్తి మొగినుండవలెను ॥

సతతభూతదయా విచారిగావలెనొండె
జితమైన యింద్రియ స్థిరుఁడుగావలెను
అతిశయంబగు వేంకటాద్రీశు సేవకులె
గతి యనుచు తనబుద్ధిఁ గలిగుండవలెను" (1-301)

అనే సంకీర్తన రచించాడు.

భగవంతుడు మానవునికి సర్వావయవాలను, మనస్సును, మేధస్సును అనుగ్రహించాడు. వీటిని భగవత్సేవకు, ధ్యానానికి వినియోగించినప్పుడే అవి సార్థకతమవుతాయి. పోతనకూడా 'కమలాక్షునర్చించుకరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' అనే పద్యం వ్రాశాడు. అన్నమయ్యకూడా ఈ విధమైన విష్ణుభక్తి అంశాలనే లోకానికి బోధించాడు. అశాశ్వతమైన ఈ సాంసారిక విషయాలు, లోక కంటకాలైన ఈ లోభ బుద్ధులు ఎందుకు? వినవలసివస్తే విష్ణుకీర్తనను చెవికి వినబడేలా చేస్తే అదే వేదాంత బోధ. బ్రతకవలసివస్తే మధువైరి అయిన మహావిష్ణువుపై భక్తి కలిగి వుండటమే ప్రాణులకు బ్రహ్మోపదేశం. చదువవలసివస్తే విష్ణునామాన్ని మాటిమాటికి చదువుకోవడమే సకల శాస్త్రాలు సమ్మతించిన విషయం. నిద్రపోవలసివస్తే విష్ణుమూర్తికి హృదయాన్ని అర్పించి నిద్రపోవడమే యోగ నిద్ర. కోరిక కలిగితే శ్రీ వేంకటేశ్వరుని దయకు కోరిక చేయడమే ఉన్నతమైన ఆనంద సౌఖ్యం. కీర్తి పొందదలచితే వైష్ణవ గృహాన్ని కీర్తివంతం చేయడమే తన వైభవానికి చిహ్నం. అని సవివరంగా తెలియజేస్తూ —

### శ్రీరాగం

"కాకున్న సంసారగతులేల
లోక కంటకములగు లోభంబులేల॥

వినికి గనవలసినను విష్ణుకీర్తన చెవికి
పనికి చేసిన నదియె వేదాంత బోధ
మనికి గనవలసినను మధువైరిపై భక్తి
వునికి ప్రాణులకు బ్రహ్మోపదేశంబు ॥

చదువు గనవలసినను శౌరినామము దిరుగఁ
జదువుటే సకల శాస్త్ర సమ్మతము
నిదురగనవలసినను నీరజాక్షునకిఁ దన
హృదయమర్పణ సేయుటది యోగ నిదుర ॥

అనవలసిన వేంకటాధీశ్వరుని కృపకు
నాస సేయుటే పరమానంద సుఖము
వాసి గనవలసినను వైష్ణవాగారంబు
వాసి సేయుట తనకు వైభవస్ఫురణ ॥ (1-326)

అనే సంకీర్తన రచించాడు.

మానవుడు అజ్ఞాన అంధకారంలో పడి జ్ఞాన వెలుగును చూడలేక అనేక రకాలైన సాంసారిక బాధలకు లోనవుతుంటాడు. జ్ఞానవంతుడైనప్పుడు తన దుఃఖాలకు కారణాలు తెలుసుకొని పశ్చాత్తాపం చెందుతాడు. అన్నమయ్య ఈ విషయాలను స్పష్టంగా వివరించాడు. గాలంవంటి ఈ దేహానికి చింతాపరంపరలు అనే చిక్కులు తగులుకున్నాయి. ఉద్ధృతమైన మోహపు వలలో చిక్కుకొని జీవుడు తుదిలేని గర్భ నరకాల్లో ఈదులాడవలసి వచ్చింది. మధ్యలో వచ్చిన సుఖాలను అనుభవించడంవల్ల మురికి వాకిలిలో పొర్లాడవలసి వచ్చింది. చూపులకు లోనైన సుఖాన్ని కోరడంవల్ల అధికమైన భ్రాంతితో తిరుగాడవలసివచ్చింది. ఎప్పుడూ మేలుచేసే శ్రీ వేంక

చేస్తున్న సేవించకపోవడంవల్ల తిరుగులేని నరక కూపంలో పడవలసి వచ్చింది. అన్ని లోకులకు జ్ఞానబోధ చేస్తూ —

శ్రీరాగం

"ఎంత గాలము కదా యీ దేహధారణము
చింతాపరంపరలఁ జిక్కువడవలసె ॥

పడిగొన్న మోహంబు వలల దగులై కదా
కడలేని గర్భ నరకము లీఁదవలసె
నడిమి సుఖము చేత నవ్వు సేయఁగఁగదా
తొడరి పాయపుగడ్డఁ దూరాడవలసె ॥

పాపపుంజములచేఁ బట్టువడఁగాఁగదా
ఆపదల తోడి దేహము మోపవలసె
చూపులకు లోనైన సుఖముఁగోరఁగఁగదా
దీపన భ్రాంతి చేఁదిరిగాడవలసె ॥

కోపేఁడైన తిరువేంకటేశుఁ గొలువకకదా
ప్రతిలేని నరక కూపమునఁ బడవలసె
అతని కరుణా రసంబబ్బకుండఁగఁగదా
బతిమాలి నలుగడలఁ బారాడవలసె ॥ (1-316)

అనే సంకీర్తన రచించాడు.

అక్రమ జీవనమార్గం సాగించే అజ్ఞానులకు మహాత్ములు ఎన్ని విధాలుగా హితబోధ చేసినా వారు వినరు. వారు వినడం లేదు. అంటే వారి గతజన్మ కర్మలు వారిని వదలక చెడుమార్గంలో నడిపిస్తున్నాయని భావించాలి. అన్నమయ్య ఈ విషయాలను గూర్చి

విశదీకరించాడు. ఎంత బోధించినా ఏమి చేసినా పేరుకొనిపోయిన తన కర్మలు అనుభవిస్తేగానీ తొలగిపోవు. ఎల్లప్పుడూ దురాచార ప్రవర్తన కలిగిన జడుడైన మానవునికి, పాపకర్మలను చాటి చెప్పే దుష్టునికి పుణ్య సంబంధమైన విషయాలను బోధించినా ఉపయోగం వుండదు. సమస్త జీవరాసులను హింసించే క్రూరునికి భగవంతుడు ఇహాపర సౌఖ్యాలను ఇవ్వడు. కర్మ బంధాలను వదలివేసిన వానికి సహజమైన లౌకిక ఆచారాలు జరగవు. దైవాన్ని దూషిస్తూ తిరిగే మానవునికి దైవసంబంధమైన నిగూఢ విషయాలు బోధపడవు. శ్రీ వేంకటేశ్వరుని చింతించకపోతే పవిత్రమనస్కుడై బ్రతకలేడు అని అన్నమయ్య లోకులకు సద్గుణాలను గూర్చి, భక్తి ప్రాధాన్యం గూర్చి బోధిస్తూ —

"ఎంత బోధించియేమి సేసినఁ దన
దొంతి కర్మములు తొలఁగీనా ॥

సతత దురాచార జడునకుఁ బుణ్య సం
గతి దలపోసినఁ గలిగీనా
అతి పాపకర్మ బోధకుఁడై వెలయుదుష్టు
మతిఁదలపోసిన మరికలిగీనా ॥

బహుజీవహింసాపరుఁడైన వానికి
యిహాపరములు దైవ మిచ్చీనా
విహిత కర్మములు విడిచిన వానికి
సహజాచారము జరిగీనా ॥

దేవ దూషకుఁడై తిరిగేటివానికి
దేవతాంతరము దెలిసీనా

శ్రీ వేంకటేశ్వరుఁ జింతింపకుండిన
పావనసుతుఁడై బ్రతికినా ॥ (1-347)

అనే సంకీర్తన రచించాడు.

బుద్ధిమంతులు పాపకర్మలు చేసే దుష్టులకు నీతిబోధ చేసి సన్మార్గంపైపు త్రిప్పాలని ప్రయత్నిస్తారు. ఫలితం కనిపించకపోతే నిరాశ చెందుతారు. ఈ విషయాన్నే అన్నమయ్య ఏయే రకపు మార్గులకు ఏయే సద్గుణాలు అలవడవో చెప్పాడు. మానవునికి శరీర వికారాలు ఉన్నంత వరకు కట్టకడపటిదైన కైవల్యం సిద్ధించదు. నిర్మలమైన ఆనందాన్ని కలిగించని మోహభ్రాంతి పుట్టుకను విచారించనివ్వదు. అలాగే ఏది శాశ్వతం, ఏది అశాశ్వతం అనే వివేకం అజ్ఞానికి, సత్యవాక్కును గూర్చి విచారించడం లోభిమానవునికి, హత్య చేయని సత్కర్మలు క్రూరాత్మునికి, ఎదురయ్యే పాపం కష్టునికి, ఎల్లప్పుడూ ఆనంద వికాసం సోమరికి, పవిత్ర భావం వ్యసన లోలుడికి, ఇంద్రియ నిగ్రహం పాపాత్ముడికి, సాటిలేని గంభీర గుణం నీచుడికి, శ్రీవేంకటేశ్వరుని సేవలో నిమగ్నమయ్యే మనస్సు లౌకిక బంధలంపటులకు, శ్రీవేంకటేశ్వరుని నామమనే అమృతాన్ని గ్రోల డానికి సామాన్యులకు వీలుకాదని అన్నమయ్య అనుభవపూర్వకంగా చెబుతూ —

**లలిత**

"ఈ దేహ వికారమునకు నేదియుఁగడపల గానము
మోదమెరంగనిమోహము ముందర గననీదు ॥

నిత్యానిత్య వివేకము నీరసునకు నొనగూడదు
సత్యాలాపవిచారము జరుగదు లోభికిని
హత్యా విరహిత కర్మము అంటదు క్రూరాత్మునకును
ప్రత్యక్షంబగు పాపము పాయదు కష్టునను ॥

సతతానంద విలాసము సంధించదు తామసునకు
గత కల్మషభావము దొరకదు వ్యసనికిని
జిత కాముఁడు తానవుటకు సిద్ధింపదు దుష్కర్మికి
అతులిత గంభీర గుణంబలవడ దధమునకు ॥

శ్రీ వేంకటగిరి వల్లభు సేవా తత్పర భావము
త్రోవ మహా లంపటులకు తోఁపదు తెలఁపునకు
దేవోత్తముఁడగు నీతని దివ్యామృతమగు నామము
సేవింపఁగ నితరులకును చిత్తం బొడఁబడదు ॥ (1-268)

అనే కీర్తన రచించాడు.

లోకంలో అసూయా ద్వేషాపరులు, హింసాప్రవృత్తి కలిగిన వారు సన్మార్గంలో నడిచే సజ్జనులను ఎప్పుడూ చీడపురుగుల్లా నాశనం చేస్తుంటారు. వారిని ఎదుర్కొనే శక్తిలేని దుర్బలులు దీనికంతా కారణం తను కర్మే అనుకుంటూ ఓర్చుకుంటారు. అలాగే పిల్లలు జ్ఞానవంతులై వైవాహిక సంబంధలంపటాలకు దూరంగా జీవించాలను కున్నప్పుడు పెద్దలు బలవంతంగా వైవాహికాది కర్మలను అంటగట్టి భవబంధాలలో పడవేస్తారు. దీనికి కారకులు నిజానికి పెద్దలు కారు. భవబంధాలలో చిక్కుకున్న కర్మయే కారణం. ఈ విషయాలను అన్న మయ్య అనుభవపూర్వకంగా వ్యక్తీకరించాడు. మానవుడు తాను అనుభవిస్తున్న లౌకిక కష్టాలకు, నష్టాలకు, అవమానాలకు కారకులు ఎవరో కాదు. సూక్ష్మంగా ఆలోచిస్తే దానికి కారకులు తన మనస్సు గానీ, తన కర్మగానీ, జీవుడుగాని, దేవుడుగాని ఏదో అయివుంటుంది. మోహం అనే త్రాళ్ళను తెచ్చి అటూ ఇటూ కదలనివ్వకుండా మెడకు చుట్టి ఇతరులు నవ్వేలాగా ఇంటింట త్రిప్పించి అంతులేని కోరికలతో దుఃఖంతో కుమిలేటట్లు చేసింది. కోట్లకొలది జన్మలలో చేసిన పాపాలను తననుండి తొలగించడానికి తన పేరును నాలుక చివర

నిలుపుమని, అంతే చాలునని శ్రీవేంకటేశ్వరునికి విన్నవించుకుంటూ అన్నమయ్య —

బౌళి

"చిత్తమో కర్మమో జీవుఁడో దేవుఁడో
వొత్తిన యీ చేఁత లోకరివిగావు ॥

పదిలమైన మోహపాశంబులు దెచ్చి
మెదలకుండఁగ నాకు మెడఁజుట్టి
యెదిరివారు నవ్వనింటింటఁ దిరిగించి
తుదలేని యాసల దుఃఖాతురునిఁ జేసె ॥

కొలఁది మీఱ జన్మకోట్లఁ బెనగొని
తొలఁగని నాలోని దురితము
తొలఁగింప నాలుక తుదకు నీపేరిచ్చి
తెలుపు మింతయు చాలుఁదిరువేంకటేశా"! (1-309)

అనే సంకీర్తన రచించాడు. అన్నమయ్యకు పెద్దల బలవంతం కారణంగానే ఇద్దరు భార్యలతో వివాహం జరిగింది. సాంసారిక బాధలు, కర్మలు తొలగించడానికి శ్రీవేంకటేశ్వర నామానికే శక్తివుందని అన్నమయ్య విశ్వసించాడు.

ఈ విధంగా అన్నమయ్య ప్రజలను భక్తిమార్గంలో నడిపించడానికి, జ్ఞానవంతుల్ని చేయడానికి, మోక్షాన్ని సిద్ధింపజేయడానికి తన సంకీర్తనల ద్వారా అనేక రీతులుగా ప్రబోధలు చేశాడు. పరమ భక్తుడైన అన్నమయ్య తన కర్తవ్యాన్ని పూర్తిచేసి నిష్క్రమించి ఇప్పటికి నాలుగు వందల ఎనభై ఎనిమిది సంవత్సరాలయింది. కానీ వాటిని ఆచరించవలసిన మన కర్తవ్యమే మిగిలిపోయింది.

"కోస్తావాణి" (8-3-1992)

# అన్నమయ్య సంకీర్తనల్లో మాతృ లాలన

అన్నమయ్య ఒక చిన్న పల్లెటూరులో పుట్టి పెరిగిన పరమ భాగవతోత్తముడు. ఆ పల్లెటూరు రాయలసీమలో కడప జిల్లా, రాజంపేట తాలూకాలోని తాళ్ళపాక. అన్నమయ్య అప్పని వర ప్రసాది కాబట్టి పుట్టుకతోనే ప్రతిభావంతుడు, అయినా అన్నమయ్య వేదాలు, పురాణాలు, రామాయణ, భారత భాగవతాలు, సకల శాస్త్రాలు కూలంకషంగా అధ్యసించిన పండితోత్తముడు. ఈ పవిత్ర గ్రంథాల సారాంశమంతా వెన్నుని వరం చేత జిహ్వారంగ సీమ తమంత తాముగా వచ్చి నర్తించగా అతడు ఆడిన మాటెల్ల అమృత కావ్యంగా, పాడిన పాటెల్ల పరమగానంగా మారసాగడంతో ముప్పై రెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనల్ని రచించిన కారణ జన్ముడు అన్నమయ్య. అతడు సర్వకాల సర్వావస్థల్లోని సమస్త ప్రజానీకానికి శాశ్వత వరాన్నిచ్చి సమస్త జీవుల్ని పరి పోషించి సంరక్షించే విష్ణుమూర్తి, లీలల్ని, మానవతా ప్రబోధాన్ని సంకీర్తనల రూపంలో అందించున ప్రజాకవి.

అన్నమయ్య సంస్కృత భాషలోను, తెలుగు గ్రాంథిక భాష లోను, శిష్ట వ్యావహారికంలోను, పామర భాషలోను, గ్రామీణుల జానపద భాషలోను సంకీర్తనలు రచించాడు. అన్ని రకాల ప్రజల మనస్తత్వాలకు, అభిరుచులకు తగిన శృంగార సంకీర్తనలు, వైరాగ్య సంకీర్తనలు, తత్వాలు ఉత్సవ కీర్తనలు, సామాజిక ప్రబోధాత్మక కీర్తనలు వివిధ కులవృత్తుల కీర్తనలు, గొబ్బి, సువ్వి, అల్లోనేరేళ్ళు, జాజర, సోది, ఏల, శోభన, హారతి మొదలైన అనేక జానపదగేయ రీతుల్ని రచించాడు. వీటి అన్నింటిలోను వస్తువు ఒక్కటే. అది పన్నెండవ శతాబ్దంలోని శ్రీమద్రామానుజాచార్యులు ఏర్పరచిన విశిష్టాద్వైత మత సిద్ధాంతం, పోతన మహాకవి —

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
..............................
కుంభినీ ధవుఁ జెప్పెడి గురుడు గురుడు
..............................
తండ్రీ! హరి చేరుమనియెడి తండ్రి తండ్రి"
..............................

అని నిర్ధారించిన వారి భక్తి తత్వం.

అన్నమయ్య సమాజంలోని అన్ని రకాల మనుష్యుల మన స్తత్వాలను బాగా తెలుసుకొన్న తత్వవేత్త. సమాజ సౌధానికి కుటుంబం మూల స్తంబం వంటిదని, ఆ కుటుంబంలో ఇంటి దీపమైన ఇల్లాలిదే ప్రథమ స్థానమని, ఆ ఇల్లాలు జ్ఞానవంతురాలు అయితే భర్త, పిల్లలు తదితరులు జ్ఞానవంతులౌతారని, యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః అని అన్నమయ్యకు తెలియనిది కాదు. అందుకే అన్నమయ్య ఇల్లాలి ద్వారా కుటుంబాన్ని, కుటుంబం ద్వారా సమాజాన్ని, సమాజం ద్వారా దేశాన్ని జ్ఞాన మార్గంలో నడిపించి ఉద్ధరించడం కోసం అనేక రకాలైన స్త్రీల పాటల్ని అన్నమయ్య రచించాడు.

ఆ స్త్రీల పాటలలో కూడా తల్లి బిడ్డను లాలించి పాలించి, ఆడించి, మురిపించిన సన్నివేశాలు ఆనందానుభూతుల్ని కలిగిస్తాయి. కుటుంబంలో స్త్రీకి అనురాగభరితమయిన, రామణీయకమైన భార్య దశ తర్వాత వచ్చేది వాత్సల్యపూరితమయిన మాతృత్వదశ. కుటుంబంలో ప్రకృతి గతంగా పురుషుడికి లేని ప్రత్యేకత, ప్రాధాన్యం స్త్రీకి వచ్చిందంటే అది మాతృత్వ దశవల్లనే. బిడ్డను నవ మాసాలు ఉదరంలో భరించి ప్రసవించడమనేది మహా నరక యాతన. అయినా ప్రసవం తర్వాత తల్లి బిడ్డవల్ల పొందే మధురానుభూతి అమృతోప మానమయినది. తన బిడ్డ పెరిగి పెద్దవాడై రాముడంతటి గంభీరుడు కావాలని, కృష్ణుడంతటి మహనీయుడు కావాలని కలలు గంటుంది.

అప్పుడు ఆ తల్లి —

లాలనుచు పాడరమ్మా ఈ బిడ్డ లక్ష్మీ విలాసుడమ్మా
శ్యామలాకారుడమ్మా ఈ బిడ్డ లీలావతారుడమ్మా

అని లాలిపాట పాడుతూ యోగి తుల్యమైన ఆ బిడ్డకు సంగీతం ద్వారా ఆనందాన్ని అందిస్తూ భక్తితత్వాన్ని బోధిస్తుంది. అన్నమయ్య ఈ లాలి పాటల ధోరణిలోనే—

లాలనుచు నూఁచేరుల లలన లిరుగడల
బాలగండవర గోపాల నినుఁజాల ॥

ఉదుటు గుబ్బల సరము లుయ్యాల లూఁగ
పదిరి కంకణరవము బహుగతుల మ్రోఁగ
వొదిగి చెంపల కొప్పు లొక్కింత వీఁగ
ముదురు చెమటల నళికములు తొప్పదోఁగ

అనే పాటను రచించాడు. ఈ పాటలో బాలగోపాలుని ఉయ్యాలలో వేసి ఇరువైపుల నుంచి స్త్రీలు ఉయ్యాల ఊచడం ఉయ్యాల ఊస్తున్నప్పుడు ఆ రమణుల కంఠ హారాలు ఉయ్యాలవలె ఊగుతుండడం, హస్త కంకణాలు రవళించడం, తల కొప్పులు చెదరడం నుదుటిపై స్వేద బిందువులు ముసరడం మొదలైన సహజ చర్యలను కళ్లకు కట్టినట్టుగా అన్నమయ్య వర్ణించాడు.

పశువు చెవులొగ్గి వినును సర్వంబు నాడు
శిశువు రోదన మాని నిశ్చేష్ట వినును
హృదయ రంజన మిడువంత లెల్లమాపు
గాన మమృత తుల్యంబు నిక్కంబు సుమ్ము

అన్నట్లు, శిశుర్వేత్తి పశుర్వేత్తి గానరసంఫణి అనే ఆర్యోక్తి ప్రకారంగానే శిశువులు, జోకొడుతూ పాట పాడనిదే సామాన్యంగా

నిద్ర పోరు. తల్లి పాడగల్గిన కంఠం కలిగి వుంటే సరే, లేకపోతే కుటుంబంలో పాడగల్గిన ఇతర స్త్రీ పురుషులెవరైనా పాడి తీరవలసిందే. పోతన భాగవతంలో గోపికలు చిన్ని కృష్ణునికి —

జోజో కమల దళేక్షణ
జోజో మృగరాజ మధ్య
జోజో పల్లవ కరపద
జోజో పూర్ణేందు వదన జోజో యనుచున్

అని పాడిన ఒక పద్యం కనిపిస్తుంది. లోక వ్యవహారంలో కూడా —

జో అచ్యుతానంద జోజో ముకుందా
రార పరమానంద రామ గోవిందా ॥

తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించి
నాలుగూ వేదములు గొలుసులమరించీ
బలువైన ఫణిరాజు పానుపమరించీ
చెలియు డోలికలోన చేర్చి లాలించీ

అనే పాట ప్రసిద్ధంగా కనిపిస్తుంది. అన్నమయ్య కూడా తాను తల్లిగా మారి పరమాత్మను బిడ్డగా భావించుకొని వాత్సల్య భక్తితో శ్రీకృష్ణుని బాల్య చేష్టల్ని వర్ణిస్తూ —

జో వచ్యుతానంద జోజో ముకుందా
రావె పరమానంద రామ గోవిందా

నందునింటను జేరి నయము మీరంగా
చంద్రవదనలు నీకు సేవ చేయంగ

అంతముగ వారిడ్ల నాడు చుంతంచ
మందలకు దొంగ మాముద్దు రంగ
అంటూ జోలపాట పాడుతున్నాడు.

చాలామంది పసిపిల్లలు బువ్వ తినకుండా మారాము చేస్తుంటారు. పొట్టనిండా బువ్వ తినకపోతే కంటినిండా నిద్రపోకుండా పోరు పెడుతుంటారు. ఆ బాధకు తట్టుకోలేక తల్లి ఎలాగైనా తినిపించాలని పట్టుపట్టి బిడ్డకు చందమామను చూపుతూ 'దాయె దాయె చంద మామ' అని పిలుస్తూ గోరుముద్దలు తినిపిస్తూ —

చందమామ రావే జాబిల్లి రావే
కొండెక్కి రావే కోటి వేలు తేవే
బండెక్కి రావే బంతిపూలు తేవే
తేరు మీద రావే తేనెపట్టు తేవే
అన్నీ తెచ్చి మా పాపయికీయవే
అనే పాటను పాడుతుంది.

అన్నమయ్య కూడా మారాము చేస్తున్న చిన్ని కృష్ణునికి చందమామను చూపిస్తూ గోరు ముద్దలు తినిపిస్తూ ఉల్లాసంగా —

చందమామ రావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడికోర వెన్నపాలు తేవో ॥

నగుమోము చక్కనయ్యకు నలువ పుట్టించిన తండ్రికి
నిగమము లందుండే అప్పకు మా నీల వర్ణునికి
జగమెల్ల ఏలిన స్వామికి చక్కని ఇందిర మగనికి
ముగురికి మొదలైన ఘనునికి మా ముద్దుల మురారి
బాలునికి ॥

అనే పాటను గానం చేశాడు. ఈ పాటలో చిన్ని కృష్ణుడు నవ్వు ముఖంతో వున్న అందమైనవాడని, బ్రహ్మను గన్న తండ్రి అని వేదాలలో విరాజిల్లే వాడని, జగాలను రక్షించేవాడని, స్తుతించబడ్డాడు.

తల్లిదండ్రులు తమ శిశువుకు గర పే విద్యాభ్యాసం ఉగ్గుపాలతో ప్రారంభమవుతుందని లోక ప్రసిద్ధి. ఒక వ్యక్తిలో ఉత్కృష్టమైన మంచితనం లేదా దుష్కృతమైన చెడుతనం కనిపిస్తే ఇతనికి ఈ బుద్ధి ఉగ్గుపాలతోనే వచ్చింది అనడం పరిపాటి. తెలుగుతల్లి తన బిడ్డను కాళ్లపై పరుండ బెట్టుకొని చిన్న గిన్నెలో కొంచెం ఆముదం, పాలు, ఉప్పుగల్లు వేసి రంగరించి తినిపిస్తుంది. సహజంగా పిల్లలు ఉగ్గు తిన డానికి ఇష్టపడరు. కానీ అది మంచి జీర్ణశక్తిని, ఆరోగ్యాన్ని ఇస్తుంది కాబట్టి తల్లి ఎలాగైనా తినిపించాలని ప్రయత్నిస్తూ —

ఊ ఊ ఉంగన్న
ఉగ్గుపాలు ఇందన్న
గంటెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న

అంటూ పాడివినిపిస్తుంది.

ఉగ్గు పెట్టిన తర్వాత మూతికి అంటుకున్న జిడ్డునంతా ఒంటికి రాచి, కాళ్లు చేతులను కుడి ఎడమలుగా వంచి —

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
ఏనుగుతిన్న వెలగపండు జీర్ణం
గుఱ్ఱంతిన్న గుగ్గిళ్లు జీర్ణం

అని పాడుతూ మురిపిస్తుంది.

అన్నమయ్య కూడా బాలకృష్ణునికి ఉగ్గుపెట్టమని చెబుతూ శిశువు ఉగ్గుకోసం చేయి చాస్తున్నాడు అని, తల్లిలా ఉత్కంఠతో

ఉగ్గు పెట్టరే వోయమ్మా చె
య్యొగ్గీ నిదె శిశువోయమ్మా

అని ఆదేశిస్తూ ఉగ్గుపెట్టిన తర్వాత ఈ దివ్యబాలుని ఒంటిని మామూలు బాలునివలె ఊచకండని, ఉదరం లోని జగాలన్ని కదలిపోతాయని వేడి పాలు ఒంటిపై పడకుండా తొలగదీయండని హెచ్చరిక చేస్తూ —

కడుపులోని లోకమ్ములు గదలీ
నొడలూఁచకురే వోయమ్మా
తొడికెడి సరుగునఁదొలగఁదీయరే
వుడికెడి పాలివి వోయమ్మా

అంటూ ఉగ్గుపాట పాడుతున్నాడు. లోకంలో సాధారణంగా స్త్రీలు దుర్భరమయిన ఆ వేదన అనుభవిస్తూ ఏడుస్తూ శిశువులకు కంటారు. కానీ దైవస్వరూపుడయిన శిశువును ప్రసవిస్తున్న దేవకి మాత్రం నవ్వుతూ ప్రసవించిందంటూ —

సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁగనియె

అని ఒక సువ్వి పాటలో తెలియ చేశాడు. అన్నమయ్య దైవకిశోరంలో కనిపించే రూప లావణ్యం అద్భుతచేష్టలు, మహిమలు, సామాన్య శిశువులో కనిపించవు అందుకే అన్నమయ్య విష్ణు స్వరూపుడైన శిశువును వర్ణిస్తూ —

'చిన్ని శిశువు చిన్ని శిశువు
యెన్నడు చూడమమ్మ యిటువంటి శిశువు' అని

'అబ్బురంపు శిశువు ఆకు మీఁది శిశువు
దొబ్బుడురోల శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి।

పుట్టు శంఖ చక్రములఁలుట్టిన యా శిశువు
పుట్టఁకతొల్లేమూరు పుట్టువైన శిశువు
వొట్టుక పాలు వెన్నలునోల లాడు శిశువు
తొట్టెలలోని శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి

అనే సంకీర్తనను రచించాడు.

ప్రళయ కాలంలో విష్ణుమూర్తి శిశు రూపుడై మర్రాకుమీద పవ్వళించి ఒక కాలి బొటనవేలును చేతితో పట్టుకొని నోటిలో వేలు ఉంచుకొని లోకాలను తిలకిస్తూ ఉంటాడని పురాణాలు చెబు తాయి. ఈ అద్భుతమయిన శిశువు జన్మించేటప్పుడు శంఖ చక్రాలతో పుట్టినవాడని, రోలును ఈడ్చుకుంటూ వెళ్ళి మద్దిచెట్లను కూల్చిన వాడని, గోపకాంతల ఇండ్లలోని పాలు వెన్నలు ముచ్చిలించిన వాడని, అన్నమయ్య చిన్నికృష్ణుని లీలల్ని వర్ణించాడు.

తుంటరి పిల్లవాడు పొరుగిండ్లకెళ్ళి అల్లరిచేష్టలు చేస్తున్నపుడు ఆ ఇంటి స్త్రీలు వచ్చి తల్లికి ఫిర్యాదు చేయడం, ఆ తల్లి బిడ్డపై నున్న మమతానురాగాల్ని అణచుకోలేక ఫిర్యాదు చేసిన వారినే కోపగించి మందలించడం, లోకంలో గమనిస్తుంటాం. అన్నమయ్య సంకీర్తనల్లో కూడా గోపికలు చిన్నికృష్ణుని అల్లరి చేష్టలను భరించ లేక యశోదతో —

'ఏమి సేతుమమ్మా నేము యెశోదమ్మా
గామిడి తనముల కడఁగి బాలుఁడు'

అని ఫిర్యాదు చేయగా యశోద తన బిడ్డపైనున్న అత్యంత మమతానుబంధంవల్ల గోప స్త్రీలతో మీ ఇండ్లు మీరు జాగ్రత్త

చేసుకోవాలి కానీ పాలు వెన్నలలో చేయి పెట్టకని నా బిడ్డను ఎందుకు ఆడిపోసుకొంటారు ? చిన్న పిల్లలు తమ చేతికందిన పాలు పెరుగు త్రాగకుండా ఊరుకుంటారా అని సహజమయిన అనురాగంతో తల్లులు తమ పిల్లలు చేసిన అల్లరి చేష్టలను సమర్థించుకొనే తీరు తెన్నులను అన్నమయ్య —

'కానరటె పెంచరటె కట కటా బిడ్డలను
నేను మీ వలెనే కింటి నెయ్యమైన బిడ్డని

బాయిటఁబార వేసిన పాలు వెన్నలును
చేయి పెట్టుకుందురా చిన్ని బిడ్డలు
మీ ఇండ్లు జతనాలు మీరు నేసికొనక
పాయక దూరేరేలే ప్రతీ లేని బిడ్డని'

ఇనే సంకీర నలో వర్ణించాడు. ఒక్కోసారి అల్లరి పిల్లలపై పెద్దలకు ఫిర్యాదు చేసిన వారికి సైతం పిల్లలపై జాలి కలిగి వారిని కొట్టుతుంటే అడ్డుపోతుండటం లోకంలో గమనిస్తుంటాం. అన్నమయ్య సంకీర్తనలో కూడా ఈ విధమైన సహజధోరణి కనిపిస్తుంది.

'మొత్తకురే యమ్మలాల ముద్దులాడు వీఁడే
ముత్తెమువలె నున్నాఁడు ముద్దులాఁడు ॥

అంటూ ఒక గోపిక ముద్దుకృష్ణునిపై జాలితో అడ్డుపడుతుంది.

విష్ణుమూర్తి ధరించిన అన్ని అవతారాలకన్నా రామావతారం, కృష్ణావతారం మిక్కిలి ఉత్కృష్టమైనవి. రెండు అవతారాలలో మహావిష్ణువు సామాన్య శిశువువలె, తల్లిగర్భంలో జన్మించి నేత్రోత్సవంగా శైశవక్రీడలు నెరపి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం ఎన్నో అద్భుత సుఘటనలను గావించి మానవాళికి ఆదర్శమూర్తు

లయ్యారు. రామావతార కాలంలో కన్నా కృష్ణావతార కాలంలో దుష్టుల సంఖ్య పెరిగిపోయింది. కాబట్టి పరమాత్మ ఒకవైపు పుట్టింది మొదలు అనేక మహిమల్ని ప్రదర్శించి దుష్ట సంహారం గావిస్తూ మరోవైపు నంద, యశోద, గోపికలను, గోపబాలురను తన అపురూప బాల్య చేష్టాదులతో మురిపించి తన్మయుల్ని చేశాడు. అన్నమయ్య సంకీర్తనల్లో బాల్య లీలాభివర్ణన మంతా శ్రీకృష్ణావతారానికి సంబంధించిందే.

అన్నమయ్యకు పరిసరాల పరిజ్ఞానం పరిపూర్ణంగా వుంది. స్త్రీ పురుష, పేద, ధనిక, పండిత, పామరులనే వివక్ష లేకుండా ప్రతివారి మనస్తత్వాల్ని, చేష్టల్ని, ఆప్యాయతానురాగాల్ని అన్నింటిని నిశితంగా పరిశీలించిన కుశాగ్రమతి అన్నమయ్య. అందువల్లనే లోకంలో సాధారణ స్త్రీలు తమ పిల్లల పట్ల చూపించే లాలన పాలనను పరమాత్మకు అన్వయించి, తాను తల్లిగా మారి వాత్సల్య భక్తితో ఆరాధించి సంకీర్తనలు రచించాడు. ఈ సంకీర్తనల్ని లోకవ్యవహారం లోని వాత్సల్య గీతాలకు అతి సన్నితంగా రచించి నందువల్ల సాధారణ స్త్రీలు కూడా అన్నమయ్య భక్తి తత్వాన్ని సులభంగా అర్థం చేసుకొని అమృతానందాన్ని పొందుతారు. తాము నేర్చుకున్న జ్ఞానాన్ని, పొందిన అనుభూతిని తమ కుటుంబస్థులకు ఇరుగు పొరుగు వారికి అందించగలరు. ఇదే అన్నమయ్య ఆశయం, మాతృలాలన సంకీర్తనల లక్ష్యం.

23-4-92 ఆకాశవాణి, విశాఖపట్టణం, తెలుగు మాసపత్రిక-1992



# సంఘ సంస్కర్తగా అన్నమయ్య

సమాజాన్ని రచనల ద్వారా ప్రగతి పథంలో నడిపించే వ్యక్తి కవి. కవులు తమ కావ్యాల ద్వారా సమాజాన్ని ప్రభావితం చేస్తే వాగ్గేయకారులు తమ సంగీతాత్మకమైన సంకీర్తనల ద్వారా సమాజాన్ని అలరింపజేసి సంస్కరిస్తారు. అలాంటి వాగ్గేయకారులలో ప్రప్రథముడు అన్నమయ్య. ఇతడు రాయలసీమలో కడప జిల్లా రాజంపేట తాలూకాలోని తాళ్ళపాక అనే గ్రామంలో జన్మించాడు. ఇతని తల్లి లక్కమాంబ, తండ్రి నారాయణసూరి. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని వరంచేత జన్మించిన పుణ్యపురుషుడు కాబట్టి అతడు ఆడిన మాటెల్లా పరమగానంగా మారసాగింది. అన్నమయ్య జగన్మాతాపితరులు, కలియుగ ప్రత్యక్ష దైవాలు అయిన అలమేల్మంగా శ్రీనివాసులపై 32 వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలను రచించాడు! తిరుమల తిరుపతి దేవస్థానంవారి శ్రద్ధాసక్తుల వల్ల, నిర్విరామ కృషి వల్ల నేడు 15 వేల సంకీర్తనలు వెలుగు చూస్తున్నాయి. ఇంటింటా అన్నమయ్య సంకీర్తనల స్వరఝరి ప్రవహిస్తోంది.

అన్నమయ్య ఎంతటి పరమభక్తుడైనా, భక్తి ప్రబోధకుడైనా సమాజంలో తానూ ఒక వ్యక్తే కాబట్టి సమాజాన్ని విడిచి ఆయన సంకీర్తనలు రచించలేదు. ఆధునిక కాలంలో వేమన, రాజా రామమోహనరాయులు, కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు మొదలైన మహనీయ సంస్కర్తలు, సమాజంలోని మూఢ నమ్మకాలు, ఆచారాలు, కుళ్లు కుత్సితాల్ని, మానవ సంకుచితత్వాన్ని పోగొట్టి ప్రజలలో హేతువాద దృష్టిని, ప్రగతిశీల దృక్పథాన్ని కలిగించినట్టుగా 15వ శతాబ్దంలోని తాళ్ళపాక అన్నమయ్య సమాజ శ్రేయస్సు కోసం ఎన్నో విధాలుగా ప్రబోధలు చేశాడు.

భగవంతుడు సృష్టించిన గాలి, నీరు, భూమి, అగ్ని, ఆకాశం అనే పంచభూతాలు సృష్టిలోని జీవులందరి పట్ల సమానంగానే వర్తిస్తున్నాయి. వీటికి జీవులు, నిర్జీవులు, మానవులు, జంతువులు, కీటకాలు, పేద, ధనిక, స్త్రీ, పురుష, అధికం, అల్పం అనే భేదాలు లేవు. కాని మనస్సు, మేధస్సు కలిగిన మానవులు, సంకుచిత మనస్తత్వంతో ఈ భేదాలు చూపుతూ సాటి మనుష్యులను బాధించి అవమానం చేస్తుంటారు. అలా హీనంగా ప్రవర్తించడం సమంజసం కాదని, అందరికీ ఆ శ్రీహరియే అంతరాత్మ అంటూ 'తందాన ఆహి తందనానపురె' అనే జానపద రీతిలోని సంకీర్తన ద్వారా అన్నమయ్య తెలియజేశాడు. లోకంలో రాను రాను దుర్మార్గతనం పెరిగిపోతోందని సౌమ్యత్వం ప్రజలలో క్షీణించి పోతోందని, ఎటుచూసినా ధర్మం కనిపించడం లేదని మందుకోసం వెదికినా మంచి పనులు కనిపించడం లేదని అన్నమయ్య ఎంతో ఆవేదన పడుతూ 'కాల విశేషమో లోకము గతియో సన్మార్గంబులు కీలు వదలె' అనే సంకీర్తనను రచించాడు.

శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో - మానవుల గుణాలను బట్టి, వారు చేసే కర్మలను (పనులను) బట్టి తాను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు వర్ణాలుగా విభజించానని చెప్పాడు. కాని ఆ భగవంతుడు అన్ని వర్ణాల వారి పట్ల వారి వారి భక్తి ప్రపత్తులను బట్టి సమానంగా దయ చూపిస్తాడు. ఆ భగవంతునికి లేని కుల విభేదం మానవులకు ఉండకూడదని అందరూ భక్తి విశ్వాసాలు కలిగి వుండాలని 'ఏ కులంజుడేమి యెవ్వడైన నేమి' అనే సంకీర్తనలో సమాజానికి ఉద్బోధ చేశాడు.

మన భారత దేశ సమాజంలో అనాదిగా వస్తున్న మూఢాచారం జంతుబలి, ముఖ్యంగా గ్రామీణ ప్రజలు జాతర సమయాలలో

మేకలు, పొట్టేళ్లు, కోళ్లు మొదలైన వాటిని క్షుద్ర దేవతలకు బలి ఇస్తుంటారు. ఇలా మూర్ఖంగా మానవత్వం లేకుండా జంతుబలి ఇవ్వడం మంచిది కాదని పరమాత్మ కోరేది అసలైన మానస పూజ అని 'నేను నీ వాడిని' అని పరమాత్మకు విన్నవించుకుంటే చాలని ఉద్బోధిస్తూ 'మారు చేతులీయ వద్దు మారు గాళ్లీయ వద్దు బీరాన గుండెలు కోసి పెట్టవద్దు' అనే సంకీర్తన రచించాడు.

అన్నమయ్య దృష్టిలో నిజమైనధనం అంటే మహావిష్ణువే. ఆ స్వామి కరుణ, ఆ స్వామి ఇచ్చే వరాలు శాశ్వతమైనవి, చెడిపోనట్టివి. లోకంలో చేతులు మారేధనం వల్ల జీవితావసరాలు తీర వచ్చుకానీ అసలైన మనశ్శాంతి మాత్రం దొరకదు అందువల్లనే నారదుడు, ప్రహ్లాదుడు, ధ్రువుడు, బ్రహ్మ, శివుడు మహర్షులు మొదలైనవారందరూ నిరంతరం నారాయణ మంత్రాన్ని జపిస్తుంటారని ఆ మంత్రమే అసలైన చెదరని, తరగని ధనం అని మోక్షమిచ్చే ధనం అని జ్ఞానబోధచేస్తూ

'ఇచ్చలోఁ గోరేనెల్లా ఇచ్చే ధనము
అచ్చుత నామ మెపో అధికపు ధనము'

అనే సంకీర్తన రచించాడు.

లోకంలో దుర్మార్గులు, దుష్టులైన మానవులు, జానెడు పొట్టకోసం, పిడికెడు మెతుకులు కోసం అనేక రకాలపాట్లు పడుతుంటారు. సజ్జనులను బాధపెట్టుతుంటారు. వారిపచ్చటి బ్రతుకుల్ని చూచి ఓర్వలేక లోలోపల హింసలు పెడుతుంటారు. అలాంటి నీచుల బ్రతుకుకూడా ఒక బ్రతుకేనా అంటూ అన్నమయ్య వారిని మంచి మార్గంలోకి త్రిప్పడం కోసం —

"కడుపెంత తాఁగుడుచు కుడు వెంత దీనికై
పడని పాట్ల నెల్లఁబడి పొరల నేలా"

అనే సంకీర్తన రచించాడు.

కుటుంబంలో, సమాజంలో కొంతమంది స్త్రీ, పురుష అనే విభేదాలు చూపుతూ స్త్రీని బానిసగా చేసి హింస పెడుతుంటారు. పురుషులమనే అహంకారంతో స్త్రీలను అణగ్రదొక్కుతూ క్రూరంగా ప్రవర్తిస్తుంటారు. అలా విభేదాలు చూపకూడదని, స్త్రీలు, పురుషులు ఇద్దరూ మనుష్యులేనని ఇద్దరూ సమానులేనని సమతాధర్మాన్ని బోధిస్తూ—

"పొలఁతులు జీవులే పురుషులు జీవులే
తలఁప భావ భేదము లే కాని
బలిమి స్వతంత్రముఁ బర తంత్రమొకరికి
యెలమి నిందులోఁ జెల్లెహీనాధికములే"

అనే సంకీర్తన రచించాడు.

ఈ విధంగా అన్నమయ్య జనన మరణాలనే ప్రవాహంలో పడి కొట్టుమిట్టాడుతున్న ప్రజలకు ఒకవైపు మోక్ష మార్గాన్ని ఉపదేశిస్తూ, మరోవైపు సమాజంలోని క్రూరత్వాన్ని, మూర్ఖత్వాన్ని, ఛాందసత్వాన్ని పోగొట్టి మానవత్వాన్ని భక్తితత్వాన్ని అనేక రకాల సంకీర్తనల ద్వారా ప్రబోధించాడు, అన్నమయ్య సంకీర్తనల్లోని మానవతా ప్రబోధలు, భక్తి సిద్ధాంతాలు ఒక తెలుగు ప్రజలకే కాకుండా మానవులందరికి జ్ఞాన దీపికల వంటివి.

'క్రోస్తావాణి' 5-5-92



# అన్నమయ్య అనురాగ వర్ణన

మానవజీవితం అనురాగం వల్లనే ఆనందమయం అవుతుంది. అనురాగం చవిచూడని మానవజీవితం నిస్సారమయింది. ఈ అనురాగం భార్యాభర్తల మధ్య, ప్రేయసీ ప్రియుల మధ్య, నాయికా నాయకుల మధ్య ప్రస్ఫుటమై రసవంతంగా పరిణమిస్తుంది. అన్నమయ్య ఈ అనురాగాన్ని దివ్య నాయికా నాయకులైన పద్మావతీ తిరుమలేశుల మధ్య అమృతోపమానంగా చిత్రించి శృంగార నాయికగా మారుతూ స్వామివారిని నాయకుడుగా ప్రేమించి, ఆరాధించి తన్మయత్వం చెందడం కనిపిస్తుంది. నాయికా నాయకుల మధ్య ఎప్పుడైనా ఏమైనా పొరపొచ్చాలు కలిగినప్పుడు ఒక్కొక్కసారి తానే చెలికత్తెగా మారి ఇద్దరికీ బుద్ధులు చెప్పడం, లేదా తప్పిదాలు చేసిన వారికి హెచ్చరికలు చేసి ఇద్దరినీ కలపడం మొదలైన సన్నివేశాలు ఇందులో కనిపిస్తాయి. అన్నమయ్య ఈ కలియుగ ప్రజలను ఉద్ధరించి తరింప చేయడానికి తిరుమలలో వెలసిన వేంకటపతి ముద్రాంకితంతో, అనురక్తి, అనుపమ భక్తితో కూడిన వేలాది సంకీర్తనలు రసహృదయులకు మలయజ గంధ వీచికల వంటివి.

తారుకాణ సేసుకొంటే తానే నేను
యీ రీతినే నవ్వుఁగాని ఇంటికి రమ్మనవే ॥

చెక్కులివె చెమరించె చిత్తమెల్లా జిగిరించె
కుక్కినట్టు కోరికలు కొనసాగెను
తొక్కినాఁడు నా పాదము తొలుతే సందడిలోన
యెక్కడ పరాకు సేసీనింటికి రమ్మనవే ॥

దప్పిదేరె పెదవుల తమకము పైవార
కొప్పువీడి చన్నులపై కుప్పలాయెను
ముప్పిరిగాఁ గట్టినాఁడు ముంజేత కంకణము
యిప్పుడేల నించీ సిగ్గులు యింటికి రమ్మనవే ॥

ఆసూలంటి నిన్నుఁగూడె అంగమెల్లాఁ బులకించె
చేయి చేయి సోఁకి యాస చిమ్మిరేఁగెను
చాయలాసన్నలా సేస చల్లె శ్రీ వేంకటేశుఁడు
యీ యెడ నన్ను మన్నించి యింటికి రమ్మనవే ॥
(25-239)

నాయిక చెలికత్తెతో తాళ్ళాణించుకుంటే తన ప్రియుడే తాను అని చెబుతూ - తనకు చెక్కులు చెమరిస్తున్నాయని, మనసు చిగురిస్తోందని, కోరికలు కొనసాగుతున్నాయని, తన పాదాన్ని మొదటే అందరి ముందూ తొక్కాడని, అలాంటి అతడు ఇప్పుడు పరాకు చేస్తున్నాడని, తన మోహము అతిశయించగా పెదవులు దప్పిదేరి వున్నాయని, కొప్పు విడిపోయి తన చన్నులపై కుప్పలుగా పడి ఉందని, ఎంతో ప్రేమతో ముంజేతిపై కంకణం కట్టినవాడని, అలాంటి అతను ఇప్పుడు సిగ్గు పడుతున్నాడని, తన తనువెల్లా నిమరగా ఒలువెల్లా పులకరించిందని, చేయి చేయి తాకగా తనలో ఆశలు చేలరేగి వున్నాయని, తనపై సేసలు చల్లినాడని, అలాంటి తన ప్రియుని త్వరగా ఇంటికి రమ్మనమని చెప్పుతోంది. ఈ సంకీర్తలో నాయికా నాయకులు పద్మావతీ శ్రీనివాసులు. ఈ విషయాన్ని అన్నమయ్య ఈ సంకీర్తనలో వర్ణించాడు.

ఇదివో నీ మహిమలు యేమని పొగడేమయ్యా
కదిపితేనే యినుము కనకమై మించెను ॥

సెలవి నీవు నవ్వితే చిత్తము చీఁకటి వాసె
వెలసెను నా లోని వేడుక లెల్లా
చెలిమి సేసి నా పైఁ జేయి నీవు వేసితేను
బలిమితో వలపుల పంట లెల్లాఁబండెను ॥

తప్పక నీవు చూచితే తనువు పై కాఁక మాని
వుప్పతిల్లె జవ్వనము పుదుటునను
కొప్పు దువ్వి నీవు నన్నుఁ గొన గోరు సోకించితే
కుప్పళించి తమకపు కొటారులు నిండెను ॥

చేరి నీవు పలికితే సిగ్గులు మూల కొదిగి
కారకమై నెమ్మొముసఁ గళలన్నియు
యీ రీతి శ్రీ వేంకటేశ ఇన్నిటా నన్నేలితివి
సారెనాకిట్టె మదన సామ్రాజ్యము హెచ్చెను ॥

(25-246)

రాగమయి అయిన ప్రేయసి తన ప్రియునితో - నీ మహిమలు ఏమని పొగడేది? నీవు తాకితేనే ఇనుము బంగారమై పోతుంది. నీవు నవ్వితే చిత్తములోని చీకటి తొలిగి పోయింది. నాలోని సంతోషం వికసించింది. స్నేహంతో నీవు నాపై చేయివేస్తే వలపుల పంటలన్ని పండినట్లయింది. నీవు చూస్తే నా తనువుపై వేడి తగ్గిపోయింది. యౌవ్వనం దర్పించింది. నీవు కొప్పు దువ్వితే నాలోని మోహం వెల్లివిరిసింది. నీవు మాట్లాడితే నా నిండు ముఖంలో కళలు కమ్ము కున్నాయి. యీ విధంగా నీవు నన్ను ఏలడంవల్ల నా మన్మథ సామ్రాజ్యం అతిశయించింది. అని తన ప్రేమానురాగాల్ని వ్యక్త పరచే విషయాన్ని యీ సంకీర్తనలో అన్నమయ్య మిక్కిలి రామ ణీయకంగా వర్ణించాడు.

అందులోనే వున్నవివె అన్ని విన్నపములును
కందువతోఁ దగలనీ కరుణించవయ్యా ॥

చెక్కులపై నెమజారఁజెమట నీ పచ్చడాన
గక్కన దుడుచుకొనీ గామిని
వెక్కసపు గుచముల వెట్టదీర నీ చేతుల
అక్కరతో నద్దుకొనీ నప్పటప్పటికిని ॥

అలయిక తెల్లొఁదీర నంటనున్న నీ మీఁద
పలుమారు నొరగీని పడఁతి
నిలువుఁ గొప్పువీడితే నిన్నే ముడుపుమనీ
తలఁపించి విరహపు తమకము తోడను ॥

తెల్లమిగాఁదన దప్పి దేరుచుకొని మోవి
మెల్లనే చేకొనీ నలమేలు మంగ
చెల్లుబడినీకాఁగిట (శ్రీ) వేంకటేశుఁడు గూడి
యిల్లిదే నిన్నుఁబొగడి యిచ్చకమాడీని ॥ (25-137)

ప్రేయసిపై ఉదాసీనంగా ఉంటున్న ప్రియునికి చెలికత్తె, ప్రేయసి చేస్తున్న చేష్టలలోనే అన్ని విన్నపాలు ఉన్నాయని, ప్రేమతో కరుణించమని చెబుతూ - చెక్కులపై జారుతున్న చెమటను నీ పచ్చడంతో తుడుచుకొంటోందని, తన ఎత్తైన వక్షస్థలాన్ని తనివి తీర నీ చేతులతో అద్దుకొంటోందని, తన అలసటంతా తీరేలాగా నీ మీదకి వాలుతోందని కొప్పువీడి ఉంటే విరహపు మోహంతో నిన్నే ముడువమంటోందని, నీ మోవిని తన దప్పి తీరేలా అందుకొంటోందని, నీ కౌగిటిలో చేరి నిన్ను పొగడుతోందని విన్నవించుకుంటున్న విషయాన్ని అన్నమయ్య ఈ సంకీర్తనలో హృదయ రంజకంగా వర్ణించాడు.

అలసేవు సొలసేవు అప్పుడే నీవు
వలపు రేఁచుట గాక పట్టిసటిలేఁటికే ॥

సరసమాడే విభుఁడు చన్నులెంత పిసికినా
కరఁగి కూడుటగాక కసరనేలే
గోరబుగాఁగూడేవాఁడు గోరనెంత వ్రాఁదినాను
దొరసి మెచ్చుట గాక దూర నేటికే ॥

మగఁడైన వాఁడు రతి మచ్చరము చూపితేను
నగుట గాక మాటల వెగటు లేలే
తగుల మోహించు వాఁడు తమకించి పొదిగితే
సొగసి లోనౌటగాక బిగియ నేలే ॥

సందడిఁ బెండ్లాడేఁవాడు సారెఁబువ్వుల వేసితే
విందులఁజొక్కుట గాక విసువులేలే
యిందరిలో (శ్రీ) వేంకటేశుడిట్టె నిన్ను నేలె
నందుకొనవలెఁగాక చలపట్ట నేలే ॥ (25-135)

శృంగార క్రీడలాడుతున్న ప్రియునిపట్ల విరసంతో ఉంటున్న ప్రేయసికి చెలికత్తె - నీ ప్రియుడు సరసాలాడుతుంటే అప్పుడే అలసిపోతున్నావు. వేపును పెంచకుండా ఎందుకు వ్యర్థపు కపటాలు నీపై అంతగా మక్కువ చూపుతుంటే నీవు కసరడమెందుకు ? అతనిని మెచ్చుకోవాలి గాని దూషించడమెందుకు ? నీ మగడు రతిపై వేడుక చూపుతుంటే, నవ్వుతుండాలిగాని విరక్తి ఎందుకు? నిన్ను మోహించిన నీ ప్రియుడు నీపై మచ్చికాలు చూపితే అతనికి లోబడి ఉండాలి గాని ఎందుకు బిగుసుకుంటావు? నిన్ను వివాహమాడబోయేవాడు ప్రతిసారి పువ్వులను వేసితే ప్రేమ చూపించకుండా ఎందుకు విసుగుకుంటావు ? నీ ప్రియుడు ఇంతమందిలో నిన్ను ఏలినందుకు అనురాగం

చూపాలి కాని సాధించడమెందుకు? అని హితబోధ చేస్తున్న విష యాన్ని అన్నమయ్య ఈ సంకీర్తనలో హృద్యంగా వర్ణించాడు.

కంటిమయ్య నీ చేతలు కన్నుల పండుగ గాను
పెంటలైన ముచ్చటలే ప్రియము నీకు ॥

మంతన మాడేటి వేళ మజ్జన మాడేటి వేళ
ఇంతితోడి సరసము లింపులు నీకు
అంతలోఁగప్పుర కాపు అవధరించేటి వేళ
సంతతపు వసంతము చవులు నీకు ॥

పొందుల వేళలఁదట్టు పుణుఁగు పూసేటి వేళ
ఇందుముఖితోడి మాటలితవు నీకు
చెందమ్మి పూవు దండలు సింగారించుకొనే వేళ
విందులమోవి యీవులు వేడుక నీకు ॥

సొలసి నవ్వేటివేళ సొమ్ము లిడుకునే వేళ
అలమేల్మంగ కూటమి అనవు నీకు
యెలమి శ్రీ వేంకటేశ ఇద్దరుఁ బెండ్లాడే వేళ
కొలువులోని మొక్కులు కొసరు నీకు ॥ (25-136)

నాయికా నాయకులైన అలమేల్మంగా శ్రీనివాసుల అన్యోన్య అనురాగాన్ని సరసపు చేష్టలను చూచి సంతోషించిన చెలికత్తెలు శ్రీనివాసునితో - నీ చేష్టలన్నీ కన్నుల పండుగగా చూశాము. అధికమైన ముచ్చటలే నీకు ప్రియమైనవి. రహస్యాలు చెప్పుకొనే వేళ, అభిషేకవేళ, ప్రేయసి తోడి సరసాలే నీకు ఇంపైనవి. కర్పూ రము పూసుకొనే వేళ నీకు నిత్య వసంతపు రుచులు. కలయిక వేళ లోను, కస్తూరిపూసే వేళలోను చంద్రదముఖి అయిన నీ ప్రేయసితో

సరస సల్లాపాలే నీకు ఇష్టం. ఎర్రతామర పూలదండలు సింగారించు కొనె వేళ అధరాల మధురిమలో నీకు విందులు. ప్రేమతో నవ్వే వేళ లోను, ఆభరణాలు పెట్టుకొనే వేళలోను నీ చెలి అయిన అలమేల్మం గతో సంయోగమే నీకు అనువయింది. ఇద్దరూ పెండ్లాడే వేళలో కొలువులో అందరూ నీకు మొక్కులు ఇవ్వడమే నీకు ఆనందాతి శయం. అని చెబుతున్న విషయాన్ని అన్నమయ్య మానసానంద కరంగా వర్ణించాడు.

అన్నమయ్య అన్ని వయసులలోని, అన్ని కాల ప్రజల మన స్తత్వం బాగా తెలిసిన జ్ఞానవంతుడు కావడంవల్ల శృంగార రీతిలో సామాన్య మానవుల వైజంవలె దేవతా స్వరూపులైన పద్మావతీ శ్రీనివాసుల ప్రణయాన్ని వర్ణించి ప్రజలను ఆకర్షించుకున్నాడు. ఈ సంకీర్తనల్లోని శృంగారం లౌకిక శృంగారం వలె మనుష్యుల్ని మన్మ థావేశ పూరితుల్ని చేయకుండా అమలిన శృంగార ప్రేమను వికసింప జేస్తుంది. మధుర భక్తి భావనలను గుబాళింప జేస్తుంది. పద్మావతీ శ్రీనివాసులపై నిర్మలమయిన ప్రేమను, నిష్కామమైన భక్తిని ఉద్దీ పింప జేస్తుంది.

3-6-92 (కోస్తావాణి)



# అన్నమయ్య తలపుల తరంగాలలో శ్రీనివాసుడు

ఈ కలియుగంలో ప్రజల కామితాలను ఈడేర్చి వారి జన్మలను కడ తేర్చడానికి వేంకటాచలంపై వేంచేసిన విష్ణుమూర్తియే శ్రీనివాసుడు. ఆ శ్రీనివాసుని దివ్య వర ప్రసాదియే అన్నమయ్య. అన్నమయ్య బాల్యంలో ఉయ్యాల తొట్టెలో ఊగుతున్నప్పుడు కూడా శ్రీనివాసుని పేరు చెప్పనిదే పోరు మానేవాడు కాదు. తిరుమలప్పని ప్రసాదమని చెప్పనిదే ఉగ్గుపాలైనా త్రాగేవాడు కాదు. ఇలా విష్ణుభక్తితో ప్రహ్లాదునిలా పెరిగి పెద్దవుతున్న అన్నమయ్యకు ఇంటి వ్యక్తులు పిలిచి పనులు చెబుతుంటే విసుగు లేకుండా చేసేవాడు. ఒకసారి పెద్దల ఆజ్ఞతో అడవికెళ్ళి గడ్డి కోస్తున్నప్పుడు చిటికెన వ్రేలు తెగి రక్తం కారగా, ఈ దురవస్థకు వారే కారణమని ఎంచి "ఎన్నటి చుట్టంబు లిటువంటి వారల కెన్నటి బంధుండ నేను వారలకు" అనుకొని శ్రీనివాసుడే తనకు సర్వస్వం అని భావించి తిరుమల కొండకు చేరుకున్న పరమ భక్తుడు అన్నమయ్య.

అన్నమయ్యకు వెన్నుని వరము చే సమస్త విద్యలు జిహ్వారంగసీమ తమంతతామే సొచ్చి నర్తించగా, ఆడిన మాటెల్ల అమృత కావ్యంగా, పాడిన పాటెల్ల పరమగానంగా మారసాగింది. అన్నమయ్య శ్రీనివాసునిపై అనేక శృంగార అధ్యాత్మ సంకీర్తనలు రచించసాగాడు. ఒకసారి కడప మండలాన్ని పరిపాలించే సాళువ నరసింహారాయలు అన్నమయ్య కీర్తి ప్రతిష్ఠలు విని, తమ ఆస్థానానికి పిలిపించి ఒక పాట పాడమనగా "ఏమొకో చిగురుటధరమున యెడనెడ కస్తూరి నిండెను" అనే శృంగార సంకీర్తన పాడాడు. నరసింగరాయలు

ఆ పాటలోని మధురభావనకు ముగ్ధుడై, తమమీద ఒక పాటపాడమని కోరాడు, అన్నమయ్య వెంటనే హరి హరీ" అని చెవులు మూసుకొని "హరిముకుందుని కొనియాడు నా జిహ్వ నినుకొనియాడ నేరదెంతైన" అని నిరాకరించగా, నరసింగరాయలు అన్నమయ్యను శృంఖలాబద్ధుని చేసి చెరసాలలో ఉంచాడు. అప్పుడు అన్నమయ్య శ్రీనివాసుని ధ్యానించి—

"సంకెలఁ బెట్టిన వేళ చంపఁబిలిచిన వేళ
అంకిలిగా అప్పులవారాఁగిన వేళ
వేంకటేశునామమే విడిపించగతిగాక
మంకుబుద్ధిఁబొరలిన మరిలేదు తెరఁగు"

అని కీర్తించగా సంకెలపీడి క్రింద పడింది.

అన్నమయ్య ఇద్దరు భార్యలకు భర్త అయినా తామరాకుపై నీటి బొట్టువలె సంసార జీవితం సాగిస్తూ నిరంతర దైవ ధ్యానంలోనే నిమగ్నమై ముప్పైరెండువేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు అలమేల్మంగా శ్రీనివాసులపై రచించి స్వామివారికే అంకితం చేశాడు.

పరమ భక్తాగ్రేసరుడైన అన్నమయ్యకు సృష్టిలోని ప్రతి వస్తువు, ప్రతిప్రాణి శ్రీనివాసుడుగా నేదర్శనమిచ్చాయి. అన్నమయ్య పల్లెటూరులో పుట్టిపెరిగిన సంకీర్తనాచార్యుడు. ఇతనికి గ్రామీణ వాతావరణం, అక్కడి చెట్లు, పుట్టలతో, రాళ్ళు రప్పలతో, సమస్త జీవులతో సుపరిచయం వుంది. పల్లెటూళ్ళలోని పండ్లు ప్రకృతి సహజమైనవి. అన్నమయ్యకు ఆ పండ్లలోకూడా శ్రీనివాసుడే సాక్షాత్కరించాడు.

తినరాని కొనరాని దేవలోకపు పండు
మనసున దలఁచితే మరగించే పండు ॥

పంటకెక్కి పాలవెల్లి పండిన పాలపండు
తొంటి గొల్లెతలమోవి దొండపండు
అంటుకొన్న మేనిచాయ అల్లునేరేడుపండు
ముంటి సింహపు గోళ్ళ ముండ్ల పండు ॥

అనే కీర్తనలో శ్రీనివాసుడు తినరాని కొనరాని దేవలోకపు పండని, మనసులో తలచుకొంటేనే చవులూరించే పండని, పాల సముద్రంలో పండిన పాలపండని, గొల్లెతల మోవికి దొండపండని, నల్లని రంగుతోనున్న నేరేడుపండనీ, సింహపు గోళ్లను కల్గిన ముండ్ల పండు అని, ఇంకా పై కీర్తనలోనే ఈత పండు, దేవదారుపండు, గురువిందపండు, అరటిపండు, తియ్యని చింతపండు, తేనెపండు, గొప్ప మామిడి పండు అని అనేక రకాలుగా అతని రూప గుణ అవతార విశిష్టతలకు అనుకూలమైన పండ్లతో శ్రీనివాసుని పోల్చి వర్ణించాడు.

అన్నమయ్య ఒకే చోటవుండి సంకీర్తనలు రచించలేదు. రాయలసీమ ప్రాంతంలోని అనేక గ్రామాలలో సంచరించాడు. మనిషి జీవించడానికి వ్యవసాయ వృత్తి తర్వాత ముఖ్యవృత్తి అయినది నేతవృత్తి. అన్నమయ్యకు నేత వృత్తి వారితో కూడా సుపరిచయం వుంది. నూలు వడికి, వస్త్రాన్ని నేసే వృత్తి వ్యాపారిని శ్రీనివాసుడుగాను, వస్త్రాన్ని నేసేటప్పుడు చేసే పనుల్ని సృష్టి కార్యంలో భగవంతుడు చేసే పనులతోను పోల్చి అన్నమయ్య —

వాడల వాడల వెంట వాడివో వాడివో
నీడ నుండి చీరలమ్మే నేత బేహారి

పంచ భూతముల నెడి పలు వన్నె నూలు
చంచలపు గంజివోసి చరిసేసి
కొంచెపు కండెల నూలి గుణముల నేసి
మంచి మంచి చీరలమ్మే మారు బేహారి ॥ (1-275)

అనే కీర్తన రచించాడు. వన్నెనూలు, గంజిపోయడం, కొంచెపు కండెలు, పసిడి నీరు, చిలికించడం, కుచ్చులుగా కట్టడం మొదలైన నేతవృత్తికి సంబంధించిన అంశాల్ని పంచభూతాలు, చాంచల్యం, గుణాలు, మాయలు, చిటిపొటి అలుకలు, కుటిల చేష్టలు మొదలైన సృష్టి కర్మలతో పోల్చి వర్ణించడం జరిగింది.

ప్రాచీనకాలంలో మందులమ్మేవారు ఊరూరా తిరుగుతూ తమ మందుల గొప్పతనాలు చెప్పుతూ, ఎవరెవరు తమ మందులు కొని జబ్బులు నయం చేసుకున్నారో వారి పేర్లను కూడా వివరిస్తూ పోయేవారు. ఆ సన్నివేశాన్ని చూచిన అన్నమయ్యకు శ్రీనివాసుడే ఒకమందుగా, అదే శాశ్వతం, సచ్ఛందమయిందని, ఆ మందును ధ్రువుడు, ప్రహ్లాదుడు, నారదుడు మొదలైనవారు కొని తరించారని, అలాంటి మంచి మందును మీరూ కొని తరించండి అని ప్రజలకు ఉపదేశిస్తూ —

కొనరో కొనరో మీరు కూరిమి మందు
వునికి మనికి కెల్ల నొక్కటే మందు ॥

ధ్రువుఁడు గొనినమందు తొల్లియు బ్రహ్లాదుఁడు
చవిగాఁగొనినమందు చల్లని మందు
భవరోగములు విడిపాఱఁగ బెద్దలు మున్ను
జవకట్టికొనిన విచ్చలమైనమందు ॥ (1-237)

అనే కీర్తన రచించాడు.

అన్నమయ్య వంశం బ్రాహ్మణ వంశం. అయినా వారి వృత్తి వ్యవసాయం. అతనికి పొలంతో, పొలం పనులతో, పొలంలో పని చేసే పశువులతో బాగా పరిచయం వున్నది. అన్నమయ్యకు పొల

మంతా శ్రీనివాసుడుగా గోచరించింది. అతని తలపులలోని ఒక తరంగం —

"తిమ్మిరెడ్డి మాకు నిచ్చె దిష్టమైన పొలము
బొమ్మిరెడ్డి కప్పగించి పోదినేఁసె బొలము ॥

నిండినట్టి మడుగుల నీరు వంకపొలము
కొండలు మోఁచిన పెద్ద గొబ్బరపు పొలము
అంతనే పొలము రాజులుండేటి పొలము
చెండివేసి మాకు లెల్లా సెలగిన పొలము" (10-52)

అనే ఒక గీతమై విరాజిల్లింది. ఈ కీర్తనలో మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ మొదలైన విష్ణుదేవుని అవతారాలను అన్నమయ్య వర్ణించాడు. అలాగే పొలంలో పని చేస్తున్న ఎద్దుకూడా శ్రీ వేంకటేశ్వరుడుగా తలపులలో తటిల్లతలా దీపించగా —

"పొలమెల్ల తిరిగిన బోడెద్దు
గరిమెలో నెవ్వరికి దగ్గరిరాని యెద్దు ॥

పురములు సాధించఁబూనినప్పుడు భూమి
భరమెత్తి నిలిచిన బండెద్దు
పరివోనిమంద పసులఁబోవోలి శ్రీ
వరుడై రోలఁగట్టుపడినెద్దు" (11-47)

అనే కీర్తన రచించాడు. అన్నమయ్య ఈ కీర్తనలో శ్రీ వేంకటేశ్వరుని వృషభాచలపు టెద్దుగా వర్ణించాడు. ఇందులో విష్ణువు వరాహావతారమెత్తి భూమిని ఉద్ధరించడం, శ్రీకృష్ణుడు గోకులంలో పశువులను విప్పి తోలి వేయడం, రోలికి కట్టివేయబడటం వీటిని గూర్చి అన్నమయ్య ప్రస్తావించాడు.

లోకంలో భూతాలు తెల్లగా వుంటాయని, అవి కొందరినే పట్టుతాయని అంటారు, కానీ శ్రీనివాసుడు నల్లని భూతమని ఆ భూతం భూమిలోని జనులందరినీ పట్టే భూతమని చెబుతూ ఆ స్వామి అవతార సంఘటనలను వివరిస్తూ —

"పుడమి నిందరి బట్టె భూతము
కడు పొడవైన నల్లని భూతము"

అనే సంకీర్తన రచించాడు.

అన్నమయ్య కాలంలో కర్నూలు ప్రాంతంలో బోయీలు చెంచులు ఎక్కువగా ఉండేవారు. అన్నమయ్య రాయలసీమ ప్రాంతంలోని గ్రామాలనేగాక అడవులలో కూడా సంచరించి అడవి ప్రజలతో కూడా సంబంధాలు పెంచుకున్నాడు. అక్కడ నివసిస్తున్న బోయీల నాయకుని రూపం చూడగానే మన అన్నమయ్యకు పొడుగైన వేంకటాచల నాయకుడు తలపులలో తిరిగాడు. అప్పుడు విష్ణుమూర్తి అవతార లీలలు కూడా స్ఫురించాయి.

ఆ భావనతో అన్నమయ్య —

"పొడవైన శేషగిరి బోయ నాయకుఁడు
విడువకిందరిఁగాచు వెడబోయ నాయఁడు ॥

పొలసి మీసాల పెద్ద బోయ నాయఁడు
మలిగి పీఁపునఁగట్టె మంకు బోయ నాయఁడు
పొలము రాజై తిరిగే బోయ నాయఁడు
నెలయ మోటున నుండే వేఁట బోయ నాయఁడు

(1-460)

అనే సంకీర్తన రచించాడు.

ఈ కీర్తనలో ప్రౌఢమైన శేషగిరి బోయయనాయకుడైన ఆ శ్రీనివాసుడు ఎవ్వరినీ వదలకుండా అందరినీ రక్షిస్తాడని, అతని ఆర్త త్రాణపరాయణతి, మత్స్య, కూర్మ, వరాహ, నరసింహాది అవతార విశేషాలు ప్రస్తావించబడ్డాయి.

అన్నమయ్యకు సర్వం శ్రీనివాసమయమే, తన సంకీర్తనా యజ్ఞం పూర్తి అయిన తర్వాత స్వామి వారికి అంకితమిస్తూ —

"నానాలికపై నుండి నానాసంకీర్తనలు
పూనినాచే నిన్ను పొగడించితివి
వేనామాలవెన్నుడా వినుతించనేనెంతవాడ
కానిమ్మని నాకీపుణ్యముగట్టితి వింతేనయ్యా"

అని తన నమ్రతను వ్యక్తం చేశాడు. అపుడు శ్రీనివాసుడు అన్నమయ్యతో ఆనాడు కృష్ణమాచార్యుని అధ్యాత్మ రచనలవల్ల విరక్తుడనైన నేను, నేడు నీ శృంగార సంకీర్తనలకు మంచి ప్రాయపు వాడనయ్యానని —

"ఆ కృష్ణమాచార్యు నధ్యాత్మవినుతి రాకి
కొన్నాళ్లు విరక్తుండనైతి
జగతినీ సంకీర్తనములకగపడి
మంచి ప్రాయంపువాడనైతి"

అని తన ఆనందాన్ని వ్యక్తం చేయగా అన్నమయ్య వినయ సంపత్తితో పోతన, మొల్లవలె —

"నా నేరుపు నీ నేరుపు అరసిచూడ
పలికెడి వీణ లోపలి చక్కదనము
పలికించినవానిదై పరగినరీతి"

గోవిందా, నిన్ను వేదాలు, పండితులు ఎన్నో విధాలుగా స్తుతిస్తూ ఉండగా నేనెంతవాడను, అని తన వివేకాన్ని నిరూపించు కున్న విశిష్ట వైష్ణవభక్తుడు అన్నమయ్య. అన్నమయ్య తలపుల తరంగా లలో తారాడే తిరుమలగిరి శ్రీనివాసుడు అందరి ఆకాంక్షలను నెర వేర్చే అమృతస్వరూపుడు.

ఉపయుక్త గ్రంథాలు :

1) అన్నమాచార్య అధ్యాత్మ సంకీర్తనలు 1, 2 సంపుటాలు

2) అన్నమాచార్య జీవిత చరిత్రము - చిన్నన్న

3) అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు - 
పొన్నాల లీలావతమ్మ

— జూలై 1992 స్రవంతి.



# సమతావాదిగా అన్నమయ్య

"శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
సఏవ వీతరాగశ్చేత్ నీరసం జాత మేవతత్"

అని ఆనంద వర్ధనుడు ధ్వన్యాలోకంలో చెప్పినట్లు కవి శృంగార మనస్కుడైతే అతను సృష్టించిన కావ్యం కూడా రసమయం అవుతుంది. కవి వైరాగ్య మనస్కుడైతే అతను సృష్టించిన కావ్యం కూడా నీరసంగా ఉంటుంది. అన్నమయ్య ఇద్దరాండ్రకు ముద్దుల మగడుగా గృహస్థ జీవనం గడిపిన శృంగార ప్రియుడు. అలాగని ఆ భాగవతుడు అదే శాశ్వతం అనుకోలేదు. ఏ నాటికైనా ఈ ఐహిక మంతా ఒక బూటకం అవుతుందని, పరమాత్మ పాదసన్నిధే సత్య మని ఆయనకు తెలుసు. ఈ పరిజ్ఞానంతో అన్నమయ్య ప్రజలకు ఐహిక ఆముష్మిక ఆనందాన్ని, జ్ఞానాన్ని అందివ్వడం కోసం ముప్పై రెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలను రచించి కలియుగ ప్రత్యక్ష దైవం, తన తల్లి, తండ్రి, గురువు, దైవం, ప్రియుడు, సఖుడు. సర్వస్వం అయిన ఆ ఏడుకొండల శ్రీనివాసునికే అంకిత మిచ్చాడు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి నిరవధిక కృషివల్ల అపార శ్రద్ధా భక్తుల వల్ల నేటికి పద్నాలుగు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు లభించాయి.

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు అలమేల్మంగా శ్రీనివాసులు. వీరు లోకాతీతమైన దివ్య ప్రేయసీ ప్రియులు. దివ్య సతీపతులు. వీరి సర్వాంగ సౌందర్యం, ప్రణయం, కలహం, చెలికత్తెల హిత వచనం మొదలైన సన్నివేశాల వర్ణనలో అన్నమయ్య లోకసాధారణమైన నాయికా నాయకుల చేష్టల్ని వారికి

ఆరోపించి నవరసభరితంగా శృంగార సంకీర్తనల్ని రచించాడు. ప్రేమసీప్రియులు లేదా దంపతులు అయిన స్త్రీ పురుషులు అన్యోన్య ప్రేమానురాగాలతో వర్ధిల్లుతుంటారు. జీవితంలో ఎలాంటి వారికైనా ఎప్పుడూ సుఖాలు ఎప్పుడూ కష్టాలే ఉండవు.

"సుఖస్యానంతరం దుఃఖం దుఃఖ స్యానంతరం సుఖం
చక్రవత్పరి వర్తంతే సుఖాని చ దుఃఖాని చ"

అని ఆర్యోక్తి.

కష్టాలు, సుఖాలు, గౌరవాలు, అవమానాలు ఒకదాని తర్వాత మరొకటి వస్తూనే ఉంటాయి. భగవంతుడు సృష్టించిన ఒక దినంలోనే అర్ధదినం పగలు, అర్ధదినం రాత్రి అయినట్లు కొన్ని రోజులు సుఖాలు, కొన్ని రోజులు దుఃఖాలు ఎలాంటి వారికైనా తప్పవు. అలాగే ప్రేయసీ ప్రియులు, భార్యాభర్తలకు పరస్పరం ఒకరిపై ఒకరికి ప్రేమ కలిగినట్లే ద్వేషం కూడా కలుగుతుంటుంది. అలాంటి సందర్భాలలో హితులు, ఆప్తులు అయినవారు ఓదార్పు చెబుతుంటారు. అప్పుడు వారిలో కోప తాపాలు కొంత చల్లారి మళ్ళీ ఒకటవుతుంటారు. జీవితంలో సంయోగ వియోగాలు ఇలా రంగుల రాట్నంలా తిరుగుతుంటాయి.

సాధారణంగా స్త్రీ పురుషులలో స్త్రీలకే పుట్టింటి వారు కానీ, మెట్టింటి వారు గానీ, ఇరుగు పొరుగువారు గానీ అన్ని విషయాలలో ఆయా వ్యక్తులపట్ల ప్రవర్తించవలసిన తీరును గూర్చి హితోపదేశాలు, నీతులు, ధర్మాలు బోధిస్తుంటారు. పొరపాట్లు స్త్రీలలో కనిపించక పోయినా పురుషులు పెడుతున్న హింసలను, ఆగడాలను సహించవలసిందిగా స్త్రీలకే ఓదార్పు చెబుతారు గానీ, దుర్గుణాలను, దుశ్చేష్టలను వదలుకోమని పురుషులకు మాత్రం నీతిబోధ చేయరు. ఇది లోకంలో జరిగే వాస్తవం. అన్నమాచార్యులు భార్యాభర్తలలో,

ప్రేయసీ ప్రియులలో ఈ విధమైన వ్యత్యాసాలు, న్యూనతాధిక్యతలు ఉండకూడదని శృంగార సంకీర్తనల్లో పురుషులకు హితబోధలు చేశాడు.

భర్త, తనపట్ల భార్య ఎలా ప్రవర్తించాలని, ఎలా సేవించాలని కోరుకొంటాడో —

"కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
భోజ్యేషు మాతా శయనేషు రంభా
రూపే చ లక్ష్మీ క్షమయా ధరిత్రీ
షట్కర్మ యుక్తా కుల ధర్మపత్నీ"

అనే విధంగా తాను కూడా భార్యపట్ల అలాగే ప్రవర్తించాలని, అలా సేవించాలని అన్నమయ్య తెలియ జేశాడు. భౌతికంగా స్త్రీ పురుషులలో భిన్నత్వం ఉంటినా మానసికంగా, మేధోగతంగా, ప్రేమ పరంగా ఏకత్వం ఉండాలని అన్నమయ్య ఆలోచన. అందుకే

'పొలతులు జీవులే పురుషులు జీవులే
తలప భావ భేదములే కాని
బలిమి స్వతంత్రముఁ బరతంత్రమొకరికి
యెలమి నిందులోఁ జెల్లే హీనాధికములే"　　(2-78)

అనే సంకీర్తనలో స్త్రీలైనా, పురుషులైనా మనుషులేనని, కేవలం భావ భేదం తప్ప ఇంకేమి లేదని, ఒకరు స్వతంత్రంగా, మరొకరు పరతంత్రంగా ఉండకూడదని సమతా భావాన్ని వ్యక్తంచేశాడు.

మహాకవి కాళిదాసు, జయదేవుడు, తులసీదాసు, రామకృష్ణ పరమహంస, మహాత్మగాంధి, కందుకూరి వీరేశలింగం పంతులు వంటి పుణ్యపురుషులు జ్ఞానవంతులైన తమ భార్యల అడుగుజాడలలో నడచి మహనీయులుగా ఖ్యాతిగాంచారు. తమ మహోన్నత స్థితికి

తమ భార్యలే కారణమని కూడా నిజాయితీగా చెప్పుకున్నారు. మాన వాళిచే నివాళులందుకున్నారు. కానీ చాలామంది పురుషులు తమ భార్యలయొక్క ఔన్నత్యాన్ని చెప్పుకోడానికి ఆమె సందేశాలను వినడానికి, ఆచరించడానికి ఇష్టపడరు. అలా ప్రవర్తిస్తే తమ పురుష త్వానికి భంగం కలిగినట్లుగా, సమాజంలో గౌరవం క్షీణించినట్లుగా తక్కువ భావనతో ఆలోచిస్తారు. ఇది సమంజసం కాదని అన్నమా చార్య శృంగార సంకీర్తనలు పురుషులకు హితోపదేశం చేస్తున్నాయి.

సతి విరహావేదనతో ఎన్ని తిట్లు తిట్టినా సరసుడు నేర్పరి అయిన భర్త వాటన్నిటిని ఓర్చుకోవాలంటూ —

"సరసుఁడ విన్నిటాను జాణపు నీవు
వోరసె నిందాకాసతి వోరుచుకోవయ్యా
మనసొక్కటైనదాకా మాటలు సూటిఁ బడవు
యెనయకుండితే నన్ని యెరవెరవే
నిను బాసి విరహాన నెలఁత యెంత దూరెనో
వానరితివిఁ కనవి వోరుచుకోవయ్యా" (29-203)

అని చెలికత్తె నాయకునికి హితబోధ చేస్తుంది. ఇక్కడ చెలి కత్తె హితబోధ చేస్తోంది అంటే అన్నమయ్య హితబోధ చేస్తున్నా డని భావించాలి.

అలాగే మరొక సంకీర్తనలో ప్రేయసి పరిహాసాలకు ఏమన్నా కూడా బుజ్జగించాలి కానీ కోపగించకూడదని, ప్రేమతో ప్రేయసి పంతాలాడినా ప్రియుడు అలగకూడదని, ప్రేయసి ప్రతిదానికి నవ్వినా దయతో ఉండాలిగాని తప్పులెంచకూడదని అన్నమయ్య చెలికాని రూపంలో సందేశమిస్తూ —

"చాలు చాలు నూరకుండు సతులెల్లా నవ్వేరు
కేలు చాచి తిట్టేటి పేలరీడు గలఁడా
యెగసక్కెలకుఁ జెలులేమైనా నాడుదురు
పగటున బీరములు పచారింతురు
పొగరున నీవందుకు బుజ్జగించ వలెఁగాక
మగువతోఁ గోపగించే మగవాడు గలఁడా" (29-402)

అనే సంకీర్తన రచించాడు.

సహజంగా స్త్రీల మనస్సు ఆర్ద్రమయింది. పురుషుని దృష్టిలో చిన్న విషయం, చిన్నమాటే అయినా అది స్త్రీకి మిక్కిలి పెద్దదిగా బాధ కలిగించవచ్చు. ఆ బాధను తట్టుకోలేక కొంతమంది స్త్రీలు తిండి, నిద్రమానేసి బాధ పడుతూ చిక్కిపోతుంటారు. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాయిక అయిన అలమేల్మంగ కూడా తన నాయకుడైన శ్రీనివాసుడనిన ఏవో మాటలకు, చేష్టలకు నొచ్చుకొని, నిద్రాహారాలు మాని మంచం పట్టింది. అప్పుడు చెలికత్తె శ్రీనివాసుని గుణగణాలను ప్రశంసిస్తూనే —

"ఎప్పుడూ కోపగించుకొనని నీవు నేడు ఏమి చేయబోయి ఏమి చేశావో ఏమో! నిన్నటి నుండి కన్నుమూయడం లేదు. ఎన్ని సార్లు చెప్పినా తినే పళ్ళెం కూడా ముట్టడం లేదు. మంచంపై పడుకునే వుంది. తలకొప్పు కూడా వీడిపోయి వుంది. తలనొప్పిగా వుంది అంటూ పైకి కూడా లేవడం లేదు. ఆమెకు నీవు తప్ప ఇంకెవరున్నారు ? పూలపాన్పుపై పడుకొని వున్నా ఆమె దేహం కాలిపోతోంది" అని నాయిక పరిస్థితి నాయకునికి తెలియజేస్తూ —

"ఎన్నడునుఁ గోపగించ విందుముఖి నీ విట్లా
విన్నని వదన మెల్లా వింతలాయ నీపుడు

ఇంతలోని పనికిగా నెంత చేసినాఁడవు
కాంత నిన్నటి నుండి కనుమూయ దాయను
బంతి కూటి సతులెల్లాఁ బలుమారు నేఁపగా
చింతతోఁ బళ్ళెము మీఁద చెయి చాఁచదాయెను"

అనే సంకీర్తన రచించాడు.

భర్త మహోన్నతుడైతే భార్య ఎంతగా సంతోషిస్తుందో ఎన్ని విధాలుగా సపర్యలు చేస్తుందో అన్నమయ్య ఆ విధంగా భార్య మహోన్నతురాలైతే అంతగా సంతోషించాలని, సపర్యలు చేయాలని అన్నమయ్య స్త్రీ పురుషులకు సమ ప్రాధాన్యమిస్తూ సందేశమిచ్చాడు. స్త్రీ అన్నిటా నేర్పరియై రాజ్యమేలినా, అది మంచిదేనని, ఆమె పీటపై కూర్చొని వున్నా ప్రియుడైన తాను నిలబడి మాట్లాడటం, ఆమె పవ్వళించి వుంటే ప్రియుడు ఆమె పాదాల దగ్గర కూర్చొని ఆకు మడచి అందివ్వడం మంచిదేనని, ప్రియురాలికి ఎంత సేవ చేస్తే అంత అతనికే లాభమని అన్నమయ్య శ్రీనివాసునికి చెలికాడుగా —

"ఆఁటది రాజ్యమేలితే అది మంచిదేకాదా
చాటువగా మాకు నిన్ను సాదించ నేఁటికి

పీటపై నున్నదాపె ప్రియుఁడవు నిలుచుండి
మాటలాడే వాపెతోను మంచిదే కాదా
గాటముగా వంచ నెంత గలిగి మెలగినాను
మాటున నీవే బదికే వేమనన నేటికి

పడతి పవ్వళించఁగా పాదాలకాడ నుండి
మడిచిచ్చే వాకు నీవు మంచిదే కాదా

వృథగ నీవెంత వ్రాశిగాలు నేర్చినాను
కడు నీకే లాభమయ్యీ కాదనఁగఁ నేటికి"

అని హితబోధ చేస్తున్నాడు.

సతీపతులు లేదా ప్రేయసీ ప్రియులు పరస్పరం ఒకరి కొకరు ఒద్దికగా వుంటే అంతకన్నా కావలసిందింకేమి వుంటుంది? ఇహ లోకమే స్వర్గలోకమై భాసిల్లుతుంది.

అన్నమాచార్యులు కొన్ని సంకీర్తనల్లో ప్రేయసి సౌంద ర్యాన్ని ఆమెపట్ల ప్రియుని అనురాగాన్ని రమ్యంగా ఉత్ప్రేక్షించాడు. కోమలి అయిన ప్రేయసికి కుచములే కొండలైతే ప్రియుని చేతులే చెల్లు చేమలట. అతిశయమైన ఆమె యవ్వనం అతనికి ఫల భోగమట. ఆమె కన్నులు కమలములైతే అతని చూపులు తుమ్మెద లట. ఆమె చెమటలే సాగరమైతే అతను అందులో ఓలలాడే శేష సాయిఅట. ఆ దివ్యపురుషుడు శ్రీనివాసుడట. ఈ భావన సంకీర్త నలో ఇలా పొందుపరచబడింది.

"ఒక రొకరికే మన మొద్దికగాదా! నీకు
వెకలి రతుల ముందు వెనుక గానా

కోమలి నీ కుచములు కొండలైతే నీ మీఁది
చేమలు చెల్లఁబో నా చేతు లివి
యేమిటా నీ జవ్వనమే యెక్కుడుగా నెంచుకొంటే
ఆ మీఁది ఫలభోగ మదినేఁ గానా (30-40)

అన్నమయ్య పోతనవంటి భక్తాగ్రేసరుడు, వేమనవంటి యోగితుల్యుడు. రాజా రామమోహనరాయ్, కందుకూరి వీరేశ

లింగంపంతులు, గురజాడ అప్పారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, మహాత్మాగాంధి వంటి సంఘసంస్కర్త. స్త్రీకి పురుషునితోపాటు సమానత్వం ఉండాలని, స్త్రీ పురుషుడికి బానిస కాదని, పురుషుడు తాను స్త్రీ ద్వారా సేవల్ని పొంది సుఖపడుతున్నట్లే తానుకూడా స్త్రీకి సేవలు చేయడంవలన పురుష గౌరవానికి లోటేమీ రాదని, ఇంకా తనకే లాభమని అన్నమయ్య తన శృంగార సంకీర్తనలద్వారా పురుష ప్రపంచానికి జ్ఞానబోధ చేశాడు. స్త్రీ పురుషుల మధ్య అంతరాలుండకూడదని సమతావాదాన్ని బలపరచాడు.

— ఆకాశవాణి, తిరుపతి (9-9-92)



# అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో వర్ణనలు

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడైన అన్నమయ్య రచించిన వేలాది శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు, ప్రేయసీ ప్రియులు అయిన వారు దివ్యులైన అలమేల్మంగ శ్రీనివాసులు. అన్నమాచార్యులు మానవులకు ఈ జగన్మాతాపితరులైన అలమేల్మంగా శ్రీనివాసులపై భక్తి కుదర్చడానికి వైరాగ్యధోరణిలోనే కాకుండా మధుర భక్తి ధోరణిలో కూడా అనేక విషయాలను బోధించాడు. ప్రజలను శృంగార విషయం ద్వారా ఆకర్షింపచేసుకొని చివరికి వారి మనసును దైవంమీదే నిమగ్నం చేయడానికి అలమేల్మంగా శ్రీనివాసులనే తన శృంగార సంకీర్తనలలో నాయికా నాయకులుగా చేశాడు. వారి లావణ్య సౌందర్యాలు, అనురాగ ఆప్యాయతలు, ప్రణయకోపాలు, చెలికత్తెల ఊరడింపులు మొదలైనవానిని అపూర్వమైన భావాలతో వర్ణించాడు. ఈ వర్ణనలోని అంశాలన్నీ చదువురాని అతి సామాన్యులను కూడా రజింపచేసి మానసిక ఉల్లాసాన్ని భక్తి భావాలను పెంపొందింపచేస్తాయి.

"చెలియ మేనే నీకు సింగారపుఁదోఁటాయ
యెలమితో వినోదింతు విష్వఁ డిట్టె రావయ్య ॥

వేసవి యండలుగాసె వెలది విరహమున
వాసి కెక్కెఁజెమటల వానగురిసె
మోసులెత్తే పులకలు (ల?) మొలచెఁబైరులెల్ల
యీసతినీ మనోరాజ్య మేలుదువు రావయ్యా" ॥

కమ్మటి చన్నుల నారి కడపుఁ గాయలు గాచె
పమ్మి మోవి తేనెల పంటలు పండెను

వుమ్మగిల్లు నూరుపుల నొనరె నాయిటి గాలి
తమ్మి కంటి జవ్వనపుదతి రావయ్యా ॥

మఱి తోఁగి చూపుల మంచి చంద్రోదయ మాయ
నెఱయ నవ్వులనే వెన్నెల గాసెను
యెఱిఁగి శ్రీ వేంకటేశ యిటువచ్చి కూడితివి
తెలవ నేలఁగ దినదినము రావయ్యా" ॥ (24-152)

నాయకుడైన శ్రీనివాసునికి ఒక చెలికత్తె నాయిక అయిన అలమేల్మంగయొక్క అనురాగాన్ని, అంద చందాలను గూర్చి - ప్రేయసి శరీరమే నీకు శృంగారమైన పూదోట, ప్రేమతో క్రీడించుదువు రావయ్యా! ఆమెయొక్క విరహంలో వేసవి కాలంనాటి ఎండలు కాస్తున్నాయి. చెమటల వాన కురుస్తోంది. పులకాగ్రాలు పైరులవలె మొలచివున్నాయి. ఇలాంటి సతియొక్క మనోరాజ్యాన్ని ఏలుదువు రావయ్యా. ఆమెకు గలుపెల్లా కాయలు కాచాయి. అధరాలలో తేనెవంటి పంట పండింది. నిట్టూర్పులు యవ్వనాతిశయంతో ఉంది. ఆమె చూపులలో చంద్రోదయమయింది. నవ్వులనే వెన్నెల కాస్తోంది. ఇలాంటి ఆమెను ఏలడానికి ప్రతి రోజు రావయ్యా అని విన్నవించుకుంటున్న విషయాన్ని అన్నమయ్య ఈ సంకీర్తనలో మనోహరంగా వర్ణించాడు.

"చూచి వచ్చితి నీవున్న చోటికిఁదోడి తెచ్చితి
చేచేతఁ బెండ్లాడు చిత్తగించవయ్యా ॥
లలితాంగి జవరాలు లావణ్యవతి యీకె
కలువకంటి మంచి కంబుకంఠి
జలజవదన చక్కజఘన సింహామధ్య
తలిరుఁబోడి చక్కదన మిట్టిదయ్యా! ॥

అలివేణి మిగుల నీలాలక శశిఫాల
మలయజగంధి మహామానిని యీకె
పెలుచుమరుని నిండ్ల బొమ్మలది చారుబింబోష్ఠి
కవిత కుందరద చక్కందన మిట్టిదయ్యా ॥

చెక్కుటద్దముల దిది (శ్రీ)కారకన్నన్ (ర్ణ?)ములది
నిక్కుంజన్నులరంభోరు నిర్మల పాద
గక్కన (శ్రీ) వేంకటేశ కదిసె లతాహస్త
చక్కె నీ కీలేమ చక్కందన మిట్టిదయ్యా"॥ (24-164)

చెలికత్తె తాను ప్రేయసిని తీసుకొని వచ్చానని, పెండ్లాడ టానికి చిత్తగించమని నాయకునితో అంటూ ఆమె చక్కదనాన్ని గూర్చి వర్ణిస్తూ, లలితాంగి అయిన ఈ లావణ్యవతి కలువలవంటి కన్నులు కలదని, శంఖం వంటి కంఠం కలదని, పద్మం వంటి ముఖం కలిగిందని, సింహపు నడుమువలె సన్నని నడుము కలిగిందని, తుమ్మెదలవంటి కురులు కలిగిందని, పరిమళ శరీరం కలిగిందని, మన్మ థుని విల్లువంటి కనుబొమ్మలు కలిగిందని, మల్లెమొగ్గలవంటి దంతాలు కలిగిందని, అద్దాలవంటి చెక్కిళ్లు కలిగిందని, (శ్రీ)కారంవంటి చెవులు కలిగిందని, ఎత్తైన వక్షస్థలం కలిగిందని, అరటి బోదెలవంటి ఊరువులు కలిగిందని, నిర్మలమైన పాదాలు కలిగిందని, తీగవంటి హస్తాలు కలి గిందని, ఆమె చక్కదనం ఇంతటిదని విన్నవించే విషయాన్ని అన్న మయ్య ఈ సంకీర్తనలో హృద్యంగా వర్ణించాడు.

"ఏల పొద్దులు గడపే వింతికడకకు రావయ్యా
నాలిసేయ నిక వద్దు నమ్మి యాపె వున్నది ॥

చక్కని సతి మోమున చంద్రోదయం బాయ
వెక్కసపు నవ్వుల వెన్నెల గాసె

చొక్కపు కొప్పు విరుల చుక్కలు గానుపించె
పక్కన నెంచితే పట్టపగలు రేయాను

సతి కుచగిరులనే జక్కవలు జోడుగూడె
తతి వికసించెఁ గన్నులఁ దామరలు
మితిలేని రత్న కాంతి మించె సూర్యోదయము
మతి నెంచుకొంటేను మాపే రేపాను

కలికి మొయి చెమటల గడియారపు నీరెక్క
తెలిసిగ్గులనే పెండ్లి తెర వేసెను
అలమె శ్రీ వేంకటేశ అంతలో నీవు రాఁగాను
నెలవై యిట్టె వుండితే నిచ్చ కల్యాణమవును"

(24-179)

నాయకుడు నాయిక దగ్గరకు రాకుండా కాలం గడిపేస్తుంటే చెలికత్తె నాయిక పక్షాన మాట్లాడుతూ, ఆమె అందచందాలను, అనురాగాన్ని గూర్చి —

చక్కని సతిముఖంలో చంద్రోదయం అయింది. నవ్వులలో వెన్నెల కాసింది. కొప్పులోని పుష్పాలలో చుక్కలు కనిపించాయి. సతి కుచగిరులనే జక్కవ పిట్టలు జోడు కూడినట్లయింది. తామరల వంటి కన్నులలో మోహం వికసించింది. కలికిమొక్క శరీర స్వేదంలో గడియారపు నీరెక్కింది. తెల్లని సిగ్గులలోనే పెండ్లి తెరవేసింది. కాబట్టి శ్రీనివాసుడైన నీవు ఇప్పుడు వచ్చినట్లయితే నిత్యకల్యాణ మవుతుంది. అని తెలియజేసిన అంశాన్ని అన్నమయ్య ఈ సంకీర్తనలో వర్ణించాడు.

"ఎడమాట లేమిటికి నెందాఁకాను
బడివాయకుండరయ్య పడఁతియు నీవును ॥

తెలియనింతికి నీకు దేహములు రెండైతే
తేఁపొక్కటే కాదా తగులైనది
పిలిచితే మీ కిద్దరి పేరులు వేరులైతే
వలపొక్కటే కాదా వర్ణింపను ॥

చక్కదనా లిద్దరికి సిరికిబేసికినైతే
చొక్కఁజేసే పొందికలు జోడే కావా
ఇక్కువైన చూపులు యెదురుబడినైతే
యెక్కువ తమకములు యీడైనవే కావా ॥

పేరడిమీసుద్దులు పెన్నుద్దులై వుండినాను
యీరసము లేని రతి యేకమే కాదా
యీరితి శ్రీవేంకటేశ యెనసితివీపె నీవు
పోరచి మోవి తీపులు పొత్తులవే కావా"      (24-418)

ప్రేయసీ ప్రియులు ఎడబాటుతో, మనస్తాపంతో ఉండకూడదని చెలికత్తె వారికి హితవచనాలు చెబుతూ, నీకు, యీమెకు శరీరాలు వేరైనా బంధం ఒకటే కదా! పేర్లు వేరైనా వలపు ఒక్కటేకాదా, చక్కదనాలలో మీరిద్దరూ వేరైనా పొందికలు ఒకటే కదా! చూపులు ఎదురుబడిగా ఉన్నా మోహం యీడైనదే కదా! మాటలు వేరైనా రతి ఒకటేకదా! అని విన్నవించిన విషయాన్ని అన్నమయ్య యీ సంకీర్తనలలో వర్ణించాడు.

"మగువరో ఇందుకే నీ మగఁడు మోహించినాఁడు
పగటున రాఁగగదవే బాఁతి పడేని"

కప్పురాలవంటినీ కందువ పలుకలనే
దప్పితేరి తమకము దైలు వాకీని

రెప్పల చూపులలో మీరిన మెరుఁగులనే
కుప్పళింపు వలపులు కురులయ్యీని ॥

బంగారు నిగ్గులు దేరేబాహుమూలపు కాంతుల
కంగవించి వొడిగట్టి యాసగించీని
కంగని, నీపురముపై కుచ దుర్గములనే
సంగతిఁదాపు సేసుక సంతోసించీని ॥

తేటలైన నీ మోవి తేనెల విందులకే
వాటముగ నోరూరి వచ్చి యున్నాఁడు
మేటి శ్రీ వేంకటేశుఁడు మెచ్చి నీ కాఁగిటఁగూడి
కోటి కోటిరతులఁ జొక్కుచు నవ్వీని ॥ (24-363)

చెలికత్తె ప్రేయసితో - 'ప్రియుడు నిన్ను మోహించి వున్నాడని, వెంటనే రావలసిందని చెబుతూ, కర్పూరంవంటి నీ చల్లని పలుకులతోనే ఒప్పి తీర్చుకొని మోహంతో ఉన్నాడు. రెప్పల చూపుల లోని మెరుగులనే వలపులు పెనవేసుకొంటున్నాయి. బంగారు కాంతులీనే బాహు మూలపు కాంతులకు ఒడిగట్టి ఆశపడుతున్నాడు. నీ వక్షస్థలం మీద కుచదుర్గాలను గూర్చి ఆలోచిస్తూ సంతోషిస్తున్నాడు. తేటమైన అధరాలనే తేనెల విందులకు నోరూరి వచ్చి యున్నాడు. అని విన్నవించిన విషయాన్ని అన్నమయ్య మృదు మధురంగా వర్ణించాడు.

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో కొన్నింటిలో విషయం నాయికా నాయక వియోగ సంబంధమై కనిపించినా సంకీర్తనా ముగింపులో ఐక్యం కనిపించడం అన్నమయ్య సంకీర్తనలలోని ప్రత్యేకత. అన్నమయ్య శృంగార సంకీర్తనలు మానవులలో భక్తిని, రక్తిని పెంపొందింపజేస్తాయి.

పండిత భారతి (అక్టోబరు 1992)

# అన్నమయ్య గిరిజన గేయాలు

అన్నమయ్య సంగీతాత్మకమయిన పద రచనల ద్వారా అన్ని రకాల, అన్ని అవస్థల ప్రజలకు విష్ణుభక్తిని, మానవత్వాన్ని, వివేకాన్ని ప్రబోధించిన ప్రజాకవి. అన్నమయ్య సకలాగమశాస్త్ర కోవిదుడు. బహు భాషావేత్త. అందుకే సంస్కృత భాషావేత్తలను సంస్కృత భాషా ప్రియులను మెప్పించెడానికి సంస్కృత భాషా సంకీర్తనలు, తెలుగులో గ్రాంథిక భాషను అభిలషించే పండితులను మెప్పించడానికి గ్రాంథిక భాషా సంకీర్తనలు, పామరులను, జానపదులను అలరించడానికి, ప్రభావితం చేయడానికి వ్యావహారిక భాషా సంకీర్తనలు రచించాడు. అన్నమయ్య పుట్టి పెరిగింది జనపదంలో. అందువల్ల అన్నమయ్యకు జానపదుల మనస్తత్వం, జానపద పరిజ్ఞానం బాగా తెలుసు. చదువురాని జానపదుల్ని చైతన్యవంతం చేయడానికి జానుతెనుగును ఉపయోగించి లాలి, జోల, ఏల, ఉయ్యాల, సువ్వాల మొదలైన అనేక జానపద గేయ రీతుల్ని రచించాడు. అన్నమయ్య జానపదులకే కాకుండా గిరిగుహలలో నివసించే గిరిజనులకు కూడా భక్తి జ్ఞాన ముక్తి మార్గాలను తెలియ చేయడానికి గిరిజన వేష భాషలను, వారి జీవన చర్యలను పొందు పరుస్తూ గిరిజన గేయాలను రచించాడు.

అన్నమయ్య రాయలసీమలోని వివిధ క్షేత్రాలను సందర్శిస్తూ సంకీర్తనలు రచించినట్లే అనంతపురం జిల్లా కొండ కోనల్లో నివసించే బోయీలను, కర్నూలు జిల్లా అరణ్యప్రాంత పూపాదలలో, పర్వత శ్రేణులలో విహరించే చెంచులను దర్శించాడు. అన్నమయ్యకు ఈ సృష్టిలో ఏ చరాచర వస్తువులను చూసినా, ఏ జీవిని చూసినా

శ్రీనివాసుడే సాక్షాత్కరిస్తూంటాడు. ఆ శ్రీనివాసలీలలు అన్నమయ్య మానస సాగరంలో అలలు అలలుగా వలయీకృతమవుతూ వుంటే ఆయన గళం నుండి అలవోకగా గేయాలు జాలువారుతుంటాయి.

అన్నమయ్య బోయీలను దర్శించినపుడు వారి వేషధారణను, గుణగణాలను గమనించాడు. వారి మీసాలు, పొట్టిపొట్టి అడుగులు, నెమలి చుంగులు, మంకుతనం, మోటుతనం, పగసాధించేతత్వం, వేట ప్రియత్వం సిగ్గు, బిడియం లేకపోవడం వీటన్నిటిని పరిశీలనగా చూసి నపుడు అన్నమయ్యకు విష్ణుమూర్తి దశావతారాలు గుర్తుకువచ్చాయి. ఆ దశావతార విశేషాలను బోయీలకు సమన్వయిస్తూ శేషాచల వాసుడైన శ్రీపతిని బోయీల నాయకుడుగా అభివర్ణిస్తూ —

"పొడవైన శేషగిరి బోయ నాయఁడు
విడువకిందరిఁగాచు వెసబోయ నాయఁడు ॥

పొలసి మీసాల పెద్ద బోయ నాయఁడు
మలిగి పేఁపునఁగట్టె మంకు బోయ నాయఁడు
పొలము రాజై తిరిగే బోయ నాయఁడు
వెలయ మోటున నుండే వేఁట బోయ నాయఁడు ॥

పొట్టి పొట్టి యడుగుల బోయనాయఁడు యెందు
బుట్టు పగ సాధించే బోయ నాయఁడు
బొట్టుల మెకము నేసేబోయ నాయఁడు
పట్టపు నెమలి చుంగు బలు బోయ నాయఁడు ॥

పొంచి సిగ్గగ్గలిఁగని బోయ నాయఁడు
మించిరాల మీఁద దాఁటే బోయనాయఁడు
అంచెల శ్రీ వేంకటేశుఁడనే బోయనాయఁడు
పంచఁగాల వేలముల బలు బోయనాయఁడు (1-460)

అనే సంకీర్తన రచించాడు.

బోయీలు కొండ కోనల్లో నివసిస్తున్నట్లే శ్రీనివాసుడు కూడా శేషాచలంపై నివసిస్తున్నాడు. బోయీలు చాలా వరకు గుజ్జు రూపంలో ఉంటారు. కానీ అన్నమయ్య శ్రీనివాసుని పాదమైన శేషగిరి బోయ నాయకుడుగా వర్ణించి ఈ బోయ నాయకుడు ఎవ్వరిని వదలకుండా అందరినీ రక్షిస్తాడని అతని ఎత్తైన విగ్రహ స్వరూపాన్ని, అతని దయాగుణాన్ని పల్లవిలో వ్యక్తం చేశాడు. చరణాలలో వరుసగా మత్స్య, కూర్మ; వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామకృష్ణ, బుద్ధ, కల్క్యవతారాలను స్ఫురింపచేశాడు. వీటిని సులభంగా సమన్వయం చేసుకోవచ్చు. అన్నమయ్య పామర, జానపద, గిరిజన ప్రజలకోసం వ్యాకరణాన్ని భాషా నియమాల్ని కూడా ఉల్లంఘించి యథేచ్ఛగా అలతి అలతి తేట తెనుగు మాటలలో ఎంతో లోతైన అర్థాలను కూడా అవలీలగా వ్యక్తం చేశాడు.

అన్నమయ్య శ్రీనివాసుని బోయ నాయకుడుగా వర్ణించినట్లే అతని దేవేరి అయిన లక్ష్మీదేవిని బోయతిగా చిత్రించాడు. బోయ స్త్రీ వేషధారణను లక్ష్మీదేవికి ఆరోపించాడు. అయితే ఈ బోయతి సామాన్య బోయతిలా కాక శాశ్వతమయిన, పవిత్రమయిన సుఖాలకు మరిగిందని, హరిని మోహించి అతన్నే రమించిన బోయతి అని కీర్తిస్తూ —

"భోగీంద్ర శయనుని బోయతి దివ్య
భోగాలు మరిగిన బోయతి ॥

పొదిగొన్న పెనుగొప్పు బోయతి మించుం
బొదలిన గుబ్బల బోయతి
పొదలం బూవులు చూచి బోయతియంప
పొదిసవి నెరచెనె బోయతి ॥

పొడల గందపు మేని బోయతిపచ్చి
పొడి కప్పురపుఁ బూత బోయతి
పొడవైన హరిఁజూచి బోయతి నేడు
పుడుకు వే దురుగొన్న బోయతి ॥

పొందైన రచనల బోయతి పతి
బొందక పొందిన బోయతి
పొందు లెరఁగని బోయతి రతిఁ
బొందె వేంకటపతి బోయతి ॥ (12-175)

అనే సంకీర్తన రచించాడు.

లోక వ్యవహారంలో చెంచులక్ష్మి నరసింహుల కథ ప్రసిద్ధ మయిందే. అన్నమయ్య కర్నూలు జిల్లాలోని అహోబల నారసింహ స్వామిని వర్ణించే సంకీర్తలలో చెంచుల ప్రసక్తి చేశాడు. నాయిక అయిన లక్ష్మీదేవిని చెంచెతగా వర్ణించాడు. మోహపరవశురాలైన నాయిక స్వామిని ప్రణయ కోపంతో ఎలా కసరుతోందో, స్వామి పట్ల ఎలా ప్రవర్తిస్తోందో తెలియ జేస్తూ అన్నమయ్య —

"సింగార రాయనిఁదిట్టీ చెంచెత వేలి
వుంగరాల చేత నన్నొత్తకు నీవనుచు ॥

గురువింద పొదఁమరగున నుండి బిగిసీని
సిరిపరు నెదుటనే చెంచెత
దొరలకే కాక నెత్తురు మన్ను మాకేల
బురదచెమట నామై పొలను కంపనుచు ॥

గుదిగొన్న మొగలి రేకులయెన్ను కొనగోరఁ
జిదిమి దేవుని వేసీఁజెంచెత

గదరుఁ బిల్లులనేతి కంపు నీ వొళ్లెల్ల
కదియకు నా మేను కంటగించీ ననుచు ॥

కప్పురపుఁ దావి వేంకటపతి కౌఁగిటఁ
జెప్పక యేతులే చెప్పీఁజెంచెత
దప్పిదేరు తేనెల తనివార నీ మోవి
యెప్పుడుఁబాయక ఇట్టె ఇచ్చే వోయనుచు"॥(12-146)

అనే సంకీర్తన రచించాడు.

ఇంటిలో ఉంగరాల వేళ్లతో తనను ఒత్తవద్దని శృంగార రాయుడైన నారసింహ స్వామిని చెంచెత సరసపుటలుకతో తిట్టు తోంది. గురువింద పొదచాటున దాగుకొని బిగుసుకు టోంది. హిరణ్య కశిపుని వధించి ఒళ్లంతా రక్తపు బురదతో నిండిన కంపు శరీరంతో తనను తాకవద్దని అంటోంది. మొగలిపూల ఎన్నను అతనిపై విసురు తోంది. జవ్వాది, పునుగు పిల్లుల కంపుతో వున్న నీ శరీరం చూస్తుంటే అసహ్యం వేస్తోందని అంటోంది. ఈ విధంగా తన ప్రణయ కోపాన్ని ప్రదర్శిస్తూ దప్పి తీరేవిధంగా నీ తియ్యని మోవి వదలకుండా ఎప్పు డిస్తావో అంటూ తన ప్రియుని తిట్టుతోందని అన్నమయ్య నాయిక సరస కోపాన్ని రమణీయంగా వర్ణించాడు.

లోక వ్యవహారంలో చెంచెతా కృష్ణుల సంవాదం కూడా ప్రసిద్ధమయిందే. అలాగే చెంచెతాకృష్ణుల అనురాగాన్ని వారి సరస సంభాషణా చాతుర్యాన్ని వర్ణిస్తూ —

"ఊరకుండేవో కేదో వోసి చెంచెతా!
కోరి నిన్ను నెంచుకొంటి గొల్లఁడవు గదరా ॥

జమళి పీకెలిదండ సరినీకేలే
నెమలిచుంగులపాగా నీకేలరా

అమరేనే సందుఁగడె మందుకుఁదోడు
భ్రమసి నీ వేల గుల్లపట్టుకున్నాఁడవురా ॥

పలు మెకాల వెంటను పారేవేలే నీవు
యెలమిఁబులుగు నేల యెక్కితివిగా
పలచని పారెటాకు పయ్యెదేఁటికే
అలమత్తాకు పానుపు అది నీకు నేలరా ॥

కాకిపైఁడి బొట్టు నీకుఁ గడు ప్రియమా
ఆకుఁదోలసి దండ నీకది బాఁతా
కైకొంటి శ్రీ వేంకటాద్రి ఘనుఁడ నిన్ను
నేకమైఁతిగదరా నీ యిందిరా దేవిని ॥" (25-418)

అనే సంకీర్తన రచించాడు.

ఇందులో జమళిపికిలిదండ నీకెందుకే అని కృష్ణుడంటే. నెమలి చుంగుల పాగా నీకేలరా అని చెంచెత ఎదురు ప్రశ్న వేస్తోంది. నీవు జింకలవెంట ఎందుకు తిరుగుతావు అని కృష్ణుడు అడిగితే నీవు పక్షి నెందుకెక్కావు అని చెంచెత అడుగుతోంది. పారెటాకు పైట నీ కెందుకే అని కృష్ణుడు, మత్తాకు పానుపు నీకేలరా అని చెంచెత ఈ విధంగా ఒకరికొకరు ఎవ్వరూ సమాధానాలు చెప్పకనే విలాసంగా పరస్పరం ఎదురు ప్రశ్నలు వేసుకుంటూ ఏకమైపోతారు. అన్నమయ్య ఏ రకపు శృంగార సంకీర్తనలోనైనా జీవాత్మ పరమాత్మ లక్ష్యాన్నే అంతర్గతంగా నిరూపించాడు.

ఈ విధంగా అన్నమయ్య నాగరికులకు, జానపదులకే కాకుండా గిరిజనులైన బోయీలకు, చెంచులకు వారి జీవన వ్యవహారాలకు తన సంకీర్తనలలో స్థానం కల్పించాడు. గిరిజనులకు కూడా వారి అవగాహనకు తగిన విధంగా విష్ణుభక్తిని సరస శృంగార రీతిలో బోధించి తరింపజేశాడు. అన్నమయ్య శిష్ట, జానపద, గిరిజన ప్రజలందరికీ హితుడు, సన్నిహితుడు.

కోస్తావాణి (10-10-1992)

# అన్నమయ్య విష్ణుబోధ

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" ॥

అని శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లుగా ప్రతి యుగంలోనూ సాధువులను రక్షించి దుష్టులను శిక్షించి ధర్మ సంస్థాపన చేయడం కోసం విష్ణుమూర్తి భూమిపై అవతరిస్తుంటాడు. భగవంతుడు తన అవతరణకు ముందుగా తన దివ్యాంశాలలో నుంచి కొన్ని కొన్ని కాలాలలో పరమ పురుషులను అవతరింపజేసి వారిద్వారా ప్రజలకు ధర్మ ప్రబోధ చేయిస్తుంటాడు. ఈ విధంగానే అన్నమయ్య అవతరణ జరిగింది. అన్నమయ్య ప్రజలలో మానవత్వాన్ని, విష్ణుభక్తిని, వైష్ణవ మత సిద్ధాంతాలను సులభంగా బోధించడం కోసం అనేక రకాలైన జానపదగేయ రీతులను, సంస్కృత, శిష్ట వ్యావహారిక భాషలలో సంకీర్తనలను రచించాడు.

కలియుగారంభంలో మహర్షులు చేస్తున్న కలి పాపహరణ యజ్ఞానికి మన ముక్కోటి దేవతలలో ఎవరు అర్హులు అనే సంశయం రాగా కొందరు మహర్షులు త్రిమూర్తులు అని చెప్పారు. ఆ త్రిమూర్తులలో ఎవరు పూజార్హులో నిర్ణయించడానికి భృగు మహర్షి ముల్లోకాలకు వెళ్ళి వారి వారి గుణాలను, ప్రవర్తనా తీరులను బట్టి - బ్రహ్మదేవుని రాజసమూర్తిగాను, శివుని తామస మూర్తిగాను నిర్ణయించి బ్రహ్మదేవునికి భూలోకంలో పూజార్హతే లేకుండా శపించి, శివునికి లింగపూజ తప్ప మూర్తి పూజ లేకుండా శపించి, విష్ణుమూర్తిని పరీక్షించి అతని సంయమన సద్గుణాన్ని మెచ్చి అతన్ని సాత్త్విక మూర్తిగా నిర్ణయించి ఇతడే యజ్ఞ ప్రథమ పూజార్హుడుగా నిర్ధారణ

చేసాడు. ఈ విధంగా - ఆ విష్ణుమూర్తియే ఈ కలియుగంలో ప్రత్యక్ష దైవంగా తిరుమల కొండపై వేంచేసియున్న శ్రీనివాసుడు. వేదాలలో రామాయణ, భారత, భాగవతాదులలో నెలకొన్న దేవ దేవుడు ఈ విష్ణుమూర్తియే. ఈ విధమైన పరిజ్ఞానం హేతువాదక శక్తిని ప్రజలలో కలిగించి శాశ్వతమైన, స్వచ్ఛందమైన పరమపదాన్నిచ్చి కాపాడే ఆ విష్ణుమూర్తిపై ప్రజలకు భక్తి ప్రపత్తులు ప్రవర్ధమానం చేయడమే అన్నమయ్య సంకీర్తనల లక్ష్యం.

"విష్ణుఁ డొక్కఁడే విశ్వాత్మకుఁడు
వైష్ణవమే సర్వంబును

పరమేష్ఠి సేయు బ్రహ్మాండ సృష్టియు
హరునిలోని సంహార శక్తి
పరగఁగ నింద్రుని పరిపాలనమును
అరసిచూడ శ్రీహరి మహిమలే ॥

ఇలఁ బంచ భూతములలో గుణములు
అల నవగ్రహ విహారములు
తలకొను కాలత్రయ ధర్మంబును
అలరఁగ నారాయణుని మహిమలే ॥

అంతటఁ గల మాయా విలాసములు
పొంతఁ బరమపద భోగములు
మంతుకు నెక్కిన మరి సమస్తమును
ఇంతయు శ్రీ వేంకటేశు మహిమలే" ॥ (2-345)

సకల దేవతలలో విష్ణువొక్కడే విశ్వాత్మకుడు. సర్వమూ వైష్ణవమే. బ్రహ్మ చేసే విశ్వసృష్టి, శివునిలోని సంహార శక్తి,

ఇంద్రుని పరిపాలన యోచించి చూస్తే అంతా ఆ శ్రీహరి మహిమే. పృథివీ, అప్, తేజో, వాయు వాకాశాలనే పంచభూతాలలోని గుణాలు, నవగ్రహ విహారాలు, భూత వర్తమాన, భవిష్యత్ ధర్మాలు అన్నీ ఆ నారాయణుని మహిమలే. విశ్వంలో అంతటా వ్యాపించి యున్న మాయా విలాసాలు పరమపదభోగాలు సమస్తమూ ఆ శ్రీనివాసుని మహిమలే, అంటూ అన్నమయ్య ఈ సంకీర్తనలో పేర్కొన్నాడు. భక్తపోతన కూడా కమలాక్షుడైన ఆ విష్ణుమూర్తిని అర్చించే చేతులే చేతులని, అతనిని వర్ణించే నాలుకే నాలుకని, అతనిని చేరుకోమని చెప్పే తండ్రియే తండ్రి అని, అతనిని గూర్చి బోధచేసే గురువే గురువు, అని ఈ విధంగా విష్ణుమూర్తి వైశిష్ట్యాన్ని భాగవతంలో నిరూపించాడు.

"విచారించు కోరోయిది వివేకులాలమెందు
పచారాలు చూచి మీరు భ్రమయకురో

భావింప నారదునికి బ్రహ్మపట్టమరుదా
వేవేలైనాఁ గొంచెమని విడిచెఁ గాక
దేవతలు తన్నుఁ జూచి దిగ్గన లేచి మొక్కేటి
ఆ వైభవపు పదమందెఁ గాక

మిక్కిలి జ్ఞానము గల్గిమించి తమనేరుపెల్లా
చిక్కి సంసారము పాలు సేయవలెనా
యెక్కువ హరిదాసుఁడై యిట్లానే వైకుంఠ
మెక్కుడితోవ సాధించే దిది మేలుగాక

ఇదియే శ్రీ వైష్ణవులు యీఁక బూర్వాచార్యులు
వెదకి చదివి కన్న వివరమెల్లా
తుదమొదలెరఁగని దుష్టుల కతలుమాని
పదిలమై యిట్టే నమ్మి బ్రదుకుట గాక

సంకు చక్రములు మా(నూ)?ని సమాన భోగముతోడ
అంకెల శ్రీ వేంకటేశునంత నుండరో
పొంకపు బుద్ధు లిమ్మని పొంచి గాయత్రి జపించి
ఇంక బ్రహ్మవేత్తలంచే దిందుకే కాక" ॥ (3-241)

అన్నమయ్య కాలంలో అన్యమతస్థుల దాడులు, మత బోధలు జరుగుతుండేవి. వారు చూపే ఆశలకు ప్రలోభులై ప్రజలు అన్య మతాలను స్వీకరించేవారు. అన్నమయ్య ఈ దుస్థితిని చూచి ఆవేదన చెంది వుండవచ్చు. అందుకే అన్నమయ్య - వివేకులైన ప్రజలారా మీరే విచారించుకోండి. ఇతరుల ప్రచారాలు చూచి భ్రమించకండి అని ఉద్బోధ చేస్తూ - నారదుడు ఇతర పదవులను వదలి, తనను చూచి దేవతలందరూ దిగ్గనలేచే నారాయణ మంత్ర పదవిని చేపట్టాడు. మీ విజ్ఞానాన్ని, నేర్పును అంతా సంసారం పాలు చేసీయకుండా హరిదాసులై వైకుంఠ నగర మెక్కే దారిని సాధించండి. ఇదే వైష్ణవులు, పూర్వాచార్యులు వెదకి, చదివి, కనుగొన్న విషయం. ఆది అంతాలు లేని దుష్టుల విషయాలు వదిలిపెట్టి నిశ్చలమైన బుద్ధితో శ్రీహరిని నమ్మి బ్రతకండి. శంఖ, చక్ర ముద్రాధారణ గావించుకొని విష్ణుమూర్తి అంతటి వైభవంతో తులతూగండి. మంచి బుద్ధు లిమ్మని గాయత్రిని జపించే బ్రహ్మవేత్తలు భావించేది ఈ విష్ణుమూర్తి కోసమే అంటూ విష్ణుభక్తిని సహేతుకంగా వివరించి చెప్పాడు.

"ఊరకే కలుగునా వున్నతపు మోక్షము
శ్రీరమణు కృప చేతఁ జేరు మోక్షము

కలుషముఁ బెడఁ బాసి కర్మగండము గడచి
మలసినప్పుడు గా మరి మోక్షము
చలన మించుక లేక సంసార వారధి దాఁటి
నిలిచినప్పుడుగా నిజమోక్షము

పంచేంద్రియాల మీఁది భక్తి హరి మీఁదఁబెట్టి
మంచి వాఁడైనప్పుడుగా మరి మోక్షము
అంచల యాసలుమాని ఆచార్య సేవచేసి
మించి నప్పుడుగా అమీఁది మోక్షము

శాంతమే కూడుగా నుండి సమచిత్తమునఁ బొంది
మంతు కెక్కినప్పుడుగా మరి మోక్షము
అంతట శ్రీవేంకటేశుఁడాదరించి మన్నించితే
నంతరంగమున నున్న దనాది మోక్షము"॥ (2-505)

మోక్షమంటే జనన మరణాలు లేకుండా శాశ్వతంగా పరమాత్మలో కలసిపోయి దివ్యానందాన్ని అనుభవించడం. ఈ మోక్షం ఊరకే కలుగదు. శ్రీరమణుడైన విష్ణుమూర్తి దయవల్లనే సాధ్యమవుతుంది. కల్మష బుద్ధులను, ఐహిక కర్మలను వదలినప్పుడు, నిశ్చలమైన మనస్సు సంసార సాగరాన్ని దాటి నిలిచినప్పుడు పంచేంద్రియ సుఖాలను అతిక్రమించి హరిమీద భక్తి ఉంచి సజ్జనుడుగా, బ్రతికినప్పుడు అత్యాశలు వదలిపెట్టి ఆచార్యుని సేవచేసి ధన్యుడైనప్పుడు, శాంతమే ఆహారంగా ఉండి సుఖదుఃఖాలలో సమస్తచిత్తాన్ని అవలంబించి నిలిచినప్పుడు, శ్రీవేంకటేశ్వరుడు దయచూపి మన్నించినప్పుడు మోక్షం సిద్ధిస్తుందని అన్నమయ్య మోక్షాన్ని పొందే మార్గాన్ని అతి సులభంగా వివేచించి ప్రజలకు బోధించాడు.

"పెద్ద తెరువుండఁగాను పెనుగంతలు దీసుక
పొద్దువోక యడవులఁ బుంగుడయ్యేరు"

తొల్లిటి పెద్దలెంచిరి దొడ్డ వాఁడు హరియంటా
అల్లదే భారత రామాయణ భాగవతములు
ఇల్లిదే నేఁటి పెద్దలు యెవ్వరో దైవములంటా
వెల్ల విరిగా నింకా వెదకేరు ॥

దేవలోకమువారు దేవుఁడు శ్రీపతియని
భావించి మొరవెట్టి బ్రదికిరి
యీవల నిప్పటివారు ఇందఱికి మొరవెట్టి
కావిరి నెవ్వరి వారు గాక వున్నారు ॥

నానా భూములవారు నమ్మి శ్రీవేంకటపతిఁ
గానవచ్చి యేఁటనేఁట ఘనులయ్యేరు
యీ నిజ మిక్కడివారు యిన్నియుఁ దెలిసుండియు
మానక చలాలఁ బోయి మాయలఁ బొందేరు"(3-383)

ప్రజలు అజ్ఞానులై తనలోనున్న, తన సమీపంలో నున్న ప్రధాన దైవాన్ని వదిలిపెట్టి ప్రయాసతో ఎక్కడెక్కడో తిరిగి బాధ పడుతుంటారు. అలాంటి వారికి అన్నమయ్య జ్ఞానబోధ చేస్తూ ముందు యుగాలలోని పెద్దలందరూ విష్ణుమూర్తియే అధికుడుగా లెక్కించారు. దానికి తార్కాణం రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలు. కానీ ఈ కాలపు పెద్దలు ఇంకా ఎవరో దైవాలున్నారని వెదకుతున్నారు. దేవలోకంలోని వారు దేవుడు ఆ శ్రీపతియే అని భావించి కష్టాలలో అతనికి మొరపెట్టుకొని బ్రతికారు. కానీ ఇప్పటివారు అందరికీ మొర పెట్టుకొని ఎవ్వరివారూ కాకుండా వ్యర్థంగా ఉంటున్నారు. నానా దేశాలవారు శ్రీవేంకటపతిని నమ్మి ప్రతి సంవత్సరం చూడటానికి వచ్చి ఘనులవుతున్నారు. కాని ఇక్కడివారు ఈ విషయాలన్నీ తెలిసీ కూడా పంతాలకు పోయి మాయలకు లోబడుతున్నారు. అంటూ ప్రజలలోని అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానాన్ని పెంపొందింప జేయడానికి ఈ సంకీర్తన రచించాడు.

"ఏమిఫలము దానిన్నియునుఁ దెలిసి నను
సాము సేసిన ఫలము జయశీలుఁడౌటగాక ॥

తాను గలిగిన ఫలము దయసేయఁ గలుగుట
మేను గలిగిన ఫలము మేలెల్ల గనుట
మానుషము గల ఫలము మంచి వాఁడౌట తనుఁ
దానె తెలిసిన ఫలము తత్వపరుఁడౌట గాక ॥

పదిలమగు కులము గల ఫలము తాఁ జదువుట
చదివిన ఫలంబర్థ సారంబు గనుట
పొదలి శాస్త్రార్థంబు పొడగన్న ఫలము మఱిఁ
దఁలక తిరు వేంకటేశు దాసుఁడౌట గాక" (1-136)

మానవుడికి ఎన్ని తెలిసినా ఏమిలాభం ? సాము విద్య నేర్చినందుకు ఫలం జయశీలుడు కావాలి అంటూ అన్నమయ్య ఏది ఉన్నందుకు ఏమి చేయాలో ప్రజలకు తెలియజేస్తూ — తాను బ్రతికి ఉన్నందుకు ఫలం దయ కలిగి ఉండాలి. శరీరం కలిగినందుకు ఫలం మేలు చేయాలి. మానుషత్వం ఉన్నందుకు మంచి పనులు చేసి మంచి వాడవ్వాలి. తనను గూర్చి తాను తెలుసుకున్నందుకు తత్వపరుడు కావాలి తనకు గొప్పకులం ఉన్నందుకు చదువుకోవాలి· చదివినందుకు ఫలం అర్థసారాన్ని తెలుసుకోవాలి· శాస్త్రార్థాలు తెలుసుకున్నందుకు ఫలం బుద్ధి వదలక శ్రీ వేంకటేశ్వర దాసుడు కావాలి. అప్పుడు మానవ జన్మ సార్థకమయినట్లు" అని అన్నమయ్య ఈ సంకీర్తనలో ప్రజలకు తెలియజెప్పాడు·

అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో విష్ణుమూర్తి మహిమలను, దశావతార విశేషాలను, భక్తి, జ్ఞాన, వైరాగ్య మార్గాలను గూర్చి బోధించాడు. భగవంతునిపై ప్రగాఢ విశ్వాసం ఉంటే మానవుడు ఏ విధమైన దుష్టశక్తులకు భయపడనవసరం లేదు. పోతన, అన్నమయ్య· క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్యవంటి భక్తకవులను

అవమానించిన రాజాధిరాజులు, ఇతర మానవులు తమ తమ తప్పులను గ్రహించి పశ్చాత్తప్తులై ఆ మహనీయుల పాదాలపై వ్రాలి శరణు వేడుకున్నారు. ఈ లోకంలో మానవుడికి ఎంతటి ధన, జన, బలాలున్నా, ఎన్ని కుయుక్తులు పన్నినా, ఎంతగా అహంకరించి విర్రవీగినా ఆ పరమాత్మ సంకల్పిస్తే అన్నీ పతనమవుతాయి. కాబట్టి మానవులందరూ సుమతులై వినయ వివేకాలతో, భక్తి ప్రపత్తులతో శ్రీ వేంకటేశ్వరుని సదా ధ్యానించుకుంటే సాధించలేనిది ఏమీ లేదనే దృఢ నమ్మకం, ఆత్మ విశ్వాసం, అన్నమయ్య సంకీర్తనల వల్ల మనకు సిద్ధిస్తుంది.

'నావ' త్రైమాస పత్రిక, రాజమహేంద్రవరం
(అక్టోబరు 1992)



# అన్నమయ్య సంకీర్తనల్లో అలరుల అభివర్ణన

అలరులు అంటే పుష్పాలు అని అర్థం. పుష్పాలకే పువ్వులు, సుమాలు, కుసుమాలు, విరులు మొదలైనవి పర్యాయపదాలు. భగవంతుడు సృష్టించిన ఈ సన్నివేశాల అందాల ప్రకృతిలో ఎన్నో జీవరాశులున్నాయి. ఎన్నో పర్వత సాగర స్రవంతులున్నాయి. ఎన్నో వృక్షరాశులున్నాయి. అన్నింటికన్నా ప్రత్యేకమైనవి, స్వచ్ఛమైనవి, సొగసైనవి. వృక్షజాతి ప్రసాదించే అలరులే. అయితే పుష్పాలన్నీ యోగ్యమైనవి కావు. మనుష్యులందరూ పుట్టుకతో ఒక్కటే అయినా వారి వారి రూపురేఖలనుబట్టి, గుణగణాలనుబట్టి, యోగ్యతనుబట్టి పురుషులందు పుణ్యపురుషులు వేరయా అని వేమన మహాకవి అన్నట్లు ఆ పుష్పాలలో కూడా కొన్ని రకాల పుష్పాలే భగవదర్చనకు, మానవ శిరోధార్యానికి, శుభాశుభ కర్మలకు, గృహాలంకరణకు మహనీయుల సత్కారణకు ఉపయోగపడతాయి.

పుష్పాలు చక్షురింద్రియం ద్వారాను, పుష్పపరిమళాలు ఘ్రాణేంద్రియంద్వారాను శారీరకహాయిని, మనస్సుకు ఎంతో ఉల్లాసాన్ని, తన్మయత్వాన్ని కలిగిస్తాయి. కవులు సొగసైన స్త్రీ, పురుషుల శరీరావయవ సౌందర్యాన్ని పుష్పాలతో పోల్చి చెబుతారు. అసలు పుష్పాల ప్రసక్తులులేని కావ్యం అంటూ ఏ భాషా సాహిత్యంలోనూ ఉండదన్నా ఆశ్చర్యం లేదు.

తాళ్లపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని వరప్రసాది. శ్రీ వేంకటేశ్వరుడు శ్రీ మహావిష్ణువు అవతారం. ఈ దేవుడు దుష్టశిక్షణ శిష్టరక్షణకోసం ప్రతి యుగంలోనూ అవతరించే ధర్మోద్ధారకుడు. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరునిపై ముప్పై రెండువేల శృంగార

అధ్యాత్మ సంకీర్తనలను రచించి, ఆ స్వామివారికి అంకితమిచ్చిన పరమ భాగవతోత్తముడు. వైష్ణవ మతోద్ధరణ, వైష్ణవ మతాధిక్య నిరూపణ, విష్ణులీలాభివర్ణన, మూర్ఖాచార ఖండన, మానవ ధర్మ ప్రబోధం మొదలైనవి అన్నమయ్య సంకీర్తనల్లోని ప్రధానాంశాలు. అన్నమయ్య శృంగార సంకీర్తనలలో పుష్పాభివర్ణన, పుష్ప ప్రాధాన్యం, పుష్పవినియోగం విరివిగా కనిపిస్తుంది. అన్నమయ్య సంకీర్తనలలో ఎన్నో రకాల పుష్పాలు కనిపిస్తాయి. సంకీర్తనల్లో వాటిని ఎన్ని రకాలుగా ప్రయోగించాడో వాటిని స్థూలంగా పరిశీలించి చూపడం ఈ వ్యాసం ముఖ్యోద్దేశం.

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో మధుర భక్తి తత్త్వాన్ని ప్రతిపాదించాడు. ఎంతసేపు వైరాగ్యధోరణిలో వేదాంతం చెబితే పాఠకులు నీరసించిపోతారని కాబోలు పాఠకులకు ఉల్లాసాన్ని కలిగించే మధుర భక్తిమార్గంలో విష్ణుతత్త్వాన్ని ప్రబోధించాడు. ఇందులో నాయికా నాయకులు అలమేల్మంగా శ్రీనివాసులు. వీరి అందచందాలను వర్ణించేటప్పుడు అవయవాలకు పోలిక చెప్పడానికి, వీరి ప్రణయ భావాన్ని ఉద్దీపింపజేయడానికి, వీరి కోపతాపాలను పోగొట్టడానికి కొన్ని రకాల పుష్పాలను అన్నమయ్య ప్రయోగించాడు. తామర, కలువ, మొగలి, గొజ్జంగి, సంపెంగ, మోదుగ, మొల్ల, సురపొన్న, పొన్న, పొగడ, దొంతర, మంకెన, మల్లి, చేమంతి, బొండుమల్లె, జాజి మొదలైన పుష్పాలు సంకీర్తనల్లో కనిపిస్తాయి.

**తామర :**

'తామర పూడువ నీ చెయిదాకించెనంటాను
వేమారు నాతని నెన్ని వేంగేలాడేవే'

(31వ సంపుటం - 88వ సంకీర్తన)

నాయకుడైన శ్రీనివాసుడు తనపై కోపించియున్న నాయిక చేతిని తామరతూడుతో కోపోపశమనంకోసం తాకించడం, అలమేల్మంగ అతన్ని వ్యంగ్యాలాడటం, దీనినంతా గమనిస్తున్న చెలికత్తె నాయికను ప్రేమతో మందలించడం ఇందులో కనిపిస్తుంది.

'దట్టముగ మంచి తెల్లఁదామెర పూవునను
ముట్టి అవయవముల మొలచినట్టుండె' (31-274)

ఇందులో కూడా తెల్లతామరను ఆహ్లాదంకోసం శరీరానికి తాకించడం కనిపిస్తుంది.

'తుమ్మెదలఁతో లేటి తొయ్యలి తురుమునకు
సమ్మతిఁదామెరలీరే సంపెంగలేల' (31-273)

సంపెంగపుష్పం తుమ్మెదను దరిచేరనీయదు. నాయిక కొప్పు తుమ్మెదల గుంపువలె వుంది. తుమ్మెద పద్మాన్నే అభిలషిస్తుంది. కాబట్టి ఆమె కొప్పులో ఉంచడానికి పద్మాలే యోగ్యం అనే విషయం ఇందులో ఇమిడివుంది.

'తామెర కన్నులదాన తామెర చేతులదాన
తామెర మోముదాన తపవేదేమి' (31-592)

నాయిక అయిన అలమేల్మంగ తామరవంటి కన్నులు, తామరవంటి చేతులు, తామరవంటి ముఖము కలిగినదని వర్ణన చేయబడింది. జనవ్యవహారభాషకు కావ్యగౌరవం కలిగించిన అన్నమయ్య తామర అనడానికి తామెర అని ప్రయోగించాడు.

'పొంచి తామరపువ్వులఁ బోలిన పాదాలాతఁడు'
(24-251)

ఇందులో నాయకుడైన శ్రీనివాసుడు తామర పువ్వులను పోలిన పాదాలుగలవాడని వర్ణన చేయబడింది.

కలువ :

'కలువ రేకులవంటి కన్నులందేలించి చూచి
మలసిసొలసి నీతో మాటలాడీని' (31-91)

నాయిక కన్నులు కలువ రేకులవంటివని ఇందులో పోలిక చెప్పబడింది.

'ఇక్కక కలువ రేకులవంటి చూపులలో
చిక్కటిల్లి గుండెదాకి బెదరనేది' (31-233)

ఇందులో నాయిక చూపులు కలువ రేకులవంటివి అని పోలిక చెప్పబడింది.

'జలకమాడివున్నాడదు సర్వేశ్వరుడు నిగ్గు
గలిగిన మంచి నల్ల కలువవలె' (31-496)

జలకమాడి స్వచ్ఛమైన నీలవర్ణంతో ఉన్న సర్వేశ్వరుడైన ఆ శ్రీనివాసుడు నల్ల కలువవలె ఒప్పియున్నాడని వర్ణన.

'కలువ రేకులవంటి కన్నుల కలికినీమై
సొలసి సొలసి చూచి సోదించీని' (31-528)

నాయిక కన్నులు కలువ రేకులవంటివని, అలాంటి కన్నులతో నాయకుని శరీరాన్ని శోధించి చూస్తోందని చెలికత్తె చెబుతోంది.

'కలువపువ్వులవేసి కాగిలించేవు' (31-264)

పువ్వులతో శరీరాన్ని తాకించినప్పుడు ఆహ్లాదంగా ఉంటుంది. కాబట్టి పువ్వులు వేసి కౌగిలించడంవల్ల ఆహ్లాదం ఇనుమడిస్తుంది.

'వదలక నల్లఁగలువల వేసేవది యేమే
కదిసి నీ చూపులే కలువలై వుండఁగా' (30-482)

నాయిక తన ప్రియునిపై నల్లకలువలు విసిరింది. అప్పుడు ప్రియుడు తన నాయికతో నీ చూపులే కలువలవంటివని ప్రత్యేకించి నల్లకలువలను ఎందుకు విసురుతావు అని ఛలోక్తి విసరడం ఇందులో కనిపిస్తుంది.

'కలువ రేకులవంటి కన్నులాతఁడు నీ పతి' (24-151)

చెలికత్తె నాయికతో నీ భర్త కలువ రేకులవంటి కన్నులు కలిగినవాడు అని ప్రసంసిస్తోంది.

మొగలి :

'కొప్పులోని మొగలిరేకుల తావిదొలఁకగాను
చెప్పీ నేకతము నీకు చెవిలోనికే' (31-52)

అలమేల్మంగ కొప్పులో మొగలిరేకులు పెట్టుకొని ఉంది. ఆ మొగలిరేకులు పడిపోయే విధంగా ఆమె చెవిలో తన ప్రియుడు ఎడ తెగకుండా ప్రేమకబుర్లు చెబుతున్నాడని చెలికత్తె చెబుతోంది.

'చెనకు నీగోళ్ళే చిఱుగేదఁగుల పూజ' (12-100)

నాయికయొక్క గోళ్ళే మొగలిరేకుల పూజవంటిదని ఇందులో వర్ణించబడింది.

'గుదిగొన్న మొగలిరేకుల యెన్నుకొనగోరఁ
జిదిమి దేవునివేసీఁ జెంచెత' (124146)

చెంచెత తన ప్రియుడైన దేవునిపై మొగలిచెండును కొనగోరుతో చిదిమి విసిరిందని ఇందులో చెప్పబడింది.

గొజ్జంగి

'కొప్పదువ్వి నీ కాతఁడు గొజ్జంగలు ముడువఁగా'
(31-442)

ప్రియుడు తన ప్రేయసికి ప్రేమతో తలదువ్వి గొజ్జంగి పుష్పాలను తలలో ముడిచాడని ఇందులో చెప్పబడింది.

సంపెంగ :

'పుమ్మడి సంపెంగ వ్రాయనున్నతి నాసికమాయ'
(24-447)

సంపెంగపుష్పాన్ని చిత్రం గీస్తుండగా అది ముక్కుగా మారిందని చెప్పడం అద్భుతమైన భావన.

'చలివేఁడి వూర్పు నీ సంపంగి పూజ' (12-95)

సంపంగి పుష్పంలోని పరిమళం వేడిగా ఉంటుందంటారు. అందువల్ల నాయిక విడిచే వేడినిట్టూర్పు సంపంగ పూజవంటిదని వర్ణన.

'సతి నాసికమనేటి సంపెంగపూవు' (30-203)

సతినాసిక సంపెంగపుష్పంగా భావించబడింది.

మోదుగ :

'మోతుగుపూచెనొ మొల్లపూచెనో
కాతరపు చెలికన్నులను' (31-291)

మోహపు చెలికన్నులలో మోదుగపుష్పం పూచిందా లేక మొల్లపుష్ప పూచిందా అనే విచారణ ఇందులో కనిపిస్తుంది.

మొల్ల :

'లలన నీ నగవు మొల్లలపూజ' (12-95)

మొల్లపుష్పం తెల్లగా ఉంటుంది. కాబట్టి నాయికయొక్క నవ్వు మొల్లలపూజగా అభివర్ణించబడింది.

'మొల్లలు నురుముల ముడిచిన బరువున' (12-294)

మొల్లపుష్పాలు కొప్పులో బరువుగా ముడువబడ్డాయని చెప్ప బడింది.

**సురపొన్న, పొన్న :**

'యెక్కడికే వనిత మీరిద్దరి కెమ్మోవులందు
చుక్కలు జుక్కలేసుర పొన్నలై పూచె' 30-194)

సంయోగానంతరం ప్రేయసీప్రియుల అధరాలపై పడిన చుక్కలు సురపొన్న పుష్పాలై పూచాయని చెలికత్తె చమత్కరించింది అంటే చెలికత్తెరూపంలో అన్నమయ్య చమత్కరిస్తున్నాడని అర్థం.

'చెలఁగి పొన్నలవిరియు చెలువుఁదేనెలసోనఁ
జలివాంది కొంత వడదీరేనా వేళ' (12-379)

పొన్నపుష్పాలలోని తేనెసోన జాలువారినందువల్ల నాయిక విరహతాపం కొంత తగ్గిందని వర్ణించడం ఇందులో కనిపిస్తుంది.

**పొగడ ;**

'పొగడ పూవులలోన పొందుగఁజూచిన తావి
తగుఁగాక తాసుదము మానీనా' 12-368)

పొగడ పుష్పాలలోని పరిమళం తక్కిన పుష్పాలలో వలె మృదువుగా ఉండదని, పొగడపుష్పంలోని పరిమళం చాలా ఘాటుగా ఉంటుందని ఆ విధంగా నాయకుడు గర్వంతో విర్రవీగి ఉన్నాడని ఈ సంకీర్తనలో వర్ణించబడింది.

**దొంతర, మంకెన, మల్లి :**

'తనరు నీవలులు దొంతర పూవుల పూజ' (12-95)

చెలియొక్క ఉదరంమీది రోమరాజి దొంతరపూవుల పూజ గాను,

'చెమట మల్లెమొగ్గలపూజ' (12-95)
'నీదుమోవి మంకెన పూవుపూజ' (12-95)

గాను అభివర్ణించబడింది.

**చేమంతి :**

'నీ కొప్పున కేలే సేమంతులు'
'సతి తురుములోని శామంతి విరులు' (30-183)

అని చెప్పబడింది.

**బొండుమల్లి :**

'బొండుమల్లెలతావిఁ బొడవైన గాలి' (12-232)

బొండుమల్లెల వాసనతో కూడిన పెద్దగాలి అని చెప్పబడింది.

'బొండుమల్లె పరపుపైఁ బొరలేటి యిట్టినన్ను
కొండలరాయడ నిన్నుఁ గూడించెనా వలపు' (12-324)

బొండుమల్లి పాన్పుపై పొరలుతున్న నాయికను వలపు, కొండలరాయడైన ఆ శ్రీనివాసుని కలిసే విధంగా చేసిందని వర్ణన.

**జాజి :**

'తనుపులకలు జాజినలపూజ' (12-95)

నాయిక తనువుమీది పులకాగ్రాలు జాజుల పూజగా అన్నమయ్య అభివర్ణించాడు.

'జాజు జాజేగాక దిరిశపు పువ్వౌనా' (12-363)

అని సామెతరూపంలో ప్రయోగించాడు.

"అతనుని తలపోంత నడవిజాజులు పూచె" (30-8)

నాయికకు మన్మథుని తలపులతో అడవిజాజులు పూచినట్లు యుందని భావన.

అన్నమయ్య వర్ణించిన పుష్పాలలో తామరలు, కలువలే విస్తారంగా కనిపిస్తాయి. దీనికి కారణం వైష్ణవ మతంలోని అధిష్ఠాన దైవాలు, దివ్య దంపతులు అయిన లక్ష్మీ విష్ణువులకు పద్మాలు, కలువలంటేనే ఎక్కువ ప్రీతి కావడం కావచ్చు. లక్ష్మీదేవి పద్మాలయ, విష్ణుమూర్తి పద్మనేత్రుడు. సృష్టిలోని సమస్త పుష్పాలలో తామరలు, కలువలే మిక్కిలి సుందరమైనవి, పరిమళభరితమైనవి. ఈ కారణావల్ల అన్నమయ్యకు ఈ పుష్పాలనే తన సంకీర్తనల్లో విరివిగా ప్రయోగించి వుండవచ్చు. పలురకాల ప్రకృతి పుష్పవర్ణనలకు ఆలవాలమైన అన్నమయ్య సంకీర్తనా పుష్పాలు భక్తిరసప్లావితాలు, ఆనంద సంభరిత సౌరభాలు.

కోస్తావాణి (16-11-92)



# ఫెమినిస్టుగా అన్నమయ్య

ఫెమినిస్టు భావాలున్న స్త్రీ పురుషులందరూ ఫెమినిస్టులే. ఫెమినిజాన్ని తెలుగులో నారీవాదమని, స్త్రీవాదమని అంటారు. ఈ భావాలతో రచనలు చేసేవారు ఫెమినిస్టు రచయితలు, కవులు. సమాజంలో సగభాగంగా వున్న స్త్రీలు కూడా పురుషులతో పాటు మనుష్యులేనని, వారికీ మనసు, మమత, మేధ ఉందని, వారికీ హక్కులు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉన్నాయని గుర్తించడం, వాటికి ఇంటా బయటా పురుషుల వల్ల భంగం కలిగినప్పుడు, దోపిడీ చేయబడ్డప్పుడు వాటిని హస్తగతం చేసుకోవడానికి చేసే పోరాటమే స్త్రీవాదం. ఇది ఉపన్యాసరూపంలో కావచ్చు, రచనల రూపంలో కావచ్చు. నేడు ప్రపంచమంతటా స్త్రీవాదం, స్త్రీవాదకవిత్వం ఉద్యమిస్తుంది.

స్త్రీవాద కవిత్వం తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనల్లో కూడా కనిపించడం ఒక విశేషం. అన్నమయ్య 15వ శతాబ్దానికి చెందిన పదకవి అయినా, ఆనాటి సమాజంలో వర్ణాశ్రమ ధర్మాలు, కులతత్వం, మూఢాచారాలు, మూఢ విశ్వాసాలు పాటించబడు తున్నా అన్నమయ్య మాత్రం సహేతుకంగా ఆలోచించి వాటిపై తిరుగుబాటును వ్యక్తం చేశాడు. మనుష్యులు సృష్టించుకున్న ఈ అంతరాల కన్నా మానవత్వమే మిన్న అని చాటి చెప్పాడు. కుటుంబంలో, సమాజంలో స్త్రీకి అత్యంత ప్రాధాన్యం ఇచ్చాడు. లాలి, జోల, ఉయ్యాల, జాజర, గొబ్బి, సువ్వి, అల్లోనేరేళ్ళు, మాతృ వాత్సల్య గేయాలు మొదలైన అనేక రకాల పాటల్ని రచించాడు. తన శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులైన అలమేల్మంగా శ్రీనివాసులలో శ్రీనివాసుని ఘనతను తగ్గించడం, అమ్మవారి గొప్ప తనాన్ని చాటడం పైగా అమ్మవారి వలనే స్వామి వారికి వైభవం

కలిగిందని వర్ణించడంలో అన్నమయ్య స్త్రీకి ఇచ్చిన గౌరవం, ప్రథమ స్థానం వ్యక్తమవుతుంది.

"ఈకెకు నీకు దగు నీడు జోడులు
వాకుచ్చి మిమ్ము పొగడ వసమా మొరలకు

జట్టిగొన నీ దేవులు చంద్రముఖి గనక
అట్టె నిన్ను రామచంద్రుడనదగును
చుట్టమై కృష్ణ వర్ణపు చూపుల దూపెగనక
చుట్టుకొని నిన్ను కృష్ణుడ వనదగును"

అనే సంకీర్తనలో అన్నమయ్య చెలికత్తె పాత్ర ధరించి అలమేల్మంగా శ్రీనివాసుల అనురూప జంటను ప్రశంసిస్తూ ఆ జంటలో పద్మావతికి అధిక ప్రాధాన్యమిస్తూ శ్రీనివాసునితో నీ దేవేరి చంద్రముఖి కాబట్టి నిన్ను రామచంద్రుడన వచ్చును. ఆమె నల్లని చూపుల కాంత కాబట్టి నిన్ను కృష్ణుడనవచ్చు. అలాగే ఆమె అందమైన కన్నులు కలిగిన వామలోచన కాబట్టి నీవు వామనుడవు. ఆమె సింహమధ్య కాబట్టి నీవు నరసింహుడవు. ఆమె శ్రీదేవి కాబట్టి నీవు శ్రీవత్సుడవు. ఆమె అందమైన వళులు కలిగిన అహిరోమాళి కాబట్టి నీవు శేషాద్రి వేంకటేశుడవు అయ్యావు అని వర్ణించాడు. ఇలా పద్మావతికి అంటే స్త్రీకి ఆధిక్యం ఇస్తూ వ్రాసిన సంకీర్తనలు చాలా కనిపిస్తాయి.

అన్నమయ్య దైవ వశాన ఇద్దరు స్త్రీలకు భర్త అయినా ఏనాడూ వారిని బాధపెట్టినట్టు గానీ పొరపాటున కించపరచినట్లుగానీ, అన్నమాచార్య జీవితచరిత్రలో ఎక్కడా చెప్పబడలేదు పైగా అన్నమయ్య మొదటి భార్య తిరుమలాంబయే తెలుగులో తొలి కవయిత్రి. ఆమె పేరే కాలక్రమేణ వ్యవహారంలో తిమ్మక్కగా మారింది.

తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా కల్యాణమనే మంజరీ ద్విపద కావ్యాన్ని వ్రాసింది. ఆమె ఈ కావ్యం చివర్లో

'అవనిలో తాళ్ళ పాకన్న య్యగారి
తరుణి తిమ్మక్క చెప్పె తాను సుభద్రా
కళ్యాణమను పాట కడు మంచి తేట'

అని తన భర్తగారి పేరు చెప్పుకున్నదంటే అన్నమయ్య తన స్త్రీ పట్ల చూపిన అనుకూల్యత, సహకారం, ప్రోత్సాహం ఎంతటిదో మనం గమనించవచ్చు.

అన్నమయ్య తన కుటుంబంలో స్త్రీ పట్లే కాకుండా సమాజంలోని స్త్రీలపట్ల కూడా ఎంతో గౌరవం, పూజ్యభావం, దయ ప్రదర్శించిన మనవతావాది. స్త్రీకి పురుషుడితో పాటు సమాన గౌరవం ప్రాధాన్యం ఉండాలని ఒకరు స్వతంత్రులు, మరొకరు పరతంత్రులు కావడం, ఒకరిని అధికంగా, మరొకర్ని హీనంగా చూడడం సమంజసం కాదని సమాజానికి చాటిచెబుతూ-

"పొలతులు జీవులే పురుషులు జీవులే
తలప భావ భేదములే కాని
బలిమి స్వతంత్రముఁ బరతంత్ర మొకరికి
యెలమి నందులోఁ జెళ్లే హీనాధికములే"

అనే సంకీర్తన రచించాడు.

తరతరాల నుంచి నేటివరకూ కూడా అందరూ స్త్రీలకే నీతి బోధ చేస్తుంటారు. ఆచారం, ధర్మం; శీలం, నీతి స్త్రీలకే పరిమితం అన్నట్లుగా, ఛాందసంగా ఒక ఇల్లాలు తన భర్తపట్ల

"కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
భోజ్యేషు మాతా శయనేషు రంభా

రూపేచ లక్ష్మీ క్షమయాధరిత్రీ
షట్కర్మ యుక్తా కుల ధర్మ పత్నీ"

అనే విధంగా ప్రవర్తించాలని మను ధర్మశాస్త్రం చెప్పింది. కానీ పురుషుడు స్త్రీలపట్ల ఇలాగే ప్రవర్తించాలని చెప్పలేదు. అన్నమయ్య సకల శాస్త్ర పారంగతుడు. అన్ని శాస్త్రాలలోని మర్మాన్ని తెలుసుకొని వాటి సారాన్ని గూర్చి

"కంటి నిదేయర్థము ఘనశాస్త్రములు దవ్వి
పరపీడన సేయుట కంటె పాపము మరెందు లేదు
పరోపకారము కంటే బహు పుణ్యము లేదు
నితర శాంతము కంటే నిజ ధర్మ మెందు లేదు"

పరపీడనం చేయడం పాపమని, పరోపకారం కన్నా మించిన పుణ్యం లేదని, ఎల్లప్పుడూ శాంతబుద్ధితో ఉండటం కన్నా నిజధర్మం లేదని తెలియజేశాడు.

భర్తకు అవసర వేళలలో భార్య సేవ చేసినట్లే భార్యకుకూడా భర్త సేవ చేయాలని, స్త్రీ ఆధిపత్యం వహించడం, రాజ్యమేలడం మంచిదేనని, భార్యకు ఎంతగా సపర్యలు చేస్తే భర్తకే అంత సౌఖ్యమని అన్నమయ్య చెబుతూ —

"ఆటది రాజ్యమేలితే అది మంచిదే కాదా
చాటువగా మాకు నిన్ను సాధించనేటికి ॥

పీటపై నున్న దాపె ప్రియుడవు నిలుచుండి
మాటలాడే వాపెతోను మంచిదే కాదా
గాటముగా వంచ నెంత గలిగి మెలగినాను
మాటున నీవే ఒదిగే వేమిసన నేటికి"

పడతి పవ్వళించఁగా పాదాల కాడ నుండి
మడ చిచ్చే వాడు నీవు మంచివే కదా
వుడుగక నీ వెంత వ్రాడిగాలు నేర్చినాను
కడు నీకే లాభమయ్యా కాదనఁగనేటికి"

అనే శృంగార సంకీర్తన రచించాడు. ఈ సంకీర్తనలో అన్న మయ్య శ్రీనివాసునిచేత పద్మావతికి సేవలు చేయిస్తున్నాడు. పద్మావతి పడుకొని వుంటే పాదాలదగ్గర శ్రీనివాసుడు కూర్చొని ఆమెకు తాంబూలం అందిస్తున్నాడు. అలా చేయడం మంచి దేనని అన్నమయ్య వ్యాఖ్యానిస్తున్నాడు.

కొంతమంది పురుషులు తన భాగస్వామికి అనురక్తుడై వుండటం, సపర్యలు చేయడం చిన్నతనంగాను, చవటాయితనంగాను భావిస్తారు. అలాంటి వారే ఆ స్త్రీ ద్వారా సౌఖ్యాన్ని, ధనాన్ని, స్వార్థలాభాన్ని పొందేటప్పుడు అలా భావించరు. ఈ బుద్ధి జాడ్యం మానసికంగా నశించాలి. ఈ రకపు మనుష్యులకు అన్నమాచార్య సంకీర్తనలు గుణపాఠాన్ని నేర్పుతాయి.

గుట్టు, ఓర్పు, పతిలం అనేవి స్త్రీలే కాకుండా పురుషులుకూడా పాటించాలని అన్నమయ్య బోధించాడు.

"సరసుఁడ విన్నటాను జాణవు నీవు
వొరసి నిందాకా సతి వోరుచుకోవయ్యా

మనసొక్కటైన దాకామాటలు మూటఁబడవు
మొనయ కుండితే నన్నీ మొరవెరవే
నినుబాసి విరహాన నెలఁత యెంత దూరెనో
వొనరిబిడికనవి వోరుచుకోవయ్యా"

అనే సంకీర్తనలో అలిగిన సతి ఏన్నైనా తిట్టుతుంది. మనసు కుదుటపడే దాకా మాటలు చక్కబడవు. అంతదాకా నీవు ఓర్చుకో వయ్యా అని నాయకునికి అన్నమయ్య హిత బోధ చేస్తున్నాడు. పురుషునికి కోపం, తాపం, రోషం ఉన్నట్లే స్త్రీకీ ఉంటుంది. పురుషుడు కోపగించుకున్నప్పుడు స్త్రీ ఓర్చుకున్నట్లే స్త్రీ పట్ల కూడా పురుషుడు ఓర్పు, సహనం చూపించాలని అన్నమయ్య సందేశం. అందుకే అన్నమయ్య తన శృంగార సంకీర్తనల్లో అక్కడక్కడ

"కోపము పనికిరాదు కోమ్మల యెడలను
గుట్టుతో నుండనీవయ్య గుణవంతుడవు నీవు"

అనే హితోక్తులను ప్రయోగించాడు.

ఈ విధంగా కుటుంబంలో సమాజంలో స్త్రీలకు ప్రాధాన్య మిచ్చిన ప్రాచీన కవులు, భక్తులు, సాధు సంస్కర్తలు, దేశభక్తులు ఆధునిక కవులు ఎందరో వున్నారు. మహాకవి కాళిదాసు, జయదేవుడు, తులసీదాసు, రామకృష్ణ పరమహంస, మహాత్మ గాంధి, అంబేద్కర్, కందుకూరి, గురజాడ, చిలకమర్తి వంటి పుణ్య పురుషులు మహోన్నత స్థితికి తమ భార్యలే కారణమని నిజాయితీగా చెప్పుకున్నారు. మానవాళిచే నివాళు లందుకున్నారు. వీరి సదభిప్రాయాలను, సద్గుణాలను తృణీకరించి నేటి కాలంలో కొంతమంది స్త్రీలద్వారా సౌఖ్యాలు, ప్రయోజనాలు మాత్రం పొందుతూ గౌరవించడానికి నిరాకరిస్తున్నారు. ఇలాంటి ఛాందస భావాలున్న పురుషులకు అన్నమయ్య సంకీర్తనల్లోని స్త్రీవాద కవిత్వం స్ఫూర్తినిస్తే సంతోషమే. నేడు తిరుమల తిరుపతి దేవస్థానంవారి యాజమాన్యంలోని అన్నమాచార్య ప్రాజెక్టువారు అన్నమయ్య సంకీర్తనలకు స్వర కల్పన చేసి ప్రసిద్ధులైన గాయక శిరోమణులచే కచ్చేరీలు చేయిస్తున్నారు. క్యాసెట్లు విడుదల చేయి

స్తున్నారు. సినిమాలూ, రేడియోలూ, దూరదర్శన్‌లు, పత్రికలు సంస్థలు విశ్వవిద్యాలయాలు అన్నమయ్య సంకీర్తనలను మనకు సన్నిహితం చేస్తున్నాయి. కేవలం శ్రీనివాస భక్తిని, సంగీత మధుర్యాన్ని మాత్రమే విని ఆనందించడమే కాకుండా ఈ సంకీర్తనల్లో స్త్రీవాద కవిత్వాన్ని పరిశీలించగల్గితే అన్నమయ్యను ప్రాచీన కాలంనాటి ఫెమినిస్టుగా మనం గుర్తించవచ్చు.

కోస్తావాణి (25-1-93)



# మేరుపర్వత మహోన్నతం అన్నమయ్య వ్యక్తిత్వం

వ్యక్తికి తనదంటూ వున్న ఒక ప్రత్యేకతత్వం వ్యక్తిత్వం. ఈ వ్యక్తిత్వంవల్ల సాటి మానవులలో శాశ్వత గౌరవం, పూజ్యనీయత లభిస్తుంది. కేవలం చదువులవల్ల, పదవులవల్ల, అధికారంవల్ల వచ్చే గౌరవం తాత్కాలికమే, వ్యక్తిత్వం వ్యక్తికి అమూల్యమైన ఆభరణం. ఇది సత్యం, ధర్మం, జ్ఞానం, నడవడి, సడలని సంకల్పం, మనస్థైర్యం, దయ, వినమ్రత మొదలైన సకల సద్గుణాలవల్ల, ఆచరణ వల్ల కలుగుతుంది.

జీవితమే శాశ్వతం అనుకొని భ్రమించి సన్మార్గాన్ని వదలిపెట్టి కాలానుగుణంగా స్వభావాన్ని మార్చుకుంటూ అక్రమ మార్గంలో జీవితం సాగించే మానవులు వేమన చెప్పినట్లు 'పుట్టలోన చెదలు పుట్టవా గిట్టదా' అన్నట్లు కాలగర్భంలో కలసిపోతుంటారు. జీవితంలో ఎన్ని అడ్డంకులు వచ్చినా, ఎన్ని చిక్కు సమస్యలు ఎదురైనా దృఢదీక్షతో, మనోధైర్యంతో సత్యమార్గం తప్పనివారు హరిశ్చంద్రుడు, నలచక్రవర్తి మొదలైన ఉత్తమ వ్యక్తుల కోవకు చెందుతారు. వారు శాశ్వత కీర్తిప్రతిష్ఠలు పొందుతారు.

తాళ్ళపాక అన్నమాచార్యులు ఉత్తమ వ్యక్తిత్వం కలిగిన పరమ భక్తుడు. మనసా, వాచా, కర్మణా పరమాత్మకు అంకితమైన ఆళ్వారులు, పోతన, మొల్ల, మీరా, తరిగొండ వెంకమాంబ, క్షేత్రయ్య, త్యాగయ్య, రామదాసువంటి భక్తులందరూ దృఢ సంకల్పం కలిగినవారే. వారు గుండెధైర్యంతో చక్రవర్తులనే ఎదిరించి

దైవానుగ్రహంతో వారిని పాదాక్రాంతుల్ని చేసుకున్నవారు. సాంఘిక దురాచారాలను, మూఢవిశ్వాసాలను తృణీకరించినవారు తమ సత్యమార్గాన్ని వదలకుండా భక్తి జ్ఞానాలతో తమ లక్ష్యాన్ని సాధించి నిలిచినవారు. లోకంలో శాశ్వత నినాళులు అందుకున్న వారు. అన్నమయ్యకూడా తిరుపతి శ్రీ వేంకటేశ్వరునికి త్రికరణ శుద్ధిగా అంకితమైన పుణ్యపురుషుడు. ఆయన శ్రీనివాసుని పంచాయుధాలలో ఒకటైన నందకాంశంలో జన్మించిన ధన్యుడు.

అందువల్ల అన్నమయ్యకు పుట్టుకనుంచే తనదంటూ ఒక ప్రత్యేకమైన, విశిష్టమైన వ్యక్తిత్వం ఏర్పడింది. అన్నమయ్య వ్యక్తిత్వాన్ని తెలుసుకోవడానికి ఆయన మనుమడైన తాళ్ళపాక చిన్నన్న ద్విపదలో వ్రాసిన 'అన్నమాచార్యుల జీవిత చరిత్రము' ఆధారం. దీనిని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రచురించారు. అన్నమాచార్య జీవితచరిత్ర కాకుండా అన్నమయ్య వ్రాసిన సంకీర్తనలవల్ల కూడా అన్నమయ్య వ్యక్తిత్వాన్ని తెలుసుకోవడానికి వీలుంది. అన్నమయ్య వ్యక్తిత్వాన్ని తెలుసుకోవడంవల్ల ఆయనపై భక్తి విశ్వాసాలు, ఆయన వ్రాసిన సంకీర్తనలపై ఆసక్తి, అనురక్తి, గౌరవం కలుగుతుంది. అన్నమయ్య హృదయంతో మనం సంకీర్తనలు చదువుకోవడానికి గమ్యం ఏర్పడుతుంది. అందువల్ల అన్నమయ్య వ్యక్తిత్వాన్ని తెలుసుకోవలసిన అవసరం వుంది.

అన్నమయ్య లౌకిక ఊహలు తెలియని బాల్యంలో కూడా ప్రత్యేకతను కనబరచాడు. తల్లి లక్కమాంబ మామూలుగా ఉగ్గు తినిపించబోతే తినేవాడుకాదు. ఇది తిరుమలప్పని ప్రసాదం అని స్వామి పేరు చెప్పితేనే ఉగ్గు తినేవాడు. అలాగే ఉయ్యాల తొట్టెలో వేసి ఊస్తూ ఎంత ప్రయత్నించినా నిద్రపోయేవాడుకాదు. వూనుకొని వేంకటేశ్వరుని పేరును వివరించి జోలపాట పాడితేనే నిద్రపోయేవాడు. ఈ విషయం అన్నమాచార్య జీవిత చరిత్రలో —.

'తల్లి జిడ్డు పెట్టరమ్మని యుగ్గు పెట్టఁబోయినను
పనిబూని తిరుమలప్పని ప్రసాదంబు
గొను మనియనక లోఁగొనఁడు కేరుచును

ఎవపక తొట్టెలోనిడి యెంత పాటు
పడియెంతవడి జోలఁబాడెనేనియును
వేంకటపతి పేరు వివరించిపాట
పొంకించకుండినఁ బోరూరడిలఁడు' (అ. జీ. చ.)

అని చెప్పబడివుంది.

అన్నమయ్య పెద్దలపట్ల వినయంగా ప్రవర్తించేవాడు. అమ్మా నాన్నలు, అన్నా వదినెలు తనను పిలిచి పనులు చెప్తుంటే కాదన కుండా చేసేవాడు.

అన్నమయ్య బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినా వారి వృత్తి మాత్రం వ్యవసాయం కావడంవల్ల పశువుల్ని పోషించేవారు. ఒక నాడు అన్నమయ్య వదినె అన్నమయ్యను పిలిచి పశువులకు కసువు తెమ్మని ఆజ్ఞాపించింది. అన్నమయ్య కొడవలి చేతపట్టి అడవికివెళ్లి భక్తి పరధ్యానంతో గడ్డి కోస్తున్నప్పుడు చిటికెన వ్రేలు తెగి రక్తం వేగంగా కారింది. ఈ దినస్థితిని చూచి బాలుడైన అన్నమయ్య 'శ్రీహరి హరీ' అంటూ బాధపడి, ఈ బాధకు కారకురాలైన వదినపై విరక్తి చెందాడు. హరియే సకల చరాచర దేహి అని పెద్దలు చెప్పిన మాటను గుర్తు తెచ్చుకున్నాడు. కొడవలిని నేలపై విసిరి —

'ఎన్నటి చుట్టంబు లిటువంటివార
లెన్నటి బంధుందనేను వారలకు
నీవట్టి వెట్టి నాకేల కావింప
భావింప నాలోనఁబాయ కెల్లప్పుడు

తల్లియుఁ దండ్రియు దైవంబు గురువు
నెల్ల సంపదలునై యెల్ల చందముల
నను బ్రోచు శేషాద్రినాథుని గొలిచి
మనియెద................." (అ. జీ. చ.)

అని ఐహిక బంధు జనులపై విసిగి, శాశ్వతమైన తల్లి, తండ్రి, గురువు అన్నీ తానే అయ్యి తనను కాపాడే వేంకటాచలవాసుని సేవించి బ్రతుకుతాను అంటూ తిరుమలయాత్రకు వెళ్ళుతున్న పరుస లతో కలసి తిరుమలకు ప్రయాణమవుతాడు. ఈ సంఘటనలవల్ల అన్నమయ్య అచంచల భక్తి, జ్ఞానం, దృఢసంకల్పం, ధైర్యం వ్యక్త మవుతాయి.

గడ్డికోసం అడవికి వెళ్ళిన అన్నమయ్య తిరిగి ఇంటికి రాక పోయేసరికి తల్లి దిగులుపడి అన్ని ప్రదేశాలు వెదుకుకొంటూ కొన్నా ళ్ళకు తిరుమల చేరింది. స్వామి సన్నిధిలో ఘనవిష్ణువనే యతీంద్రుని చేత పంచసంస్కారాలు చేయించుకొని వైష్ణవదీక్ష స్వీకరించిన కుమారుని చూచి తల్లి ఎంతో సంబరపడిపోయి తనతోపాటు తాళ్ళ పాకకు తిరిగి రమ్మని పుత్రుని ప్రాధేయపడింది. తనకు తల్లిదండ్రులు, బంధుమిత్రులు, సర్వస్వం శ్రీనివాసుడు అని తిరిగి ఇంటికి రాలేనని తల్లికి చెప్పాడు. ఆనాటి రాత్రి తల్లీకొడుకులు అక్కడే నిద్రించారు. స్వామివారు అన్నమయ్యకు స్వప్నంలో సాక్షాత్కరించి —

'పరచింతలుడిగి నాపైనె విన్యస్త
భరుఁడవై యుండ శుభంబు లన్నియును

ననఘాత్మ నినుఁజెందుదునని వరంబిచ్చి
జననివాక్యము ద్రోయఁజనదు కుమార
పోయిరమ్ము...............' (అ. జీ. చ.)

ఇతర చింతలన్నీ వదలి భారం నామీదవేస్తే అన్నీ శుభాలు కలుగుతాయి. తల్లిమాట జవదాటకూడదు. నాయనా! వెళ్ళిరమ్మని నచ్చచెప్పాడు. ఆ తర్వాత అన్నమయ్య మేలుకొని తల్లితోపాటు తన స్వగ్రామానికి తిరిగివచ్చాడు. తల్లి పిలువగానే అన్నమయ్య వెళ్ళలేదు. తాను నమ్మిన స్వామి ఆజ్ఞాపించడంవల్లనే తల్లితోపాటు తిరిగి ఇంటికి వెళ్ళాడు. ఈ సంఘటనలో ఆయన దృఢవ్యక్తిత్వాన్ని స్వామిపై నిశ్చలభక్తిని, వినమ్రతను గుర్తించవచ్చు.

తాళ్ళపాకకు వెళ్లిన తర్వాత తల్లి తన కుమారునికి కన్యల నివ్వమని బంధువులను అడిగితే 'ఎప్పుడూ శ్రీరామ, గోవింద, హరి' అనుకుంటూ సంసార జీవితంపై విరక్తితోవుండే అన్నమయ్యకు కన్య లను ఇవ్వమని వారు సమాధానం చెప్పారు. వారికి కూడా శ్రీని వాసుడు కలలో కనిపించి కన్యలనిచ్చి వివాహం చేయమని ఆజ్ఞాపించి నపుడు వారు అన్నమయ్యకు తిరుమలమ్మ, అక్కలమ్మ అనే ఇద్దరు కన్యలనిచ్చి వివాహం చేశారు. ఇలా జగన్నాథుడైన ఆ శ్రీని వాసుని సిఫారసుతోనే ఇద్దరాండ్రకు ముద్దుల మగడైన ఘనుడు అన్నమయ్య.

అన్నమయ్య అహోబలనారసింహుని భక్తుడైన శఠకోప మునీం ద్రునివద్ద సకల వేదాంతవిద్యలు నేర్చుకున్నాడు. అతని సంకీర్తనల గాన దుందుభులు దశదిశలు మారుమోగాయి. ప్రజలందరు అన్న మయ్యను నారదుడో, తుంబురుడో, గంధర్వుడో అని ఆశ్చర్యంతో ప్రశంసించారు. ఈ వార్తలు కడప మండలాన్ని రాజధానిగా చేసు కొని పరిపాలిస్తున్న సాళువ నరసింగరాయల చక్రవర్తికి వినబడ్డాయి. అన్నమయ్యను తన ఆస్థానానికి సకల మర్యాదలతో పిలిపించి ఒక సంకీర్తన పాడమన్నాడు. అప్పుడు అన్నమయ్య పద్మావతీ శ్రీని వాసుల శృంగార ప్రణయంపై వ్రాసిన —

'ఏమొకో చిగురుటధరమున యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా'

అనే సంకీర్తన పాడి వినిపించాడు.

నరసింగరాయలు ఆ పాటలోని సరస భావానికి ముగ్ధుడై కాళిదాసాది సంస్కృత కవులలో కూడా కానరాని అద్భుతభావన ఇందులో వుందని మెచ్చుకున్నాడు. తనమీదకూడా ఇలాంటి పాట పాడమని అన్నమయ్యను కోరాడు. అప్పుడు అన్నమయ్య రాజు కోరాడుకదా అని సంబరంపడటంగానీ, స్వార్థలాభాలు కోరడంగానీ, పాడకుంటే శిక్షిస్తాడేమో అని భయపడటంగానీ చేయకుండా పాడడానికి నిరాకరించి నిర్భయంగా నిస్సంకోచంగా తన దీక్షను గూర్చి —

'నరహరి కీర్తన నానిన జిహ్వా నరుల నుతింపగ నోపదు జిహ్వ'

అని వ్యక్తంచేశాడు. రాజు మండిపడి తనకు 'మూరురాయరగండ' అనే సంకెల బిగించి కారాగారంలో బంధించాడు. అయినా అన్నమయ్య అధైర్యపడక స్వామిని వేడుకుంటూ —

'ఆకటివేళల నలపైనవేళను
తేకువ హరినామమే దిక్కు మరిలేదు

సంకెలఁబెట్టినవేళ చంపబిలిచినవేళ
అంకిలిగా నప్పులవా రాగినవేళ
వేంకటేశు నామమె విడిపించగతిగాక
మంకుబుద్ధిఁ బొరలిన మరిలేదు తెఱఁగు'

అనే సంకీర్తన పాడి బంధవిముక్తుడయ్యాడు. అంతటి ధైర్యశాలి, పరమభక్తుడు అన్నమయ్య. అన్నమయ్య సామాన్యుడు కాడని మహిమాన్వితుడని, శ్రీనివాసుని ప్రియభక్తుడని తెలుసుకొని

పశ్చాత్తాపపడి అన్నమయ్య పాదాలను పన్నీటితో కడిగి బంగారు పుష్పాలతో పూజించాడు. అన్నమయ్యకూడా రాయలపై జాలిపడి క్షమించి భక్తులను ఎప్పటికీ అవమానపరచకూడదని, బాధపెట్టకూడదని జ్ఞానబోధ చేశాడు. దీనివల్ల అన్నమయ్య క్షమాగుణం, దయ, దృఢసంకల్పం వ్యక్తమవుతుంది.

అన్నమయ్య తన సంకీర్తనా రచన పూర్తి అయిన తర్వాత స్వామివారికి అంకితమిచ్చినప్పుడు ఆ స్వామి అన్నమయ్య సంకీర్తనా సేవకు మెచ్చుకొని, ఆనాడు పాతకమూరి భాగవతుల జోలపాట విని పసిబిడ్డనయ్యాను. ఆ తర్వాత కృష్ణమాచార్యుని అధ్యాత్మ వచన సంకీర్తనలు విని విరక్తుడనయ్యాను.

ఇప్పుడు నీ శృంగార సంకీర్తనలు విని రక్తుడనై యుక్తవయస్కుడనయ్యాను.

'ఆడుచుఁ బతకమా కన్నలజోల
పాడఁగనాఁడెల్లఁ బసిబిడ్డనైతి

నా కృష్ణమాచార్య నధ్యాత్మ వినుతి
రాకఁగొన్నాళ్లు విరక్తుండనైతి
జగతి నీ శృంగార సంకీర్తనముల
కగపడ మంచిప్రాయంపు వాఁడనయితి' (అ.జీ.చ.)

అని ప్రశంసించినపుడు అన్నమయ్య స్వామివారిపట్ల భక్తితో, వినయంతో —

'వేదముల్ పొగడఁ గోవిదులు నుతి ప
నా దేవతలు కొనియాడ గోవింద

నే నిన్నుఁ గొనియాడ నెంతటివాఁడ
నా నేర్పు నీ నేరుపరసి చూచినను

పలికెడు వీణ లోపలి చక్కఁదనము
పలికించు నతనిదై పరగినరీతి'

వేదాలు, పండితులు, దేవతలు నిన్ను కొనియాడుతుండగా నేనెంతవాడను! పలుకుతున్న వీణ గొప్పతనం పలికించే వాడిదైన విధంగా నా నేర్పు నీ నేర్పే కదా అని విన్నవించుకున్నాడు. అన్నమయ్య అంతటి వినయశీలి.

అన్నమయ్య సంకీర్తనలవల్లకూడా అన్నమయ్య వ్యక్తిత్వాన్ని గుర్తించవచ్చు. అన్నమయ్య హేతువాదభక్తుడు. మూఢాచారాలను, కులభేదాలను, శుష్కవాదాలను, నాస్తికత్వాన్ని, కుకవులను, పరపీడన పరాయణత్వాన్ని నిర్భయంగా, నిస్సంకోచంగా ఖండించాడు. అన్నమయ్య జ్ఞానులపట్ల ఎంత వినమ్రంగా ఉంటాడో మూర్ఖులపట్ల దుష్టులపట్ల అంత తీక్షణంగా ఉంటాడు. దుర్మార్గులకు, బుద్ధిహీనులకు జ్ఞానబోధ చేసినవారిని సన్మార్గంవైపు త్రిప్పడంకోసం వారిని అధములాల, వెఱ్ఱులాల మొదలైన పదాలతో సంబోధించడానికి కూడా వెనుకాడడు. చిన్న చిన్న దేవుళ్ళను తీసుకొనివచ్చి మహావిష్ణువుతో సరిసమానమని చెప్పడం ఇత్తడిని బంగారంతో కలిపి తూచడంవంటిదనే వ్యత్యాసం తెలియనివారిని అన్నమయ్య 'అంతరు మాలినట్టి అధములాల' అని సంబోధించాడు.

ఒకరు చెప్పిన విషయాన్నే దొంగిలించి తమ పేర్లు పెట్టుకొని గొప్పగా విర్రవీగే కుకవులను నిరసిస్తూ మీకంత వేడుకగా వుంటే ఒల్లువంచి తడికలు అల్లుకోండి అంటూ —

'వెఱ్ఱులాల మీకు వేడుక కలిగితేను అఱ్ఱువంచి తడుకల్లంగ రాదా' అని శ్రుతిమెత్తగా ప్రశ్నించాడు. అన్నమయ్యకు కోపం, రోషం, ఆవేశం ఏదైనావుంటే అది సమాజాన్ని చక్కబెట్టడం

కోసమే. ఈ విధంగా అన్నమయ్య వ్యక్తిత్వాన్ని అన్నమాచార్య జీవితచరిత్రద్వారాను, అన్నమయ్య సంకీర్తనలద్వారాను గుర్తించ వచ్చు. అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో ఇంకా ఎన్నో అంశాల ద్వారా కూడా అన్నమయ్య వ్యక్తిత్వాన్ని నిరూపించవచ్చు. అన్న మయ్య వ్యక్తిత్వం మేరుపర్వతం అంతటి మహోన్నతం, వేంకటా చలం అంతటి మహిమాన్వితం.

కోస్తావాణి



# నాద బ్రహ్మోపాసకుడు - త్యాగరాజు

క్రీస్తుశకం 15వ శతాబ్దంలో శ్రీవేంకటేశ్వర భక్తి సామ్రాజ్యాన్ని నిరాఘాటంగా ఏలి ఆ స్వామి వారిపై 32 వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు పాడి తరించిన పరమ భక్తాగ్రేసరుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు యావదాంధ్ర దేశీయులకు సుపరిచితులు. ఇతని సంకీర్తనలలోని శృంగార విషయం 16వ శతాబ్దిలో క్షేత్రయ్యగాను, భక్తిభావం 17వ శతాబ్దిలో రామదాసుగా, సంగీతాంశం 18వ శతాబ్దిలో త్యాగరాజుగా అవతరించాయని పండితులు చమత్కరించడంలో ఆశ్చర్యమేమీ లేదు.

ఆంధ్రదేశంలో గోదావరి నదీ తీరంలో నన్నయ వంటి ప్రముఖ కవులు ఎందరో ఉద్భవించడం వల్ల గోదావరి నీళ్ళు త్రాగితే కవిత్వం వస్తుందని, తమిళనాడులో తంజావూరు ప్రాంతంలోని కావేరి నదీ తీరంలో త్యాగరాజు వంటి ప్రముఖ సంగీత గాయకులు ఎందరో జన్మించడం వల్ల కావేరి నది నీళ్ళు త్రాగితే సంగీతం వస్తుందని పెద్దలు చెబుతుంటారు. ఎందరో మహాత్ములు, త్యాగజీవులు, దేశభక్తులు, కవులు, గాయకులు ఆయా ప్రాంతాలలో అవతరించడం మూలంగా వారి వారి జన్మస్థలాలకు కూడా శాశ్వతమైన కీర్తి రావడం సహజమే కదా.

ఆంధ్రదేశానికి గోదావరి ప్రాంతం ఎంతటి ప్రసిద్ధ ధాన్యాగారమో తమిళనాడుకు తంజావూరు ప్రాంతం అంతటిది. ఈ జిల్లాలోని కావేరి నదీ ప్రాంతంలో తిరువయ్యారు అనే గ్రామం ఉంది. ఇక్కడ వెలసిన దేవుడు త్యాగరాజస్వామి ఈ గ్రామంలోనే 1767 సర్వజిన్నామ సంవత్సరం, వైశాఖ శుద్ధ షష్ఠి నాడు సీతమ్మ, రామ

బ్రహ్మం అనే పుణ్యదంపతులకు ఆ స్వామివారి అనుగ్రహం వల్ల త్యాగరాజు మూడవ పుత్రుడుగా జన్మించాడు.

త్యాగయ్య తల్లిదండ్రులు కాకర్ల వంశానికి చెందినవారు. వీరిది భారద్వాజస గోత్రం. ములికినాటి తెలుగు బ్రాహ్మణులు. త్యాగయ్య తాత గిరిరాజకవి. ఇతడు శాహభూపాలుని కొలువులో ఉండేవాడు. త్యాగయ్య తండ్రి రామబ్రహ్మం కూడా తంజావూరును పాలించిన రెండవ తులజాజి చేత పోగడ్తలందిన రామభక్తుడు.

త్యాగరాజుకు చిన్నప్పటి నుంచీ కూడా తండ్రిచేసే రామ పూజలంటే మహాఇష్టం. అందువల్ల పూజా సమయాలలో ఆయన తండ్రికి సహాయపడుతుండేవాడు. అంతేగాక తల్లి రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలను చదివేటప్పుడు, పురందరదాసు కీర్తనలను, జయదేవుని అష్టపదులను మధురంగా పాడుతుండేటప్పుడు తన్మయత్వంతో ఆనందాశ్రువులను రాల్చేవాడు. ఇలాంటి త్యాగయ్యకు కరుణా సముద్రుడు, జగదేక సుందరుడు అయిన ఆ శ్రీరామ చంద్రుడే ఆరాధ్య దైవమయ్యాడు.

రామబ్రహ్మం త్యాగరాజుకు ఏడవయేట ఉపనయనం చేసి తానే గురువుగా మారి విద్యాభ్యాసం చేశాడు. త్యాగరాజు విద్యాభ్యాసంలోను, పూజా సమయాలలోను తండ్రిని అనుసరించేవాడు. ఒకరోజు త్యాగయ్య రామ పూజ చేస్తూ భక్తి తన్మయత్వంతో "నమో నమో రాఘవాయ" అనే సంకీర్తన గానం చేశాడు. ఆ రోజులలో కాగితాలు, ముద్రణాలయాలు లేని కారణం వల్ల త్యాగయ్య ఇంటి గోడలపై కీర్తనలు వ్రాసేవాడు. రామబ్రహ్మం మొదట్లో వీటిని పిచ్చి గీతలని భ్రమించాడు. కానీ చివరికి ఆలోచించి పండితులను పిలిపించి చూపించాడు. పండితులు ఆ కీర్తనలలోని సంగీత సాహిత్యాంశాలను గుర్తించి త్యాగయ్యకు సంగీతం నేర్పించవలసిందిగా

ఆదేశించారు. కుమారుని సంగీత జిజ్ఞాసను గుర్తించి త్యాగయ్యను తన గ్రామంలోనే ఉన్న ప్రసిద్ధ సంగీత విద్వాంసుడైన శొంఠి వెంకట రమణయ్య దగ్గరకు శిష్యుడుగా పంపించాడు. వాల్మీకి, నారద, సరస్వతుల అంశాలతో జన్మించిన త్యాగయ్యకు గురువు నేర్పిన సంగీత విద్యలు కరతలామలకమయ్యాయి.

ఒకసారి శొంఠి వెంకటరమణయ్య తంజావూరులో సంగీత సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. సభలో త్యాగయ్యను కూడా పాడమని కోరాడు. త్యాగయ్య గురువుకు, సభాసదులకు నమస్కరించి బిలహరి రాగంలో "దొరకునా ఇటువంటి సేవ" అనే పాట పాడాడు. ఆ కీర్తనలోని సాహిత్య విషయానికి, పాడే పద్ధతికి పండితులు, గాయకులు త్యాగయ్యను, అతనికి విద్య నేర్పిన శొంఠి వేంకట రమణయ్యను మనసారా శ్లాఘించారు. సహృదయుడైన ఆ గురువు తన బిడ్డతో సమానమైన త్యాగయ్యను వాత్సల్యంతో ఆలింగనం చేసుకొని "దొరకునా ఇటువంటి శిష్యుడు" అని మెచ్చుకొన్నాడు. అంతేగాక తంజావూరు మహారాజు తనకిచ్చిన బహుమానాలను త్యాగయ్యకు ఇచ్చివేశాడు. త్యాగయ్య గురుభక్తి, శొంఠి వెంకటరమణయ్య గారి శిష్య వాత్సల్యం మరువరానిది. గురుశిష్యులు గుర్తించుకోవలసిన విషయం.

త్యాగయ్య యుక్త వయస్కుడు కాగానే తన మేనమామ అయిన వీణకాళహస్తయ్య దగ్గర ఉండిన సంగీత గ్రంథాలన్నీ క్షుణ్ణంగా, పరిశీలనగా చదివేశాడు. అయినా అతనికి కొన్ని సందేహాలు నివృత్తి కాలేదు. ఇలా అతడు చింతాక్రాంతుడై ఉన్నప్పుడు ఒక రోజు నారదుడు సన్యాసి వేషంలో అతని ఇంటికి వచ్చాడు. త్యాగయ్య సంతోషించి అతిథి మర్యాదను స్వీకరించమని కోరాడు. ఆ సన్యాసి అందుకు సమ్మతించి, తెచ్చిన మూటను ఇంట్లో ఉంచి

నదీ స్నానం ముగించుకొని తిరిగి వస్తానని చెప్పివెళ్లాడు. పూర్వ కాలంలో అతిథిని దేవుడుగా భావించి భక్తితో గౌరవించేవారు. ముందుగా అతిధికి భోజనం పెట్టిన తర్వాతనే గృహస్థులు భుజించే వారు. ఆ ప్రకారంగా త్యాగయ్య అతని రాకకోసం నిరీక్షించి, రాత్రి అయ్యేసరికి రామ నామ స్మరణం చేసుకొంటూనే నిద్రపోయాడు. ఆ రాత్రి నారదుడు త్యాగయ్యకు కలలో కనిపించి సన్యాసి వేషంలో ఇంటికి వచ్చిన వ్యక్తి తానే అని, ఆ మూటలో స్వరార్ణవం, నార దీయం అనే గ్రంథాలున్నాయని, వాటిని చదివి సందేహాలు నివృత్తి చేసుకోవచ్చని చెప్పాడు. నీవల్ల సంగీతానికి విశేష ప్రచారం లభి స్తుందని చెప్పి అంతర్థానమయ్యాడు.

ఆ ప్రకారంగానే త్యాగయ్య ఆ గ్రంథాలను చదివి తన సం దేహాలను తొలగించుకొన్నాడు. త్యాగయ్య తన సందేహాలను నివృత్తి చేసిన నారదుని 'రాజిలు, పీణగల్గు, గురురాయ, (శ్రీ) నారద నాద సరసీరుహ భృంగ శుభాంగ (శ్రీ) త్యాగరాజనుత (శ్రీ) రమాం పాలయ, వరనారద నారాయణ స్మరణానందభవము' అంటూ ఎన్నో కీర్తనలతో స్తుతించాడు.

త్యాగయ్య పెద్దన్న జపేశునికి వివాహమయింది. రెండవ అన్న యౌవ్వనంలో అకాలమరణం చెందాడు. తల్లిదండ్రులు త్యాగయ్యకు పార్వతమ్మ అనే కన్యతో వివాహం వైభవంగా జరిపించారు. త్యాగ య్యకు వివాహం అయిన రెండేళ్ళకే రామబ్రహ్మం జబ్బుపడి మర ణించడంతో త్యాగయ్య ఎంతో క్రుంగిపోయాడు. చివరికి ఎలాగో గుండె దిటవు చేసుకొని మనస్సును సంగీతంపై కేంద్రీకరించాడు. ఉంఛవృత్తిని చేపట్టి జీవనం సాగించాడు. ఉంఛవృత్తి అంటే ముష్టి ఎత్తడం కాదు. గృహస్థులే వారిని పిలిచి ప్రీతిగా వస్తువులను సమ ర్పిస్తారు. ఇలా త్యాగయ్య ఉంఛవృత్తితో జీవనం సాగిస్తూ సంగీత

సాగరంలోని లోతుపాతులన్నీ సమగ్రంగా తెలుసుకొన్నాడు. తన జన్మను చరితార్థం చేసుకోవడానికి రామతారక మంత్రాన్ని 96 కోట్ల సార్లు జపించాడు. త్యాగయ్య

"రామ భక్తి సామ్రాజ్యమే మానవుల కబ్బెనో
ఆ మానవుల సందర్శన మత్యంత బ్రహ్మానందమే"

అని ఉద్ఘాటించాడు. "నిన్ను బాసియరనిమిష మోర్వనురా" అని పరితపించాడు.

త్యాగయ్య ఆజన్మాంతం ఐహిక సుఖాలను తృణీకరిస్తూ పరమానందభరితమైన రామ భక్తి సాగరంలో ఓలలాడిన ధన్య పురుషుడు. వాల్మీకి 24 వేల శ్లోకాలతో రామాయణం రచించినట్లే త్యాగయ్య 24 వేల కీర్తనలను తన స్వీయనామాంకిత ముద్రతో రచించాడు. ప్రతి కీర్తనకు రాగతాళాలు, ఒక పల్లవి, అను పల్లవి, చరణాలు ఉంటాయి. ఈ కీర్తనలు ప్రస్తుతం 660 మాత్రమే లభించాయి. త్యాగయ్య కీర్తనలనే కాకుండా సీతారామ విజయం, ప్రహ్లాదభక్త విజయం అనే నాటకాలను, నౌకాచరిత్రమనే గేయ నాటకాన్ని రచించాడు. ఇతడు సుమారు 200 రాగాలలో కీర్తనలు రచించినట్లు ప్రతీతి.

ఈ మహనీయుడు 1847 వ సం॥ పుష్య శుద్ధ దశమి నాడు రామనామ స్మరణ చేసుకొంటూ నిద్రిపోయాడు. శ్రీరాముడు త్యాగయ్యకు కలలో సాక్షాత్కరించి ఇంక పదిరోజులలో భౌతిక దేహం వదలి నాలో కలిసిపోతావు' అని చెప్పి అంతర్ధానమయ్యాడు. ఆ రోజు పుష్య శుద్ధ ఏకాదశి. త్యాగయ్యకు ఏకాదశి భజనలంటే ఎంతో ఇష్టం. భజన సందర్భంగా వచ్చిన శిష్య బృందాన్ని, పుర ప్రజలను ప్రీతిపూర్వకంగా త్యాగయ్య సంభావించాడు. త్యాగయ్య

పుష్య బహుళ చతుర్థినాడు పరమహంస అయిన బ్రహ్మానందేంద్ర స్వామి ఆధ్వర్యంలో త్యాగయ్య సన్యాసాశ్రమాన్ని స్వీక రించాడు. అప్పుడు త్యాగయ్య నాదబ్రహ్మానంద స్వామిగా పిలువ బడ్డాడు. తరువాత త్యాగయ్య సభాసదులను ఉద్దేశించే 'రేపు ఉదయం 11 గంటలకు రాముడు నన్ను తనలో లీనం చేసుకొంటాడు. అందు వల్ల ఈ క్షణం నుంచి విరామం లేకుండా భజన చేయండి' అని కోరాడు.

ఈ వార్త శరవేగంతో పాకడంతో వేలకొలది ప్రజలు గుమి గూడారు. మోక్షసిద్ధి పొందే రోజు త్యాగయ్య 'వాగధీశ్వరి' రాగంలో 'పరమాత్ముడు జీవాత్ముడు' మనోహరి రాగంలో 'పరితాపము' అనే కీర్తన గానంచేసి యోగసమాధిలో కూర్చున్నాడు. త్యాగయ్య తాను చెప్పిన నిర్ణీతకాలంలోనే త్యాగయ్య కపాలం పగిలి ఒక్క దివ్యతేజస్సు పైకెగిసిపోయింది. త్యాగయ్య సిద్ధిపొందిన తరువాత శిష్యులు గురువుగారి కోరిక ప్రకారం కావేరీ నదీ తీరంలో శొంఠి వేంకట రమణయ్య సమాధి ప్రక్కనే త్యాగయ్య సమాధిని కూడా నిర్మించారు.

త్యాగయ్య సిద్ధి పొందిన నాటినుంచి ప్రతి సంవత్సరం అతని శిష్యులు ఇంటిదగ్గర ఆరాధన జరిపేవారు. 1907 నుంచి తిల్లస్థానం నరసింహ భాగవతులు, పంజు భాగవతులు, వయొలిన్ గోవింద స్వామి పిళ్ళై మొదలైన భక్తులు అతి వైభవంగా ఆరాధన మహో త్సవం చేయడం ప్రారంభించారు. బెంగుళూరు నాగరత్నమ్మ తన సంపాదన ధనమంతా ఖర్చుపెట్టి 1952లో త్యాగరాజు సమాధిపైన ఆలయం కట్టించింది. 1940 నుండి త్యాగరాజు మహోత్సవం సభలు ఏర్పాటయ్యాయి.

త్యాగయ్య తమిళ దేశంలో జన్మించి తెలుగులో కీర్తనలు వ్రాసి కర్నాటక సంగీతాన్ని కూర్చిన ప్రతిభాశాలి. త్యాగయ్య లోని పవిత్రమైన సామాన్య జీవితం, నిశ్చల రామభక్తి, నిరంతర నాదబ్రహ్మోపాసన వేనోళ్ళ కొనియాడదగిన అంశాలు.

'కోస్తావాణి' దినపత్రిక (25-6-1988)



సంసార సుఖాలపైన, ఐహిక సంబంధ ఇతర వాంఛలపైన మమకారం లేకుండా సదసద్వివేకం, దయ, త్యాగం మొదలైన సద్గుణాలు ఆదర్శ జీవితాన్ని గడిపే మహనీయులకే రామభక్తి కుదురుతుంది. రామునిపై భక్తి కుదిరిందంటే అది పూర్వజన్మ సుకృతమే. జీవితం తరించినట్లే. ఈ విషయాన్ని గూర్చి త్యాగరాజు—

'రామభక్తి సామ్రాజ్యమే మానవుల కబ్బెనో
ఆ మానవుల సందర్శన మత్యంత బ్రహ్మానందమే'

అని చాటి చెప్పాడు.

వైష్ణవభక్తి సంప్రదాయం ప్రకారం భగవంతునికన్నా భాగవతుడే మిన్న. ఈ విషయాన్నే ఒకసారి శివుడు పార్వతితో —

'60 వేల సంవత్సరాలు మహావిష్ణువును ధ్యానిస్తే ఎంత ఫలితం వస్తుందో అంత ఫలితం ఒక్క పూట వైష్ణవ భక్తుని సేవిస్తే వస్తుంది' అని చెపుతాడు. ఈ విషయం తాళ్ళపాక అన్నమాచార్యుల మనుమడైన చిన్నన్న తన పరమయోగి విలాస కావ్యంలో వ్రాశాడు. కాబట్టి భగవంతునికి తన భక్తులంటేనే ఇష్టం. అందుకే త్యాగయ్య కూడా రామభక్తుల సందర్శన భాగ్యాన్ని ఇంతగా స్తుతించాడు.

త్యాగరాజు తాను రచించిన 24 వేల కీర్తనా కుసుమాలతో శ్రీరాముని దివ్య పాదారవిందాలను అర్చించాడు. శివుడు, కేశవుడు అనే భేదం లేకుండా అన్ని దైవాలమీద కీర్తనలు వ్రాశాడు. అన్ని దైవాలలోను శ్రీరామచంద్రమూర్తినే సందర్శించాడు. త్యాగయ్య తన జీవితకాలంలో అందివచ్చిన ఎన్నో రాజభోగాలను తృణీకరించాడు. తన సుఖంకోసం ఎప్పుడూ దైవాన్ని ప్రార్థించలేదు. తన కుటుంబంలోని వారుగానీ, రాజుగానీ ఎవరైనా తనను అవమానించి

కష్టాలుపాలు చేసినా అన్నిటినీ సహించి తన బాధను శ్రీరామునికే విన్నవించుకొన్నాడు. ఇలాంటి పరమ భక్తాగ్రేసరుడైన త్యాగయ్య కేవలం రామభక్తితోనే ప్రజలకు ఎంతో త్యాగం చేశాడు. ఎన్నో మహిమలు చూపాడు.

ఒకసారి తంజావూరు మహారాజు రెండవ శరభోజీ త్యాగయ్య గాన ప్రశస్తి విని, తన మీద పాటపాడితే త్యాగయ్యకు 10 ఎకరాల భూమిని పారితోషికంగా ఇస్తానని తన సేవకుల ద్వారా త్యాగయ్యకు ఈ పద్ధతి గిట్టక తనకు తానే —

"నిధి చాలా సుఖమా రాముని
సన్నిధి సేవ సుఖమా నిజము తెల్పుము మనసా"

అని ప్రశ్నించుకొని రాజు పంపిన కానుకలను కూడా గ్రహించలేదు. తంజావూరునుంచి వచ్చిన రాజసేవకులు ఆగ్రహించి వెళ్ళి రాజుకు నివేదించారు. రాజు పట్టరాని కోపంతో త్యాగయ్యను బంధించి తెమ్మని ఆజ్ఞాపించాడు. సేవకులు కొంతదూరం వెళ్ళేసరికి శరభోజిరాజుకు భరించరాని కడుపునొప్పి మొదలయింది. భక్తులను అవమానించి హింసించదలచుకొన్న ఏలాంటివారికైనా ఇలాటి చేటులు చూడడం మన భారతావనిలో క్రొత్తేమీ కాదు. ఎంతోమంది రాజవైద్యులు వచ్చి ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలితం శూన్యమయింది. మానవ ప్రయత్నం మానవశక్తి నశించినప్పుడు దైవశక్తిని నమ్ముకోవడం మానవ నైజం కాబట్టి దైవజ్ఞులు రాజుగారి జాతకం పరిశీలించడం మొదలు పెట్టారు. తత్ఫలితంగా ఒక మహాభక్తునిపట్ల రాజుగారు చేసిన అపచారమే ఈ బాధకు కారణం అని తేలిపోయింది. అపుడు రాజుగారి మూడవ మంత్రి అయిన అరళా అయ్యంగార్ ఈ పరిస్థితికి ఎంతో చింతించి, తిరువయ్యూరుకు వెళ్ళి

త్యాగయ్యకు జరిగిన వృత్తాంతమంతా చెప్పి రాజును క్షమించవలసిందిగా త్యాగయ్యను వేడుకొన్నాడు. త్యాగయ్యకూడా విద్యాధురంధరుడు, ప్రజారక్షకుడు అయిన రాజుకు ఈ దుర్భర పరిస్థితి కలిగినందుకు ఎంతో విచారించి తులసి తీర్థాన్ని ఒక పాత్రిలో పెట్టి దీన్ని రాజుకు ఇవ్వమని ఆ శ్రీరామచంద్రుడే వారిని రక్షిస్తాడని చెప్పి ఆ పాత్రను మంత్రిగారికి అందించాడు. మంత్రిగారు తంజావూరు వెళ్ళి త్యాగయ్య ఇచ్చిన తులసీ తీర్థాన్ని రాజుకు ఇచ్చాడు. రాజు తీర్థం పుచ్చుకోగానే కడుపునొప్పి తగ్గుముఖం పట్టింది. రాజు తన పొరపాటుకు పశ్చాత్తాపపడి త్యాగయ్య ఇంటికి స్వయంగా వెళ్ళి తన తప్పును క్షమించమని వేడుకొన్నాడు. లోకంలో ఎంతటి ఘనుడైనా భగవంతునికి, భక్తునికి క్రిందవాడేకదా. అపకారికైనా ఉపకారం చేసి దయాగుణం ప్రదర్శించడం మహాత్ములకు సామాన్య విషయమే. కాబట్టి త్యాగయ్య రాజుగారిని క్షమించి ఆశీర్వదించాడు. అప్పటినుంచి రాజుగారు త్యాగయ్య చేసే రామభజనలకు వెళ్ళుతూ రామభక్తి సామ్రాజ్యంలో తానూ ఒక దాసుడుగా ఉంటూ మానవ జన్మను సార్థకం చేసుకొన్నాడు.

ఈ సంఘటన జరిగిన కొంతకాలానికి త్యాగయ్య తల్లి సీతమ్మ మరణించింది. ఇన్నాళ్లు త్యాగయ్యకు అండదండగా ఉన్న తన తల్లి మరణించడంతో అన్న అయిన జపేశయ్య త్యాగయ్యపై కోపతాపాలను నిస్సంకోచంగా బహిర్గతం చేయసాగాడు. త్యాగయ్య దినంలో ఎక్కువభాగం రామపూజలోనే గడిపేవాడు. జపేశయ్యకు పొట్టకూటికి పనికిరాని త్యాగయ్య చేసే రామపూజలంటే గిట్టవు. అందుకే రామ విగ్రహాలను కావేరీనదిలో పారవేశాడు. త్యాగయ్య ఆ విషయం తెలుసుకొని ఎంతో దిగులుపడి రామనామ జపంతో కలవరించసాగాడు. ఒకనాటి రాత్రి రాముడు కలలో కనబడి కావేరి

ఘట్టంలో దాగి ఉన్నానని చెప్పి అదృశ్యమయ్యాడు. త్యాగయ్య ఆ ప్రకారంగా అక్కడికి వెళ్ళి చూడగా రామ విగ్రహాలు కన బడ్డాయి. త్యాగయ్య ఎంతో సంబరపడి హద్దులులేని ఆనందంతో

"కనుగొంటిని శ్రీరాముని నేను
ఇలలోన సీతానాయకుని నేడు"

అనే కీర్తన గానం చేశాడు.

రామవిగ్రహాలను పడవేసిన పాపఫలితం జపేశయ్యను వదల లేదు. ఒకసారి జపేశయ్య కొడుకైన రాముడు కావేరీ నదిలోపడి మరణించాడు. తన కొడుకు ఇలా అకస్మాత్తుగా మృత్యువుపాలై నందుకు, త్యాగయ్యను కష్టాలపాలు చేసినందుకు జపేశయ్య ఎంతో క్రుంగి అనారోగ్య పీడితుడయ్యాడు. తన అన్న ఎన్ని ఇబ్బందులు పెట్టినా, ఎన్ని కఠినవాక్కులు పలికినా త్యాగయ్య వాటిని వాత్సల్య పరంగానే భావించి మారు పలికేవాడుకాదు. తన రామ విగ్రహాలను పారవేసినా, ఆగ్రహంతో ఇంటిని రెండు భాగాలుగా విడగొట్టినా త్యాగయ్య అన్నపై కోపగించుకోలేదు. ఇంతటి సహనశీలం ఉన్నందు వల్లనే త్యాగయ్య రామ కటాక్షానికి పాత్రుడయ్యాడు. దయా హృదయుడైన త్యాగయ్య తన అన్నగారి దుస్థితి చూడలేక "రామ చంద్రా! నేను నా కోసం ఎప్పుడూ ఏదీ కోరలేదు. తప్పులు చేసిన వారిని క్షమించి కాపాడే దేవుడవు నీవు. నా అన్న ఆరోగ్యంతో కలకాలం జీవించేటట్లు అనుగ్రహించు అని ప్రార్థన చేస్తూ "ఎన్నో తప్పులు చేసిన వారిని రాజన్య నీవు బ్రోచినావు" అనే కీర్తన పాడాడు. త్యాగయ్య ప్రార్థనల నాలకించిన శ్రీరాముడు జపేశయ్యను కనిక రించాడు. అతడు క్రమంగా కోలుకొని పశ్చాత్తాపపడి తమ్ముని కౌగలించుకొని ఆనాటినుంచీ తానుకూడా రామభక్తి కార్యాలలో త్యాగయ్యకు సహకరించడం ప్రారంభించాడు.

ఒకసారి త్యాగయ్య తన శిష్యులతో కలిసి తిరుపతి యాత్ర పూర్తిచేసుకొని పుత్తూరు చేరుకున్నాడు. ఒకచోట పల్లకిని ఆపగా ఒక శవం, ఆ శవం ప్రక్కన ఒక స్త్రీ ఒక బిడ్డ కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్న ఒక విషాద దృశ్యం కనిపించింది. త్యాగయ్య శిష్యులు ఆ స్త్రీని జరిగిన విషయం అడిగారు. అప్పుడామె — "తాము తీర్థ యాత్రలు చేస్తూ ప్రొద్దుపోయేసరికి పుత్తూరు చేరుకున్నామని, చుట్టూ దట్టమైన అడవులు వుండటంవల్ల క్రూర జంతువులకు భయపడి ఒక యింట్లో బసచేయాలని ఒక యింటి తలుపులు తట్టగా ఆ గృహస్థులు ఏ దొంగలో లేక క్రూర జంతువులో అని భావించుకొని భయపడి తలుపులు తీయలేదు. మళ్ళీ పరికించి చూడగా కొంత దూరంలో ఒక దేవాలయం కనిపించింది. తన భర్త అక్కడికి వెళ్ళి కాపలా దారుని పిలువగా అతడు ఎంతటికీ తలుపు గొళ్ళెం తీయలేదు. అప్పుడు చీకటి కావడంతో అక్కడ ఉండలేక తన భర్త తానే స్వయంగా వెళ్ళి గోడదూకి తలుపు తీయడానికి అవతలికి వెళ్ళేటప్పుడు ప్రక్కనే ఉన్న నూతిలో పడి మరణించాడ"ని తన గోడును వెళ్ళబుచ్చింది. అంతా విన్న త్యాగయ్య మనసు కరిగిపోయింది. ఒక ఇల్లాలి పసుపు కుంకుమలు అన్యాయంగా గంగపాలు కావడం చూడలేక రామధ్యానం చేస్తూ తన చేతిలో ఉన్న తులసి తీర్థాన్ని శవంపై చల్లి "నా జీవనాధార" అనే కీర్తన పాడారు. శవంగా పడి ఉన్న శేషయ్య వెంటనే నిద్రనుంచి మేల్కొన్నట్లు పైకి లేచి తనకు పునర్జన్మను ప్రసాదించిన త్యాగయ్య పాదాలకు మ్రొక్కి మళ్ళీ భార్యాబిడ్డలతో తన యాత్ర కొనసాగించాడు. అచంచల భక్తి విశ్వాసాలతో భక్తుడు సాధించలేని పని లోకంలో ఏదీలేదు.

త్యాగయ్య తన యాత్ర కొనసాగించి మద్రాసుకు సమీపం లోని తిరువొత్తియూర్ అనే గ్రామంలో నెలకొన్న వడివుడైయమ్మన్

అనే అమ్మవారిని దర్శించి, ఆ దేవతపై పంచరత్న కీర్తనలను గానం చేశాడు. వాటిని దేవాలయ అధికారులు దేవాలయ గోడలపై చెక్కి-ఉంచారు. నేటికీ అవి అలాగే ఉన్నాయి. త్యాగయ్య కోవ్వూర్ గ్రామంలోని సుందరేశ్వర స్వామిని దర్శించి ఆ స్వామివారిపై కూడా పంచరత్న కీర్తనలను పాడాడు. కోవ్వూర్ గ్రామంలో సుందర ముదలియార్ అనే ధనవంతుడు త్యాగయ్యకు ఎలాగైనా సహాయపడాలని పల్లకిలో అతనికి తెలియకుండా వెయ్యి బంగారు నాణేలను దాచి ఆ డబ్బును రామ కైంకర్యానికి వాడవలసినదని శిష్యులకు చెప్పాడు. త్యాగయ్య ఇలా యాత్ర ముగించుకొని స్వగ్రామమైన తిరువయ్యారుకు బయలుదేరాడు. దట్టమైన అడవి మార్గంలో ప్రయాణం చేస్తున్నప్పుడు ఒక దొంగలగుంపు పల్లకిని చుట్టుముట్టింది. శిష్యులు ఈ విషయాన్ని గురువుగారికి విన్నవించగా — "మనదగ్గర విలువైన వస్తువులు లేవుకదా, ఎందుకు భయం?" అని త్యాగయ్య ప్రశ్నించాడు. అప్పుడు శిష్యులు జరిగిన విషయం చెప్పారు. అందుకు త్యాగయ్య "అయితే వాటిని దొంగలకు ఇచ్చేయండి" అనిచెప్పాడు. అందుకు శిష్యులు — 'ఆ డబ్బును రామకార్యాలకు వినియోగించవలసిందని సుందర మొదలియార్ చెప్పిన మాటలను మనవి చేసుకోగా — 'అది దేవుని ధనం అయితే దేవుడే కాపాడుకొంటాడు. దానికోసం ఎందుకు బాధపడాలి' అని చెప్పి రాముని ధ్యానిస్తూ 'ముందు వెనుక యిరు ప్రక్కల తోడై మురహర హర రారా రారా' అని గానం చేయగానే ఇద్దరు యువకులు ప్రత్యక్షమై దొంగలమీద బాణవర్షం కురిపించారు. ఆ ధాటికి తట్టుకోలేక దొంగలు పారిపోయారు. ఆ యువకులు తెల్లవారే వరకు పల్లకిని వెంబడించి వచ్చారు. ఆ యువకులు ఎవరో కాదు. రామ లక్ష్మణులే. దొంగలు పల్లకి వెంట అల్లంత దూరం నుంచి వస్తూనే ఉన్నారు. దొంగలు

చివరికి జ్ఞానవంతులై తను పొరపాటును తెలుసుకొని త్యాగయ్య పాదాలపై పడి క్షమాభిక్ష వేడుకొన్నారు. వారిని క్షమించి రామ నామ మంత్రాన్ని ఉపదేశించి భక్తులుగా మార్చివేసాడు. ఇంతటి మహిమోపేతుడైన త్యాగయ్య 96 కోట్ల రామనామ జపం పూర్తి చేసి దుఃఖ భాజనమైన పునర్జన్మ లేకుండా చేసుకున్నాడు. ఈ పుణ్య చరితుడు రామ భక్తి సామ్రాజ్యంలో అఖండ భక్తుడుగా, నాద బ్రహ్మగా నిలిచిపోయాడు.

'సూర్యోదయం' ఆధ్యాత్మిక మాసపత్రిక, రాజమహేంద్రవరం
(ఆగస్టు 1988)



# త్యాగయ్య కీర్తనలలో ప్రజాహితబోధ

అన్నమాచార్యుని అన్నమయ్య అని, క్షేత్రజ్ఞుని క్షేత్రయ్య అని మన ఆంధ్రజనులు ముద్దుగా, అభిమానంగా, ఆత్మీయంగా వ్యవహరిస్తున్నట్లే త్యాగరాజును కూడా త్యాగయ్య అని వ్యవహరించడం ఆనవాయితీ. పదకవితా రచనకు ఆద్యుడైన అన్నమయ్య అనగానే మనకు ఆ ఏడుకొండల శ్రీనివాసుడు, ఆ శ్రీనివాసునిపై వ్రాసిన శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు మనకు గుర్తుకువస్తాయి. క్షేత్రయ్య అనగానే ఆ సిరిమువ్వల గోపాలుడు, శృంగార పదాలు, అభినయం మనకు గుర్తుకువస్తాయి. క్షేత్రయ్య అనగానే ఆ సిరిమువ్వల గోపాలుడు, శృంగార పదాలు, అభినయం మనకు స్ఫురిస్తాయి. అలాగే త్యాగయ్య పేరు స్మృతికిరాగానే జగదేకవీరుడు, శ్యామసుందరుడు, సత్యనిష్ఠాగరిష్ఠుడు, దయాసాగరుడు అయిన ఆ శ్రీరామచంద్రుడు, సృష్టిలోని సమస్త జీవరాసులను సుఖసాగరంలో ముంచి తేల్చగల్గిన ఏకైక సరసకళ అయిన సంగీతం మన స్ఫురణకు వస్తుంది. సంగీతానికి ప్రాణం నాదం. ఈ నాదోపాసన ద్వారా తన ప్రియదైవమైన శ్రీరామచంద్రమూర్తిని ఆరాధించి భక్తి జలధిలో ఓలలాడి పరవశుడై ముక్తి నొందిన పరమ భాగవతోత్తముడు మన త్యాగయ్య.

త్యాగయ్య తంజావూరులో కావేరీ నదీ తీరంలోని తిరువారూరులో సీతమ్మ, రామబ్రహ్మం అనే పుణ్యదంపతులకు నోము ఫలంగా 1767 సం॥లో ప్రభవించాడు. ఈ పుణ్యచరితుడు తిరువారూరులోని త్యాగరాజస్వామివారి వరప్రసాది. అందుకే తల్లిదండ్రులు అతనికి భక్తిప్రపత్తులతో 'త్యాగరాజు' అని నామకరణం

చేశారు. త్యాగయ్య, వాల్మీకి, నారద, సరస్వతుల అంశలలో అవతరించిన మహిమాన్వితుడు కావడంవల్ల ఈ భక్తునికి కవిత్వం, భక్తి, సంగీతం కరతలామలకమయ్యాయి. ఇతనికి లోకధర్మాన్ని అనుసరించి సంగీతాభ్యాసగురువులు శొంఠి వెంకటరమణయ్యగారు, శ్రీ రామకృష్ణ యతీంద్రులుగారు, త్యాగయ్య సంగీతాన్ని ఆధారంగా చేసుకొని భక్తి భావాలను కవిత్వంలో చొప్పించి కీర్తనలు రచించాడు. పల్లవి, అనుపల్లవి, చరణాలతో కూడిన ఇతని భక్త్యాత్మక కీర్తనలు లోకప్రసిద్ధమయ్యాయి. పరమ భక్తాగ్రేసరుడైన త్యాగయ్య తన ఇష్టదైవమైన శ్రీరామునిపై ఇరవై నాలుగు వేల కీర్తనలను త్యాగరాజు ముద్రాంకితంగా రచించాడు. అంతేగాక సీతారామవిజయం, ప్రహ్లాద భక్తవిజయం అనే నాటకాలను, నౌకా చరిత్రమనే గేయనాటకాన్ని రచించి 1847లో శ్రీరామచంద్రునిలో ఐక్యమయ్యాడు.

త్యాగయ్య తన కీర్తనలో సంగీత ప్రాధాన్యం, రామభక్తి భావాలు, శ్రీరాముని రూప, గుణ, శౌర్యాది వర్ణనలు, వ్యక్తిగత ఆవేదనలు, లోకానుభవాలు మొదలైనవి వ్యక్తపరచడంతోపాటు ప్రజలకు ఉపయోగపడే భక్తినీతి జ్ఞాన అంశాలను కూడా పొందుపరచాడు. సాధారణంగా భక్తులందరూ ప్రజలను భక్తిమార్గంలో నడిపించడమేగాక వారిని నీతివంతంగాను, జ్ఞానులుగాను తీర్చిదిద్దాలని, వారి జన్మలను తరింపజేయాలని సకల విధాల ప్రయత్నిస్తారు. ఈ విధంగా పోతన. ధూర్జటివంటి పద్యకవులు, అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణివంటి పదకవులు తమ రచనలలో భక్త్యాత్మక విషయాలతోపాటు, నీతిబోధకమైన విషయాలనుకూడా పొందుపరచి లోకశ్రేయస్సును అభిలషించారు. అలాగే త్యాగయ్యకూడా ప్రజాసంక్షేమంకోసం తన కీర్తనలలో భక్తిబోధనలను, నీతి జ్ఞాన

బోధలను కూడా పొందుపరచాడు. తన కీర్తనలను ఎవరైనా పాడగా వినడంవల్లగానీ లేదా స్వయంగా పాడుకున్నప్పుడుగానీ చదువుకున్నప్పుడుగానీ అందులోని హితబోధలు పఠితల హృదయాల్లో ముద్రవేసుకుంటాయని, ఆ ఉపదేశాలు కరదీపికలై మానవులను భక్తులుగా, జ్ఞానులుగా తీర్చిదిద్దగలవని త్యాగయ్య కాంక్షించి వుండవచ్చు.

మహావిష్ణువు ప్రతియుగంలోను దుష్టశిక్షణ, శిష్టరక్షణకోసం భూమిపై అనంతకోటి అవతారాలు దాల్చి ధర్మసంస్థాపన చేస్తుంటాడు. విష్ణుమూర్తి అన్ని అవతారాలలో కెల్ల దశావతారాలు ప్రసిద్ధమైనవి. ఆ దశావతారాలలో రామావతారం మిక్కిలి శ్రేష్ఠమయింది. భక్తులు తరించడానికి మిక్కిలి సులభమయింది. శ్రీరాముడు మానవునికి సర్వ విషయాలలోను ఆదర్శప్రాయమైన దేవుడు. మానవుడు బిడ్డగా, సోదరుడుగా, శిష్యుడుగా, భర్తగా, చక్రవర్తిగా, వీరుడుగా, ధార్మికుడుగా ఎలా ప్రవర్తించాలో, ఎలా ధర్మాన్ని ఆచరించాలో స్వయంగా ఆచరించి నిరూపించి చూపిన మార్గదర్శకుడు శ్రీరాముడు. అట్టి శ్రీరామునిపై భక్తి కుదరాలంటే మానవునికి నియమనిష్ఠలు అలవడాలి. అపారమైన దయాహృదయుడు కావాలి. సత్యవాక్కును పాలించాలి. ఇన్ని సుగుణాలు అలవరచుకుంటే తప్ప రామభక్తి సామ్రాజ్యంలో రవ్వంతైనా చోటుదొరకదు. త్యాగయ్య సర్వగుణాలూ ఉన్న పరమభక్తుడు. అందుకే అతనికి రామునిపై భక్తి అలవడింది. శ్రీరాముడంటే ఎనలేని ప్రేమ కలిగిన ఆ భక్తుడు తన కీర్తనలలో నిజమైన రామభక్తి తత్త్వాన్ని పరిమళింపజేశాడు.

కొంతమంది కపటభక్తులు ఉదయాన్నే లేచి చన్నీళ్లలో మునుగుతారు. శరీరంపై విభూతి పూసుకొని వేళ్లతో జపమాలలు త్రిప్పుతారు. ఇలాంటి బాహ్యకర్మలు చేస్తూ పైకి అసలైన భక్తులుగా పొగడ్తకెక్కుతారు. లోకమంతా తిరుగుతూ సామాన్య

జనులను మోసంచేస్తూ ధనార్జన చేస్తుంటారు. ఇలాంటి మోసగాండ్రు సులభమైన రామభక్తి మార్గాన్ని తెలుసుకోలేరని త్యాగయ్య కపట భక్తుల విషయంలో చింతించి తన ఆవేదన వ్యక్తం చేస్తూ —

ధేనుక — దేశాధి

"పల్లవి - తెలియలేరు రామభక్తిమార్గమును

అనుపల్లవి - ఇలనంతట తిరుగుచు కలవరించెదరుగాని

చరణాలు - వేగ లేచి నీట మునిగి భూతిపూసి
వేళ్ళనెంచి వెలికి శ్లాఘనీయులై
బాగుగ పైక మార్జన లోలురై
రేగాని త్యాగరాజనుత" అనే కీర్తన రచించాడు.

భగవద్భక్తి అంటే భగవంతునిపై అవ్యాజమైన ప్రేమ. ఎవని మనస్సు దైవసంబంధమైన కథలను, గీతాలను శ్రవణ, కీర్తన, స్మరణాది భక్తిమార్గాలచే పరవశించి పోతుందో, ఎవని శరీరంపై పులకాంగ్రాలు పొడసూపుతాయో ఎవని నేత్రాలలో ఆనందబాష్పాలు తొణికిసలాడుతాయో ఆ మానవుడే నిజమైన భక్తుడు. మానవుడు ఇహలోకంలోనే ముక్తిని కూడా సాధించాలి. ముక్తిసాధనకు భక్తి సులభోపాయం. మానవుడు భక్తిని సాధించి జీవన్ముక్తుడు కావాలి. భక్తిని సాధించాలంటే సంగీత జ్ఞానవంతుడు కావాలి. భక్తుని హృదయాన్ని సులభంగా భగవంతుని సన్నిధికి చేర్చి పరవశింపజేసే సులలితమైన వాహిక సంగీతం. సంగీతజ్ఞానహీనులకు, జీవన్ముక్తులుకాని వారికి మోక్షం లభించదని త్యాగయ్య జ్ఞానబోధ చేస్తూ —

"ప. - మోక్షము గలదా? భువిలో జీవన్ముక్తులు గానివారలకు

అ.ప. - సాక్షాత్కార నీ సద్భక్తి సంగీతజ్ఞాన విహీనులకు"

అనే కీర్తన రచించాడు.

మానవుడు ఇంట్లో వున్న చక్కని మధురమైన పాలుమీగడలను వదలిపెట్టి చప్పని గంగాజలాన్ని కోరవలసిన పనిలేదు. శ్రీరాముని రూపం కంటికి సుందరమైన రూపం. అతని పేరు శివుని నాలుకపై నిత్యమూ నర్తిస్తూ ఉంటుంది. రాముడు త్యాగయ్య ఇంటిలోనే నెల కొన్న దేవుడు. ఇలాంటి రామునిభక్తి అనే చక్కని రాజమార్గాన్ని వదలిపెట్టి అల్పమైన ఇతర కుమార్గాలను చేపట్టవలసిన పనిలేదని తన మనస్సుకే జ్ఞానబోధ చేసుకుంటూ —

ఖరహరప్రియ — ఆది

ప. - చక్కని రాజమార్గము లుండగ
సందుల దూరనేల? ఓ మనస

అ. ప. - చిక్కని పాలు మీగడయుండగ
ఛీ యన గంగాసాగరమేల

చ. - కంటికి సుందరతరమగు రూపమే ము
క్కంటి నోట చెలగెడు నామమే, త్యాగరా
జింటనే నెలకొన్న దైవమే, యిటు
వంటి శ్రీ సాకేతరాముని భక్తియను"

అనే కీర్తన రచించాడు. ఇందులో త్యాగయ్య తన మనసుకే జ్ఞానబోధ చేసుకున్నట్లు కనిపించినా ఇది ఇతరులకు చేసిన జ్ఞానబోధగా కూడా గ్రహించాలి.

ప్రతి మానవుడు కూడా తన మనస్సు అనే బంగారు పీఠాన్ని నెలకొల్పుకొని, నాదస్వరం అనే శ్రేష్ఠమైన నవరత్న వేదికపై సకల లీలా వినోదుడు, పరమాత్ముడు అయిన శ్రీరాముని పాదాలను

దైవనామాలనే పుష్పాలతో పూజించాలని, వాని జన్మమే జన్మ మని త్యాగయ్య తెలుపుతూ —

శ్రీ – దేశాది

"ప. - నామ కుసుమములచే పూజించెడి
నరజన్మమే జన్మము మనసా

అ. ప. - శ్రీమన్మానస కనక పీఠమున
చెలగ చేసికొను వర శివరామ

చ. - నాదస్వరమను వర నవరత్నపు
వేదికపై సకల లీలా వి
నోదుని పరమాత్ముని, శ్రీరాముని
పాదములను త్యాగరాజ హృద్భూషణునిట"

అనే కీర్తన వ్రాశాడు.

ఎల్లప్పుడూ విష్ణుధ్యానపరాయణులైన భక్తులు ఏ వ్యసనాలకు లోనుగాకుండా సత్యమార్గంలో నడుస్తారు. విష్ణుచింతలేని మానవులు ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎన్ని క్షేత్రాలు చూచినా, ఎంతటి వారైనా కాంతదాసులే అని, పశులను హింసించడంలోనూ, పరస్త్రీ విషయంలోను, పరుల ధనం విషయంలోను, పర మానవాపవాదం విషయంలోను, పరజీవనాదులయందును, అసత్యాన్నే పలుకుతారని అలాంటి అజ్ఞానులను, హింసాత్మకులను నిరసిస్తూ త్యాగయ్య—

ఉదయరవిచంద్రిక – దేశాది

"ప. - ఎంత నేర్చిన ఎంత జూచిన
ఎంతవారలైన కాంతదాసులే

అ. ప. - సంతతంబు శ్రీకాంత స్వాంత సి
ద్ధాంతమైన మార్గ చింతలేని వారెం

చ. - పరహింస పరభామాన్యధన పరమానవాపవాద
పరజీవనాదుల కనృతమే భాషించెదయ్య
త్యాగరాజనుత"

అనే కీర్తన రచించాడు.

ఇహలోకంవరకే పరిమితం అయిన ఆలుబిడ్డలు, చుట్టాలు, ఇళ్లు, వాకిళ్లు ధనకనకవస్తువాహనాదులు ఇవి అన్నీకూడా అస్థిరమైనవే అని భావించే భాగ్యశాలురకు ఎల్లప్పుడూ సజ్జనులను సేవిస్తూ వారి మనవి ఆలకిస్తూ సర్వం విష్ణుమయమని తలచి మనసున పూజించేవారికి, డాంబికపూజలను చేయక, శ్రేష్ఠమగు మంత్ర రాజమయిన రామనామాన్ని నిత్యమూ జపించే మహారాజులకు వీరికేతప్ప, మానవజన్మ ఎత్తిన ప్రతిసారికూడ సంసార కూపంలో ప్రవేశించి అదే సారవంతమని భావించేవారి మనసులో రామునిపై భక్తి ఊరకే కలుగుతుందా అని త్యాగయ్య రామభక్తి శ్రేష్ఠతనుగూర్చి మానవులకు బోధిస్తూ —

శహన - చాపు

"ప. - ఊరకయే గల్గునా రామునిభక్తి

అ. ప. - సారెకును సంసారమున జొచ్చి
సారమని యెంచువారి మనసున

చ. - ఆలు సుతులు చుట్టాలు వర సద
నాలు కాయఫలాలు కనక ధ
నాలుగల విభవాలగని యస్థి
రాలను భాగ్యశాలులకు గాక ॥

మంచివారిని యెడగాంచి సంతతము సే
వించి మనవి నాలకించి యాదరి సా
ధించి మదిని పూజించువారికిగాక ॥

రాజసగుణయుక్త పూజల నొసరించ
కజ సన్నుత, త్యాగరాజుని జిహ్వపై
రాజిల్లు వరమంత్రరాజమును స
దా జపించు మహారాజులకు గాక ॥

అనే కీర్తన రచించాడు.

మానవశరీరం మలినమయింది. కామ క్రోధ లోభ మోహాది దుర్గుణాలతో కూడిన నీచమయింది. నియమం లేనట్టిది. ఇలాంటి హేయ శరీరం కలిగినందుకు పవిత్రమైన సీతారామనామాన్ని పలకాలని త్యాగయ్య బోధచేస్తూ —

**వరాళి — ఆది**

"ప. - ఈ మేను గలిగినందుకు సీతారామనామమే
పల్కవలెను.
అ. ప. - కామాది దుర్గుణస్తోమ పూరితమైన
పామరత్వమేగాని నేమము లేనట్టి"

అనే కీర్తన రచించాడు.

అలాగే శ్రీరాముని గూర్చి చింతించడం అనే ఆనందసాగరం లోను, లక్ష్మీనాథుడు సకల వేదాలచే ఆశ్రయించబడిన విష్ణువు యొక్క సంగీత జ్ఞానమనే బ్రహ్మానంద సాగరంలోను ఓలలాడని శరీరం ఈ భూమికే భారమని రామభక్తి విహీనులను నిరసిస్తూ త్యాగయ్య —

**గరుడధ్వని — దేశాది**

"ప. - ఆనంద సాగరమీదని దేహము
భూమిభారము, రామబ్రహ్మ

అ. ప. - శ్రీనాయకాఖిల నైగమా
శ్రిత సంగీత జ్ఞాన మను బ్రహ్మ"

అనే కీర్తన రచించాడు.

భూమియందలి సమస్త జీవులను పోషించు దేవుడు వాసుదేవుడని పండితులు చెబుతారు. కాబట్టి సృష్టి సమస్తం విష్ణుమూర్తియే అని భావించాలని, దుర్బుద్ధిని వదవేలియాలని చెబుతూ త్యాగయ్య-

అఠాణ — ఆది

"ప. - చెడెదు బుద్ధిమానురా

అ. ప. - ఇడెదు పాత్రమెవరో జూడరా

చ. - భావానికి తగు ఫలము గల్గునని
బుధులు పల్క విన లేదా! మానస.
శ్రీ వాసుదేవ సర్వమనుచును
చింతించర, త్యాగరాజ వినుతిని"

అనే కీర్తన రచించాడు.

శ్రీరాముడు ఎంత చూచినా తనివితీరని అతృప్త్యమృతరూపుడు. సంసార సాగరాన్ని తరింపజేసే తారకమంత్రమైన రామనామం బ్రహ్మరుద్రాదులకు నిత్య జపమంత్రం. కటియందు బంగారుచేలము మెరసిపోతుండగ, చిరునవ్వులు చిందించే శ్రీరాముని సుందరమైన ముఖాన్ని భావనచేసి, రామనామ భజన చేయండని జనులకు ఉద్బోధ చేస్తూ త్యాగయ్య —

అఠాణ - రూపకము

"ప. - భజన సేయరాదా? రామ

అ.ప. - అజ రుద్రాదులకు సతతమాత్మ మంత్రమైన రామ

చ. - కరుకు బంగారు వల్వ కటినెంతో మెరయగ
చిరునవ్వులు గల మొగమును చింతించి చింతించి
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

బాగుగ మానస భవసాగరమును తరింప
త్యాగరాజు మనవిని విని తారకమగు రామనామ"

అనే కీర్తన రచించాడు.

మానవుని జీవితం కొన్నాళ్ళు నిద్రచేత, కొన్నాళ్ళు విషయ సుఖాలచేత, కొన్నాళ్ళు బ్రతుకు తెరువులకై ఇతరులను పొగడటం చేత, కొన్నాళ్ళు ఎద్దువలె కన్న తావుకే మరగి అనుభవించడం చేత, కొన్నాళ్ళు పైకి ఎంతో ఇంపుగ కనిపించే పుట్టుక అనే ప్రవాహంలో మునిగి తేలడంచేత, కొన్నాళ్ళు కొరగానివారితో వృథా ప్రలాపాల చేత, కొన్నాళ్ళు ధనపుత్రాదుల వ్యామోహంచేత, కొన్నాళ్ళు ముసలితనంచేత, కొన్నాళ్ళు ఎదుటివారి సుఖశాంతులు చూచి ఓర్వ లేకపోవడంచేత, కొన్నాళ్ళు కర్మపూజలు చేయాలనే అలసటచేత, కొన్నాళ్ళు దుర్గుణాలతో తప్పులు చేసి విర్రవీగుటచేత, కొన్నాళ్ళు నామకీర్తన చేయడం భాగ్యమనకపోవడంచేత, కొన్నాళ్లు శ్రీరాముని తత్త్వం తెలియకపోవడంచేత వ్యర్థమైపోతూ ఉందని, జీవితం మునియక ముందే అజ్ఞాన తిమిరం నుంచి మేల్కొని శ్రీరాముని భజించమని త్యాగయ్య భక్తిబోధ చేస్తూ —

**తోడి - చాపు**

"ప. - పొద్దుపోయెను, శ్రీరాముని పూని భజించవే మనస

అ.ప. - నిద్దురచేత కొన్నాళ్ళు విషయ
బుద్ధులచేత కొన్నాళ్ళు ఓ మనస!

చ. - ప్రొద్దున లేచి త్రితాపములను నరుల
పొగడి పొగడి కొన్నాళ్ళు పట్టి
ఎద్దురీతి కన్న తావుల భుజియించి
యేమి తెలియక కొన్నాళ్ళు!

ముద్దుగ తోచు భవసాగరమున
మునిగి తేలుచు కొన్నాళ్ళు
పద్దు మాలిన పామర జనులతో వెఱ్ఱి
పలుకులాడుచు కొన్నాళ్ళు, ఓ మనస!

ముదమున ధన తనయాకారములు చూచి
ముదముచేత కొన్నాళ్ళు అందు
చెదరినయంత శోకార్ణవగతుడై
జాలి చెందుటయు కొన్నాళ్ళు ॥

ఎదుటి పచ్చ జూచి తాళలేక తా
నిలను దిరుగుట కొన్నాళ్ళు
ముది మది తప్పిన వృద్ధతనముచే
ముందు వెనుక తెలియకయె కొన్నాళ్ళు ఓ మనస!

యాగాది కర్మములను జేయవలెనని
యలసటచేత కొన్నాళ్ళు యందు
రాగలోభములతో నపరాధముల జేసి
రాజసమున కొన్నాళ్ళు

బాగుగ నామ కీర్తనములు చేయుట
భాగ్యమనక కొన్నాళ్ళు
త్యాగరాజనుతుడైన శ్రీరాముని
తత్వము తెలియకయే కొన్నాళ్ళు”

అనే కీర్తన రచించాడు.

అనిత్యమైన ప్రాపంచిక విషయ సుఖాలతో కాలం వృథా పుచ్చక నిత్యమూ శ్రీరామునిపై ధ్యానంతో గడిపేవాడు, తుంబురుని వలె తంబుర మీటుతూ పరమ దయాళువైన శ్రీరాముని సన్నిధిలో నర్తించువాడు, మానవజన్మను పతన మొందించే కామ క్రోధ లోభమోహాదులను మనసులో చేరనివ్వక ఆర్తరక్షణుడైన విష్ణుమూర్తియందే మనస్సును లగ్నం చేయువాడు, ధర్మశీలుడు, కర్తవ్య నిమగ్నుడు అయిన శ్రీరాముని నామమహిమను తెలిసినవాడు, ధనాశతో కపట వేషాలు వేసి మోసపోనివాడు, అహంకారులతో సాంగత్యం చేయక శ్రీరామచంద్రుని నమ్ముకున్నవాడు, ఎల్లప్పుడూ హనుమంతునిచే ధరించబడినవాడైన శ్రీరాముని పాద ద్వయాన్ని నిరంతరం స్మరించేవాడు, అతడే ధన్యుడని నిర్ధారణచేసి చెబుతూ —

కాపి - చాపు

"ప. - అతడే ధన్యుడురా ఓ మనస

అ.ప. - సతతయాన సుత ధృతమైన సీతా
పతి పాదయుగమును సతతము స్మరియించు (న)

చ. - తుంబురువలె తన తంబూరపట్టి ద
యాంబుధి సన్నిధానంబున నటియించు (న)

కరివరదుని తత్వమెరుగను మరిగించి
అరిషడ్వర్గములందు పరవలేక తిరుగు (న)

కర్మనిష్ఠుడైన ధర్మశీలుడైన
శర్మ రామనామ మర్మము దెలిసిన (య)

కాసు వీసముల కోసము ఆశతో
వేసము ధరియించి మోసము చెందని (య)

రాజస జనులతో తా జతకూడక
రాజిల్లు శ్రీత్యాగరాజనుతుని నమ్మ (న)

అనే కీర్తన వ్రాశాడు.

ప్రతి మానవుడు తన శరీరాన్ని స్వామికార్యాలకు, ధర్మ కార్యాలకు, పరోపకారాలకు వినియోగించాలి. అలా కాకుండా కొంతమంది తమ శరీరాలను స్వామి సేవకు ఉపయోగించక లౌకిక మైన ఆశలకు లోబడి తిరుగుతుంటారు. భగవంతునిపై దృష్టి నిలుప కుండా పరస్త్రీలను ఓరచూపులు చూస్తుంటారు. భగవన్నామ స్మరణ చేయకుండా అనవసరంగా ఊరుజనులను గూర్చి వదరు తుంటారు. చేతులతో పూజలు చేయకుండా ఇతరులు ఇచ్చే నీచపు దానాలకు చేతులు చాచుతుంటారు. మానవుడు అజ్ఞానియై తన అశాశ్వతమైన శరీరాన్ని ఇలాంటి హీనమైన పనులకు వినియోగిం చడం సబబుగా లేదని హెచ్చరిక చేస్తూ —

**ముఖారి - చాపు**

"ప. ఇందుకా తనువును పెంచిన (దిం)

చ. నీ సేవకు లేక నీకు చెంతకు రాక
ఆశదాసుడై అటులిటు దిరుగుట ॥

నిరతము నీ దృష్టినే యార్జింపక
ఒరుల భామలను ఓరచూపులు చూచుట ॥

సారెకు నామ స్మరణము చేయక
ఊరి మాటలెల్ల యూరక వదరుట ॥

కరములతో పూజ గావింపక దాచి
ధరలోన లేని దుర్దానములకు చాచుట॥"

అనే కీర్తన వ్రాశాడు.

ఈ లోకంలో నిజమైన సుఖి ఎవరంటే సత్యాన్ని తప్పకుండా పాటించేవాడు. ప్రజా సేవకుడు, దైవభేదాన్ని చూపనివాడు, సుస్వరంతో కూడిన గానంతో ఎల్లప్పుడు సకల మంత్రసారమైన రామనామ తారక మంత్రాన్ని స్మరించేవాడు - వీరే సుఖులు. అంటూ త్యాగయ్య —

**కానడ — దేశాది**

"ప. - సుఖి యెవరో రామనామ సుఖి యెవరో

అ. ప. - సుఖి యెవరో ! సుముఖియెవరో
అఖిలసారమగు తారకనామ

చ. - సత్యము దప్పక సకల లోకులకు
భృత్యుడై దైవ భేదము లేక
నిత్యమైన సుస్వరపు గానముతో
నిరంతరము త్యాగరాజనుత"

అనే కీర్తన వ్రాశాడు.

కామదాసులు, అజ్ఞానులు అయిన పురుషులు స్త్రీల శరీరాన్ని చూచి వ్యామోహితులై మోసపోతున్నారని, ఆ శరీరంలోపలి హేయమైన రక్తమాంసాదులను గూర్చి ఆలోచింపక చెడుపనులకు పూనుకుంటున్నారని, అలాంటి నీచమైన పనులను త్యజించి మనోరంజకంగా రామభజన చేసుకోమని త్యాగయ్య జ్ఞానబోధ చేస్తూ —

**పరసాంగి — దేశాది**

"ప. - మేనుచూచి మోసపోకునే మనసా
లోని జాడలీలాగు గదా

అ. ప. - హీనమైన మూత్రరక్తముల
కీలనెంచు మాయామయమైన చాన

చ. - కనులనెడి యంపకోల చేతగుచ్చి
చనులనెడి గిరుల శిరము నుంచి
పనులు చేతురట, త్యాగరాజనుతుని బా
గనీవు భజన చేసుకొమ్మి స్త్రీల।

అనే కీర్తన వ్రాశాడు.

మనిషిని ఆవరించి క్రుంగదీసే అనేక రకాల భయాలలో యమునిభయం బలీయమయింది. ఈ ప్రాణభీతి పోవాలంటే బ్రహ్మ రుద్రాదులకు పదవులిచ్చే శ్రీరామునిగూర్చి భజన చేయాలని, బ్రహ్మాండమంతా నిండియున్న శ్రీరాముని ముఖాన్ని హృదయ పద్మంలో చూస్తూ, పూజలు చేస్తూ, నిండుప్రేమతో నిలువెల్లా కరగి పోయే కామరహితులకు యమనిభయం ఉండదని త్యాగయ్య నిర్దే శించి చెబుతూ —

సురటి - రూపకము

"ప. - భజన పరులకేల దండపాణి భయము మనసా, రామ

అ. ప. - అజ రుద్ర సురేశుల కాయా స్థాన మొసంగు రామ

చ. - అండకోట్ల నిండిన కోదండపాణి ముఖమును
హృత్పుండరీకమున జూచి పూజసల్పుచు
నిండుప్రేమతో కరంగు నిష్కాములకు వరనే
దండ పాల దాసుడైన - త్యాగరాజు సేయు రామ"

అనే కీర్తన వ్రాశాడు.

నిర్మలాత్మ కలిగిన మానవులకు శ్రీరాముడు కనులకు చలు వను, చెవులకు అమృతాన్ని, నాలుకకు రుచిని, మనసుకు సుఖాన్ని,

శరీరానికి ఆనందాన్ని కలుగజేస్తాడు. అలాంటి శ్రీరాముని వదలి సుజనులు ఉండలేరని త్యాగయ్య చెబుతూ —

**బలహంస – ఆది**

"ప. - నిన్ను బాసి యెట్ల యుందురో నిర్మలాత్మకా జనులు

అ. ప. - అనఘ! సుపుణ్య! అమరవరేణ్య
సనకశరణ్య! సత్కారుణ్య!

చ. - కనులకు చలువ, చెవులకమృతము
విను రసనకు రుచి, మనసుకు సుఖము
తనువుకు యానందమును కల్గచేయు
త్యాగరాజ హృద్ధామ! పూర్ణకామ!"

అనే కీర్తన వ్రాశాడు.

శ్రీరాముని దయ కరగాలంటే మనసును విషయ సుఖాలనే విటులకు ఇవ్వకూడదు. మానవుడు అలా తన మనస్సు శ్రీరామునికి గాకుండా విషయసుఖాలకు అర్పితం చేస్తే తన ఇంటి తలుపును పొరుగింటికి తీసిపెట్టి తన ఇంట్లోకి కుక్కలను తోలినట్లు అవుతుందని, తవుడుకోసం వ్యభిచారం చేయబోతే ఇంట్లో ఉన్న కూటి తపిలను కోతి ఎత్తుకొని పోయినట్లవుతుందని, చెవిటివాడికి నీతులు ఉపదేశించినట్లవుతుందని త్యాగయ్య నీతిబోధ చేస్తూ —

**వాటకురంజి – ఆది**

"ప. - మనసు విషయనట విటుల కొసంగినను
మా రాముని కృప గలుగునో మనస!

అ. ప. - తన తలు పొకరింటికి తీసిపెట్టి
తా కుక్కల తోలురీతి గాదో

చ. - తవిటికి రంకాటపోయి కూటి
తవిల కోతి గొంపోయినటుగాదో
చెవిటికి నుపదేశించినటుగాదో
శ్రీ త్యాగరాజనుతుని దలచక"

అనే కీర్తన రచించాడు.

విద్యావంతుడు గర్వం. ఈర్ష్య మొదలైన దుర్గుణాలను కలిగి వుంటే అవిద్యకు (అజ్ఞానానికి) వశ్యులైనట్లేనని, మాయామయమైన ఈ జీవితం మనది అని భావింపక విష్ణుమూర్తి పాదద్వయంపై మనసు నిలిపి ఎలాగైనా భక్తిని సంపాదించడానికే ప్రయత్నం చేయాలని త్యాగయ్య భక్తిబోధచేస్తూ —

**సామంతం – చాపు**

"ప. - ఎటులైన భక్తి వచ్చుటకే యత్నము సేయనే

అ. ప. - మటుమాయభవమును మనదని యెంచక
వటపత్రశయనుని పాదయుగములందు

చ. - విద్యాగర్వము లేల నీవ
విద్యావశము గాకేల"

అనే కీర్తన రచించాడు.

భార్యాబిడ్డలు, ధనధాన్యాలున్నా, జపతపాలు చేసి శక్తిని సంపాదించినా, వేద శాస్త్రాలను చదివినా, సకల జీవుల ఆత్మభావం క్షుణ్ణంగా తెలిసినా, యజ్ఞయాగాది కర్మలను నిర్వహించినా, భక్తులుగా మంచి పేరు గడించినా, సామాన్యునికైనా, యోగికైనా పండితునికైనా, శాంతం లేనిదే సౌఖ్యం లేదని త్యాగయ్య సద్గుణ బోధ చేస్తూ —

సామంతం — ఆది

''ప. - శాంతము లేక సౌఖ్యము లేదు సారసదళనయన

అ. ప. - దాంతునికైన వేదాంతునికైన

చ. - దారసుతులు ధనధాన్యములుండిన
సారెకు జపతప సంపద కలిగిన ॥

ఆగమ శాస్త్రము లన్నియు చదివిన
బాగుగ సకల హృద్భావము తెలిసిన ॥

యాగాది కర్మము లన్నియు చేసినీ
భాగవతులనుచు బాగుగ పేరైన ॥

రాజాధిరాజ! శ్రీ రామవ! త్యాగ
రాజవినుత! సాధురక్షక! తనకుప ॥

అనే కీర్తన వ్రాశాడు.

ఈ విధంగా త్యాగయ్య ప్రజలను సన్మార్గంలో నడిపించడానికి, వారిని దుఃఖపూరితమైన లౌకిక బంధాలనుంచి విముక్తులను చేయడానికి, పరమ భక్తులుగా తీర్చిదిద్దడానికి భక్తి, నీతి, హిత బోధకాంశాలను తన కీర్తనలలో పొందుపరచాడు. ప్రతి మానవుడు వీటిని భక్తి శ్రద్ధలతో చదివి తెలుసుకోవడమేగాక తదనుగుణంగా ఆచరించి భక్తుడుగా, జ్ఞానిగా, దయాహృదయుడుగా మారితే త్యాగయ్య కీర్తనలలోని హితబోధల ఆశయం నెరవేరినట్లవుతుంది. పరమ దయాళుడైన శ్రీరామచంద్రుని కృపామృత దృక్కులు మనపై ప్రసరిస్తాయి.

'ముముక్షువు' (కర్మ జ్ఞాన భక్తి వైరాగ్య ప్రబోధక సచిత్ర) మాస పత్రిక, ఏలూరు; ఏప్రిల్, 1991)

# సారంగపాణి పదాలలో సాంఘిక నీతులు

ఏ భాషా సాహిత్యంలోని ఏ ప్రక్రియ అయినా సామాజిక ప్రయోజనాన్ని ఆశించే వెలువడుతుంది. అలాంటిదే శాశ్వతంగా నిలుస్తుంది. అసలు సాహిత్యమంటేనే 'సహితస్యభావః సాహిత్యం' 'హితేన సహితం సాహిత్యం' అని హితాన్ని చేకూర్చేది. హితంతో కూడుకొన్నది అని అర్థం. కవి తన స్వప్రయోజనంకోసం కావ్యం వ్రాసినా, సంఘంకోసం వ్రాసినా, లేక భగవత్ప్రీతికోసం వ్రాసినా ఆ కావ్యంవల్ల అనేక లాభాలున్నాయి.'కావ్యం యశసే, అర్థకృతే వ్యవహారవిదే, శివేతరక్షతయే, సద్యఃపర నిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే' అనే శ్లోకాన్ని బట్టి కీర్తి, ధనం, లోకజ్ఞానం, శుభం, మానసిక ఉపశమనం, భార్యవలె ఉపదేశం ఇన్ని ఫలితాలను అందిస్తుంది కావ్యం. కావ్యంలో చెప్పబడిన ఎన్నో నీతులను చదివి గానీ లేక ఒకరు చెప్పగా విని గానీ జ్ఞానాన్ని సంపాదించుకొని తమ లోపాలను సవరించుకొనే సన్మార్గంలో పయనించడానికి ఉపకరిస్తుంది. కావ్యరచనా ప్రక్రియలు ఆయా కవుల అభిరుచులను బట్టి, దేశ, కాల, రాజకీయ పరిస్థితులను బట్టి మారుతూ వుంటాయి. అవి పద్య, గద్య, చంపూ పద రచనలలో ఏవైనా కావచ్చు. సంస్కృత దీర్ఘ సమాస పద బంధాది గ్రాంథిక భాష అయినా, శిష్ట వ్యావహారిక భాషలయినా, జానపద భాష అయినా కావచ్చు. వాటి ముఖ్య ప్రయోజనం మాత్రం హితవే.

మన ప్రాచీన గ్రంథాలయిన వేదాలు, ఉపనిషత్తులు, వేదాంగాలు, పురాణాలు, రామాయణ, భారతాది కావ్యేతిహాసాలు, కవిత్రయ అనువాద గ్రంథాలు, శ్రీనాథ పోతనల కావ్యాలు, అష్టదిగ్గజ కవుల సంకీర్తనలు మొదలైన వాటిలో ఆయా వ్యక్తుల అభిరుచులకు,

మనస్తత్వానికి సంబంధించిన ఎన్నో నీతులు. సూక్తులు, విజ్ఞానం ఉన్నవి కాబట్టే ఈనాటికీ అవి సాహిత్యలోకంలో చెక్కు చెదరక నిలిచి ఉన్నాయి. ఇందులో విషయ పరిజ్ఞానం లేనివారు ఇవి కేవలం ఊహా జనితాలని, వాటివల్ల సమాజానికి కలిగే ప్రయోజనం ఏమీ లేదని అపోహ పడుతుంటారు. ఆయా గ్రంథాలను ఓపికగా తరచి చూచి చదివితే ఈనాటి సమాజానికి కూడా పనికివచ్చే ఎన్నో అంశాలు మనకు కనిపిస్తాయి. యుగాలు మారినా రాజకీయ, సాంఘిక నైతిక, కాలపరిస్థితులు మారినా సత్యం శివం సుందరం అయిన భగవంతుడు, ప్రకృతి స్థితిగతులు, న్యాయం, ధర్మం మాత్రం మారదుకదా.

18, 19 శతాబ్దాలలో సంఘ సంస్కరణలు గావించడానికి రచనలు చేసిన వేమన, తదితర శతకకవులు, కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు, జాషువా మొదలైన ఆధునిక కవులందరూ ఆయా ప్రాచీన గ్రంథాలన్నింటినీ క్షుణ్ణంగా చదివినవారే. వారు అందులోని నీతిని, విజ్ఞానాన్ని గ్రహించి, కాలపరిస్థితుల కనుగుణంగా మార్పు చేసి సులభ శైలిలో, సులభ భాషలో రచనలు సాగించారు. వీరందరూ ప్రజలలో పాతుకొని పోయిన కులతత్వం, మూఢభక్తి, మత వైషమ్యం, సతీసహగమనం, బాల్యవివాహం, పురుషాధిక్యత, స్త్రీ దాసిత్వం, నిరక్షరాస్యత మొదలైన సాంఘిక పతన దురాచారాలను పోగొట్టి, జ్ఞాన దీపాన్ని వెలిగించి ప్రజలను చైతన్యవంతులను చేయడానికి రచనలు చేశారు. వీరి గ్రంథాలలోని కవితాచ్ఛాయలు, ఆశించిన ప్రయోజనాలు ప్రాచీన కావ్యకవుల గ్రంథాలలో, పదకవులు రచనలలో కూడా అనేకం కనిపిస్తాయి. ఎర్రన సూక్తిగా ప్రసిద్ధి కెక్కిన

"పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యు
నిజము శూద్రుకంటె నీచతముడు

సత్యశౌచ ధర్మ శాలి శూద్రుండయ్యు
అతడె సద్విజుండనిరి మునులు"

అనే పద్యంవల్ల ఆనాడే కవులు కులతత్వాన్ని నిరసించారని, గుణానికే ప్రాధాన్యం ఇచ్చారని తెలుస్తుంది. వేమన ఇలాగే—

'మాల మేలు గుణము మంచిది కలిగిన
మాల కూడు కుడుచు మనుజు కంటె
గుణము మేలు కాని కులమేమి మేలురా'

అని బుద్ధి చెప్పాడు. అలాగే గురజాడవారు కూడా—

'మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాల అయితే మాల నే నగుదున్'

అని కుల భేదాలను ఖండించి గుణాలకే ప్రాధాన్యం ఇచ్చాడు.

అలాగే తాళ్ళపాక అన్నమయ్య కూడా—

'విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదుల కదియే జాతి

జాతి భేదములు శరీర గుణములు
జాతి శరిరముతోడనే చెడు
ఆతుమ పరిశుద్ధం బెప్పుడును అది నిర్దోషం బనాది'

ఏ కులజుడేమి ఎవ్వడైన నేమి
ఆకడ నాతడె హరి నెఱిగిన వాడు'

అని భగవత్పరంగా కీర్తనలు వ్రాస్తూ అందులోనే కులభేదాన్ని నిరసించారు. ఇలాగే అనేక రకాలైన మూఢాచారాలను ఖండిస్తూ

క్షేత్రయ్య, త్యాగయ్య, రామదాసు, సారంగపాణి మొదలైన పద కవులందరూ కీర్తనలు వ్రాశారు.

పదకవులు ప్రజలలోని మూర్ఖత్వాన్ని, దురాచారాలను, దుష్టవర్తనను, మూఢవిశ్వాసాలను, జీవహింసను నశింపజేసి సన్మార్గమైన భక్తితత్వంవైపు నడిపించి వారిని ఉద్ధరించడం కోసమే పదాలను రచించారు. అలాంటి పదాలను రచించిన వారిలో ఒకరు సారంగపాణి. ఇతడు 1830 వ సం॥ ప్రాంతంలో చిన్నయ సూరికి సమకాలికుడని శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు 'సారంగపాణి పదాలు' అనే పుస్తకానికి వ్రాసిన పీఠికను బట్టి తెలుస్తుంది. ఇతడు కార్వేటి నగరంలోని అధిష్ఠాన దైవం అయిన వేణుగోపాలస్వామి ముద్రాంకితంగా సుమారు రెండువందల పదాలను రచించాడు. ఇతడు తన పదాలను శృంగారం, దేశీయం, జాతీయం, భక్తి వైరాగ్యం అని నాలుగు భాగాలుగా విభజించారు. మొదటి భాగంలో స్వీయ, పరకీయ, సామాన్య మొదలైన నాయికాభేద శృంగారాన్ని రెండవ భాగంలో కేవల సామాన్య శృంగారాన్ని, మూడవ భాగంలో పామర జనుల జాతీయ భావాలను, నాల్గవ భాగంలో భక్తి, నీతి, వైరాగ్య సంబంధమైన, విషయాలను గూర్చి వివరించాడు. సమాజంలో ఏమాత్రం అక్షరపరిజ్ఞానంలేని పామరులు కూడా విని అర్థం చేసుకోగల్గిన అతి సామాన్యమైన వ్యావహారిక భాషనే పద రచనలలో ప్రయోగించాడు.

సారంగపాణి పదాలలోని నాల్గవ భాగంలో భక్తి బోధక విషయాలతో పాటు ఎన్నో సాంఘిక నీతులు కూడా చోటు చేసుకొన్నాయి.

(పల్లవి) భక్తితో పిలిచి పెట్టిన యన్నము
పట్టెడైన చాలు చెవులకు

(అనుపల్లవి) రక్తిగా హితమైన పాట
పల్లవి విన్నా చాలు కృష్ణా

(చరణాలు) కులము వెలయ సత్కీర్తి వహించే
కొడుకొక్కడే చాలు ప్రజలను
అలమట బెట్టక ఆర్జించిన ధన
మణుమాత్రమే చాలు కృష్ణా

వచ్చినపుడె యాచకునికి వక తృణ
మిచ్చెనంటె చాలు సతులకు
హెచ్చువలదు భర్త దైవమని వూ
హించిరైన చాలు కృష్ణా

దురితము లణగేటందుకు దామో
దరుని భజన చాలు మీాదట
పరతత్వము దెలుపుటకు
వేణుగోపాలుడె చాలు కృష్ణా

ఈ కీర్తన భావాన్ని వివరించి వ్రాయవలసిన పనిలేదు. సామాన్య ప్రజలకు కూడా ఒక్కసారి చదువగానే విషయమంతా సుబోధకం కాగలదు. ఈ కీర్తనలో వేమన పద్యచ్ఛాయలు కని పిస్తాయి.

'గంగిగోవు పాలు గరిటెడైనను చాలు
కడవడైన నేమి ఖరముపాలు
భక్తికలుగు కూడు పట్టెడైనను చాలు'

'నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాయి తట్టెడేల
కొమరు డొకడు చాలు గుణవంతుడౌ నేని'

భక్తి, నీతి, త్యాగం, సత్యం, ధర్మం, న్యాయం మొద
సద్గుణాలు కలిగిన మహానుభావులు మాటలు, సందేశాలు
మించు ఒకే విధంగానే ఉంటాయి. అందువల్ల ఒకరి గ్రం
ఒకరు చూచి ఉన్నా, చూడలేకపోయినా, ఇలాంటి సాదృశ
వారి రచనలలో కనబడడం ఆశ్చర్యం కాదు.

'భక్తిలేని పూజ లేమిటికి పత్రి దొరకగానే
భక్తిలేని పూజ లేమిటికి
భాషించని మగడేమిటికి
రక్తి పాడని పదమేమిటికి
రహించని వేణుగోపాలుని పాద

జీతము ముట్టని కొలువేమిటికి
చిలుక లేని పంజరమేమిటికి
దాతలు దొరకని యూరేమిటికి
దైవము చేరని గుడియేమిటికి

ఆకలిగాని కూడేమిటికి
అర్థము తెలియని చదువేటికి
మూకలు గూర్చని దొరయేమిటికి
ముసలి రండలకు సొగసేమిటికి

మాట వినని తనయుడేమిటికి
మదిరానడువని సతియేమిటికి
చోటు చాలని యిల్లేమిటికి
పొట్టు బెట్టు చుట్టా లేమిటికి

అనే సారంగపాణి కీర్తన

'ఆత్మశుద్ధి లేని యాచారమదియేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధి లేని శివపూజలేలరా'

'తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి'

అనే వేమన పద్యాలను పోలి ఉన్నది.

ఒకే విధమైన నీతులను ఒకే విధమైన శైలిలో సారంగపాణి, వేమన లోకానికి అందించారు.

'పోరాని తావులకు పోరాదు బుద్ధిమంతులైతే
పోరాని తావులకు పోరాదు
పోరాని తావులకు పోతే నీలాపనిందలు వచ్చు
వేరే యవమానము పనిలేదు వేణుగోపాలుని సాక్షిగ'

పగవానింట కుడువరాదు
బలవంతుల కెడమియ్యరాదు
మగువల యాలోచన వినరాదు
మాన ధనుల పోనాడగరాదు

అప్పులు మెండుగ సేయరాదు
ఆవల పండ్లిగిలించరాదు
మెప్పులు వకరికి దోపరాదు
మెచ్చని నడతలు నడువరాదు

చేతగాని పని పట్టరాదు
చేసిన మేలు చెప్పరాదు
ఘాతకాని కొడిగట్టరాదు
కాయము సతమని నమ్మరాదు

కలిమి గలిగెనని త్రుళ్ళరాదు
గాసి వచ్చెనని వగవరాదు
వలవని వాదుకు పిలువరాదు
వంచనగా వడ్డించరాదు

పేదల కాస జెప్పరాదు
పెద్దల మది నొప్పించరాదు
బీదల హాస్యము సలుపరాదు
బిచ్చగానికి అడ్డము పోరాదు

ఈ కీర్తనలో బుద్ధిమంతులైన వారు ఎలా సత్ప్రవర్తన కలిగి ఉండాలో సారంగపాణి సవివరంగా నీతి బోధ చేశాడు.

భగవంతునిమీద నిజమైన భక్తి లేకుండా, బ్రతుకు తెరువుల కోసం, గొప్పలకోసం కాషాయవస్త్రాలు, రుద్రాక్షలు మొదలైనవి ధరించి కపట సన్యాసి వేషాలతో తిరిగే దొంగ భక్తులను, వ్రతాలు, నోములు, పూజలు చేసే ఆటోప భక్తులను నిరసిస్తూ —

'భక్తి లేని వ్రతము లెన్ని చేసిన ఫలము లేదు సుమ్మీ
రక్తులమని వేసాలు ధరించుక
రహించి వేణుగోపాలుని పాద

జడలు వెనక జీరాడిననేమి
జాహ్నవి లోపల మునిగిన నేమి
కడుపు గట్టి నటియించిన నేమి

కావి వస్త్రము గట్టిన నేమి
కండ్లు మూసుకొని గొణగిన నేమి
లావుగా తిరుమణి మెత్తిన నేమి
లక్షతులసి నర్పించిననేమి

మేనినింత భస్మమలదిన నేమి
మెడల రుద్రాక్షలు పూనిన నేమి
నానా భూముల తిరిగిన నేమి
నదులు నిధులు గనుగొంటే నేమి'

అని నిజమైన భక్తి ఉండాలి గానీ వేషధారణ ముఖ్యం కాదు అని నీతిబోధ చేశాడు.

ఇలాగే పదకవితా పితామహుడైన అన్నమాచార్యులుకూడా-

'హరిభక్తి గలిగితే అన్నియు ముఖ్యముగాక
విరహాచారములెల్ల వృథా వృథా

పులులు గుహలనుండు పోలింప ఋషులా
యెలుగు గడ్డము పెంచు నింతలోనే యోగ్యుడా
ఇల పక్షులాకాశాన కెగిరే దేవతలా
ఒలసి కోతి యడవి నుంటే వనవాసమా'

అనే కీర్తనలో భక్తిలేని బాహ్య వేషాలను, బాహ్య వ్రతాలను ఖండించాడు. ఇలాగే త్యాగరాజు కూడా —

'తెలియలేరు రామభక్తి మార్గమును
ఇలనంతట తిరుగుచును కలువరించెదరుగాని

వేగ లేచి నీట మునిగి భూతి పూసి
వేళ్ళ నెంచి వెలికి శ్లాఘనీయులై
బాగుగ పైక మార్జన లోలురై
రేగాని త్యాగరాజనుత'

అనే కీర్తనలో నిజమైన మార్గాన్ని తెలుసుకోలేక భూమండలమంతా తిరిగి తీర్థయాత్రలు చేస్తూ తెల్లవారుఝామున వేగమే నిద్ర

లేచి, చన్నీళ్ళలో మునిగి, విభూతి పూసుకొని, జపమాల త్రిప్పుతూ పైకి భక్తులుగా పొగడ్తలందుకొంటూ లోలోపల ప్రజల నుంచి డబ్బులు లాగుతూ బ్రతికే సోమరి భక్తులను, కపట భక్తులను గమనించి, ఆవేదన చెంది పదకర్త వారికి నీతిబోధ చేయడం వ్యక్తమవుతుంది.

పదకవులందరూ సంఘ శ్రేయస్సు కోసమే పదాలను దైవాంకితం చేసి రచించారు. ప్రజలకు నిత్యానిత్య వివేకజ్ఞానాన్ని భక్తి తత్వాన్ని, భగవన్మహిమలను బోధించి వారిని తరిపజేసి తామూ తరించడమే వారి ప్రధాన ధ్యేయం, సారంగపాణి కూడా అదే ధ్యేయంతో తన ఇష్టదైవమని వేణుగోపాలస్వామిపైన భక్తి, శృంగారాత్మకంగా పదాలను రచించి ప్రసిద్ధుడయ్యాడు. మహావిష్ణువునకు ఎన్ని అవతారాలున్నా, అన్ని అవతారాలోను తన ప్రియదైవమైన వేణుగోపాలునే దర్శించాడు. పదసాహిత్యంలో త్యాగయ్య నారదుని వంటి దేవఋషి అయితే క్షేత్రయ్య వాల్మీకివంటి మనుష్య ఋషి అంటారు. మరి సారంగపాణి పాటలలో ఇలాంటి ఋషిత్వ చ్ఛాయలు కనిపించకపోయినా రాగాలు, తాళాలు, పల్లవి, అనుపల్లవి, చరణాలు పరస్పర అనుబంధితమై ఉండి అతని సహజ కవితా సామర్థ్యాన్ని వ్యక్తం చేస్తుంటాయి. అందుకే వేణుగోపాలాంకితమైన సారంగపాణి పదాలకు కూడా పద సాహిత్య లోకంలో సముచిత స్థానం ఉన్నది.

సమాలోచన (అక్టోబరు, 1988)



# తత్త్వ కవుల బోధనలు

మోక్ష సాధనాలైన భక్తి, జ్ఞాన, కర్మ మార్గాలలో జ్ఞాన మార్గం అత్యంత క్లిష్టమయింది. లోక వ్యవహారంలో ఈ జ్ఞానాన్ని వేదాంతం అని పిలుస్తారు. శిష్టులైన వారు బ్రహ్మవిద్యను చాలా పవిత్రంగా భావించారు. అందుకే ఈ విద్యను వారు సంస్కృతం నుండి ఇతర భాషలలోకి అనువదించలేదు. కానీ అది మౌఖిక ప్రచారంతోనే వ్యాప్తి చెందింది. పామరులు కొందరు అందులో ఉన్న విజ్ఞానాన్ని గ్రహించి తమకు నచ్చిన విధంగా గేయాలుగా పాడుకొన్నారు. ఈ గేయాలలో తత్త్వ విషయాలుండటం వల్ల వీటికి తత్త్వాలనీ, తత్త్వ గేయాలనీ పిలుస్తారు.

పండిత వర్గంతో గాని, రాజాస్థానాలతోగానీ ఏమాత్రం సంబంధం లేని పామరజనం ముక్తిని పొందడం కోసం అన్నమాచార్యులు, క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య మొదలైనవారు చూపిన సంకీర్తన మార్గంలోని వైరాగ్య పదాల పద్ధతిని తత్త్వకవులు అవలంభించారు. 13వ శతాబ్దంలో సింహాచలంలోని కృష్ణమాచార్యుల గేయాలను, 15, 16 శతాబ్దాలలో తిరుపతిలో వెలసిన తాళ్ళపాకవారి అధ్యాత్మ సంకీర్తనలను ప్రాతిపదికలుగా తీసుకొని తరువాతి కాలంలో తత్త్వకవులు కాలజ్ఞాన తత్త్వాలు, ఆత్మ బోధామృత తత్త్వాలు, అచలమత (యోగమత తత్త్వాలు) తత్త్వాలు అనే పేర్లతో అధ్యాత్మిక ప్రబోధలు కలిగించే కీర్తనలను రచించారు. ఈ తత్త్వకర్తలలో చాలామంది బ్రాహ్మణేతరులున్నారు.

అచల మతానికి సంబంధించిన తత్త్వాలు వ్రాసిన వారిలో మొదటివారు పోతులూరి వీరబ్రహ్మం. బ్రహ్మంగారి శిష్యులు,

ప్రశిష్యులు, అనుయాయులు ఆ మార్గంలోనే తత్త్వ సాహిత్యాన్ని అభివృద్ధి చేశారు. సిద్ధర్ పాడల్‌గళ్, సిద్ధరపదగళు అనే పేర్లతో తమిళ కన్నడ దేశాలలో ఇటువంటి తత్త్వాలున్నాయి. అచల మతావలంబకులకు పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాలు ప్రమాణ గ్రంథం. వీరబ్రహ్మంగారు స్వయంగా చెప్పిన తత్త్వాలు కొన్ని, అతని ముఖ్య శిష్యుడు దూదేకుల సిద్ధయ్యగారు, బ్రహ్మంగారి మనుమరాలు ఈశ్వరమ్మగారు, యాగంటి లక్ష్మమ్మగారు, ఇంకా బ్రహ్మంగారి శిష్యులు, ప్రశిష్యులు, భక్తులు మొదలైన అనేకులు రచించిన తత్త్వాలన్నిటినీ చేర్చి కాలజ్ఞాన తత్త్వాలు అనే పేరుతో అచల మతావలంబకుడు అయిన పరిమి వీరాచార్యులు తన రచనలతో చేర్చి కూర్చారు.

## బ్రహ్మంగారి తత్త్వాలలో ముఖ్యమైనవి, ప్రచారంలో ఉన్నవి

"తియ్యని మామిడిపండు తినబోతే దొరకాదు"

"ఈ జన్మమిక దుర్లభమురా ఓరి సాజన్మ సాకార
సద్గురుని కనరా"

"కోటలాటి కోట జగతిలో ఏ కోటా లేదు"

"ఇల్లు వాకిలి నాది, ఇల్లాలు నాదనుచు
ఏల భ్రమసితివయ్యో మనసా"...

చిల్లర రాళ్ళకు మొక్కుచునుంటే
చిత్తము చెడునోరే ఒరే ఒరే
చిత్తము నందున చిన్మయ రూపుని
చూచుచు నుండుట సరేసరి

దూదేకుల సిద్ధయ్యగారి తత్త్వాలలో ప్రసిద్ధమైనది :

"ఏకులమని నను వివరమడిగితే
ఏమని చెల్పుదు లోకులకూ
పలుగాకులకు, దురాత్ములకు, ఈ దుష్టులకు
ఫాలభాగమున యీలలు బాడుచు
భావము కన్నది నాకులము
ఆనందమైనా పరబ్రహ్మ శాల్వ
కప్పుకొని జగమంతట
నిండియున్నదే నాకులము - ఒంటరిగాదే నాకులము.

ఏగంటివారు :

కొన్ని గ్రంథాలలో ఏగంటివారు, యాగంటివారు, అగంటి వారు అనే పేర్లు కనిపిస్తాయి. తత్త్వాలన్నిటిలోను కొంత భాషా సౌష్ఠవం కలిగి, భావం స్పష్టంగా ఉన్న రచనలు ఏగంటివారివే. ఈ తత్త్వాల చివరి చరణంలోని ముద్ర యాగంటి ఈశ అనిగానీ, యాగంటి గురుడు అని గానీ ఇదమిత్థంగా చెప్పడానికి వీలు లేదు.

ఏగంటివారి పదం :

"ఆనందమయుడు గావలెను
మనసు పదిలము సేయవలెను.
ఈ తనువు లోపలి తెలివి తానె కనవలెను

కనుచూపు లొకటి గావలెను
అందు ఘన చిదానందలింగము కానవలెను
ఆ యెడను హంస గానవలెను ఆత్మ
బాయక ఏగంటి గురు పదవి గనవలెను"

ఈ పదంలో యోగశాస్త్ర విషయాలు, యోగవిద్యాభ్యాసక్రమం చెప్పబడింది.

సంబోధన పదాలతో కూడిన ఏగంటివారి తత్త్వాలు :

"శివ శివ యన మేలు తుమ్మెదా
శివుడంటే నే విన మేలు తుమ్మెదా
శ్రీకంఠుడను వూవు తుమ్మెదా
మూడు లోకమ్ము లాయెను తుమ్మెదా'

"సిచ్చ సిచ్చిగాల మెల్లబుచ్చక
సచ్చిదానందమైన శివుండలంచవె మనసా"

ఆత్మ బోధామృత తత్త్వాలు అనే పేరుతో ఇంకొక తత్త్వాల పుస్తకం ఉన్నది. అందులో తత్త్వాలను రచించినవారు ఎడ్ల రామదాసు, తిరునగరి కృష్ణుడు, నారాయణ హరిదాసు మొదలైనవారు. 19 వ శతాబ్దం చివరి భాగంలో కాకినాడలో ఉండిన తత్త్వకర్త ఎడ్ల రామదాసు. బ్రహ్మంగారి తత్త్వాల తరువాత ఎడ్ల రామదాసుగారి తత్త్వాలకు బహుళ ప్రచారం ఉన్నది. ఇతడు 110 కీర్తనలతో 'సుజ్ఞాన చంద్రిక' అనే గ్రంథాన్ని రచించాడు. ఈ సుజ్ఞాన చంద్రికతో పాటు ఎడ్ల రామదాసుగారి శిష్యులు కొందరు తాము రచించిన తత్త్వాలకు కూడా చేర్చి 'ఎడ్ల రామదాసు చరిత్ర' అనే పేరుతో గ్రంథాన్ని ప్రకటించారు. ఎడ్ల రామదాసు రచనలన్నీ తత్త్వాలు మాత్రమే కావు. చాలా పాటలు సంకీర్తన పద్ధతిలో సాగాయి. ఇందులో భజన పాటలు, మేలుకొలుపులు, జోలలు, మంగళహారతులు, గురు శిష్య సంవాద గేయాలు, వేంకటేశ్వరుడు, రంగనాథుడు, రాముడు, కృష్ణుడు, ఈశ్వరుడు, త్రిపురసుందరి, వినాయకుడు మొదలైన

పేర్లతో కొలిసిన పరబ్రహ్మన్ని గూర్చిన కీర్తనలు కూడా ఉన్నాయి. బాగా ప్రచారంలో ఉన్న ఎడ్ల రామదాసుగారి కీర్తనలు :

"జీవమా మేలుకొనవే
మేలుకొనవే నెరిజీవమ - చాలు నీకిలలోన సౌఖ్యము"

"ఎన్ని మాయలు నేర్చినాడమ్మ - యశోద నీ కొడు
కన్నిటికి నెరజాలు నోయమ్మా"

"అండ పిండ బ్రహ్మాండము నిండంగ పండించినారము
పుండరీకాక్షుని నామము, ఈ పుడమి నంతట చల్లినారము"

"ఏమి జన్మం బేమి జీవనమూ - ఈ మాయ కాయము
ఏమి జన్మము యేమి జీవన మేమి
శాశ్వత మేమి సౌఖ్య మిదేమి నా ప్రారబ్ధ కర్మము"

అన్నమాచార్యులు, త్యాగరాజు, రామదాసు మొదలైన ప్రసిద్ధ వాగ్గేయకారుల సంకీర్తనలలో కూడా ఇటువంటి తత్త్వాలున్నాయి. ఇవి ఎక్కువగా తుమ్మెదా, చిలుక, హంస, జీవ, మనసా, కర్మమా, చిత్తమా, మొదలైన సంబోధనాంత పదాలతో ఉంటాయి.

"తొల్లింటివలె గావు తుమ్మెద ఇంక
నొల్లవుగా మమ్ము నో తుమ్మెదా"

"జీవాత్మవై యుండు చిలుకా, నీ
వావలికి పరమాత్మవై యుండు చిలుకా"

"పారకుమీ వో మనసా, పంతము విడువకుమీ మనసా
పారిన నీవే బడలయ్యెదవు చేరువ నాకె చెప్పవె మనసా"

ఇవి అన్నమాచార్యుల సంకీర్తనలలో ఉన్న తాత్త్విక గేయాలు.

సాధారణంగా ఈ తత్త్వాలలో గురుభక్తి, అహింస, నీతిబోధ, సంఘ సంస్కరణ, కులతత్త్వనిరసన, మూఢాచార నిర్మూలన, వైరాగ్య బోధ, సత్ప్రవర్తన, ఆత్మ నివేదన మొదలైన విషయాలు ప్రతిపాదించబడతాయి. ఈ తత్త్వాలలోని పరమార్థం వెంటనే స్ఫురించకపోయినా పామర జనం మాత్రం ఆ సంకేత పదాలకు ఆకర్షితమై వినోదం పొంది వాటిని గానం చేస్తూ ఏ గురువు ద్వారానో, పండితుల ద్వారానో, పరమార్థాన్ని తెలుసుకొంటారు. నేటికీ ఆంధ్రదేశంలో అక్కడక్కడా కొంతమంది బైరాగులు, బిచ్చగాళ్ళు ఏకతార మీటుకుంటూ, తత్త్వాలు పాడుకుంటూ తిరుగుతుంటారు.

రోజు రోజుకూ అధర్మం, అన్యాయం, అకృత్యం మితిమీరి పోతున్న ఈ రోజుల్లో చాలామంది ధనబలం, జనబలంవల్ల అహంకారం, వ్యసనలోలత్వం, లౌకిక వాంఛలపట్ల అత్యాశ మొదలైన అశాశ్వతమైన, అనారోగ్యకరమైన విషయాలలో మమకారం పెంచుకొని సత్యాన్ని, ధర్మాన్ని, దయాగుణాన్ని తృణీకరిస్తుంటారు. నాస్తికభావాన్ని ప్రచారం చేస్తూ ప్రజలను ఉద్రేకపరుస్తుంటారు. దానివల్ల మానవునిలో భయభక్తులు లోపించి పోయి ఎన్ని దుష్టకార్యాలకైనా అతడు పూనుకొంటున్నాడు. అయినా ప్రతి మానవుడు కూడా చరమదశలో ఈ తత్త్వాల సారాన్ని గ్రహించి ఇంతకాలం లౌకిక మోహాంధకారంలో మునిగి జ్ఞానదీపాన్ని దర్శించలేకపోయామే అని పశ్చాత్తాపపడక తప్పదు. కాబట్టి ప్రతి మానవుడు మొదటి నుండి కూడా ఏది సత్యం, ఏది అసత్యం అనే వివేచన బుద్ధితో పరికించి భగవంతుని ధ్యానిస్తే తుది జీవితంలో దుఃఖ పడవలసిన అవసరం ఉండదు. అప్పుడే మానవ జీవితానికి అర్థం, పరమార్థం ఉంటుంది.

'కోస్తావాణి' దినపత్రిక (11-6-1989)

# నాద జ్యోతి - ముత్తుస్వామి దీక్షితులు

మన దక్షిణభారతదేశంలో ప్రసిద్ధికెక్కిన సంగీత త్రిమూర్తు లలో ప్రథముడు త్యాగయ్య, ద్వితీయుడు ముత్తుస్వామి దీక్షితులు, తృతీయుడు శ్యామాశాస్త్రి. జీవితకాలాన్ని బట్టి వీరిని ఇలా విభజించినా వీరు ముగ్గురూ తమతమ ప్రత్యేకతలతో సంగీత సామ్రాజ్యాన్ని ఏలిన వాగ్గేయకార చక్రవర్తులే. వీరి ముగ్గురి జన్మస్థలం కూడా తంజావూరులోని తిరువాయూరు. వీరు ముగ్గురు తమ కమ్మని కంఠా లతో ప్రజల హృదయాలను రంజింపజేసిన మధుర గాయకులు. సంసార సౌఖ్యాలను తృణీకరించిన పరమ భక్తులు.

ఆంధ్ర, తమిళ, కర్ణాటక దేశాలలో 'వాతాపి గణపతిం భజే' అనే కీర్తనను వినవివారుండరు. దేవాలయాలలో, సంగీత సభలలో గాయనీ గాయకులు పాడే తొలి పాట ఇదే. ఇది సంస్కృత కీర్తన అయినా ఆబాలగోపాలాన్ని ఆనందాంబుధిలో ఓలలాడించగలిగిన శ్రావ్యత, సామర్థ్యం ఈ పాటకు ఉంది. ఇంతటి కర్ణామృతమైన ప్రతిభావంతమైన కీర్తన వ్రాసిన వాగ్గేయకారుడే ముత్తుస్వామి దీక్షితులు. తంజావూరు నాయకురాజుల పరిపాలనలో సంగీత సాహిత్య పోషకుడైన రఘునాథ నాయకుని కొలువులో చతుర్దండి ప్రకాశిక అనే సంగీత గ్రంథాన్ని రచించిన వేంకట మఖికి మాతుల పౌత్రుడు వేంకట వైద్యనాథ దీక్షితులు. ఇతని బంధువు, సంగీత శిష్యుడు రామస్వామి దీక్షితులు. ఇతడు గొప్ప సంగీతవేత్త; హంసధ్వని రాగానికి కర్త కూడా ఇతడే. ఈ రామస్వామికి, అతని ధర్మపత్ని సుబ్బమ్మకు మన్మథ నామ సంవత్సరం 1775 మార్చి 24 వ తేదీన ముత్తుస్వామి జన్మించాడు. ఇతడు తంజావూరు జిల్లాలోని వైదీశ్వ రాలయంలో ఉన్న ముద్దుకుమారస్వామి అనుగ్రహంవల్ల జన్మించడం

చేత తమ పుత్రునికి ముద్దుస్వామి అని నామకరణం చేశారు. కాల క్రమేణ ఈ పేరు ముత్తుస్వామి దీక్షితులుగా ప్రసిద్ధికెక్కింది. తమిళులు ఇతనిని ముత్తుస్వామి దీక్షితర్ అని అంటారు.

ఇతడు పదహారు సంవత్సరాలు పూర్తి అయ్యేసరికి వేదాధ్యయనంలోను, వ్యాకరణ ఛ్ఛందో జ్యోతిషాది వేదాంగపఠనంలోను, కావ్యాలంకార శాస్త్రాలలోను, మంత్ర, యోగ శాస్త్రాలలోను, పాండిత్యాన్ని సంపాదించాడు. ఇతడు వివాహితుడైన తరువాత మణలి చిన్నయ్య ముదలారి దగ్గర ఉన్నప్పుడు చిదంబరనాద యోగి అనే మహాసిద్ధుడు మణలికి వచ్చి దీక్షితుల భక్తి ప్రపత్తులకు, విద్యాగరిమకు, వినయ విధేయతలకు మెచ్చుకొని మహామంత్రం ఉపదేశించాడు. ఉపదేశం పొందిన తరువాత దీక్షితులు చిదంబర యోగితో కలసి కాశీయాత్ర చేసి అక్కడ ఐదేళ్ళవరకు మంత్రావృత్తి చేసి అష్ట మహాసిద్ధులను సంపాదించాడు. ఒకనాడు గురువు అనుమతితో గంగానదిలో స్నానం చేసి కళ్ళు మూసుకొని ధ్యానం చేస్తూ, చేతులు చాచి తన కోరికను వెల్లడించుకోగా తన చేతుల్లోకి వీణ వచ్చి నిలిచింది. తరువాత తిరిగి మణలికి వచ్చి దేవతా తృప్తికోసం అంతర్యాగాలను, బహిర్యాగాలను నిర్వర్తించాడు.

మరి కొన్నాళ్ళకు తిరుత్తణికి వచ్చి సుబ్రహ్మణ్యేశ్వరుని సన్నిధిలో మహామంత్రాన్ని జపించుకొంటున్నప్పుడు సుబ్రహ్మణ్యస్వామి ఒక మహాపురుష రూపంలో దర్శనమిచ్చి దీక్షితులను నోరు తెరువమని, నోటిలో కండచక్కెర వేసి అంతర్ధానమయ్యాడు. తక్షణమే దీక్షితులు సద్యస్స్ఫూర్తితో మాళవ గౌళరాగంలో ప్రథమా విభక్త్యంతంతో 'శ్రీనాథాది గురు గుహో జయతి' అనే సంస్కృత సంకీర్తన రచన ప్రారంభించాడు. దీని తర్వాత ఒక్కొక్క

విభక్తికి ఒక్కొక్కటి చొప్పున ఏడు విభక్తులలో కూడా ఏడు - కీర్తనలను గురుగుహాంకితంగా రచించాడు. తన సోదరులైన చిన్న స్వామి, బాలస్వామిలతో కలసి కాంచీపురంలో నాలుగేళ్ళు నివాసం ఏర్పాటు చేసుకొని శ్రీ కామాక్షి సన్నిధిలో శ్రీవిద్యోపాసన చేసుకొంటూ 'కంజదళాయతాక్షి', 'ఏకామ్రనాథం భజేహం' మొదలైన అనేక కీర్తనలను రచించాడు. కంచిలోని ఉపనిషద్ బ్రహ్మ స్వాములతో వేదాంత విచారణ చేసిన సందర్భంలో ఆ స్వాముల వారు రచించిన రామాష్టపదులకు వర్ణక్రమంతో రాగతాళాలను ఏర్పరచారు. ఆ తరువాత దీక్షితులవారు తిరువాయూరులో వెలసిన శ్రీ త్యాగరాజస్వామి, ఆనందేశ్వర, సిద్ధేశ్వర, అచలేశ్వర, హాట కేశ్వర, వల్మీకేశ్వర మొదలైన దేవతలమీద, ఆ క్షేత్రాలలో వెలసిన షోడశ గణపతులమీదను కీర్తనలు రచించాడు. వీటిలో మిక్కిలి ప్రసిద్ధమైన కీర్తన హంసధ్వని రాగంలో రచించిన 'వాతాపి గణపతిం భజే' కీర్తన. దీనితోపాటు శ్రీ మహాగణపతి, పంచమాతంగముఖ, శ్రీ మూలాధార అనే కీర్తనలు కూడా ప్రసిద్ధమైనవి.

దీక్షితులవారు చోళమండలంలోని శివ, విష్ణుక్షేత్రాలలో వెలసిన దేవతలమీద, పంచలింగ క్షేత్రాలలో వెలసిన ఈశ్వర మూర్తులమీద, కాశీ, మధుర, మొదలైన క్షేత్రాలలో వెలసిన దేవతలమీద సంస్కృత సంకీర్తనలను వ్రాశాడు.

దీక్షితులవారు తన గురువుతో కలసి కాశీయాత్రకు వెళ్ళి అక్కడ ఉన్న ఉత్తర హిందూస్తానీ సంగీత రీతులతో ప్రత్యక్ష పరిచయం సంపాదించుకొన్నారు. దాని ప్రభావం అతడు ఎన్నుకొన్న యమునా కల్యాణి, జయ ద్విజావంతి, బృందావనీ సారంగ, భీమ పలాసి (కర్ణాటక బేహాగ్) మొదలైన రాగాలలో గోచరిస్తుంది. సంస్కృత భాషా ప్రయోగంలో ఇతనికి అపారమైన సామర్థ్యం ఉంది.

అన్ని కీర్తనలలోను అద్వైతపరమైన వేదాంత తత్త్వం అంతర్వాహినిగా ప్రవహిస్తుంది. ఇతడు రచించిన నవగ్రహ కీర్తనలలో ఇతని కున్న జ్యోతిషశాస్త్ర పాండిత్యం స్పష్టమవుతుంది.

"సూర్యమూర్తే నమోస్తుతే సుందర ఛాయాధిపతే
కార్య కారణాత్మక జగత్ప్రకాశ సింహరాశ్యాధిపతే"

అనే కీర్తన సూర్యదేవునిమీదను,

'చంద్రం భజమానస
సాధు హృదయ సదృశం'

అనే కీర్తన చంద్రుని మీదను, రచించినవి. ఇలాగే తక్కిన గ్రహాలమీద కూడా కీర్తనలు రచించాడు. ఒకసారి దీక్షితులవారి శిష్యుడైన తంబియప్పన్‌కు తీవ్రమైన కడుపునొప్పి వచ్చింది. ఎంతో మంది వైద్యులు ఎన్నోరకాలైన మందులిచ్చారు. కానీ ఉపశమనం కాలేదు. చివరికి ఒక జ్యోతిష్కుడు ఇతని జాతకాన్ని పరీక్షించి ఇతనికి బృహస్పతి, శనిగ్రహాలు సరిలేవని చెప్పాడు. అప్పుడు దీక్షితులు గ్రహాలను శాంతింపజేయుటం కోసం బృహస్పతిపైన —

"బృహస్పతే యరావతే బ్రహ్మజాతే నమోస్తుతే"

అనే కీర్తనను, శనిగ్రహంపైన —

"దివాకర తనూజం శనైశ్చరం
ధీరతరం సంతతం చింతయేహం"

అనే కీర్తనను పాడగానే తన శిష్యుని కడుపునొప్పి మటుమాయమయింది. ఇతడు దేవీ మూర్తులను, దేవతా మూర్తులను వర్ణిస్తూ చేసిన వివిధ కీర్తనలలో ఇతని మంత్ర, శాస్త్ర పాండిత్యం

వ్యక్తమవుతుంది. ఉదా॥ 'నీలోత్పలాంబికాయై నమస్తే జగదాంబికాయై' మొదలైన కీర్తనలు.

మొత్తంమీద ఇతని కృతులు పండితులకు ఆస్వాదయోగ్యమైనట్లు సామాన్య ప్రజలకు సుగ్రాహ్యం కావు. వారు సాలోచనగా ఆద్యంతం అనుభవిస్తే గాని ఇతని కీర్తనలు రక్తికట్టవు. త్యాగరాజ కృతులు మాధుర్యగుణానికి చెంది ఆత్మాశ్రియరీతిలో ఉంటాయి. దీక్షితుల కృతులు సమానఘటితమైన శ్లిష్టతరమైన ఓజోగుణానికి చెంది వస్త్వాశ్రయరీతిలో ఉంటాయి. త్యాగయ్య హృదయం 'సోహం బ్రహ్మాస్మి' అనే తత్త్వంలో జీర్ణించినందువల్ల ఆ బ్రహ్మజ్ఞానంతో సకల దేవతలను దర్శించి నిర్వికార చిత్తవృత్తితో ఉదాత్తంగా సర్వలక్షణ లక్షితంగా వర్ణించడం ఇతని మార్గం. ఇతని కీర్తనలలో లయాత్మక గుణం తక్కువ. కాని రాగ సంచారం, గమక విశేషం గానం చేసే సమయంలో శ్రోతలను మైమరపింపజేస్తాయి. దీక్షితులు తన రచనలలో రాగముద్ర, వాగ్గేయకారముద్ర, క్షేత్రముద్ర, ప్రబంధముద్ర, రాజముద్ర మొదలైన అష్టాదశ ముద్రలను ప్రవేశపెట్టాడు. ఇదే తక్కిన వాగ్గేయికారులలో లేని, ఇతనిలో ఉన్న ప్రత్యేకత.

దీక్షితులవారి ఇద్దరు తమ్ముళ్ళలో చిన్నస్వామి అకాల మరణం చెందడం వల్ల చిన్న తమ్ముడు బాలస్వామి భ్రాతృ వియోగం భరించలేక హరి అనే శిష్యునితో కలసి రామేశ్వర యాత్రకు బయలుదేరాడు. ఆ యాత్ర ముగించుకొని తిరిగి వచ్చేటప్పుడు ఎట్టయాపుర సంస్థాన ప్రభువులను కలుసుకొని అతని చేత సత్కారం పొందాడు. ముత్తుస్వామి దీక్షితులు తన కొడుకుతో సమానమైన చిన్న తమ్ముడు అదృశ్యమయ్యాడనే దుఃఖంతో తన ఇద్దరు భార్యలను, సుబ్రహ్మణ్యడనే శిష్యుని వెంట పెట్టుకొని దేశాటనం చేస్తూ అక్కడక్కడా

తమ్ముని కోసం వెదకసాగాడు. ఆ సమయంలో ఒక వైష్ణవ బాలుని ద్వారా శాత్తూరులోని పెరుమాళ్ళ మంటపం వద్ద తిరువారూరు నుంచి వచ్చిన బాలస్వామి అనే విద్వాంసునికి ఎట్టయాపురపు రాజు పెండ్లి చేయిస్తున్నాడని దీక్షితులవారు తెలుసుకున్నారు. అప్పుడు ఎంతో ఆనందంతో మేఘరంజని రాగంలో 'వేంకటేశ్వర ఎట్టప్ప భూపతి మాశ్రయేహం' అనే కీర్తన పాడి తన వెంటనున్న శిష్యునికి కూడా నేర్పించాడు.

దీక్షితులు అక్కడినుండి ప్రయాణమై ఎట్టయాపురానికి వెళ్ళుతూ ఉన్నప్పుడు దారిలో వానలేక ఎండిపోయిన పంటపొలాల్ని చూసి ఆవేదనపడి అమృతవర్షిణి రాగంతో

"ఆనందామృత కర్షిణి అమృత వర్షిణి
హరాది పూజితే శివే భవాని
శ్రీగురు గుహజనని చిద్రూపిణి

సానంద హృదయ నిలయే సదయే
సద్యః సువృష్టి హేత వేద్యాం
సంతతం చింతయే అమృతేశ్వరి
సలిలం వర్షయ వర్షయ వర్షయ"

అనే కీర్తన పాడసాగాడు. వెంటనే ఆకాశంపై మబ్బులు క్రమ్మి రేగడి నేలపై వర్షం కురిసింది. రేగడినేలలో దూసుకొని పోయిన బండిని ఎలాగో కష్టపడి బండిలాగుకొని సాయంకాలానికి ఎట్టయాపురం చేరి ప్రాణసమానుడైన తమ్ముని కలుసుకొని పరమానందం చెందాడు. ఎట్టయాపుర రాజు ముత్తుస్వామి దీక్షితుల వారిని చూచి 'నాదజ్యోతి ముత్తుస్వామి దీక్షితులవారికి స్వాగతం' అంటూ ఎదురేగి తన ఆస్థానానికి పిలుచుకొని వచ్చాడు. రాజు మేఘరంజని

కీర్తన విని దీక్షితులవారిని ఎంతో మెచ్చుకొని బహు విధాలా సన్మానించాడు. తరువాత బాలస్వామి వివాహాన్ని అతి వైభవంగా జరిపించాడు. ఈ బాలస్వామి దీక్షితుల దత్తపుత్రుడే. సంగీత సంప్రదాయ ప్రదర్శిని అనే గ్రంథాన్ని రచించిన సుబ్బరామ దీక్షితులు. దీక్షితులు తమ్ముని పెండ్లి అయిన తరువాత తిరువారూరుకి వెళ్ళారు. తరువాత కొన్నాళ్ళకు ఎట్టయాపురపు రాజు 1835 వ సంవత్సరంలో తనకుమారుని వివాహానికి రమ్మని ఆహ్వానం పంపటం దీక్షితులవారు అక్కడికి వెళ్ళారు. అతడు వెళ్ళిన మూడు మాసాలకు బంధుమిత్రులందరికీ తనకు అవసానకాలం సమీపించిందని తెలియజేశాడు. ఆ ప్రకారంగా ఇతడు మన్మథనామ సంవత్సరం, తులా కృష్ణ చతుర్దశి నాడు రెండుచేతులూ పైకెత్తి అంజలి ఘటించి "శివే పాహి" అంటూ జగదీశ్వరిలో కలిసిపోయాడు.

విధి విలాసం వల్ల ఈ మహాభక్తుడు ఇద్దరు స్త్రీలకు భర్త అయినా సాంసారిక విషయాలలో ఏ మాత్రం తగుల్కొనలేదు. నిరంతరం దేవీ ఉపాసనలోనే కాలం గడిపేవాడు. ఇతడు తన ఉపాసనల చేత దేవీ అనుగ్రహం పొంది ఆ దేవత ద్వారా "వీణ" వాద్యాన్ని పొందగల్గిన ఘనుడు. కర్ణాటక సంగీత సామ్రాజ్యంలో త్యాగరాజు నాదబ్రహ్మగా కీర్తి కెక్కితే, ముత్తుస్వామి దీక్షితులు నాదజ్యోతిగా కీర్తి కెక్కాడు.

'కోస్తావాణి' (19-7-1988)



# దేవీ ఉపాసకుడు - శ్యామాశాస్త్రి

సంగీత త్రిమూర్తులను గూర్చి లోకానికి తెలియజేసినవారు సుప్రసిద్ధ సంగీత శాస్త్రవేత్త, గ్రంథకర్త అయిన సాంబమూర్తిగారు. ఇతడు శ్యామాశాస్త్రిని గూర్చి 'వడదేశవత్తు వడమాల్' అంటే దక్షిణ దేశంలో తమిళం మాట్లాడే బ్రాహ్మణుడని వ్రాశారు. సుబ్బరామ దీక్షితులవారుకూడా తన 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' అనే గ్రంథంలో శ్యామాశాస్త్రి ద్రావిడ బ్రాహ్మణులలో ఔత్త రాహకులని వ్రాశారు.

శ్యామాశాస్త్రులవారి పూర్వీకులు కాంచీనగరం వచ్చి శంకరాచార్యులవల్ల అక్కడి బంగారు కామాక్షీదేవి విగ్రహానికి అర్చకత్వం వహించారు. విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత కంచి తురుష్కుల దండయాత్రలకు లోనైనప్పుడు ఆ కుటుంబంవారు దేవి విగ్రహంతో దేశ దేశాలు తిరిగి చెంజి, ఉదయార్ పాళెం, అన్నాకుడిలో కొన్నాళ్ళుండి చివరికి తులజాజీ మహారాజు కాలంలో అతని ఆదరం సంపాదించి తంజావూరులో కామాక్షీదేవి ఆలయం కట్టించాడు.

శ్యామాశాస్త్రుల తండ్రిపేరు విశ్వనాథశాస్త్రి. ఇతనికి 25 సం॥ల వయస్సులో 1762 సం॥లో తంజావూరులోని తిరువాయూరు గ్రామంలో జన్మించాడు. ఒకసారి ఆ ఊళ్లో వేంకటేశ్వర సమారాధన జరుగుతున్నప్పుడు ఒక వృద్ధ బ్రాహ్మణుడు దేవతావేశంతో విశ్వనాథశాస్త్రుల సతీమణిని చూచి వచ్చే సంవత్సరం. చైత్రమాసంలో కృత్తికా నక్షత్రంలో పుట్టిన బాలునికి వెంకటసుబ్రహ్మణ్యం అని నామకరణం చేశారు. ఈ బాలుని తల్లిదండ్రులు ముద్దుగా 'శ్యామకృష్ణా' అని పిలుచుకొనేవారు. బంగారు కామాక్షీ

దేవి వీరి ఇంటి ఆడపడుచుగా ప్రతీతి కాబట్టి శ్యామాశాస్త్రి చేసిన దేవీ కీర్తన లన్నిటిలోను 'శ్యామకృష్ణ సహోదరి' అని ప్రయోగించి తద్వారా అతను తన రచనలలో స్వనామ ముద్ర వేసుకొన్నాడు. ఇతడు సంస్కృతాంధ్రాలలో మంచి ప్రావీణ్యం సంపాదించాడు. వారి కుటుంబంలో సంగీత దృష్టి లేకపోయినా శ్యామాశాస్త్రులవారు మేనమామ అతనికి బాల్యంలో సరళీలు మొదలుకొని స్వరజ్ఞానం వరకు అన్నీ నేర్పించాడు.

ఒకసారి ప్రసిద్ధ సంగీత శాస్త్రవేత్త అయిన సంగీత స్వామి యాత్రార్థియై తంజాపూరు వచ్చినప్పుడు శ్యామాశాస్త్రులు ఇంటికి భిక్షకు వచ్చాడు. ఆ యోగీశ్వరుడు బాలుడైన శ్యామాశాస్త్రిలో దాగిఉన్న సంగీత శక్తులను గుర్తించి, భవిష్యత్తులో అతడు గొప్ప వాగ్గేయకారుడు కాగలడని అతని తండ్రితో చెప్పాడు. ఆ సంగీత స్వామివద్ద శ్యామాశాస్త్రి మూడు సంవత్సరాలుండి సంగీత మర్మా లన్నిటిని నేర్చుకొన్నాడు. తులజాజిరాజు ఆస్థానంలో విద్వాంసుడుగా ఉండిన పచ్చిమిరియం ఆదియప్పగారి సంగీత ధోరణులను మాత్రం వినుమని అతని దగ్గర ఏమీ నేర్చుకోవద్దని గురువైన సంగీతస్వామి శ్యామాశాస్త్రికి చెప్పి, ఎన్నో సంగీత గ్రంథాలను ఇచ్చి కాశీకి వెళ్ళాడు. ఆదియప్ప శ్యామాశాస్త్రిలను ఎంతో ఆదరించి మెచ్చు కొని ముద్దుగా "కామాక్షీ" అని పిలిచేవాడు.

తండ్రి తరువాత కామాక్షమ్మను అర్చించే అధికారం శ్యామా శాస్త్రికి వచ్చింది. శ్యామాశాస్త్రిల స్వరజతులూ, తాన వర్ణాలూ, కృతులూ రానురాను ప్రసిద్ధిగాంచసాగాయి. సామాన్య రాగాలలోనే గాక అపూర్వ రాగాలలోను, అతి క్లిష్టమైన నడకలు గల తాళాల లోను అతడు సునాయాసంగా కృతులు రచించేవాడు. అతని మొదటి కృతి 'జననీ నతజన పరిపాలినీ పాహిమాం భవానీ' శ్యామాశాస్త్రికి

కామాక్షీదేవి యందున్న భక్తి అపారమయింది. దేవి సాక్షాత్కరించి శాస్త్రితో సంభాషిస్తూ ఉండేదని ఆనాటి పెద్దల ప్రవచనం. శుక్రవారపు పూజా సమయాలలో భక్తితో పరవశం చెందినప్పుడు అతని గళం నుండి అద్భుతమైన కీర్తనలు ఒక్కొక్కటి వెలువడుతుండేవి.

సంగీతమూర్తి త్రయంలో త్యాగరాజుకు, ముత్తుస్వామి దీక్షితులకు ఉన్నంత మంది శిష్యులు శాస్త్రిలవారికి లేరు. అచ్చుయంత్రాలు లేని ఆ రోజులలో వాగ్గేయకారుల కృతులకు ఎంతమంది శిష్యులుంటే అంతబాగా ప్రచారం ఉండేది. శ్యామాశాస్త్రిల క్లిష్ట తాళముల వల్లనూ, ధాతు కల్పనలో ఎక్కువ సంగతులతో సాగే కృతులు ఎక్కువగా ఉండటం వల్లనూ ఇతని దగ్గర చేరిన శిష్యులు చాలా తక్కువ. అందులోనూ చేరినవారిలో కూడా కృతులను పూర్తిగా నేర్చుకున్న వారూ తక్కువే. త్యాగరాజుకు 20 మందికి మించి శ్రద్ధాళువులైన శిష్యులుండటం చేతనూ, ముత్తుస్వామి దీక్షితులవారికి గాయకులైన ఇద్దరు సోదరులు, ఇంకా శిష్యవర్గం ఉండటం వల్ల వారి కృతులకు శ్యామాశాస్త్రి రచనలకన్నా ఎక్కువప్రాచుర్యం లభించింది. ఇతని రచనలు త్యాగరాజు కృతుల వంటి సరళ ధోరణికి చెందినవి కావు. దీక్షితుల కృతులవంటి శ్రమ సాధ్యములూ కావు. ఇతడు తెలుగు, సంస్కృతం, తమిళ భాషలలో సుమారు 400 కృతులను రచించాడు. ఆ కీర్తన లన్నిటిలోనూ దేవీ భక్తి అంత ర్వాహినిగా ప్రవహిస్తుంటుంది.

శ్యామాశాస్త్రి కొన్ని కీర్తనలలో రాగనామాన్ని కూడా పొందుపరచాడు. ఇతనికి ఆనందభైరవి రాగం పైన ప్రత్యేక అభిమానం ఉండటం వల్ల కాబోలు ఆ రాగంలో ఎక్కువగా కీర్తనలను రచించాడు. ఈ రాగంలో అతడు వ్రాసినన్ని కీర్తనలు తనకాలం

నాటివారుకానీ, తరువాతికాలంవారు కానీ వ్రాయలేదు. ఆనంద భైరవిలో 'అట' తాళంలో కంచి వరదరాజును గూర్చి 'స్వామిని రమ్మనవే' అనే కృతియొక్క రాగస్వరూపం మనోహరంగా ఉంటుంది.

తిరువాయూరులో శ్యామాశాస్త్రి తరచూ త్యాగరాజు ఇంటికి స్నేహరీత్యా వెళ్ళేవాడు. అప్పుడు త్యాగరాజు శిష్యులు 'ఈ మహాను భావుల సంభాషణలతో ఈనాడు మన భోజనం రెండు జాములు దాటిన తర్వాతనే' అని అనుకొనేవారట. శ్యామశాస్త్రి దేశయాత్ర కానీ, ఆయా క్షేత్రాల సందర్శనం గానీ చేయకుండా తంజావూరు లోనే ఉండి జీవితకాలమంతా గడిపాడు. పుదుక్కోటలో ఒకరి ప్రబోధం వల్ల మాత్రం ఇతడు తన శిష్యుడైన అలసూరు కృష్ణయ్యతో కలసి మధుర వెళ్లి తొమ్మిది కృతులను రచించి గానం చేశాడు. వీటిని 'దేవీ నవరత్న మాలిక' అంటారు. వీటిలో ప్రసిద్ధ మైనవి.

'సరోజ దళనేత్రి' - శంకరాభరణరాగం - ఆదితాళం
'దేవీ మీననేత్రి' - శంకరాభరణరాగం - ఆదితాళం
'నన్ను బ్రోవు లలిత' - లలిత రాగం - మిశ్రలఘుతాళం
'మీనలోచన బ్రోవ' - ధన్యాసిరాగం - చాపుతాళం

వాగ్గేయకారులందరివలె శ్యామాశాస్త్రిలు కూడా రాజ భోగాలపైన, రాజాశ్రయాలపైన విముఖత చూపాడు. ఒకసారి తంజావూరు విద్వాంసుల ప్రార్థనలనుకాదనలేక రాజాస్థానానికి వచ్చి బొబ్బిలి కేశవయ్య అనే సంగీత విద్వాంసుని ఎదుర్కొన్నాడు. ఆ వివాహానికి వెళ్లేముందు దేవీ పూజ చేసి చింతామణి రాగంలో "దేవి బ్రోవ సమయమిదే" అనే కీర్తన గానం చేశాడు. "భూలోక చాప చుట్టి" అనే బిరుదు కల్గిన కేశవయ్య రాగాలాపనలోను, సింహ

నందనం వంటి బహ్వక్షర ప్రమాణం గల తాళాలలో పల్లవులు పాడటంలోను గట్టివాడు. శ్యామాశాస్త్రి కూడా అతనిలాగే సంగీతంలో క్లిష్టమైన పరిశ్రమ చేసినవాడు కాబట్టి అతని సింహానందన తాళ పల్లవిని తన శరభనందన తాళ పల్లవితో ఓడించాడు. అలాగే నాగపట్నంలో అప్పుకుట్టి అనే విద్వాంసునికి కూడా ఇతడు గర్వభంగం చేసి తనకు స్నేహితుడుగా మలచుకున్నాడు.

శ్యామాశాస్త్రిలవారు ఆనందభైరవి రాగంలో రచించిన —

"మరి వేరేగతి యెవరమ్మా మహిలో బ్రోచుటకు
శరణాగత రక్షకి నీవేయని సదా నిన్ను నమ్మితి మీనాక్షి"

అనే కీర్తన ప్రకారంగానే తన జీవిత కాలమంతా తాను నమ్మిన దేవతపై అనన్యమైన భక్తి ప్రపత్తులను చూపి దేవీ ఉపాసకుడుగా, సంగీత రత్నత్రయంలో ఒకడుగా ప్రఖ్యాతి గాంచి 1827 సం॥లో తన ఇష్టదేవతలో ఐక్యమయ్యాడు.

'కోస్తావాణి' దినపత్రిక (14-5-1989)



# వచన సంకీర్తనా పితామహుడు

వైష్ణవ వచన సంకీర్తన రచయితలలో ప్రథముడు కృష్ణమాచార్యుడు. ఇతడు కాకతీయ రెండవ ప్రతాపరుద్రుని కాలానికి అంటే 13 వ శతాబ్దికి చెందినవాడు. 'సింహగిరి నరహరి నమో నమో దయానిధీ' అనే మకుటంతో సింహగిరి వచనాలను నాలుగు లక్షలకు రచించాడు. ఇతని రచనలు 'వచన సంకీర్తనలు'గా ప్రసిద్ధి కెక్కాయి.

కృష్ణమాచార్యులు వికృతి నామ సంవత్సరంలో దక్షిణ భారతంలోని 'సంతూర్' అనే గ్రామంలో ఒక వైష్ణవ కుటుంబంలో జన్మించినట్లు, పదహారవ ఏట వచన రచన ప్రారంభించినట్లు తంజావూరి తాళపత్ర ప్రతిలో ఉన్నది. ఈ సంతూరు తెలంగాణా ప్రాంతంలో మహబూబ్‌నగర్ జిల్లాలోని సంతలూరు కావచ్చునని పరిశోధకుల అభిప్రాయం.

మనకు తెలిసినంతవరకు ఆంధ్రదేశంలో వచన రచనకు, భజన సంకీర్తన పద్ధతులకు ప్రపితామహుడు ఈ కృష్ణమాచార్యులే. ఓం నమో నారాయణాయ, నమో నమో లక్ష్మీవల్లభా, అనాథపతి సింహగిరి నరహరి నమో దయానిధీ, అనే మకుటాలతో స్వామివారి అనంత గుణ నామ కథలను వచనంలో వ్రాశారు. వీటినే ధ్యాన సంకీర్తనలు, నామ సంకీర్తనలు, వేదాంత సంకీర్తనలు, విన్నపాలు, సింహగిరి వచనాలు అని కొన్ని వర్గాలుగా విభజించుకొన్నాడు. తాళ్ళపాక కవులు కృష్ణమాచార్యుల వారినే తమకు మార్గదర్శకుడుగాను తాళబంధ ఛందో విరహితమైన చూర్ణము అనే పద రచనలకు పరికల్పకుడుగాను పేర్కొన్నాడు.

ఈ కృష్ణమాచార్యుని కృతులలో నేటికి లభ్యమైనవి అయిదు మాత్రమే.

**వచన సంకీర్తనలు :**

కృష్ణమాచార్యుని వచనాలు కేవలం తాళబద్ధమే కాకుండా అంత్యప్రాసలు, శబ్దాలంకారాలు, చిత్తమా, మనసా జయ విజయీభవ మొదలైన సంబోధనలు, పల్లవిని పోలిన పాదాలు మొదలైన అంశాలన్నీ వచన సంకీర్తనలలోని గేయాంశాన్ని వెల్లడిస్తున్నాయి.

"ఒకపరి మిమ్ము నెరుంగుదుమయ్యా
ఒకపరి మిమ్ము నెరుంగమయ్యా
జ్ఞానిని చేయుమయ్యా అ
జ్ఞానిని చేయకుమయ్యా"

"విష్ణుభక్తిలేని విద్వాంసుని కంటెను
హరికీర్తనము సేయు నతడె కులజుడు
సింహగిరి నరహరి దలంచిన యతడే కులజుండు"

"దేవా ! తనువులు మాయ. తలపోసి తలపోసి చెప్పేనంటినా కరకరల మోహమిది. ఆశల పాషండఃబిది. అతుకుల జల్లెడయిది. ఇది నాటకములాడేది బూటకపు బొమ్మ"

ఇలాంటి వచన సంకీర్తనలలోనే నామ సంకీర్తనలు, ధ్యాన సంకీర్తనలు, వేదాంత సంకీర్తనలు, అనే విభాగాలు ఉన్నాయి. ఇతర వచన సంకీర్తనలన్నీ ప్రధానంగా భక్తిని ప్రబోధిస్తాయి. దేవాంతర, మతాంతర, సాధనాంతరాలను వదలిపెట్టి వైకుంఠవాసుని నమ్మి 'నీవే తప్ప నితః పరంబెరుగ'నని నివేదించడమే ఇందులోని సందేశం. ఈ వచనాలలో వ్యావహారికమైన భక్తిభావం ప్రదర్శితం కావడం విశేషం.

## తులసీ మాహాత్మ్యం :

ఇది కృష్ణమాచార్యుని రెండవ కృతి. తెలుగు స్త్రీల నోముల లోను, వ్రతాలలోను ప్రముఖ స్థానం వహించి భూలోక కల్పకం అని పేరు పొందిన ఇంటింటా పెంచిన తులసిమొక్క మాహాత్మ్యం ఇందులోని ఇతివృత్తం. ఇతడు తులసీ మహాత్మ్యాన్ని సంకీర్తనాత్మకంగా రచించాడు.

"నిశి సమయమందు తులసీ దరిసనము చేసిన వారికి శిసుహత్య, స్త్రీహత్య, గోహత్య మొదలగు పాతకంబులు పోవును దేవా! అంతమందు తులసీ దళోదక మిచ్చిన దేహము పవిత్రంబై సద్గతి కలుగును.

## నృసింహ నామాలు :

ఇది నృసింహ స్తోత్రం. 'శ్రీ నృసింహ' అని పాదాల చివరలో ఉన్నందువల్ల ఈ కృతికి నృసింహ నామాలనే పేరు వచ్చింది.

"వేదరాశిసుదన వెలుగు విశ్వభర్త శ్రీ నృసింహ
ఆది దేవ నీ చరిత్ర మద్భుతంబు శ్రీ నృసింహ
తపము నీవె శ్రీ నృసింహ జపము నీవె శ్రీ నృసింహ
నీడ నీవె శ్రీ నృసింహ తోడు నీవె శ్రీ నసృింహ"

ఈ స్తోత్రం 'సింహగిరి నరహరి నమో నమో దయానిధే' అనే వచనంతో ముగిస్తుంది.

## రామనామ సంకీర్తనం :

ఇది రామ నామ మహిమను వెల్లడించే ధ్యాన సంకీర్తనం. ఇందులో ప్రతిపాదం చివర 'రామునామము' అనే పదం ఆవృత్తి అవుతుంది.

"నీలకంధర వర పురందర నిత్యకత్యము రాము నామము
శైలరాజ సుతా తనూభవ సతత కృత్యము రాము నామము
దివ్య మంత్రము రాము నామము భవ్య మంత్రము
రాము నామము
జన నిధానము రాము నామము మను విధానము
రాము నామము

రామ నామాలు : ఇది రామ నామ సంకీర్తనలాగే గాన యోగ్యంగా 'రామా రామా' అనే పాదాంత సంబోధనలు ఉన్న రామ నామ సంకీర్తనం. ఇందులో రామ నామ స్తోత్రంతో పాటు రామాయణ కథ కూడా స్ఫురిస్తోంది.

"దశరథాత్మజ రామా రామా
ధన్యచరిత్రా రామా రామా
భరతాగ్రజా రామా రామా
పంక జేక్షణా రామా రామా

ఈ విధంగా ఓరుగల్లు, పిదప సింహాచలం ప్రాంతాలలో నివసించిన కృష్ణమాచార్యుడు సింహాచలాధీశ్వరుని పేరుతో చాతుర్లక్ష సంకీర్తనలను రచించాడు. ఇతనివల్ల ఆ వైష్ణవ క్షేత్రానికి ఎంతో ప్రసిద్ధి చేకూరింది. ఆ ఆలయాన్ని ఆశ్రయించుకొనే కృష్ణమాచార్యుని వచన సంకీర్తన సంప్రదాయం వర్ధిల్లింది.

కృష్ణమాచార్యుని రచనలు తరువాతి వారి కందరికీ స్ఫూర్తి ఉత్సాహాలను కలిగించాయని చెప్పాలి. వాస్తవం ఎలాంటిదో కానీ కారణాంతరంలో స్వామివారి ఆలయం మ్లేచ్ఛులచేత భగ్నం కావాలని కృష్ణమాచార్యుడు శపించినట్లు దానికి ప్రతిఫలంగా స్వామివారు

కృష్ణమాచార్యుని రచనలన్నీ క్షుద్రమై రూపు చెడి నశించి పోవా లనీ ప్రతిశాపం ఇచ్చినట్లు ఒక కథ ఆచార్య సూక్తి ముక్తావళిలో ఉన్నది. అలాగే కృష్ణమాచార్యుని చాతుర్లక్ష సంకీర్తనలు ఈనాడు పూర్తిగా వ్యవహారంనుండి నశించిపోయాయి. ఏది ఏమైనా ఇతడు ప్రసిద్ధికి తెచ్చిన వచన సంకీర్తనల పద్ధతి భక్తి, సంగీత రచనల విషయంలో గణనీయమైనది. తాళ్ళపాకవారు నిర్మించిన సుప్రసిద్ధ పద రచనా సౌధానికి పునాదులు వేసిన వారిలో కృష్ణమాచార్యుడు ప్రథముడు. అందుకే ఇతడు పద కవితా ప్రపితామహుడు, వచన సంకీర్తనా పితామహుడు అనే బిరుదాలతో ప్రసిద్ధికెక్కాడు.

'కోస్తావాణి' (30-5-1988)



# రామదాసు రామ భక్తితత్పరత - లోకహిత బోధ

భక్తులందరూ లోక కల్యాణం కోసమే అవతరిస్తుంటారు. వారు లోకంలో జరిగే అన్యాయాలను, అక్రమాలను, అత్యాచారాలను, హింసలను గమనించే ఎంతో వ్యథచెంది వాటిని రూపుమాపడానికి తమ జీవితాలనే త్యాగం చేస్తుంటారు. కలికాల ప్రభావం వల్ల సమాజంలో రోజురోజుకు మితిమీరిపోతున్న దుష్టచర్యలకు కారణం దైవభక్తి లేకపోవడమే అని భావించి ప్రజలలో భక్తి ప్రపత్తులను కలిగించడానికి కీర్తనలు రచిస్తుంటారు. అలా సులభంగా ప్రజలలో వ్యాప్తి చెందడానికి అనువైన కీర్తనలు రచించిన భక్త మహాశయులలో రామదాసు ఒకరు.

రామదాసు అసలు పేరు కంచెర్ల గోపన్న. ఇతడు గొప్ప రామభక్తుడై రామునికి దాసుడైనందువల్ల రామదాసుగా ప్రసిద్ధి కెక్కాడు. ఇతడు 1620 వ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో గోల్కొండ రాజ్యంలోని నేలకొండపల్లెలో లింగన మంత్రి, కామమ్మ అనే పుణ్యదంపతులకు ప్రభవించాడు. రామదాసు బాల్యంలో తల్లిదండ్రుల ఉద్బోధలవల్ల బాలరామాయణంవంటి భక్తి గ్రంథాలను పఠించాడు. అందువల్ల బాల్యంలోనే అతని హృదయ క్షేత్రంలో రామభక్తి బీజాలు పాదుకొన్నాయి. త్రేతాయుగంలో శ్రీరామునితో పాటు తానెందుకు పుట్టలేక పోయానని చింతించి-"ఎలాపుట్టకపోతినా జే శ్రీరాములతోడ" అనే కీర్తన రచించాడు. రామదాసుకు రఘునాథ భట్టాచార్యులనే గురువు మంత్రోపదేశం చేసి వైష్ణవదీక్ష ఇచ్చినట్లు రామదాసు వ్రాసిన దాశరథీ శతకంలోని 'పట్టితి భట్టరార్య గురు

పాదము లిమ్మయి సూర్ద్వప్రంత్రముంబెట్టితి' అనే పద్యంవల్ల తెలుస్తుంది.

రామదాసు ప్రారంభంలో కొన్ని గ్రంథాలను రచించి నరాంకితం చేసి చివరికి జ్ఞానవంతుడై పశ్చాత్తాపం చెందినట్లు దాశరథీ శతకంలోని 'పసగొని చేగుపండ్లకున్ మౌక్తికముల్ వెలబోసినట్లు, దుర్వ్యసనము చెంది కావ్యము దురాత్ములకిచ్చితి' అనే పద్యంవల్ల తెలుస్తుంది.

రామదాసు ఇంట్లో ఎప్పుడూ భజన గోష్ఠులు, భాగవత సత్రాలు జరుగుతుండేవి. ఒకసారి భక్తి కీర్తనలు రచించిన రామ భక్తుడైన కబీరుదాసు ఉత్తర హిందూదేశంనుంచి రామదాసుకు రామనామ తారక మంత్రాన్ని బోధించాడు. అప్పుడు రామదాసు ఆనందంతో 'తారకమంత్రము కోరిన దొరకెను, ధన్యుడనయితిని ఓరన్నా' అనే కీర్తన రచించాడు.

భక్తిప్రపత్తులతో జీవనం సాగిస్తున్న రామదాసు తనకున్న సంపదను, వస్తువులను హరిభక్తులకు, పేదలకు దానం చేస్తుండేవాడు. రామదాసు వివాహితుడైన కొంతకాలానికి తల్లిదండ్రులు చనిపోవడంతో కుటుంబభారం తనమీద పడింది. తన భార్యను, పుత్రుని పోషించడానికి కూడా అశక్తుడయ్యాడు. తన దారిద్ర్యానికి తోడుగా అతనిలో దయాగుణం, అధికం కావడంవల్ల ఉన్నదంతా పదులకు దానం చేయడంతో కుటుంబంలో బాధలు మిన్ను ముట్టాయి. రామదాసు బంధువుల, ఇరుగుపొరుగువారి సలహాలతో గోల్కొండ నవాబైన అబుల్‌హాసన్ తానాషాకొలువులో మహామంత్రులుగా పనిచేస్తున్న తన మేనమామలైన అక్కన్న మాదన్నలను కలుసుకోవడానికి హైదరాబాదు వెళ్ళాడు. అక్కన్న, మాదన్నలు రామదాసును ఎంతో

ఆదరించి నవాబును సంప్రదించి అతనికి భద్రాచలనగరానికి తహశీల్దారుపదవి ఇప్పించారు.

రామదాసు భద్రాచలానికి తహల్దారై కార్యక్రమాలను సక్రమంగా నిర్వహిస్తూ ప్రజలను ఎంతో ఆదరిస్తూ వారి గౌరవాభిమానాలకు పాత్రుడయ్యాడు. ప్రజలనుంచి వసూలు చేసిన పైకంతో సీతారాములకు ఉత్సవాలను, కైంకర్యాలను చేయిస్తుండేవాడు. ఇలా ఒకరోజు సంతర్పణ జరుగుతున్నప్పుడు రామదాసు కొడుకు దోగాడుకుంటూ వచ్చి గంజిగుంటలో పడి అచేతనుడై పోయాడు. సంతర్పణ మధ్యలో ఈ విషాద వార్త చెప్పితే కార్యభంగం అవుతుందని రామదాసు భార్య దుఃఖాన్ని దిగమ్రింగుకొని సంతర్పణ కార్యం పూర్తి అయిన తర్వాత రామదాసుకు చెప్పింది. అప్పుడు రామదాసు అంతు లేని దుఃఖంతో —

"రామ కార్యతత్పరుణ్ణయి ఉన్న సమయంలోనా నాకాపద
రామరాజ్యగాథలలో మృతుడైన విప్ర పుత్రుని
బ్రతికించినట్లు విన్నది సత్యమైతే నా పుత్రుని కూడా
బ్రతికించు" అని

శ్రీరామునికి మొర పెట్టుకొని రామాలయంలో రామసన్నిధిలో తనపుత్రుని వుంచాడు. రామదాసు మళ్ళీ అపరాని బాధావేశంతో 'ఎంతపని చేసితివి రామా, నిన్నేమందును సార్వభౌమా' అనే కీర్తన, 'కోదండరామ కోదండరామ కోదండరామ, కోట్యర్క ధామ, నీదయ నాకు నీవెందుపోకు వాడేల నీకువద్దుపరాకు' అనే కీర్తన ఆలపించాడు. రామదాసు కొడుకు శ్రీరాముని అనుగ్రహం వల్ల నిద్రనుండి లేచినట్లు లేచి కూర్చున్నాడు. అప్పటినుంచి గోపన్న ప్రజలలో భక్త రామదాసుగా మహానుభావుడుగా కీర్తికెక్కాడు. రామదాసు రామభక్తి సుధారసపానంలో మత్తహృదయుడై తాను వసూలు చేస్తున్న పైకాన్ని ప్రభుత్వానికి పంపించడం మరచిపోయాడు. ఆలయ పున

ర్నిర్మాణ పథకం క్రింద ఎప్పుడూ ఆలయ నిర్మాణాలకు, నైవ ఆభరణాలకు, ఉత్సవాలకు, సంతర్పణలకు ధనాన్ని మొత్తం ఖర్చు చేసేవాడు. రామదాసు రామభక్తి, మహిమలు, అధికారులపట్ల ఉదాసీతన దేశమంతా ప్రాకిపోయింది. రామదాసు పై ఈర్ష్యా ద్వేషాలున్న కొంతమంది తానాషాను రెచ్చగొట్టడంతో ఒకరోజు తానాషా రామదాసుకు శిస్తుపైకాన్ని తీసుకొనిరావలసిందిగా కబురు పంపాడు. రామదాసు ఆ పైకాన్ని ఇవ్వలేకపోయాడు. రాజద్రవ్యాప హారణ నేరంమీద రామదాసును పన్నెండు సంవత్సరాలు కారా గారంలో బంధించి కఠినంగా శిక్షించాడు.

తన స్వార్థంకోసం వినియోగించుకోలేదని, అంతా శ్రీరామ చంద్రుడికే ఖర్చుచేశానని, ఆ రామచంద్రుడే తానాషాకు పైకం అప్పగించి తనను రక్షిస్తాడని ప్రగాఢంగా నమ్మి రామునిపై కీర్తనలు పాడుకొంటూ భటులుపెట్టే చిత్రహింసలన్ని సహించి కారాగారంలో గడిపాడు. రామదాసు చివరికి సహించలేక ఒకరోజు రామదాసు విషం పుచ్చుకొని మరణించడానికి సిద్ధమవుతున్నప్పుడు శ్రీరాముడు లక్ష్మణ సమేతుడై జవాను వేషంలో తానాషా దగ్గరకువెళ్ళి తనను రామదాసు పంపించాడని చెప్పాడు. పైకాన్ని అప్పగించి రశీదు తీసుకొని రామదాసును బందిఖానానుంచి విడిపించాడు. ఈ విధంగా తన భక్తివిశ్వాసాలతో దృఢదీక్షతో శ్రీరాముని సాక్షాత్కరింప జేసుకొని బంధవిముక్తుడయ్యాడు.

రామదాసు రచించిన కీర్తనలలో రామదాసు జీవిత సన్ని వేశాలు, అతని రామభక్తి ఆత్మీయతతో పాటు లోకహితవుకూడా కనిపిస్తుంది. ప్రజాహితవుకోసం ప్రజలకు అతిసన్నిహితమైన దేశీయ గేయరీతులలో కీర్తనలు రచించాడు. అక్షరజ్ఞానంలేని పామరుడు

సహితం సులభంగా అర్థంచేసుకోవడానికి వీలైన వ్యావహారిక భాషను ఉపయోగించాను. రామదాసు గోల్కొండ నవాబు పరిపాలనలో అధికారిగా వున్నందువల్ల ఉర్దూ, పారశీక భాషలలో మంచి ప్రావీణ్యం సంపాదించి వుంటాడు. అందువల్ల అతని కీర్తనలలో ఉర్దూ పదజాలం కూడా చోటుచేసుకొన్నది. రామదాసు సంస్కృత భాషలో కూడా-

'భజరే శ్రీరామం హేమానస భజరే రఘురామం'
'భజరే మానసరామం భజరే జగదభిరామం'
'దీనదయాళో దీనదయాళో'

'కలయే గోపాలం కస్తూరి తిలకం సుఫాలం'
'వందే విష్ణుం దేవమశేషస్థితి హేతుం'

మొదలైన కీర్తనలను రచించాడు.

రామదాసు రచించిన కీర్తనలలో తన స్వానుభావంతో పాటు అందరికీ వుపయుక్తమయ్యే లోకనీతులు కూడా కనిపిస్తాయి.

మానవ జీవితకాలంలో ఏది సార్థకమైన కాలం అంటే చిత్త శుద్ధితో భగవత్కార్యాలకై వినియోగించే కాలమే అని జ్ఞానవంతులైన పెద్దలు చెబుతుంటారు. భగవంతుని కీర్తిస్తే మనసులోని బాధలు తొలగిపోతాయి. జన్మ కడతేరుతుంది. చాలామంది పనీపాటా లేకుండా అజ్ఞాన అహంకారాలతో వ్యర్థప్రలాపాలు, వాదోపవాదాలు చేస్తుంటారు. అలాంటి మానవులకు రామదాసు జ్ఞానబోధ చేస్తూ—

"నారాయణ యనరాదా మీ నాలికపై ముల్లు నాటియున్నదా
పనిలేని వార్తలు నూరు యట్లే
పలుమారు వాదించి పలుకుచున్నారు
మనసున వెతలెల్ల తీరు మీ

జననము లేదేర జనులార మీరు"
అనే కీర్తన రచించాడు.

మానవులకు భక్తితో పాటు నిగ్రహం కూడా అవసరం. నీతి నియమం లేనివారు, చపలచిత్తులు చాలామంది భక్తి మనసులో ఉంటేచాలు అంటారు. కానీ భగవంతుని మనసులో స్మరించడంతో పాటు నోరు వున్నందుకు భగవంతుని నోరారకూడా కీర్తించాలి. అందుకే పోతన భాగవతంలో 'నోరు నొవ్వంగ హరికీర్తి' నుడువ మన్నాడు. అలా నోరు నొప్పికలిగేలా హరినామాన్ని నుతించని వాడు పుట్టినందుకు తల్లులకడుపు చేటు అన్నాడు. అలాగే రామదాసు కూడా దైవనామాన్ని నీతితో పల్కనివాడు ఉన్మత్తుడని, మూఢ చిత్తుడని నిరసించాడు. ఈ దేహం అశాశ్వతమని తెలిసినా కొంత మంది దురాత్ములు మళ్ళీ అజ్ఞానంలో పడి చెడుబుద్ధులతో సాహసం చేసి సజ్జనులను బాధపెడుతుంటారు. రామదాసు అలాంటి వారిని పాతకులు, బ్రహ్మఘాతకులు అంటూ—

"రామరామయని నోటరవ్వంత నేపైన
నీమము తప్పక మంచి నీతితో పల్కని వా
డున్మత్తుడు మూఢచిత్తుడు

దేహమశాశ్వతమని తెలియక దుర్బుద్ధిచేత
సాహసమున సాధుజనులను సంకటబెట్టుడివాడు
పాతకి బ్రహ్మఘాతకి"
అనే కీర్తన రచించాడు.

మనిషికి వచ్చే రోగాలు శారీరక రోగాలని, మానసిక రోగా లని రెండు రకాలు. శారీరక రోగాలు పోవడానికి వైద్యం చేయించు

కోవచ్చు, కానీ కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యా లనే అంతశ్శత్రువులచే అలమటిస్తున్న మానసిక రోగాలను పోగొట్టు కోవడానికి రామయోగి మందుకొనండి అంటూ, రామదాసు ప్రజలకు సులభమైన ఉపాయం చెబుతూ —

> "రామజోగి మందు కొనరే ఓ జనులారా
> రామజోగి మందుకొని ప్రేమతో భుజింవుడన్న
> కామ క్రోధ లోభ మోహ ఘనమైన రోగాలకు
> .................................మందు"

అనే కీర్తన వ్రాశారు.

ఇలాంటి కీర్తన రామదాసుకు రెండు శతాబ్దాలకు పూర్వమే తాళ్ళపాక అన్నమాచార్యులు కూడా —

> "కొనరో కొనరో మీరు కూరిమి మందు
> ఉనికి మనికి కెల్ల నొక్కటే మందు"

అనే కీర్తన రచించాడు.

సాగరం లోతైనా తెలుసుకోవచ్చు కానీ మానవుని మనస్సు అనే సాగరం లోతుమాత్రం తెలుసుకోవడం అసంభవం. అనంతమైన, అగాధమైన మనస్సాగరంలో ఎన్నెన్ని అగ్ని పర్వతాల్లాంటి, క్రూర జంతువుల్లాంటి దుర్బుద్ధులుంటాయో తెలుసుకోవడం, ఏ మానవుడు ఏ సమయానికి ఎలా మార్పుచెందుతాడో, ఏ కీడు చేస్తాడో కూడా తెలుసుకోవడం అసాధ్యమైన విషయం. అందుకే ఎల్లప్పుడూ విశ్వ సించదగిన ఆ భగవంతుని నమ్మి జన్మను తరింపజేసుకోవాలని అచ్చ మైన దేశీయ సామెతల ద్వారా రామదాసు వ్యక్తం చేస్తూ—

"నరహరి నమ్మక నరుల నమ్మితే
నరజన్మ మీడేరునా
చెఱకులుండగ వెఱ్ఱి చెఱకులు నమిలితె
జిహ్వాకు రుచిపుట్టునా

కాళ్ళుండగ మోకాళ్లతో నడచితె
కాశీకి పోవచ్చునా
నీళ్ళుండగ నుమ్మి నీళ్ళను మింగితే
నీరదాహము తీరునా"

నరుని నమ్మి కడతేరిన నరులు ఎవ్వరూ లేరు. ఈ నరులు సుఖాలకు మూలమైనవారే కానీ దుఃఖాలలో చేరువయ్యేవారు కారు. అందుకే సుఖదుఃఖాలలో ఎప్పుడూ తోడు నీడగా వుండి కాపాడే ఆ నారాయణునే నమ్ముకోవాలి. అసలైన చెరకులు నమిలితే నోటికి తీపితగులుతుంది కానీ పంకీరాని కొయ్యలు నమిలితే నోటికి కష్టమే కానీ రుచిపుట్టదుకదా, అలాగే కాళ్ళతో నడిస్తే కాశీకి పోవచ్చు కానీ మోకాళ్ళతో నడకసాగదు కదా. అలాగే నీళ్లు తాగితే దప్పిక తీరుతుంది కానీ ఉమ్మి మింగితే దప్పిక తీరుతుందా అని వివయని వేచన చేసి ప్రజలకు జ్ఞానబోధ చేశాడు రామదాసు. అన్నమయ్యకూడా 'మనుజుడై పుట్టి మనుజుని సేవించి అనుదినము నెతల చెందనేలా' అనే కీర్తనలో ఈ విధమైన భావాలనే వ్యక్తం చేశాడు.

మంగళకరమైన, మధురామృతమైన రామ నామం అంటే రామదాసుకు ఎంతో ప్రీతి. అందుకే రామనామాన్ని తలచుకొంటేనే చాలని తెలియజేశాడు. రామనామాన్ని స్మరిస్తే చాలు కఠోరమైన తపస్సు చేయవలసిన పనిలేదు. ఇతర దైవాలను వెదుకవలసిన పని లేదు. ఇతరులను హింసించకుంటే అదే పరమ ధర్మం. ఇతరులను

రక్షిస్తానని పలుకవలసిన పనిలేదు. ఇతరుల సొమ్ములను తస్కరించ కుంటే చాలు, భగవంతునికి గోపురాలు కట్టవలసిన పనిలేదు. దీన జనుల యందు ప్రేమ చూపితే చాలు, పరమాత్మునియందు ప్రత్యేకంగా భక్తి చూపవలసిన పనిలేదు. విష్ణు భక్తులను పూజిస్తే చాలు, విష్ణువును పూజిస్తాననే అహంకారం వుండనవసరం లేదు అంటూ రామదాసు మానవతా ధర్మాలను బోధిస్తూ —

"శ్రీరాముల దివ్యనామస్మరణ చేయుచున్న
ఘోరమైన తపములను కోరనేటికే మనసా
వేరువేరు దైవములను వెదుక నేటికే మనసా

పరుల హింస సేయకున్న పరమ ధర్మమంతే చాలు
పరులను రక్షింతునని పల్క నేటికే మనసా
దొరకొని పరుల ధనముల దోచక యుండితె చాలు
గురుతుగాను గోపురములు గట్ట నేటికే మనసా ॥

పరగ దీనజనుల యందు పక్షముంచినదే చాలు
పరమాత్ముని యందు ప్రీతి బెట్ట నేల మనసా
హరిదాసులకు పూజ లాచరించిన చాలు
హరిని పూజ చేతుననే అహమదేటికే మనసా"

అనే కీర్తన రచించాడు.

ఈ కీర్తనలో రామదాసు తన మనసుకే జ్ఞానబోధ చేసుకుంటు న్నట్లు కనిపించినా, ఇతరులకు కూడా ఇందులోని ధర్మాలు ఆచరణీయ మైనవే.

రామదాసు ఈ విధంగా భక్తి జ్ఞాన వైరాగ్యబోధన కీర్తనలను, స్వానుభవకీర్తనలను పల్లవి, అనుపల్లవి, చరణాలతో కూడిన

సుమారు నూట ముప్పైఏడు కీర్తనలను రచించారు. రామదాసు ఈ కీర్తనలతో పాటు దాశరథీశతకం, ఆత్మరక్షామణీ శతకం, జానకీపతి శతకం, భావనారాయణ శతకం, మానసబోధ శతకం కూడా రచించి లోకానికి జ్ఞానబోధ చేశారు.

ఆకాశవాణి, విశాఖపట్టణం 20-2-1991

ముముక్షువు స్పెషల్ ఎడిషన్-1991



# రామదాసు కీర్తనల్లో రామనామ మహిమ

తెలుగు కీర్తనకారులలో రామదాసు ఒకరు. ఇతని పూర్వ నామం కంచెర్ల గోపన్న. ఇతడు బాల్యమాదిగా గొప్ప రామభక్తుడు కావటం వల్ల ఇతనికి రామదాసు అనే పేరు వచ్చింది. "దాశరథీ కరుణాపయోనిధీ" అనే మకుటం గల శతకాన్ని రచించింది ఈ రామదాసే. ఇతడు 1620 సం॥లో తెలంగాణా ప్రాంతంలోని నేలకొండపల్లెలో లింగనమంత్రి, కామమ్మ అనే పుణ్యదంపతులకు జన్మించాడు. ఇతనికి రఘునాథ భట్టాచార్యులనే గురువు మంత్రోపదేశం చేసి వైష్ణవ దీక్ష ఇచ్చినట్లు దాశరథీ శతకాన్ని బట్టి తెలుస్తుంది.

రామదాసు పేదకుటుంబంలో పుట్టడం వల్ల జీవనభృతికోసం గోల్కొండ ప్రభువైన తానాషా కొలువులో తహశీలుదారుగా చేర వలసివచ్చింది. అక్కన్న మాదన్నలు రామదాసుకు మేనమామలు. వీరి సహాయం వల్లనే రామదాసుకు తహశీల్ పదవి సమకూరింది. రామదాసు భద్రాచల నగరానికి తహశీల్ అధికారి అయినప్పటినుంచి భద్రాచల దేవాలయ పునర్నిర్మాణానికి, భక్తి కార్యాలకు అపారంగా ధనం ఖర్చుచేసేవాడు. వసూలైన పైకాన్ని మొత్తం రాజుగారి అనుమతి లేకుండా భద్రాచల దేవతామూర్తులైన సీతారాములకు లక్ష్మణునికి అనేక ఆభరణాలు తయారుచేయించి పెక్కు కైంకర్యాలకు, సేవలకు ఖర్చుచేశాడు. తానాషా ప్రభువు ఈ విషయం తెలుసుకొని రామదాసు మహాభక్తుడని కూడా దయలేకుండా పన్నెండు సంవత్సరాలు జైలులో బంధించి శిక్షించాడు. అప్పుడు అధికారులు, బంధుమిత్రాదులు, ప్రజలు అందరూ నిస్సహాయులు కాగా తన హృదయార్తిని తన ప్రియదైవం శ్రీరామచంద్రునికే విన్నవించు

కొన్నాడు. ఆ శ్రీరాముడే తన భక్తశిఖామణిపై కరుణజూపి, రామదాసు ఇవ్వవలసిన మొత్తం పైకాన్ని అతని భటుని వేషంలో తానా షాకు అప్పగించి రామదాసును బంధవిముక్తుని చేసి పరమపదాన్ని అనుగ్రహించాడు.

రామదాసు బందిఖానాలో వుండి బాధపడుతున్నప్పుడే కీర్తనలు వ్రాశాడు. రామదాసు కీర్తనలు ఈ నాటికీ ఆంధ్రదేశమంతా పండిత పామరులలో, ఆర్తులలో, అనాథలలో జీవిస్తూనే ఉన్నాయి. దేవాలయాలలో, భజన గోష్ఠులలో కీర్తించబడుతూనే ఉన్నాయి. రామదాసు కీర్తనలలో ప్రసిద్ధమైన - 'పలుకే బంగారమాయెనా, శ్రీరామ నీ నామమేమిరుచిరా, ఏ తీరుగ నను దయజూచెదవో, నన్ను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ!' వంటి కీర్తనలు తెలియని తెలుగుబిడ్డ ఉంటే ఉన్నా ఆశ్చర్యం లేదు.

రామదాసుకు శ్రీరాముడంటే మిక్కిలి ప్రీతి. శ్రీరాముడు పరమదయాళువు. విష్ణుమూర్తి దశావతారాలలో శ్రీరామావతారం ప్రత్యేకమయింది. శ్రీరాముని పేరు ఉచ్చరిస్తేనే భక్తుల మనసులు పరవశిస్తాయి. ఆనందబాష్పాలు తొణికిసలాడుతాయి. పాపపంకిలంలో కూరుకుపోతున్న ఈ కలికాల ప్రజలు ఒక్కసారి నామస్మరణ చేయడంతోనే సర్వపాపాలు హరించుకుపోతాయని ఎన్నో ధర్మగ్రంథాలు చెబుతున్నాయి. శంకరుడు పార్వతికి "శ్రీరామ రామ రామేతి రమేరామే మనోరమే, సహస్రనామ తత్తుల్యం రామనామం వరాననే" అని తెలియజెప్పాడు. రామనామాన్ని మూడుసార్లు మనస్ఫూర్తిగా ఉచ్చరిస్తే వెయ్యిసార్లు పలికినంత ఫలితం కలుగుతుందని దీని భావం. హనుమంతుడు రామనామంతోనే చిరంజీవి అయ్యాడు. భక్తపోతన, అన్నమయ్య, త్యాగరాజు, మొల్ల, వంటి భక్తవరేణ్యులు ఎందరో శ్రీరాముని కీర్తించి తరించారు. రామదాసు

కూడా దయాసాగరుడైన శ్రీరాముని నామమహిమను తన కీర్తనల్లో ప్రస్తుతించాడు.

శ్రీరాముని పేరు మంగళకరమయింది. ఆ నామస్మరణ చేస్తే కఠినమైన తపస్సులు చేయవలసిన పనిలేదు. వేరు వేరు దైవాలను వెదుకవలసిన పనిలేదు అంటూ —

పల్లవి : "శ్రీరాముల దివ్య నామస్మరణ చేయుచున్న
ఘోరమైన తపములచు కోరనేటికే....."

అనుపల్లవి : "వేరు వేరు దైవములను వెదుక నేటికే"
అనే కీర్తన రచించాడు.

భగవంతుడు మానవునికు సర్వాంగ సౌష్ఠవాన్ని కలిగించాడు. కానీ మానవులందరూ ఆ అవయవాలను భగవంతుని సేవకోసం వినియోగించడం లేదు. ఎన్నో పాపకర్మలకు ఉపయోగిస్తూ పతనమై పోతున్నారు. రామనామాన్ని కీర్తించకపోతే అది నాలుక చేసిన పాపం అవుతుంది. కాబట్టి రామనామాన్ని పలుకుమని రామదాసు తన జిహ్వకు బోధిస్తున్నాడు. తనకు తానే చెప్పుకుంటున్నాడు. అంటే ప్రజలందరికీ చేస్తున్న ప్రబోధగా మనం గమనించాలి. రామ నామాన్ని ప్రేమతో పలికితే ఆ భగవంతుడు కోరిన కోరికలిస్తాడు. బుద్ధి చెడినవారు రామనామాన్ని తలచితే వారి పూర్వ పాపం నశించి పరమానందం కలుగుతుంది. సర్వదోషాలు హరించిపోతాయి. కాబట్టి రామనామాన్ని ఉచ్చరించమని నాలుకకు హితవు చెబుతూ —

పల్లవి : "రామ నామము బల్కవే పాపపు జిహ్వా
రామ నామము పల్కవే పాపపు జిహ్వా (శ్రీ)"

అనుపల్లవి : రామ నామము నీవు ప్రేమతో పల్కిన
స్వామి ఎల్లప్పుడును కామితార్థము లిచ్చు (శ్రీ)"

చరణాలు : "మతిలేని వారిలలో సీతాపతిని
సతతము తలచినను హితవున వారి పూర్వ
కృతము లెల్ల మాన్పి కృపతో మను జూచి
అతులిత సామ్రాజ్యమానందమొందజేయు శ్రీ"
..................................................
"దాసులనెల్ల బ్రోచుచు భద్ర గిరిని
వాసుడై జగములనేలు శ్రీరాముడు
దోసములెల్ల బాపి వాసిగధర రామ
దాసహృదయ నివాసుడైన సీతా

అనే కీర్తన రచించాడు.

ఇంతటి మాహాత్మ్యం కలిగిన, పవిత్రమైన రామనామాన్ని కొంతసేపైన నియమంగా నోటితో పలుకనివాడు ఉన్మత్తుడని, మూఢ చిత్తుడని రామదాసు —

"రామ రామయని నోట రవ్వంత సేపైన
నీమము తప్పక మంచి నీతితో పల్కని వా
డున్మత్తుడు మూఢచిత్తుడు"

అనే కీర్తన రచించాడు.

రామనామాన్ని విడువకుండా భజించే భక్తులకు ఆ నామమే బ్రతుకు అవుతుంది. అదే పరమామృతం అవుతుందని రామదాసు స్వానుభవంతో తెలియజేస్తూ —

"రామనామమే జీవనము అన్యమేమిరా కృపావనము
రామనామ సుధా మధురము - అది ఏమరక భజియించు మాకిక"
అనే కీర్తన రచించాడు.

ఐహికమైన మానవులందరూ అశాశ్వతమైనవారు. ఐశ్వర్యం క్షణికమయింది. ఒక్క రామ నామమే జిహ్వకు శాశ్వతమయిందని, ఆ శ్రీరాముని దయయే మంగళకర మయిందని రామదాసు —

"శ్రీరామ నామమే జిహ్వకు స్థిరమై యున్నది యున్నది
శ్రీరాముల కరుణయే లక్ష్మీకరమై యున్నది యున్నది"

అనే కీర్తనలో తెలియజేశాడు.

శ్రీరామనామం ఎంతో రుచికరమయింది. అది అతులిత మయింది. ఆ నామమే గజేంద్రుని, ప్రహ్లాదుని, విభీషణుని మొదలైన వారిని రక్షించింది. అరటి, కర్జూరం మొదలైన ఫలాలకన్నా, నవరసాల కన్నా, వెన్న ముద్దకన్నా, పనస, నేరేడు, ద్రాక్ష ఫల రసాల కన్నా రుచికరమయింది. ఇతరమైనవి ఏవీ రామనామాన్ని మించిన రుచికాదు. హనుమంతుడు, శంకరుడు, తుంబురుడు, నారదుడు మొదలైన వారందరూ ధ్యానం చేస్తున్నటువంటిది. ఇంతటి రామనామము అద్భుత మహిమ కలిగినటువంటిదని రామదాసు —

"ఓ రామ నీనామమేమిరుచిరా
శ్రీరామ నీనామ మేమి రుచిరా"

అనే కీర్తనలో తెలియజెప్పాడు.

రామదాసు బందిఖానాలో భటులు పెడుతున్న చిత్రహింసలను అనుభవించాడు. కానీ ఆ హింసల్ని పటాపంచలు చేయగల్గిన రామ నామామృతాన్ని మనసారా గ్రోలి ఎంతో ఆనందాన్ని అనుభవించాడు. ఈ విషయాన్ని రామదాసు

"ఆనందమానందమాయెను శ్రీ జానకి
రామస్మరణము చేయగనే"

అనే కీర్తనలో తెలియజేశాడు.

ఈ విధంగా భద్రాచల రామదాసు పల్లవి, అనుపల్లవి చరణా లతో కూడిన రామదాసు ముద్రాంకితమైన తన కీర్తనల్లో రామ నామ మహిమను శ్లాఘించాడు. ఐహికమైన కార్యకలాపాలవల్ల మానవులకు జీవనభృతి, కీర్తి ప్రతిష్ఠలు లభించవచ్చు. కాని మన శ్శాంతి, జీవిత పరమార్థం చేకూరదు. అది దైవనామస్మరణ వల్ల మాత్రమే సాధ్యమవుతుంది. రామదాసు కీర్తనలు ఆత్మాశ్రయ మైనవి. అయినా ఆత్మ కలిగిన మానవులందరికి అవి వర్తిస్తాయి. పార మార్థిక చింతనకు ఉపకరిస్తాయి. చిత్తభ్రమలను నశింపజేస్తాయి. ఇలాంటి కీర్తనలను మనకు అందించిన భక్తరామదాసు చిరస్మర ణీయుడు.

'కోస్తావాణి' (25-11-1992)



# పద్మావతీ చరణ చారణ చక్రవర్తి 'జయదేవ్'

తెలుగులో ఆంధ్రదేశంలో పద సాహిత్యం ఆవిర్భవించటానికి ముందే సంస్కృతంలో భారతదేశానికంతటికీ సంబంధించిన పద సాహిత్యం వెలువడింది. ఈ పద సాహిత్య కర్త భక్త జయదేవుడు. రసభరితమైన, శుభప్రదమైన, రాధా మాధవ ప్రణయ చరిత ఈ మహితాత్ముని అంతరంగంనుంచి సంగీతాత్మకమైన అష్టపదులుగా జాలు వారాయి. ఇవి గోవిందుని గూర్చి గానం చేసేవి కాబట్టి గీత గోవిందం అయింది.

జయదేవుని జన్మస్థానం బిందు బిల్వ సముద్ర సంభవ రోహిణి రమణేన' అని అష్టపదుల్లో చెప్పి వుండటంవల్ల బిందు బిల్వమని తెలుస్తుంది. దీనినే కిందుబిల్వం అంటారు. ఇది ఒరిస్సా రాష్ట్రంలోని దని, వంగదేశాలలోనిదని వివాదాలున్నాయి. (శ్రీ) భోజదేవ ప్రభ వస్యరామా దేవీ సుత(శ్రీ) జయదేవ కస్య అనే అష్టపదుల్లోని శ్లోకాన్నిబట్టి ఇతని తల్లిదండ్రులు రామాదేవి భోజదేవులని తెలుస్తుంది. ఒరిస్సాలోని జగన్నాథస్వామి ఆదేశంతో వ్యాసముని జయదేవుడుగా జన్మించాడని విజ్ఞుల అభిప్రాయం. ఈ భక్తవరేణ్యుడు వేద వేదాంగాలలో, శాస్త్రాలలో, పురాణ ఇతిహాసాలలో, సకల విద్యలలో పరిపూర్ణుడయ్యాడు. జయదేవునికి పద్మావతితో వివాహం దైవాదేశంగా జరిగింది. జగన్నాథస్వామి పద్మావతి తండ్రి అయిన దేవశర్మకు, ఆలయంలోని అర్చకులకు స్వప్నంలో కనబడి పద్మావతిని జయదేవునికిచ్చి వివాహం చేయమని ఆజ్ఞాపించాడు. దారిద్ర్య బాధలకు భరిస్తున్న జయదేవుడు మొదట వివాహం నిరాకరించినా ఆపైన వారి ప్రోద్బలంవల్ల వివాహం చేసుకున్నాడు.

జయదేవుడు క్రీ.శ. 1116-1160 మధ్యకాలంలో నాఘదేశాన్ని పాలించిన లక్ష్మణ సేనుడనే మహారాజు ఆస్థానంలోని కవి పండిత శేఖరుడు 'గీత గోవిందం' అవతారికలో జయదేవుడు —

'వాగ్దేవతా చరిత చిత్రిత చిత్త పద్మా

పద్మావతీ చరణ చారణచక్రవర్తి' అని చెప్పుకోవడం వల్ల అతని భార్య అయిన పద్మావతిపై అనన్య ప్రేమకలవాడని, ఆమె చరణాలలో చరించే రసిక చక్రవర్తి అని తెలుస్తుంది. అంతేగాక అపూర్వమైన నవ్యరీతిలో తన సతిలోని సౌశీల్య, సద్గుణ, విద్వత్తులను తెలియజేస్తూ వ్రాసిన —

జయతి పద్మావతీ సుఖ సమాజే భజతి జయదేవ కవిరాజరాజే

జయతి పద్మావతీ రమణ జయదేవ కవి భారతీ" అనే శ్లోక పాదాలను బట్టి తన భార్య అనురాగ ప్రోత్సాహాలే తన కవితా విర్భావ కారణాలని, తాను అష్టపదులు గానం చేస్తుంటే పద్మావతి చరణాలు వర్తించేవని తెలుస్తుంది. తులసీదాసు, కాళిదాసు, రామకృష్ణ పరమహంస, కందుకూరి వీరేశలింగం, మహాత్మాగాంధి షేక్స్పియర్ వంటి జగద్విఖ్యాత మహానుభావులందరూ తమ మహోన్నత స్థితికి తమ సతీమణులే కారణమని చెప్పుకున్న ఔదార్య హృదయులే.

జయదేవుని భక్తి మహిమలను గూర్చి కొన్ని సంఘటనలున్నాయి. ఒకనాడు జయదేవుడు "వదసియదికించిదపి...ప్రియే చారుశీలే" అనే అష్టపది రచిస్తున్నాడు. 'స్మరగరళ ఖండనం మమ శిరసి మండనం దేహిపద పల్లవ ముదారం' అని కృష్ణుడు మన్మథ జ్వరంతో కాగుతున్న తన శిరస్సుపైన రాధ పాదమనే చిగురాకును ఔషధంగా చేర్చమని రాధను ప్రాదేయపడుతూ అడుగుతున్నట్లు

రచన సాగడంతో దీనిని గూర్చి కొంత ఆలోచించి ఏవగించుకొని పరమాత్మ తలపై స్త్రీ పాదాలు చేర్చడం ఏమిటని ఆ పంక్తులను చెరిపివేసి అభ్యంగన స్నానానికి వెళ్ళాడు. అప్పుడు శ్రీకృష్ణుడు జయదేవుని రూపంలో వచ్చి తాళ పత్రాలను ఘంటాన్ని పద్మావతి నడిగి తీసుకొని తిరిగి ఆ పంక్తులనే వ్రాసి వెళ్ళాడు. జయదేవుడు వచ్చి చూచి ఈ విషయం భార్యను అడుగగా మీరే వచ్చి వ్రాశారని, ఆ పత్రాలపై పడిన తైల బిందువులను కూడా చూపించింది. శ్రీకృష్ణుడే ఆమెకు ఈ రూపంలో ప్రత్యక్షమై ఆ పంక్తులను తిరిగి వ్రాసి ఆ భావం ఉచితమయిందేనని స్ఫురింప జేసినందుకు జయదేవుడు ఆనందంతో ఉప్పొంగిపోయి భార్యను అభినందించి జయతి పద్మావతీ రమణ... అని పూరించాడు. ఈ అష్టపదిని సంగీత సాహిత్య ప్రవీణులు శ్రీకృష్ణ దర్శనం జరిగింది కాబట్టి దర్శనాష్టపది అంటారు.

ఒకనాడు రాజు పట్టమహిషి ప్రజలందరూ పద్మావతి పతిభక్తి పరాయణత్వాన్ని ప్రశంసిస్తుంటే అసూయపడి, రాజు కవులతో కలసి వాహ్యాళి వెళ్ళినప్పుడు జయదేవుడు పులివాతపడి మరణించాడనే వార్త పంపించింది. ఆ వార్త విన్న పద్మావతి నేలకూలి మరణించింది. తిరిగి వచ్చిన రాజు ఈ విషయం తెలుసుకొని రాణిని శిక్షించపూనుకున్నప్పుడు జయదేవుడు అతన్ని వారించి దైవానుగ్రహం ఉంటే తిరిగి జీవిస్తుందని చెప్పి దర్శనాష్టపదినే గానం చేశాడు. పాట పూర్తి కాగానే ఆమెలో పునరుజ్జీవం కలిగింది. ఈ సంఘటన వల్ల ఈ అష్టపదికి సంజీవాష్టపది అనే పేరు కూడా వచ్చింది.

ఒకనాడు లక్ష్మణసేన మహారాజు తాను రచించిన రచనను ప్రజలు నిరాదరించడం, జయదేవుని గీతగోవింద రచనను ప్రజలు ఆదరించడం చూచి ఈర్ష్యపడి, అహంకరించి ఈ రెండింటిలో ఏది గొప్పదో

నిర్ణయించుకోవడానికి జగన్నాథస్వామి ఆలయంలో స్వామి సన్నిధిలో ఉంచాడట. మరునాడు చూసేసరికి జయదేవుని గీతగోవిందం స్వామి శిరస్సుపైన, రాజు గ్రంథం క్రిందుగా, దూరంగా ఉంది. అప్పుడు రాజు వినయ వివేకాలతో జయదేవ మహాకవికి సాష్టాంగ ప్రణామం చేసి శరణు వేడాడు. ఈ విధంగా ఎంతటి రాజాధి రాజులైనా భక్తులపట్ల అహంకారంతో, ఈర్ష్యా ద్వేషాలతో ప్రవర్తిస్తే తలక్రిందులవుతారన్న సత్యాన్ని జయదేవుని జీవితచరిత్రవల్ల తెలుస్తుంది.

జయదేవుడు రచించిన గీతగోవిందం 12 సర్గల గేయ ప్రబంధం ఇందులో 24 అష్టపదులు రాగతాళ నిర్దేశంతో జయదేవుని ముద్రాంకితంతో ఉన్నాయి. ఇందులో సుమారు 80 శ్లోకాలున్నాయి. ఈ అష్టపదులు జీవాత్మ పరమాత్మలైన రాధామాధవుల ప్రణయం, విరహం, అనుసంధానం తెలియజేస్తాయి. ఇవి కోమలమైన పదాలతో మధుర భక్తిరస భరితంగా, మనోరంజకంగా అలరారుతున్నాయి. ప్రతి అష్టపది మంగళాశీస్సులతో సమాప్తి అవుతుంది. ఈ అష్టపదులలో "శ్రితకమలాకుచమండల ధృతకుండల ఏకలిత లలిత వనమాల జయ జయదేవ హరే" అనే అష్టపది శ్రీకృష్ణుని రూప గుణ లీలా విభూతి వర్ణనను గూర్చి తెలియజేయగా "ప్రళయ పయోధి జలే ధృత వానసి వేదం.

విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్

కేశవ ! ధృత మీన శరీర జయ జగదీశహరే" అనే అష్టపదిలో వరుసగా మహావిష్ణువుయొక్క మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, పరశురామ, బుద్ధ, కల్కి అనే దశావతార వర్ణనలు చేయబడ్డాయి.

ఈ అష్టపదులలో జయదేవుడు, కృష్ణుడు గోపికలతో బృందావనంలో క్రీడించటం, రాధ అలుక, కృష్ణ విరహం, రాధ విరహం, రాధాకృష్ణుల సమాగమం మిక్కిలి రమణీయంగా వర్ణించాడు.

బృందావనంలో నీలమేఘ శరీరుడైన శ్రీకృష్ణుడు చందన చర్చితుడయి పీతాంబరధారియై, తులసి మాలాలంకృతుడయి ఒక్కొక్క గోపికతో ఒక్కొక్క విధంగా క్రీడిస్తున్న అద్భుత శృంగార చేష్టలు...

'చందన చర్చిత నీల కళేబర పీత వసన వనమాలీ' అనే అష్టపదిలో వర్ణించడం జరిగింది. బృందావనంలో గోపికలతో క్రీడించిన దృశ్యం చూచి కుపితురాలయి వెడలిపోయిన రాధను భయంతో ఆపలేకపోయానని ఇప్పుడేమి చేసెదనని కృష్ణుడు బాధపడుతున్న విషయం...

'మామియం చలి తావిలోకస్యవృతం వధూనిచయేవ
కింకరిష్యతి సాచిరం విరహేణ" అనే అష్టపదిలో వర్ణించబడింది. ఇందులోనే శ్రీకృష్ణుడు-రాధా నీవు నా ఎదుట కన్నులకు కట్టినట్లు కనిపిస్తున్నావు. నా ఎదుట చరిస్తున్నావు. పూర్వంవలె వచ్చి నన్నెందుకు నీ కౌగిలిలో చేర్చుకోవు అని విరహంతో దుఃఖిస్తూ, ప్రాధేయపడుతున్న విషయాన్ని "దృశ్యసేపురితో గతాగవమేవ ...

పరిరంభణం నదధాసి అనే చరణంలో చెప్పబడింది.

రాధ విరహ వేదనను చెలికత్తె శ్రీకృష్ణునితో-రాధ విరహాన్ని విను. నీకై ఆమె పరితపిస్తోంది. చందనాన్ని, మారుతాన్ని, చంద్ర కిరణాలను ఆమె దూషిస్తూ వాటిని విషంగా చూస్తోందని చెప్పిన విషయం—

"నిందతి చందన మిందు కిరణమను
నిందతి ఖేదమ ధీరమ్"

సానిరహే తవదీనా—అనే అష్టపదిలో చెప్పబడింది. రాధ విరహావస్థను చెలికత్తె ఇంకా "ఓ మాధవా! రాధ శరీరంపై పూసిన శ్రీ గంధపు పూతను కూడా మిక్కిలి భయంతో విషంగా చూస్తోంది అంటూ —

"స్తన వినిహిత మపిహార ముదారం
రాధికా కృష్ణా రాధికా

తవ విరహే కేశవ" అనే అష్టపదిలో చెప్పబడింది.

చెలికత్తె కృష్ణ దర్శనానికి ఆతురపడుతున్న రాధను వేగంగా అతని దగ్గరకు వెళ్ళడానికి త్వరపెట్టుతూ రాధా! గోపికాకుచమర్ధనాను రక్తుడయిన కృష్ణుడు మనోహర శీతల వాయువులతో ఉల్లసిల్లే యమునానది ఒడ్డునందలి ఉద్యానవనంలో ఉన్నాడని నీవు అక్కడికి తొందరగా వెళ్ళుమంటూ —

'రతి సుఖసారే గతి మభిసారే
ధీర సమీరే యమునా తీరే వసతి వనే వనమాలీ
గోపీ పీన పయోధర మర్దన చంచల కరయుగశాలీ'

అనే అష్టపదిలో చెప్పబడింది. తనను చేరుకున్న రాధతో కృష్ణుడు ప్రేమానురాగాలతో —

ఓ రాధా నీవు చాల దూరంనుంచి వచ్చావు. ఆ శ్రమ పోవడానికి నేను నీ పాద చరణాలను నా చేతులతో మెల్లగా ఒత్తుతాను. నా వలె నిన్ను అనుసరించి ఉండే నీ పాద నూపురాలను క్షణకాలం శయ్యపై ఉంచు అంటూ —

'కిసల శయన తలేకురు కామిని—

కరకమలేన కరోమి చరణ మహమాగమిదాఽసి విదూరం'
అనే అష్టపదిలో చెప్పబడింది. అలసి సొలసి వచ్చిన రాధ శ్రీకృష్ణుని పై గల అధికారంతో, మమకారంతో, తనకు ఉపచర్యలు చేయమంటూ అతనిని తన స్తనాలపై మకరికా పత్రాలను చిత్రించమనడం, నుదుట కస్తూరి తిలకం పెట్టమనడం, ముంగురులు సవరించమనడం కళ్ళకు కాటుక పెట్టమనడం, పువ్వులను ముడవమనడం, మోనాలు సవరించమనడం మొదలైన విషయాలు—

'కురుయదునందనం శిశిరతరేణ కరేణ పయోధరే
నిజగాదనా యదునందనే

క్రీడతి హృదయనందనే' అనే అష్టపదిలో చెప్పబడ్డాయి :

ఈ విధంగా రాధా మాధవుల యమునాతీరస్థ లతాగృహాలలో అనేకరకాలుగా కామక్రీడలలో తేలి ఆనందించారు. జయదేవుని జీవిత చరిత్ర, జయదేవుని అష్టపదులు చలన చిత్రాల ద్వారా, సభాగోష్టుల ద్వారా, సంగీత కచ్చేరీల ద్వారా, నాట్యాభినయాల ద్వారా విశ్వవ్యాప్తి గాంచాయి. మహిమాన్వితమైన జయదేవుని చరిత్ర, లోకరంజకమైన, నిత్య సుఖప్రదమైన, కృష్ణ భక్తిరస ప్లావితమైన ఈ గీత గోవింద కావ్యం యావద్భారత దేశానికొక దివ్యవరం.

గోస్తావాణి (21-3-1992)



# క్షేత్రయ్య పదాలలో ప్రణయ సౌందర్యం

సృష్టిలో ఎన్నో వింతవింతలు జరుగుతున్నాయి. వాటి ప్రభావం ఎందరెందరిమీదో పడుతుంటుంది. కానీ అందరూ పుణ్య పురుషులు కాలేరు. ఆ భాగ్యం కొందరికే. హీనమైన పంకంలో సుందరమైన పద్మం పుట్టినట్లు హేయమైన వేశ్యాకులంలో కళావిదుషి, కమనీయ రూపసి, సుగుణాలరాశి అయిన మోహనాంగి జన్మించింది. ఈ లలితాంగియే క్షేత్రయ్య సహాధ్యాయి, ప్రియురాలు. తనపై అహర్నిశలూ మోహావేశపరవశుడై అజ్ఞానాంధకారంలో కూరుకొని పోయిన క్షేత్రయ్యకు జ్ఞానబోధ చేసి చిత్తచాంచల్యం పోగొట్టి మువ్వ గోపాలునిపై మనసు మరలించింది. భక్తిని కుదిరించింది. ఆ స్వామిపై మధురగీతాలు వ్రాయించింది. తాను పాదాలకు అందె కట్టి ప్రియుడు వ్రాసిన పదాలకు నాట్యాభినయం చేసింది. క్షేత్రయ్య భక్తుడు, పదకర్త పుణ్యపురుషుడు కావడానికి కారకురాలయింది.

క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య. వివిధ పుణ్యక్షేత్రాలను సందర్శిస్తూ సంచారం చేయడంవల్ల ఇతడు క్షేత్రజ్ఞుడయ్యాడు. ఈ పేరే జనవ్యవహారంలో నలిగి క్షేత్రయ్యగా మారి రూఢికెక్కింది. ఇతని కాలం 1600 సంవత్సరాల నుంచి 1680 వరకు అని పరిశోధకులు గుర్తించారు.

క్షేత్రయ్య అనగానే అందరికీ శృంగార పదాలు, నాట్యాభినయం గుర్తుకు వస్తాయి. 'మగువ తన కేళికా మందిరము వెడలెన్' 'ఇంత తెలిసియుండీ ఈ గుణమేలరా; రారా నా సామిరారా, వంటి మధురమైన క్షేత్రయ్య పదాలు ఇదివరకే మనకు చలన చిత్రాల ద్వారా సుపరిచితమే. ఇంకా కొన్ని పదాలు సభలలో నాట్యాభి

నయాల ద్వారా కూడా వ్యాప్తి చెందాయి. క్షేత్రయ్య వ్రాసిన ఇలాంటి శృంగార అభినయాత్మకమైన పదాలకు మార్గదర్శకం అన్న మయ్య వ్రాసిన శృంగార సంకీర్తనలే. అన్నమయ్య వ్రాసిన శృంగార సంకీర్తనలను క్షేత్రయ్య బాగా ఆకళింపు చేసుకొని అందు లోని తెనుగు నుడికారపు సొంపును గ్రహించి తనదైన స్వంత బాణీలో క్షేత్రయ్య పదాలు రచించాడు. ఈ పదాలలో మువ్వ గోపాలుని నాయకుడుగా చేసి తాను నాయికగా అభివర్ణించుకొని మధుర భక్తి రీతితో పదరచన సాగించాడు. అన్నమయ్య తిరుపతిలో వెలసిన శ్రీ వేంకటేశ్వరునిపై పల్లవి చరణాలతో కూడిన పదాలను రచిస్తే క్షేత్రయ్య కృష్ణాజిల్లాలోని 'మొవ్వ'లో వెలసిన గోపాలునిపై పల్లవి, అనుపల్లవి చరణాలతో కూడిన పదరచన సాగించి మువ్వ గోపాల ముద్రను అనుపల్లవిలో ప్రయోగించి ప్రత్యేకత ప్రద ర్శించాడు.

క్షేత్రయ్య సుమారు 4,500 పదాలు రచించినట్లు ప్రసిద్ధి. వీటిలో నేడు లభించినవి 380 పదాలు మాత్రమే. ఈ పదాలలోని బహుభార్యత్వం, వేశ్యాలోలత్వం, వ్యభిచారం మొదలయిన అంశా లను గమనించిన కొందరు విమర్శకులు క్షేత్రయ్య పదాలు 'పచ్చి బూతులు' అని విమర్శించారు. ఈ కువిమర్శ అన్నమయ్య శృంగార సంకీర్తనలకే తప్పలేదు. నిజానికి ఆ శృంగార వర్ణనలన్నీ అలౌకిక మయినవిగానే మనం భావించాలి. ఆ పదాలలోని నాయకుడు శ్రీకృష్ణపరమాత్మ ఇందులోని నాయికలు అలనాటి గోపికలుగా, ప్రకృతిలోని జీవులుగా మనం విశ్వసించాలి. ప్రకృతిలోని జీవులన్నీ పరమాత్మను పొంది పరమానందం అనుభవించడానికి పడే తపన ఈ పదాలలో మనకు గోచరిస్తుంది. ఆనాటి సమాజపరంగా ఆలోచించినా ఆ రోజులలో బహుభార్యత్వం, వేశ్యాసంపర్కం అతివేలంగా ఉండేది.

ఆనాడు 'రాయ వేశ్యాభుజంగా' అని సంబోధిస్తే రాజులు, జమీందారులు, రసికులు ఉప్పొంగిపోయేవారు. ఏ కవి అయినా తన సమాజాన్ని, సమాజ నడవడిని వదలి రచనలు చేయలేదు. అందువల్ల ఆ బూతు పదజాలం, వారి ప్రవర్తన పదాలలో చోటు చేసుకొని ఉండవచ్చు. ఆనాటి వేశ్యలు కూడా పురుషులను ఆకర్షించుకోవడానికి సంగీత సాహిత్య నాట్యాలు నేర్చుకొని, వారికి అనుకూలమయిన అసభ్యకర శృంగార పదాలనే ప్రచారంలోకి తెచ్చివుంటారు. కాబట్టి క్షేత్రయ్య తన పదాలలో యీ అశ్లీల పద ప్రయోగం చేయడానికి కారణం ఆనాటి సమాజమనే చెప్పవచ్చు.

క్షేత్రయ్య పదాలను గూర్చి ఎవరెన్ని విధాలుగా విమర్శించినా ఆ పదాలలో ఉదాత్త ప్రేమ, ఉత్కృష్ట కవితా మాధుర్యం, లలితమైన దేశి పదజాలం, సుందర శబ్ద రచన మిక్కుటంగా కనిపిస్తుంది. క్షేత్రయ్య కేవలం భక్తుడే కాకుండా సంస్కృతాంధ్ర భాషలలోను, అలంకారాది శాస్త్రాలలోను, సంగీత, సాహిత్య, అభినయ కళలలోను మంచి నిష్ణాతుడు. భావ విస్తృతికి అనువైన రాగ ప్రసారం చేసి రాగతాళ ప్రయోగ వైవిధ్యం, పదరచనకు ఒక విశిష్ట స్థానం చేకూర్చాడు. క్షేత్రయ్య పదాలలో నాయకుడు మువ్వగోపాలుడు. నాయిక పేరు ప్రత్యేకంగా నిర్దేశించలేదు. ప్రవర్తనా తీరునుబట్టి, సంభాషణారీతిని బట్టి నాయికను స్వీయ, పరకీయ, సామాన్య (వేశ్య) అని మనం గుర్తించవచ్చు. లేక మువ్వ గోపాలుని పరమ భక్తుడైన క్షేత్రయ్యయే నాయికగా మారాడని చెప్పవచ్చు. నాయికా నాయకులమధ్య ప్రేమ కలాపాలలో రాయబారం నెరపడానికి చెలికత్తె పాత్ర ఉంది. క్షేత్రయ్య తన పదాలలో నాయికానాయకుల సౌందర్యం, ప్రణయం, విరహం, అలుక, అనునయం, హితవచనం మొదలైన అంశాలను మిక్కిలి మనోహరంగా వర్ణించాడు.

నాయిక తమ జంటవలె అన్యోన్యంగా, ఒద్దికగా ఎవరున్నారు చెప్పు అని నాయకునితో మునుపటి నలచక్రవర్తివి నీవైతే, దమయంతిని నేనవుతాను. నీవు కృష్ణుడవైతే నేను రుక్మిణీదేవిని. నీ రఘురాముడివివి, నేను సీతాదేవిని. నివు సత్యహరిశ్చంద్రుడివైతే నేను చంద్రమతిని. నీవు మన్మథుడివైతే నేను రతీవిని అని తను అన్యోన్యతను ముచ్చటించుకున్న విషయాన్ని క్షేత్రయ్య —

"ఒద్దరివలె గూడి యెవ్వరున్నారు తెల్పరా
ఒద్దికలో మనవలెనున్నారా ?
మువ్వగోపాల"

అనే పదంలో వర్ణించాడు. క్షేత్రయ్య నాయికా, నాయకులను పురాణ ప్రసిద్ధమైన పుణ్య దంపతులతో పోల్చి వర్ణించి వారికి ఉదాత్తతను చేకూర్చాడు.

ప్రతి ప్రేయసి తన మనసువలె తన ప్రియుని మనసు కూడా వుంటే ఎంత బాగుంటుందని భావిస్తుంది. ఇక్కడ కూడా నాయిక తన నాయకునితో నా మనసు వంటిదే నీ మనసైతే నా నోము ఫలించినట్లే. తియ్యని చెరకునకు పండు పండినట్లుగా మన ఆనందం రెట్టింపు అవుతుంది. నేను ఊరకుండలేక గోరుతో ఏమి వ్రాసినా అది నీ రూపుగానే తోస్తుంది. నిద్ర నుంచి మేల్కొనగానే నీవు నా ప్రక్కనున్నట్లే ఉంటుంది. అని తన భావాలను వ్యక్తంచేస్తున్న తీరు.

"నా మనసు వంటిది నీ మనసైతేనా
నోము ఫలమిాడేరురా అదిగాక
వేమారు చెరుకున పండు పండినట్లు
వేడుక ఇనుమడించేరా ఓరి వరదా"

అనే పదంలో క్షేత్రయ్య మిక్కిలి మనోహరంగా వర్ణించాడు.

కంచి వరదరాజస్వామి ఆలయం గర్భగుడిలో ధ్యాన నిమగ్నుడైన క్షేత్రయ్యను అర్చకులు గమనించక గర్భగుడి తలుపులు బిగించుకొని వెళ్ళినపుడు క్షేత్రయ్య ఆ రాత్రి అక్కడే ఉండి పోయాడు. తన స్వామితో శయన మందిరంలో శృంగార కేళిలో తేలి ఉదయాన్నే వెళ్ళుతున్న ఆ దేవి నలిగిన వేషధారణను గూర్చి, సొలసిన శరీర సౌందర్యాన్ని గూర్చి—

"మగువ తన కేళికా మందిరము వెడలెన్
వగకాడ మా కంచి వరద తెల్లవారెననుచు"

అనే పదంలో - జారిపోయిన గొజ్జంగి పూల జడతోను, చిక్కు పడిన మెడలోని హారంతోను, విశాలమైన నేత్రాలలో నిద్రమత్తు తోను, పాదద్వయంలో తడబడుతున్న నడకతోను, స్తనాలపై నఖ క్షతాల చంద్రులతోను ప్రకాశించే ఎర్రటి పెదవుల చిగురాకులతోను, సమరతి బడలికతోను, జరపావడ కలిగి జారిన పైటతోను, ఇరువైపుల భుజాలకు ఊతనిచ్చే చెలికత్తెలతోను. పరమాత్మ ! మువ్వగోపాల, తెల్లవారింది అంటూ వెళ్ళుతున్న విషయం క్షేత్రయ్య కళ్ళకు కట్టి నట్లుగా చిత్రించాడు.

తన ప్రాణ సమానుడైన ప్రియుని ఎడబాటును తట్టుకోలేని ప్రియురాలు, ప్రియుడు ఇల్లువిడిచి వెళ్ళుతున్నప్పుడు హెచ్చరికలు చేస్తూ - నీవు వెళ్ళిన చోటే వుండిపోయేవు, అక్కడ ఉండిపోకుండా వస్తానని ఒట్టుపెట్టావు. వెంటనే నీవు ఇక్కడికి రాకుంటే నా కన్నీరు కావేరి కాలువలా ప్రవహిస్తుంది. నీ ఎర్రటి పెదవులలోని తేనె ఆనకుంటే నా నోరు ఎండిపోతుంది. నీవు నా కౌగిలిలో లేకుంటే

పున్నమినాటి వెన్నెల కూడా వేడిగా ఉంటుంది. పద్మనేత్రుడా! నీవు తిరిగి వచ్చేదాక ఇంటి ముంగిటిలోనే ఉంటాను. నా ప్రాణ నాథా! మరచిపోయి నీవు ఎవరితోనైనా మాట్లాడేవు! మనసు విరిచేస్తారు. జాగ్రత్త సుమా! నీకు శరణు వేడుతున్నాను. ఈ రాత్రికి కూడా ఆలస్యం చేయకుండా వచ్చేయి అని తన ప్రేమ భావాన్ని వ్యక్తం చేసుకుంటున్న తీరును క్షేత్రయ్య —

"అట్టే వుండవు సుమీ! నా ప్రాణనాథ
అట్టే యందుండకిందు వచ్చేదనేని
యాన బెట్టితి సుమీ! నా ప్రాణనాథ!

వనజాక్ష! నీవిడకు వచ్చేదాక...తలవాకిలె యిల్లు సుమీ
నా ప్రాణనాథ
శరణు మువ్వగోపాల, యీ రేయి గూడ జాగు సేయకరమ్మీ!
నా ప్రాణనాథ

అనే పదంలో మిక్కిలి రమణీయంగా వర్ణించాడు. ఇందులో జీవాత్మ అయిన నాయిక తన నాయకుడు పరమాత్మ అని గుర్తించి శరణు వేడింది. వదలివుండలేనని విన్నవించుకొన్నది.

నాయిక తన ప్రియుని సౌందర్యాన్ని గూర్చి, మృదుమధుర స్వభావాన్ని గూర్చి ఆనందోత్సాహాలతో నా స్వామి ఎంతో చక్కనివాడు. నా మనసుకు ఎప్పుడూ ఉల్లాసాన్ని కలిగిస్తాడు. చిరు నవ్వు వాడు, ముద్దు మాటలవాడు, మెరుపుటద్దాల చెక్కిలి కలవాడు, చిగురాకు పెదవులవాడు, తామర రేకుల కన్నులవాడు, లేత వయసులో నున్నవాడు, మన్మథుని తండ్రి అయినవాడు, మెరుస్తున్న చామన చాయ శరీరంవాడు, ఎర్రతామరలవంటి పాదాలవాడు, లేబ్రాయం లోని సింహపు నడుము గలవాడు, గజేంద్రుని తొండాలను మరపించే

చేతులు కలవాడు, చాలా సొగసైనవాడు. అని తెలియజేసిన విధం...

"ఎంత చక్కనివాడే నా స్వామి వీడెంత చక్కనివాడే
ఇంతి మువ్వగోపాలుడు సంతసము నా మదికి
సంతోషము చేసెనే"

అనే పదంలో రమ్యంగా అభివర్ణించారు.

క్షేత్రయ్య పదాలు గోపాలునివలె కోమలమయినవి. మురళీరవళి వలె మధురమైనవి. బృందావనివలె శోభాయమానమైనవి. రాధవలె రమణీయమయినవి. భుక్తి ముక్తి ప్రదాయకమయినవి. కూచిపూడి నృత్యాభినయనాలకు అనుకూలమైనవి. సకల జనావళి సముద్ధరించ దగినవి.

కోస్తావాణి (26-7-1992)



# వరదయ్య పదాలలో ప్రేయసీ విరహం

వరదయ్య అంటే క్షేత్రయ్యే. ఈ పదకవి నాయికా నాయకుల ప్రణయాన్ని శృంగార రస రమ్యంగా వర్ణించినట్లే నాయికా నాయకుల విరహాన్నికూడా కరుణరసాత్మకంగా చిత్రించాడు. వరదయ్య పదాలలో నాయకుడు లేక ప్రియుడు మువ్వగోపాలుడు. నాయిక ఒకరంటూ నిర్దేశింపబడలేదు. గోపాలుడు దక్షిణ నాయకుడు. ఆయనకు చాలామంది ప్రియురాండ్రు ఉన్నారు. కానీ నాయికలందరికీ కలసి ఒకే ప్రియుడు ఉండటంవల్ల ఒకరిని విడిచి ఇంకొకరి చెంతకు వెళ్ళుతున్నప్పుడు ఎడబాటును సహించలేక వారు విరహవేదనతో బాధపడుతుంటారు. సవతి మాత్సర్యంతో రుసరుసలాడుతుంటారు. కోపం తగ్గిన తర్వాత ప్రాధేయపడుతుంటారు. చెలికత్తె ద్వారా రాయబారం పంపుతుంటారు. ప్రియుడు ఎంతకూ దయచూపకుంటే మనస్సును నిశ్చలం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. అలాగే ఒక్కోసారి నాయకుడే విరహవేదన అనుభవిస్తూ వుంటాడు. అలక మానమని ప్రియురాలిని వేడుకొంటాడు. ఇలా అలకలు, అనునయాలు, రాయబారాలు, ప్రేయసీ ప్రియులు ఇద్దరూ చేస్తుంటారు. ఇలాంటి విరహ విషాదాన్ని వరదయ్య తన పదాలతో కరుణ రసాత్మకంగా చిత్రించాడు.

నాయికపై అలిగివున్న నాయకునితో చెలికత్తె మా చెలి రాత్రిపూట నిన్ను రమ్మని రాయబారం పంపింది. నీపై మోహపరవశురాలై వుంది. ఆమె తళుకు పూపుల మొలక. మన్మథుని చేతి చిలుక. నీవు కన్నులతో చూస్తే దయారసం కురిపిస్తుంది. ఆమె సౌందర్యాన్ని తిలకించుదువురా. సుందరాకార! ఆలస్యం చేయవద్దు. మా సుందరి నీ కోసం ఎదురు చూస్తోంది. పూలపానుపుపై పువ్వులు పరచి వుంది. పూలమాలను నీ కోసం చేత పట్టుకొని వుంది. ఎందుకు మా చెలిపై ఈ పంతం. ఎందుకు జాగు చేస్తావు. అని లాలనగా మాట్లాడుతూ తన చెలికపకు రమ్మని ఆహ్వానం చెబుతున్న విషయం-

రారా మా యింటికి రాతిరి నిన్ను మా
రామ రమ్మన్నదిరా
రారా మా రమణి నీకు రాయబారములంపె
లేరా నినుగోరి మరులూరి యున్నదిరా

తళుకుఁజూపులుగల మొలకరా! యది నీకె
తగియున్నది మరుని చిలుకరా యిక దాని
కన్నులఁజూచితే కరుణ లొలుకురా
కలికి నీపై మరులొలుకురా యికదాని!

..............................

బాల పాన్పున విరులు పరచి యున్నదిరా
శ్రీలోల నీకే పూలమాల గొన్నదిరా
వేలా దానితో చలములేలరా మువ్వ గో
పాల యలతపవు చేసేవురా!

అనే పదంలో క్షేత్రయ్య వెల్లడించాడు. ఇందులో చెలికత్తె తన నాయిక రూపసౌందర్యాన్ని, గుణసౌందర్యాన్ని గూర్చి నాయకునికి వ్యక్తంచేసి ఆమెపై అతనికి సుముఖత్వం కలిగింపజేయడం గూర్చి క్షేత్రయ్య రమ్యంగా వర్ణించాడు. ఇందులో "శ్రీలోల" అనే సంబోధనవల్ల నాయకుడు పరమాత్మ అని తెలుస్తుంది. నాయిక జీవాత్మకు ప్రతీక అని చెప్పవచ్చు.

నాయిక తనపై పంతగించియున్న నాయకుడైన గోపాలునితో తనను గూర్చి ఇంత తెలిసియుండికూడా ఈ నిరాకరణగుణం ఎందుకు? నీవు నాపై అలిగి ఇంటికి రావడంలేదు. నిన్ను పిలుచుకొని రమ్మనడానికి నాకు చెలికత్తె లెవరున్నారు? చెలికత్తెవైనా, చెలికాడివైనా, నా పాలి దైవమైనా నీవే. నన్ను క్రొత్తదానిగాచూచి వేరు చేశావు.

నాకు ఆత్మీయులెవరున్నారు ? ఎవరు ఆదరిస్తారు ? అంతరంగమైనా, ఆదరించినా నీవే దిక్కు. విచారించిచూస్తే నీవే నా బ్రతుకు. నా నేర్పులు, నమ్మకలు అన్నీ నీవే. ఒట్టుపెట్టి చెబుతున్నాను. నీవే నా ఆనందం అని తన ప్రేమ నైజాన్ని వ్యక్త పరుస్తున్న విషయం.

"ఇంత తెలిసియుండి - యీ గుణమేలరా
పంతమా మువ్వగోపాల ! నా స్వామి !

అలుక చేసి యింటికి రావైతివి నెనరైన
చెలికత్తె లున్నారా పిలువ వచ్చేరా
చెలికత్తెవైన నీవె - చెలువుడవైన నీవె
తలచి చూడ నా పాలి దైవము నీవె !
..............................

(శ్రీ)నిధి ! మువ్వగోపాల ! చేపట్టి నన్నేలితివి
నా నేర్పెలెవరైనా నందించేరా
నా నేర్పులైన నీవె - నమ్మికలిచ్చిన నీవె
యోసగా బలికెద నా యానందమైన నీవె...

అనే పదంలో క్షేత్రయ్య దృశ్యీకరించినట్లు వర్ణించాడు.

నాయిక చెలికత్తెతో తన విరహావేదనను గూర్చి చెబుతూ తన ప్రియుడైన మువ్వగోపాలుడు ఎంత మొక్కినా రావడంలేదు. నన్ను మోసం చేశాడు. చందమామ అందరికి చల్లగా ఉంటాడు. కానీ ప్రియ విరహంతో వేదన పడుతున్న నాకు అగ్గిలా వున్నాడు. పూర్వజన్మలో ఏ జంటను విడదీశానో ఇప్పుడు ఇలా అయ్యాను. చెలీ ! ఎప్పుడు తమ ప్రియులనువదలి వుండని వనితలు ఏమి నోములు నోచారో నా నుండి నా ప్రియుని దూరంచేసే చెలులు నాకు కలగడం నా దురదృష్టం అని బాధపడుతున్న విషయం.

"మోసమాయెనే నా బుద్ధికి మోసమాయెనే
మోసమాయెనేమి సేతు మువ్వగోపాలుడు నేడు
మొక్కి వేడిన రాడే! చెలియా!

అందరికి చల్లనైన చందమామ నా పాలిటి
కనలమాయెనయ్యో చెలియ
ముందు నే నెవ్వరి పొందెడ బాసితినో
అందుకు నే నీలా నైతినో ఓ చెలియ!!

ఏ ప్రొద్దు ప్రాణవిభుల నెడబాయని యింతు
లెన్ని నోములు నోచిరో చెలియ
దాపున గూడున్న విభుని దవ్వుల బెట్టు చెలులు
నా పాలగలిగిరో ఓ చెలియ"

అనే పదంలో వర్ణించాడు.

"ఉండరాని విరహ వేదన
ఉండని సురత సుఖమేల
ఎండలేని నాటి నీడ ఏమి చేయనే"

అని అన్నమయ్య పదాల్లోని చెలికత్తె నాయికతో అన్నట్టుగా విరహ వేదన భరించరానిదే అయినా ఆ విరహ వేదన, ఎడబాటు లేకుంటే ప్రియ కలయికా సుఖం తెలియదు. ఎండతాపం అనుభ వించకుంటే నీడ సుఖం తెలియదు. అందువల్ల నాయికా నాయకులు మధ్య ఎప్పుడూ ప్రణయ సౌఖ్యమే కాకుండా అప్పుడప్పుడూ విరహ వేదన కూడా ఉండటంవల్ల వారిద్దరి మధ్య ప్రేమ కాంక్ష కూడా అధిక మవుతుంది. క్షేత్రయ్య పదాలలోని ప్రియుడు శ్రీకృష్ణపరమాత్మ. ప్రేయసులు జీవులు. ఈ జీవులు పరమాత్మతో ఐక్యం చెందినప్పుడే

శాశ్వతమైన ఆనందాన్ని అనుభవిస్తారు. అందువల్ల ఈ జీవులన్నీ ఆ పరమ పురుషుని చేరడానికి పడుతున్న తపన, ఆరాటమే ఇందులో వర్ణించబడిన ప్రేయసీ విరహం. ఇది మధురభక్తి కోవకు చెందిన విరహమే కాని అశాశ్వత ఐహిక సంబంధ మయింది కాదు. మువ్వ గోపాలుని ప్రియ భక్తుడైన వరదయ్య ప్రేయసీ విరహ వేదనా సన్ని వేశాల్ని లలితమైన పదాలతో, సుకుమారమైన భావ జాలంతో ఆర్ద్ర పూరితంగా వర్ణించాడు.

కోస్తావాణి (7-9-1992)





రచయిత్రి : డా॥ పి. లీలావతమ్మ

జననం : కలియుగ వైకుంఠం అయిన తిరుపతికి సమీపంలోని పానకం గ్రామం.

తల్లిదండ్రులు: శ్రీమతి అనసూయ, శ్రీ పొన్నా వేంకటరాయులు

విద్యాభ్యాసం : ఉన్నత విద్య - తిరుచానూరు

కళాశాల విద్య - శ్రీ పద్మావతి స్త్రీల కళాశాల, తిరుపతి.

విశ్వవిద్యాలయ విద్య-శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి.

వృత్తి : లెక్చరర్, భక్తిపద కవితాశాఖ, తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి ప్రాంగణం, బొమ్మూరు - 533 124.

ప్రవృత్తి : బుద్ధి దీప్తి అయినప్పుడు - వ్యాస రచన.

హృదయం గాయపడినప్పుడు - గేయ కవితల రచన.

మనసు కలత చెందినప్పుడు - గానాలాపన.

సామాజిక దుస్థితి ప్రబలినప్పుడు - మానవ మానస సరసిలో సమత మమత మానవత భక్తి తత్పరతా పద్మాలు వికసించాలని తపన, ఆవేదన.

ప్రచురణ : అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు. పి హెచ్. డి, సిద్ధాంత గ్రంథం.

రాబోవు ప్రచురణ : అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీ ధర్మాలు.